# ప్రేమగాథ

(నవల)

మూలం :

విల్లా కేతర్

తెలుగు :

చందూర్





ప్రతిమా బుక్స్
49 మూకతాల్ వీధి
మద్రాసు - 7

# ఇందులో

## చందూర్ మిగతా పుస్తకాలు

నేల - నీరు
హెలెన్ కెల్లర్
మహానగరంలో
జీవితం
నవచైనా
చెల్లు
ఆరు కథలు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
ప్రతి గురువారం
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
శిక్ష
అంతేనా
కాఫీ మా నెయ్యుడం
పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం
అఖరుకోరిక.
ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్త లోకాలు
కొన్ని గ్రంథాలు
సీతతో సినిమాకి
నట్టింట దీపం
మాంగుళూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతాఫలాలు
భాష
పూసలమేడ
శివరావు
కలడో లేడో

# ప్రస్తావన

1883 వేసవి కాలంలో ఒక సాయంత్రం వేళ సెబైన్ కొండల మీద నిర్మితమైన తోట బంగళాలో ముగ్గురు మతాధిపతులూ (కార్డినల్సు) దూరప్రాంతం నుంచి ఒక మత ప్రచారకుడూ (ఫాదరీ) కలుసుకున్నారు. ఆరామ మందిరపు డాబా మీద కొస్తే చుట్టూ దృశ్యం కడు రమణీయంగా కనపడుతుంది. డాబాకి 20 అడుగులు దక్షిణంగా, ద్రాక్ష తీగెలతో కప్పబడి వున్న పొదరింటి వంటి ప్రదేశంలో, ఒక విశాలమైన టేబుల్ ముందు నలుగురూ ఆసీనులయారు. దొలుచుకు వచ్చిన శిలావేదిక ఎక్కేందుకు వీరు కూచున్న చోటి నుంచి పైకి, రాతి మెట్లు వున్నాయి. ఆ శిలా వేదిక ఎక్కి, చూస్తే కనపడే దృశ్యం కన్నుల వైకుంఠమే! గ్రామ సౌభాగ్యపు మడతల కొసని రోమ్ నగరం దర్శన మిస్తుంది.

స్పానిష్ మతాధిపతీ (కార్డినల్) అతని అతిథులుగా బల్ల ముందు కూచున్నారు. ఇంకో గంట వరకూ సూర్యుడు అద్భుతంగా ప్రకాశిస్తూనే ఉంటాడు. అంత దాకా ఈ భూత జగత్తుని తన సువర్ణ కాంతులలో ముంచి వుంచుతాడు. రోమ్ నగరంలోని, సెయింట్ పీటర్సు చర్చి బురుజు నీలాకాశాన్ని తాకుతూ కళ్ళు జిగేల్మనిపించే తామ్ర కాంతులు ప్రసరింప జేస్తోంది. గాలిలో ఎగురుతూ నేలకు వాలి, పై భాగము కృంగి పోయిన బెలూనా అన్నట్లు వుందది. స్పానిష్ కార్డినల్‌కి చీకటి పడక పూర్వమే భోజనం చేయటం అలవాటు. అంచేత, ఈ విందు బాగా వెలుతురుండగానే ప్రారంభమయింది. సూర్యరశ్మి ఎంతో ఉత్సాహవంతంగా ఉన్నది; నారింజ పుష్పాల లేత గులాబీ రంగుకు బంగారపు ఛాయని అందిస్తూ ఆకుల పచ్చదనానికి మెరుగు పెడుతోంది. ఫల పుష్పాదుల లేత పరిమళంతో, ఆ ప్రదేశమే ఒక నందనవనంలా ఉంది. కార్డినల్సు (మతాధిపతులు) ముగ్గురూ ఎర్ర పట్టీలు ఎర్ర బొత్తాములు గల నల్లని పొడుగు గౌనులు ధరించారు. దూరం నుంచి వచ్చిన ఫాదరీ మాత్రం ఊదాపట్టిచొక్కా పైన పొడుగాటి నల్లకోటు వేసుకున్నాడు.

ఆ నలుగురూ ఒక ముఖ్య విషయాన్ని గురించి తర్కించెందుకు సమావేశమయారు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో కొత్తగా చేరిన న్యూ మెక్సికో మత వ్యవహారాల విషయమై బాల్టిమోర్ నుంచి రాగల ఫిర్యాదుని

పరిశీలిస్తున్నారు. 'ఎపోస్టలిక్ వికారేట్' అను పేరుగల 'మత ప్రదేశం' గురించి తర్జన భర్జన సాగుతోంది. అది సరిగ్గా ఎక్కడ వుందో, అక్కడికి ఎలా చేరుకోవాలో, మార్గమంటూ వున్నదో లేదో ఆ సమావేశమైన నలుగురిలో ఏ ఒక్కరికీ తెలిసినట్టు లేదు. ఆఖరికి అమెరికా నుంచి వచ్చిన ఫాదరీకి కూడా, ఆ కొత్త చోటుకి ఎలా చేరుకోవాలో తెలీదు. ఇటాలియన్ మతాధిపతీ, ఫ్రెంచి మతాధిపతీ, న్యూమెక్సికోని 'లె మెక్సిక్యూ' అన్నారు. స్పానిష్ మతాధిపతి మాత్రం 'న్యూ స్పెయిన్' అనడం మొదలు పెట్టాడు. ఈ ముగ్గురికీ అట్లాంటిక్‌కి అవతల వైపు గల విషయాలపై అంత శ్రద్ధ లేదు. ఏదో దూరం నుంచి వచ్చాడని, ఫెర్రాండ్ ప్రోద్బలంవల్ల ఈపాటి పరిశీలన అయినా జరుగుతోంది. కార్డినల్సు ఒకప్పుడు లాటిన్‌లో తప్ప అన్యభాషలలో సంభాషించే వారు కాదు. కాని ఈనాడు దేశకాల పరిస్థితులనుబట్టి ఫ్రెంచిలో మాట్లాడుతున్నారు.

ఫ్రెంచి, యిటాలియన్ మతాధిపతులు మధ్య వయస్కులు. వారి వైఖరీ, మాటతీరూ కులీనతను వెలిబుచ్చుతున్నాయి. స్పానిష్ మతాధిపతి యువకుడు,— మిగతా యిద్దరికంటె కొంచెం చామనచాయ. అతని తండ్రి స్పెయిన్ దేశీయుడు, తల్లి ఆంగ్లవనిత. మనసులో వున్నది ముఖం మీద అనేయడమనే గుణం తల్లి దగ్గర నుంచి వచ్చిందతనికి.

పదహారవ గ్రిగరీకాలంలో స్పానిష్ కార్డినల్ 'వాటికన్'లో గొప్ప పలుకుబడి గల వ్యక్తి. గ్రిగరీ మరణానంతరం, అక్కడి మత సంబంధమైన రాజకీయాలలో చొరబడటం యిష్టం లేక, తన ఎస్టేటుకి వెళ్ళి పోయి, రెండేళ్ళపాటు అక్కడ నిశ్చింతగా గడిపాడు. అప్పట్లోనే 'దైవభక్తుల ఉద్యమం' అంటూ ఒకటి లేవదీశాడు. అసలీ ఉద్యమ పితామహుడు పదహారవ గ్రిగరీ. స్పానిష్ కార్డినల్‌కి తీరిక సమయంలో టెన్నిస్ ఆడటం తెగ సరదా. చిన్నప్పుడు చదువుకునే రోజుల్లో ఇంగ్లాండులో నేర్చుకున్నాడు ఈ టెన్నిస్. మన కథాకాలం నాటికి ఇండోర్ టెన్నిస్ గాని లాన్ టెన్నిస్ వ్యాప్తిలోకి రాలేదు. ఇన్‌డోర్ టెన్నిస్‌లో ఈ స్పానిష్ కార్డినల్ గట్టివాడని చెప్పవచ్చు. ఇతనితో ఆడేందుకు స్పెయిన్ నుంచి ఫ్రాన్సు నుంచి కొమ్ములు తిరిగిన ఆటగాళ్ళు వస్తూండే వారు.

సభికులు నలుగురులోకి ఫెర్రాండే చూపులకి కొంచెం పెద్దవాడు. కష్ట సుఖాలు వొంటబట్టిన మనిషి. ఆ నీలపు కళ్ళల్లోని వెలుగు తప్ప, అతని ముఖం శాగాడస్సి పోయి వుంది. అతని సంచార ప్రదేశం ఒక విధంగా దుర్గమమైనది. ఎక్కడికక్కడ దారికడ్డంగా పెద్ద పెద్ద సరస్సులు వుండేవి. ఒక్కడూ, చలిగాలి ముఖాన ఛెళ్ళున కొడుతూ వుండగా, తన పనిమీద సంచరిస్తూ వుండేవాడు, గుర్రమెక్కి. ఫెర్రాండు యిక్కడికి ఒక ముఖ్యమైన పని

మీద వచ్చాడు. తన పని నిర్విఘ్నంగా జరిగేందుకు వాళ్ళని సుముఖులుగా చేసుకోవాలి.

ఫెర్రాండు తన రెండు చేతులూ చాచి, వారికి క్షమాపణ చెపుతున్నట్టుగా అన్నాడు. 'నేను టేబుల్ మేనర్స్ మర్చిపోయాను కదూ – ఏమిటో పరధ్యానంలో పడి గబగబా తినేశాను. న్యూమెక్సికోని అమెరికా సంయుక్త రాష్ట్రాలు కలిపేసుకున్నాయంటే, మీకు ఒక పట్టాన అర్థం కాదు. అది ఎంత పెద్ద ప్రదేశమో, అక్కడ మతభక్తిని నిలబెట్టేందుకు మత సాధకులు ఎలా కృషి చేస్తున్నారో మీకు ఎలా చెబితే తెలుస్తుంది?'

'తెలీకేం, మాకు అనుభవమే – కొంప లంటుకున్నాయి, తొందరగా డబ్బు పంపించండి – అనే విన్నపాలు మేము విని విని ఉన్నాం' అన్నాడు ఇటాలియన్ కార్డినల్.

'మీరంత తొందరపడ కూడదు. క్రీస్తు మతానికి అక్కడ పదహారో శతాబ్దంలో అంకురార్పణ ఐంది. ఈ మూడు వందల యేళ్ళ బట్టీ ఎన్నో గొడవలు వచ్చాయి. అక్కడి కాతలిక్ మతం యింకా పూర్వ పద్ధతిలోనే ఉంది. వెనుకటి చర్చి మందిరాలు కూలి పోయాయి. మిగిలి ఉన్న కొద్ది మత ప్రమాణాలూ, మత శిక్షణా తెలియని ఫాదరీల వశమయాయి. ఇప్పుడీ ప్రదేశాన్ని అభివృద్ధిదాయక దృక్పథంగల ప్రభుత్వం తన చేతి కిందికి తీసుకుంది. ఇక్కడున్న దుష్టత్వాన్ని మొదట్లోనే

ఖండించకపోతే, ఉత్తర అమెరికాలో గల యితర ప్రదేశాలకి కూడా యీ విషవాయువులు పాకి మొత్తం మీద ఆధ్యాత్మిక జీవనానికే దెబ్బ తీస్తాయి.'

'మెక్సికో బిషప్ ఈ సంగతి పరిశీలించడం లేదా?' అని అడిగాడు ఫ్రెంచి కార్డినల్.

'ఇవి దురాంగో బిషప్ అజమాయిషీలో ఉన్నాయనుకుంటా' అని అందించాడు స్పానిష్ కార్డినల్.

'దురాంగో బిషప్ వృద్ధుడు. అతని హెడ్ క్వార్టర్సుకీ మనం మాట్లాడుకుంటున్న 'శాంటాఫే'కీ పదిహేను వందల మైళ్ళు. రోడ్లూ, కాలిబాటలూ లేని అడివి ప్రదేశమది. నౌకా యోగ్యమైన నదులు పేరుకి కూడా లేవు. అయితే, మనుష్యులక్కడికి ఎలా వెళ్ళగలరని మీరు అడగవచ్చు— అదే చెబుతున్నా. అక్కడి వ్యాపారం ముఖ్యంగా కంచరగాడిదల మీద జరుగుతోంది. గాడిదల మీద మూటలు వేసుకుని, ఒక చోటు నుంచి మరొక చోటుకి వెళతారు. ఆ ప్రాంతాల గల యెడార్ల సంగతి చెబితే హడలిపోతారు. ప్రయాణీకులు దప్పికవల్ల చావరు కాని నరహంతకులు మీద పడ్డారా ప్రాణాలతో వొదిలిపెట్టరు. ఇక నేల ఎలా ఉంటుందని అడుగుతారేమో బల్ల పరుపుగా ఉన్నట్టే కనపడి లోపలకి కుంచుకు పోతుంది. ఎక్కడికక్కడ కొండలు అడ్డు తగులుతూ ఉంటాయి. ఆ కనుమలగుండా ప్రయాణం చెయ్యటం

కష్టసాధ్యం. ఈ దుర్గమ ప్రదేశానికి ఆవల నివసిస్తున్న దురాంగోబిషప్ 'నా ఆజ్ఞనెందుకు ధిక్కరించావ్?' అని ఎవరైనా మతగురువుకి శ్రీముఖం పంపించాడనే అనుకుందాం. అది అతనికి చేరాలికదా! తప్పు చేసిన ఫాదరీ ఒకవేళ అది తనకి అందినా, అందలేదంటాడుగాని అందిందంటాడా? ఆ ఫాదరీ సమన్లు అందుకున్నట్టు రుజువు చేయడమెలా? అటువంటి మతగురువు మీద బిషప్ ఏం చర్య తీసుకోగలడు? పోస్టుమోసుకెళ్ళేవాళ్ళు ఎవరూ అంటే ఉన్ని, తోళ్ళ కోసం అడవుల వెంట వెళ్లే వేటగాళ్లూ, బంగారం దొరుకుతుందేమోనని ఆపేక్షతో ఆ కొండ గుట్టలు గాలించేవారూను! వీళ్ళ ద్వారా పంపిన ఉత్తరం అక్కడి మతగురువుకి అంది, ఆయనగారు సంజాయిషీ చెప్పాలి. సంజాయిషీ బదులు అందలేదంటే పోదూ?'

ఫ్రెంచి కార్డినల్ వైన్‌గ్లాసు ఖాళీ చేసి, పెదవులు తుడుచుకుంటున్నాడు. 'ఫెర్రాండ్, అక్కడుండే వాళ్ళందరూ యిలా కొండల్లో తిరుగుతూ ఉంటే, యింటి పట్టున యింకెవరుంటారు? వాళ్ళకి యిళ్లూ వాకిళ్ళూ లేవా?'

'అయ్యో లేకేమి – సుమారు ముప్ఫయి జాతుల మంది నేటివులు ఉన్నారక్కడ. ఎవరి భాష వాళ్ళది. ఎవరి ఆచారాలు వాళ్ళవి. ఒక తెగకీ మరో తెగకీ చచ్చినా పడదు. వీళ్ళు కాక మెక్సికనులు వేరే ఉన్నారు. ఈ మెక్సికనులు మంచివాళ్లే కాని క్రమశిక్షణ, మత

బోధన లేక మూఢాచారాలని పట్టుకు దేవులాడు తున్నారు.'

'డురాంగోబిషప్ దగ్గిర నుంచి నాకో ఉత్తరం వచ్చింది. తన దగ్గిరున్న వికార్‌ని ఈ కొత్త ఉద్యోగంలో వేయమంటూ' అన్నాడు స్పానిష్ కార్డినల్.

'నేటివ్ మతగురువు ఈ కొత్త ఉద్యోగానికి పనికి రాడు. నేటివుని వేశారా మన శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరే! ఆ డురాంగోబిషప్ చెబుతున్నతను వృద్ధుడు కూడా. ఎవరేనా యువకుణ్ణి, చాకచక్యంతో మసలుకోగల ధైర్యవంతుణ్నీ కార్యదీక్షగలవాణ్నీ కొంచెం జాగ్రత్తగా చూసి ఆ ఉద్యోగంలో వెయ్యాలి. ముష్కరులతోనూ, అజ్ఞానులతోనూ పోరాడవలసి ఉంటుందతను. నీతి నియమాలు లేని పాదరీలనీ లోకం తల్లకిందులు చేసే రాజకీయ దురంధరులనీ, అతను తన బుద్ధిబలంతో జయించ వలసి ఉంటుంది. ఇక అతను తన జీవితాన్ని మత ధర్మానికై ధారపోయగల సంకల్పచిత్తుడై ఉండాలి.'

స్పానిష్ కార్డినల్ కనుకొలకుల్లోంచి ఫెర్రాండ్‌ని పరిశీలనగా చూసి, 'మీ ధోరణిబట్టి చూస్తే, మీ మనసులో ఎవరో వ్యక్తి వున్నట్టున్నాడు. అతను ఫ్రెంచివాడై వుంటాడు బహుశా. అవునా, కాదా?' అని అడిగాడు.

'అవును - ఫ్రెంచిపాదరీలపట్ల మీకున్నూడా అంతటి సద్భావం వుండటం సంతోష హేతువు.'

'మత ప్రచారంలో ఫ్రెంచి జెసూట్లని చెప్పి మరో కర్ని చెప్పాలి. మా స్పానిష్ ఫాదరీలు ఆత్మార్పణ చెయ్య గల వారుగా మాత్రం రాణిస్తారు.'

'ఏమైనా జర్మనుల కంటె నయం,' అన్నాడు ఇటాలియన్ కార్డినల్.

'జర్మనులు దేనికది విడదీస్తారు. ఫ్రెంచివారు ఎక్కడిదక్కడ సర్దుతారు. ఫ్రెంచి ఫాదరీలకి వాస్తవ దృక్పథం, తర్కవిచారం వారి స్వభావ లక్షణం' అంటూ, స్పానిష్ కార్డినల్, ఫెర్రాండ్ వేపు తిరిగి, యింకొంచెం బర్గండీ వైన్ పుచ్చుకోండి. ఇది మీకోసమని ప్రత్యేకంగా తెప్పించాను లోపల నుంచి. మీరు కెనడాలో గడిపిన యిరవై హేమంత ఋతువుల చలినీ, యిది ఒక్క గుక్కతో మరిపింప జేస్తుంది,' అన్నాడు.

గృహమేధి చూపుతున్న అతిథి సత్కారానికి వినమ్రంగా చిరునవ్వు నవ్వుతూ 'మీ ద్రాక్ష రసం ఎంత బాగుందో! అట్లాంటిక్ దాటి నప్పటి నుంచీ, ఈ జిహ్వ ద్రాక్షరసమాధుర్యం మరచి పోయింది. అక్కడ మాకు విస్కీ, రమ్ లే కదా దొరికేది! ఒకసారి నలభై రోజుల సముద్ర ప్రయాణానంతరం, పారిస్ లో దిగి అక్కడి షాంపెయిన్ పుచ్చుకోగానే అది అమృతం అనిపించింది' అన్నాడు.

'అయితే మీకు షాంపెయిన్ తీసుకురమ్మంటాను. ఇప్పుడు మనం అనుకుంటున్న ఫాదరీ ఆ అడవి దున్నల

ప్రపంచంలో యేం తింటాడేం, పాపం?' అన్నాడు స్పానిష్ కార్డినల్.

'మాంసపు ఒరుగూ, మిరప్పొడి జల్లిన 'ఫ్రిజోల్సూ' దొరుకుతాయి. ఎక్కడ పడితే అక్కడ మంచినీరు పుష్కలంగా లభ్యమవుతుంది. ఒక్క సంగతి మాత్రం మీరు గుర్తించాలి. ఆ యువకుని జీవితం ఆ అరణ్య ప్రాంతానికి అంకితమై పోతుంది. మీద పడ్డ వర్షాన్ని నేల ఎలా పీల్చేసుకుంటుందో, అదేవిధంగా అతని వయసునీ శక్తి సామర్థ్యాలనీ ఆ ఉద్యోగం పీల్చేస్తుంది. ఎక్కడికక్కడ ఎప్పటికప్పుడు త్యాగ జీవనమే ధ్యేయంగా ముందుకు సాగవలసి వుంటుంది. క్రిందటి సంవత్సరం నేటివ్‌లు, లావోస్‌లోని అమెరికను గవర్నరునీ, మరో పన్నెండు గురు తెల్లవారినీ దారుణంగా హత్యచేసి వారి చర్మం వొలిచారట. అక్కడి ఫాదరీకి కూడా యిందులో ప్రమేయం ఉందంటారు. అందువల్లనే అతను బతికి బయటపడి వుండవచ్చు. న్యూ మెక్సికో అంటే ఎటువంటిదో మాటలలో చెప్పలేం,' అన్నాడు ఫెర్రాండు.

'అయితే మీ మనిషి ఎక్కడ వున్నాడు?'

'నా 'డయోసీస్' లోనే. ఓంటేరియో సరసు ప్రాంతాన వున్నాడు. అతని వయసు ముప్ఫై అయిదు. ఇప్పటికి తొమ్మిదేళ్ళ బట్టి నా దగ్గిర పని చేస్తున్నాడు. సెమినరీలో చదువు పూర్తి అయిన వెంటనే, తిన్నగా నా దగ్గిరి కొచ్చాడు.'

'పేరు ?'

'జీన్ మేరియు లెటూర్.'

స్పానిష్ కార్డినల్ కుర్చీలో వెనక్కి జేరగిలబడి, వేలి కొనలతో టేబులును మీటుతూ అన్నాడు:'ఫెర్రాండు, మీరు చెప్పినదంతా బాగానే వుంది గాని బాల్టిమోర్ బిషప్ ఎవరిని వేయమంటే వారిని వేస్తుంది రోమ్‌లోని అధిష్టాన వర్గం.'

'సిఫారసు చేస్తూ మీరొక్క ముక్క అంటే...'

'నిజమే, నేను కల్పించుకుంటే కొంత పని జరుగుతుంది,' అన్నాడు స్పానిష్ కార్డినల్ చిరునవ్వు నవ్వుతూ. 'అయితే ఈ లెటూర్ బుద్ధిమంతుడేనా? తెలివిగలవాడేనా? ఆ యువకుని నిష్కారణంగా గోతిలోకి దింపుతున్నారు మీరు! పోన్లెండి, ఆ ఒంటేరియో సరస్సు దగ్గిరుండి బావుకునే దేముంది? మీ కెనడా గురించి నేను ఫెనిమోర్ కూపర్ నవలల ద్వారా తెలుసుకున్నాను. అవన్నీ ఇంగ్లీషులో చదివాను. అది సరే గాని మీరు చెబుతున్న ఈ ఫాదరీ నిజంగా ప్రజ్ఞావంతుడేనా? లలిత కళలలో ఏమేనా అభిరుచి వుందా?'

'స్క్వామెక్సికో పోయే మనిషికి లలిత కళ లెందుకు?' అని ఫెర్రాండ్ అనే సరికి ముగ్గురు కార్డినల్సూ కడుపార నవ్వి తమ పాన పాత్రలు నింపుకున్నారు. ఈ ఫెర్రాండు అదే పనిగా ఒక విషయం మాట్లాడ్డం వారి కంత నచ్చలేదు.

'కొంచెం వింటారా, నేనొక చిన్న కథ చెబుతాను. లలిత కళల గురించి ఏమైనా తెలుసునా అని, నే నడగ డానికి కారణం లేక పోలేదు. వెలెన్షియాలోని మా పురాతన భవంతిలో స్పానిష్ పెయింటర్స్ చిత్రాలు అనేకం వున్నాయి. మా ముత్తాత గారికి ఈ చిత్ర పటాల సేకరణ ఒక సరదా. ఆయన జాగర్త చేసిన ఎల్ గ్రెకో చిత్రాలు స్పెయిన్ మొత్తం మీద మరింకెక్కడా లేవు. మా ముత్తాత ముసలివాడైనప్పుడు, న్యూ స్పెయిన్ నుంచి ఒక ఫ్రెంచి ఫాదరీ యాచన నిమిత్తం వచ్చాడు. అమెరికా నుంచి వచ్చే యీ ఫాదరీ లందరూ యాచకులే అనవచ్చు. ఈ ఫ్రెంచి ఫాదరీకి ఆ దేశపు కథ లెన్నో తెలుసు. మా యింటి కొచ్చి పూజామందిరం దగ్గిర ప్రార్థనలు చెప్పే వాడు. బట్టా పాతాయే కాకండా చాలా డబ్బు గుంజాడు మా ముత్తాత దగ్గర. 'మా చర్చికి ఆభరణంలా వుంటుంది, ఒక పెయింటింగు యివ్వండి' అని ముత్తాతని అడిగాడు. ఆయనకి వితరణ బుద్ధి ఎక్కువ. 'ఆ కనపడే చిత్ర పటాల్లో నీ ఇష్టమొచ్చింది తీసుకో,' అన్నాడాయన. నోటి నుంచి ఆ మాట రావడమే తడవుగా, అక్కడున్న పెయింటింగ్సులో ఉత్తమ మయినది ఎన్నుకున్నాడా మహానుభావుడు. ఎల్ గ్రెకో చిత్రించిన సెయింట్ ఫ్రాన్సిస్ చిత్రమది. మతసంబంధమైనవ క్రూసిఫిక్షనో, ఏమార్టిడమో-యిలాటివి కోరుకుంటాడనుకున్నాడు. ధ్యానముద్రలోని సెయింట్ ఫ్రాన్సిస్‌కి మోడల్‌గా కూచున్నది ఆల్బుకర్కీ డ్యూక్; ఆ రూప విలా

సుని చిత్రము నీ కెందుకు, అని తప్పింప జూశాడు మా ముత్తాత. 'అక్కడి నేటివులకి యిటువంటి కళాఖండం అర్ధమవుతుందా? ఎందుకిది నిష్కారణం పట్టుకుపోతావు' అని ఒకటికి పదిసార్లు చెప్పి చూశాడు గాని ప్రయోజనం లేక పోయింది. 'మీరా చిత్రం నా కివ్వదలుచుకోక పోతే నేను చెప్పే దేముంది? ఇస్తానన్నారు గనక అడిగాను. ఇది మానవ మాత్రుల దగ్గిర వుండవలసింది కాదు - భగవంతుని సమక్షంలో వుండాలి' అన్నాడు.

'మా ముత్తాత యేమంటాడు, పాపం! ఆడినమాట తప్పితే బాగుంటుందా? అంచేత నోరు మూసుకు ఆ చిత్రాన్ని ఫాదరీ చేతుల్లో పెట్టి తన పుస్తకంలో యిలా రాసుకున్నాడు: భగవంతుని ప్రీత్యర్థం మత గురువు టియోఫిలో ఫలానా నెంబరు గల సెయింట్ ఫ్రాన్సిస్ చిత్రం న్యూ మెక్సికోలోని అడివి మనుషుల చర్చిలో ఉంచడానికి ఈయడమైనది. ఈ పోయిన విలువైన చిత్రం కారణంగానే, నాకూ డురాంగో బిషప్‌కీ మధ్య చాలా ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచాయి. దీనిని మా పూర్వీకుడు ఏ సందర్భంలో చర్చికి ధారాగతం చేసిందీ, విడమరచి చెపుతూ రాశాను. ఆ చర్చి ప్రస్తుతం నామరూపాలు లేకుండా శిథిలమై పోయిందనీ, లోపలి వస్తుసామగ్రంతా ఛిన్నాభిన్నమై పోయిందనీ ఆ బిషప్ వ్రాశాడు. ఎంతో విధ్వంసకకాండ జరిగిందనీ, బహుశా ఆ చిత్రపటం దాని విలువ తెలీని ఎవరి చేతిలోనో పడి నశించిపోయి వుండ

వచ్చనీ, ఒకవేళ పొరబాటున ఎవరేనా జాగ్రత్త చేసినా, అది ఏ అటకమీదనో, ఏ కర్రల దొడ్లోనో పడి వుండి, దాని విలువను ఏనాడో కోల్పోయి వుంటుందనీ వ్రాశాడు. ఇదంతా ఎందుకు చెప్పొచ్చానంటే, ఫ్రాంసు, మీరు సూచించే ఆ ఫ్రెంచి మత గురువుకి కళాదృష్టి గాని వుంటే ఎల్ గ్రెకో పెయింటింగ్ సంగతి కొంచెం జ్ఞప్తిలో వుంచు కోమనండి.'

'అతనికీ లలిత కళల గురించి ఎక్కువ తెలుసునో తెలియదో చెప్పలేను. కాని సౌజన్యవంతుడు మాత్రం అవును, చక్కని అభిరుచులు గలవాడు.'

'అయితే ఎల్ గ్రెకో చిత్రం పటం సంగతి మాత్రం కొంచెం జ్ఞాపకం వుంచుకోమనండి. సూర్యాస్తమయ సమ మవుతోంది. డాబామీదకి వెళ్లి కాఫీ పుచ్చుకుంటూ అస్తమయ శోభ చూద్దాం పదండి' అన్నాడు స్పానిష్ కార్డినల్. అతిథులు ముగ్గురూ వెనకని వస్తూ వుండగా సన్న మెట్లమీద నుంచి డాబా యెక్కా డాయన. ఆ శిలాగ్రం పైనుంచి చుట్టూ ప్రపంచం, నీలపుసరసు మీద ధూళి పరుచుకున్నట్టుగా వుంది. పొదల చుట్టూ గల ప్రదే శం వూదారంగు దాల్చింది. ఆ లేత చెంగావి రంగు ఆకా శంలో తేలివస్తూన్న గాలి కెరటాలు అతిథుల ముఖాలని స్పృశిస్తున్నాయి.

నలుగురు సాధకులూ డాబామీద పచార్లు చేస్తూ, చుట్టూగల సృష్టి సౌందర్యాన్ని వీక్షిస్తున్నారు. నక్ష

త్రాలు తెరతొలగించుకు బయటికి వచ్చాయి. ఎన్నెన్నో విష యాలు మాట్లాడారు రాజకీయ వాసన లేకుండా. లాంబార్డు యుద్ధం గురించి ప్రస్తావించలేదు. వెన్నిస్‌లోని సంగీత నాటికలు, ఆండులేషియాలో పరివర్తన తీసుకొస్తున్న స్పానిష్ నర్తకి, మొదలైన విషయాలు వచ్చాయి. ఫ్రెంచి, ఇటాలియను, స్పానిష్ కార్డినల్సు మాట్లాడే సంగీత సారస్వత విషయాలు, అమెరికా నుంచి వచ్చిన ఫాద రీకి బొత్తిగా తెలియవు. ఆ దూర ప్రదేశంలోపడి కొట్టు కుంటూ కళాభిరుచులు కోల్పోతున్నానా అని ఫెర్రాండు క్షణకాలం చింతించాడు. ఏమైనా తన ప్రపంచం వేరు. తను వచ్చిన పని వేరు. సంస్కృతీ నాగరికతలకి దూర మయానా అని కొద్దిగా వ్యాకుల పడుతున్న ఫెర్రాండు చెవిలో స్పానిష్ కార్డినల్ అన్నాడు: 'మీ కాండిడేట్ పేరేమిటన్నారూ - జీన్ లెటూర్ కదూ?'

# 1



# నూతనప్రదేశం

1851వ సంవత్సరం ఆకురాలు కాలంలో ఒకనాటి మధ్యాహ్నం వేళ సెంట్రల్ న్యూమెక్సికోగుండా ఒక రౌతు తన గుర్రం మీద ప్రయాణం చేస్తున్నాడు. అతని స్వారీ గుర్రానికి వెనకగా, బరువులు మోసే మోత గుర్రం ఉంది. మోత గుర్రం సామానులు మోసుకు వస్తోంది. దారి తప్పిన ఆ బాటసారికి, దారి చూపగలవి జేబులోని దిక్సూచీ, మనసులోనిది క్సూచీ జ్ఞానమూను. ఈ భూభాగం ఎలా ఉన్నదంటే, దీని కెక్కడా ఆకృతి అంటూ లేదు. అసలు ఆకారం లేదని కాదు – కనపడేవన్నీ ఒకే మాదిరి ఎర్రమన్ను గుట్టలు. ఎటు చూసినా అవే గుట్టలు. ఆ ఎర్ర కొండలు పొద్దుట నుంచీ అదే పనిగా దాటుతున్నాడు. ఎన్నిటిని దాటినా, ఆ కొండ లింకా అనంతంగా కన పడుతూనే ఉన్నాయి. శంఖాకృతిలో గల ఈ ఎర్ర

గుట్టలు తప్ప మరొకటి కనపడకపోవడంతో, అతనికి పిచ్చెక్కిపోతోంది. ఈ ఎర్ర గుట్టల మధ్య యిప్పటికి ముప్పై మైళ్ళు ప్రయాణం చేసి ఉంటాడు. ఆ గుట్టల మధ్య నుంచి దారి చేసుకుంటూ ముందుకి నడుస్తున్నాడు. గరాటు ఆకారంలో ఉన్న ఈ ఎర్రమట్టి గుట్టలు చూసి చూసి కళ్ళు అలసట చెందుతున్నాయి. ఆ గుట్టల మీద అక్కడక్కడ చిన్నవి 'జునిపర్' మొక్కలు వడిలిపోయిన ఆకు పచ్చటి పత్రాలతో అగుపడుతున్నాయి. కొండలన్నీ ఎరుపు. మార్పులేని ఆ దృశ్యం మతిపోగొడుతోంది. ఎన్ని ఎర్ర గుట్టలని వెనక్కి తోసేసుకు వస్తున్నా, అవి యింకా అసంఖ్యాకంగా మొలుస్తూనే ఉన్నాయి.

ఆ ఎర్రమట్టి గోపురాలు చూడలేక కళ్ళు మూతలు పడుతున్నాయి. వేడి తీవ్రత బాటసారిని భయపెడుతోంది. మార్పులేని ఏక రూపం చూడలేక, కళ్ళు మూసుకు ప్రయాణం సాగిస్తున్నాడు.

కొంతసేపయ్యాక కళ్ళు తెరుపుల కొచ్చి చూడగా ఈ మట్టి గోపురాలమీద గల జునిపర్ మొక్కలలో ఒక ప్రత్యేకమైనది కనపడింది. పొత్తుగా పెరిగిన పొట్టి మొక్కల బదులు, పది అడుగుల పొడవు గల వృక్ష ఖండం కనిపించేసరికి అతనికి ప్రాణం తెప్పరిల్లినట్టయింది. అదీగాక ఈ వృక్షఖండం శిరోభాగాన శిలువ వలె చీలి, ఆకుపచ్చని ఆకులతో దర్శన మిచ్చింది. చూడగానే బాట

సారి గుర్రం దిగి, జేబులోనించి ప్రార్థన పుస్తకం తీసుకు తల మీద టోపీ కింద ఉంచి, ఆ వృక్షానికి మోకరిల్లాడు.

పైన వేసుకున్న చర్మపు దుస్తుల కడుగున మత గురువులు ధరించే కోటు వేసుకున్నాడు. ఆ యువకుడు భగవంతుని పట్ల సంపూర్ణ భక్తి విశ్వాసములు గలవాడు. వెయ్యిమందిలో వున్నా ప్రత్యేకంగా కనపడే తేజశ్శాలి అతను. మోకరిల్లి అతను చేసే నమస్కారం త్రికరణ శుద్ధి గలది. దాతృత్వము, దయ, ప్రేమ, కరుణ మొదలైన సద్గుణాలన్నీ అతని ముఖంలో స్పష్టంగా కనపడతాయి. ఇక ఆ చేతి వేళ్ళకి గల సొగసులో దయాగుణం దాక్కుని వుందా అనిపిస్తుంది. సౌజన్యమూర్తీ, సాహసోపేతుడూ అయిన ఆ యువకుడు కులీన కుటుంబంలోనివాడు. ఆఖరికి ఆ ఎడారిలో కూడా, ఎవరూ తనని చూడని ప్రదేశంలో కూడా, ప్రవర్తనలో పొల్లు రానీయని జ్ఞానవంతుడు. సౌమ్యత తన స్వభావంలో అంతర్భాగంగా చేసుకోగలగడమే కాకుండా, తన నంటిపెట్టుకు వస్తున్న, ఆ గుర్రాల పట్ల కూడా ఎంతో కరుణతో ఉండేవాడు. తను మొక్కుతున్నది చెట్టుకే, అయినా ఆ ప్రార్థన వినేది భగవంతుడని అతనికి తెలుసు.

అరగంట సేపు ప్రార్థించాడు అతను. ప్రార్థనానంతరం మనసెంతో ప్రశాంతిగా ఉంది. గుర్రంతో కొంచెం సేపు, వచ్చీ రాని స్పానిష్ భాషలో సంభాషించాడు. ముందుకి వెళ్దామా, ఏం చేద్దాం?-అని అడుగుతున్నాడు.

తమ దగ్గర వున్న నీటి కూజాలు ఖాళీ అయిపోయాయి. నిన్న ఉదయం నుంచీ గుర్రాలకి నీళ్ళు లేవు. గడచిన రాత్రి ఈ ఎర్ర గుట్టలలోనే విశ్రమించారు. పగలస్తమానం ప్రయాణం చేసినా, సాయంకాలానికి కూడా ఒక్క నీటి బొట్టు కనపడలేదు. గుర్రాలు దప్పికతో గిజగిజ లాడు తున్నాయి. నీటి వాసన కోసమై పొద్దుటి నించీ అవి తపిస్తున్నాయి.

ఒకసారి టెక్సాస్ యెడారి గుండా ఒంటెల మీద ప్రయాణం చేస్తున్నప్పుడు, దప్పికంటే ఏమిటో స్వాను భవంతో తెలుసుకున్నాడు ఈ బాటసారి. నీటి కొరతవల్ల వారందరూ వంతులు వేసుకోవలసి వచ్చింది. అయినా ఏదో నీరంటూ కొంచెం గాక పోతే కొంచమయినా దొరికేది. ఈసారి మరీ ఘోరం. నిన్న వుదయం నుంచీ నీటి చుక్క లేదు. నాలుక పిడచకట్టి నోరంతా చేదుగా వుంది. నోటి చేదుకి సాయం, వొళ్ళు నొప్పులు! గోపురాల వంటి ఎర్ర కొండలు తనని పదే పదే భయపెట్టటంతో, తన దప్పిక మర్చిపోయేందుకు ప్రభువు పడిన దాహ బాధను జ్ఞప్తికి తెచ్చుకు, ఆ ప్రభుని ధ్యానంలో 'తను' అనేది మాయము చేసేందుకు ప్రయత్నించాడు. భగవంతుడు తననీ విధంగా మరణించమని లిఖించాడా? 'స్వామీ యిది నా జీవిత చరమ ఘడియలా?' అంటూ ఆ శిలువ నుద్దేశిస్తూ తన శక్తి అంతటితోనూ ప్రార్థించాడు. చిన్నప్పటి నుంచీ సుశిక్షణలో పెరిగిన వాడవడం చేత, చిత్తము ఆ పర

మాత్మని మీద వుంచి, ప్రార్థనలో నిమగ్నుడై, తనని తాను మర్చిపోగలిగాడు.

ఆ ప్రార్థన అలా ఎంతసేపు జరిగేదోగాని గుర్రం నిలబడలేక, తూలిపోవడం వల్ల, ఆ ప్రాణి మీద అతనికి ఎంతో భూత దయ కలిగింది. కుంపటి వంటి ఈ ఎడారిలో తను ఆ రెండు జీవాలకీ యజమాని. వాటికి లేని మేధా శక్తి తనకి ఉన్నది. అంచేత వాటిని తన బుద్ధి బలంతో రక్షించుకోవాలి.

ఆ బాటసారి పేరు జీనులెటూర్. ఇతన్ని న్యూ మెక్సికో రాష్ట్రపు మత గురువుగా వేశారు. సిన్సినాటిలో సంవత్సరం క్రితం దాకా చర్చి ఉద్యోగంలో వున్నాడు. సిన్సినాటిలో ఎవరూ అతనికి ఈ న్యూమెక్సికో దారి చెప్ప లేక పోయారు. ఫాదర్ లెటూర్ అమెరికా వచ్చిన కొత్త రికంలో న్యూయార్కు నుంచి సినుసినాటికి రైలు మార్గం పడింది. ఆ రైలు మార్గం ముందుకు సాగిపోక అక్కడితో ఆగిపోయింది. న్యూమెక్సికో ఈ ఖండానికి ఎక్కడో మధ్య భాగాన వుంది. వోహియో వ్యాపారులకి న్యూమెక్సికో చేరుకునేందుకు రెండే రెండు మార్గాలు తెలుసు. ఒకటి: సెయింట్ లూయియా వెంట శాంటాఫె వెళ్ళే మార్గం. కాని, ఆ దారి వెంట ప్రయాణం చేయటం క్షేమం కాదట – విప రీతమైన దొంగల భయం. రెండవది న్యూ ఆర్లియన్సు మీదుగా, గాల్వెస్టాన్ చేరుకు, టెక్సాస్ దాటి, శాన్ ఆంటోనియో మీదుగా రయో గ్రాండీ లోయ వెంట

న్యూమెక్సికో చేరుకోవడం. 'అసావాదితో బ్రహ్మ'లా, చుట్టు తిరిగి వెళ్ళే దారి అయినా, ప్రాణ భయంలేని ఈ మార్గం వెంట ప్రయాణం చేయమని లెటూర్ మిత్రులు సలహా యిచ్చారు. వారి సలహా ప్రకారం ఈ చుట్టు దారి వెంట ప్రయాణం చేస్తున్నాడు లెటూర్. ప్రమాదకరం గానే వున్నది మొదటి నుంచీ ఈ ప్రయాణం! గాల్వెస్టన్ రేవులో అతను ప్రయాణం చేస్తున్న స్టీమరు మునిగి పోయింది. అక్కడితో అతనికిగల భౌతిక సంపదయావత్తూ జలదేవత పాలయింది. ప్రాణాలకి తెగించి అతి కష్టం మీద ఓ పది పుస్తకాలు కాపాడుకోగలిగాడు ఆ మునిగిపోతున్న ఓడలో నుంచి...తరువాత ఒక వర్తకుల జట్టుతో కలసి, చచ్చి చెడి, టెక్సాస్ దాటి, శాన్ ఆంటోనియో చేరు కుంటూ వుండగా, బండిలో నుంచి జారిపడి కాలు విరుగ గొట్టుకున్నాడు. వైద్యం కోసం, విశ్రాంతి కోసం మూడు నెలల పాటు ఓ ఐరిష్ కుటుంబంతో అక్కడ గడిపి, వొోటి కాలు గట్టి పడ్డాక, ప్రయాణం సాగించాడు. ఈ వేసవిలో ప్రయాణం మొదలుపెట్టి, పై వేసవిలో ఒక సాయంత్రం వేళకి తన గమ్యస్థానము సమీపించాడు. పన్నెండు నెలలు ప్రయాణం చేసిన మీదట జనపదం కనిపించేసరికి అతనికి ప్రాణం తెప్పరిల్లి నట్టయింది. తను ఉన్న బండ్ల వరుస ఎడ తెగవి అడవులగుండా రెండు రోజులు పరుగెత్తింది. సాయంత్రం నాలుగు గంటలవేళ కొంచెం పసరిక, నీరు కనిపించే పర్వత ప్రాంతాన నిలిచిందా బండ్ల వరుస.

అడవులు చూసి విసిగెత్తి వున్న నేత్రాలకి, ఎర్రనైన కొండ గుట్టలు, వూదిన బెలూనులవలె అగుపడ్డాయి. ఈ కొండలు ఎగిరెగిరి పడే సముద్ర కెరటాలలా వున్నాయి.

ఇనబింబం అస్తగిరి చేరుకునే సమయాన, చేతులు చాచి పీఠభూమిని కౌగలించుకుంటున్నట్టు కనపడు తున్నాయి రెండు పర్వతాలు. ఆ బాహుబంధం లోపల ఉంది శాంటాఫే. అక్కడి చర్చిగోపురం చుట్టూ గల ప్రదే శాన్ని తిలకిస్తూ ఉంటుంది. ఆ పట్నంలోని ఒకే ఒక పెద్దవీధి తిన్నగా చర్చి వద్దకు తీసుకు వెడుతుంది. శాంటాఫే చర్చి మందిరం ఒక నీటి జల వంటిది. జల నుంచి ఉద్భ వించిన నీరు పరవళ్ళు తొక్కుతూ చుట్టూ పారినట్టే ఈ చర్చి ప్రభావం అక్కడి ప్రజల నిత్య జీవితముపై వ్యాపిం చినది. బూరుగ చెట్లు ఊగిసలాడుతూ మత సాధకులకి స్వాగతం చెబుతున్నాయి. వెనకటి ప్రయాణంలో లెటూర్ వెంట ఫాదర్ జోసఫ్ కూడా ఉన్నాడు. బాల్య మిత్రులైన వీరిద్దరూ ఈ కొత్త ఖండంలోని కష్టాలు చెరి సమంగా పంచుకుంటున్నారు. ఆ సాయంత్రం వేళ శాంటాఫె గ్రామంలోకి ప్రభు సేవకులుగా వచ్చారు ఆ యిద్దరు ఫాదరీలూను!

* * *

మరి అయితే ఆ పర్వత హస్తాలకి దూరంగా తన గమ్యస్థానం ఎలా చేరుకోవాలో కూడా తెలీకుండా ఈ

మట్టి కొండల మధ్యకి ఎందుకు వచ్చిపడ్డట్టు ఈ లెటూార్ ? మొదటిసారి శాంటాఫె చేరుకున్నాక ఏమయిందంటే అక్కడి మెక్సికన్ ఫాదరీలు 'నీ అధికారం మేం అంగీకరించేది లేదు పో' అన్నారు.

అగతోనికాబిషప్ సంగతి తమకి తెలీదనీ, తాము దురాంగోబిషప్‌కి బద్ధులమై వున్నామనీ అన్నారు. 'ఫాదర్ లెటూార్, నువ్వో మా బిషప్పైవెతే నీ యోగ్యతా పత్రా లెక్కడ?' అని ముక్కుమీద గుద్దినట్టు అడిగారు. తన నిక్కడ వేస్తున్నట్టు, ఈ ఉద్యోగం మార్పు, దురాంగో బిషప్‌కి వుత్తరం ద్వారా కబురు వెళ్ళిందని మాత్రమే లెటూార్‌కి తెలుసు. ఆ ఉత్తరం ఆయనగారికి అందిందో లేదో! ఒకవేళ అందినా, ఆజ్ఞాపత్రం పంపేదేమిటిలే. అని వూరుకున్నాడో! ఈప్రాంతాల వుత్తరాలు పోస్టుచేయడమేగాని, అవి అందుతాయనే నమ్మకం లేదు. దురాంగో బిషపుకి ఒకవార్త తెలియపరచదలుచుకుంటే, తేలిక మార్గమేదనగా, తిన్నగా వెళ్ళి చెప్పడమే! లెటూార్ కొద్ది వారాలపాటు శాంటాఫెలో వుండి, తన అధికార పత్రం కోసం, వోల్డ్ మెక్సికోలోని దురాంగో బిషప్ దగ్గరికి ప్రయాణం కట్టాడు. శాంటాఫె నుంచి అక్కడికి రాను పోను మూడువేల మైళ్ళు.

రయోగ్రాండీరోడ్డు ప్రమాదభూయిష్టమనీ, తప్పు త్రోవలు అనేకం వున్నాయనీ, ఎక్కడేనా దారి తప్పి పోవచ్చుననీ లెటూార్‌కి ముందే వార్నింగు యిచ్చారు

అతని శ్రేయోభిలాషులు. కొన్నాళ్ళు చాలా జాగ్రత్తగా తెలిసిన బాట వెంటనే పోతూ వచ్చాడు. ఆ తరువాత, కొంచెం నిర్లక్ష్యం చేశాడు. ఆ నిర్లక్ష్యానికి ఫలితం ఈ దారి తప్పడం. దగ్గిర గల ఆహార పదార్థాలు అయి పోయాయి; నీళ్ళ కూజాలు ఖాళీ అయాయి; గుర్రాలు అలిసి పోయాయి. వెనక్కు వెళ్ళనూ లేడు; ముందుకు పోనూ లేడు. కొండగుర్తుగా కనపడ్డ యిసుకదారి వదిలి పెట్టకుండా వస్తున్నాడు యింతవరకూ. చివరికి ఆ యిసుక దారి కూడా మాయమయింది.

నీరసంగా పడివున్న తన గుర్రానికి అమాంతంగా ఏదో నూతన శక్తి రావడం, లెటూర్‌కి ఆశ్చర్యం కలి గించింది. అది కష్టపడి లేచి నుంచుని మోరఎత్తి నలు దిక్కులకి చూసి, ఏదో ఆఘ్రాణిస్తున్నట్టుగా వూపిరి పీల్చింది. సామాను మోస్తున్న గుర్రం కూడా అదే ప్రకారం లేచి నిలబడి మోర ఎత్తి ఆఘ్రాణించింది. నీటి చాలుని పసికట్టాయా ఈ జీవాలు ?

మరొక గంటసేపు అదేమాదిరి ఎర్రగుట్టల మధ్యగా ప్రయాణం చేసిన మీదట ఆ యిసుక ఎడారిలో జలజల పారే నీటి ప్రవాహం కనపడింది. మానవుని బుద్ధిబలం నిరుపయోగమవగా, ఆ జంతువుల ఘ్రాణేంద్రియ శక్తి ప్రాణరక్షణ చేసింది. ఆ గుర్రాలు నిస్సహాయుడైన మాన వునికి ప్రాణం పోసి, తమని తాము కాపాడుకున్నాయి. ఈ దుమ్ములో, ఈ యిసుకలో, ఈ ఎర్రకొండల దుస్స్వప్నంలో

గల గల పారే ఆ స్వచ్ఛమైన నీరు ఫాదరీని విభ్రాంతునిగా చేసింది. ఇది నిజమా, భ్రాంతా అని కళ్ళు తుడుచుకున్నాడు లెటూర్.

జలజలపారే నీరు, చూపు మేరలో పొలాలు కొంచెం దూరంగా పత్తిచెట్లు, పూదోటలు, చిన్న చిన్న ఇళ్ళు, వీటన్నిటితోపాటు తెల్లగా వున్న మేకల మందని ప్రవాహం వైపు తోలుకొస్తున్న ఒక బాలకుడు. అటువంటి మహానందకర దృశ్యం కనపడింది - ఫాదర్ లేటూర్ కి.

గుర్రాలు మరీ ఎక్కువ నీరు తాగకుండా, అతను వాటిని వారిస్తున్న సమయాన, నల్లశాలువా కప్పుకున్న ఒక అమ్మాయి, అటువైపుగా వచ్చింది. ఆమె ముఖారవిందమునుండి వెలువడుతున్నది ఒక కరుణారస వాహిని. క్రైస్తవ రీతిని వందనం చేస్తూ 'ఎక్కడి నుంచి వస్తున్నారు?' అని స్పానిష్ భాషలో అడిగింది.

'నీకు సర్వ శుభములు చేకూరుగాక... నేను దారి తప్పి పోయిన ఫాదరీని. ఈ నీటి ప్రవాహం నా దప్పిక తీర్చింది' స్పానిష్‌లోనే సమాధాన మిచ్చాడు.

'మత గురువా! అంతటి అదృష్టమా మాకు! అవును, మీరు మత గురువుల వలెనే కనపడుతున్నారు. మావి సత్యవాక్కులే! మా తండ్రి ప్రార్థనలు విని భగవంతుడు మిమ్మల్నిక్కడకు పంపి వుంటాడు. మా వాళ్ళందరికీ తొందరగా చెప్పాలి ఈ సంగతి.'

# 2

మరొక గంటలో చీకటి పడింది. ఫాదర్ లెటూర్‌కి ఆ మెక్సికనువాసుల యింట్లో అతిథి సత్కారం జరిగింది. వారు తమ యింటికి 'నదీ దేవత' అని నామకరణం చేసుకున్నారు. బెనిటో, అతని పెద్ద కొడుకూ, యిద్దరు మనుమలూ లెటూర్‌తోపాటు భోజనాల దగ్గిర కూచున్నారు. నీటి వాగు దగ్గర లెటూర్‌ని కలుసుకున్న అమ్మాయి పేరు జోసెఫా. ఈ యింటి పెద్ద బెనిటో కుమార్తె. బెనిటో భార్య పోవడంతో ఇంటి పని అంతా జోసెఫాదే. ఎంతో రుచికరమైన పదార్థాలతో భోజనం పెట్టారు లెటూర్‌కి.

ఈ యింట్లోకి వచ్చినప్పటి నుంచీ లెటూర్‌కి ఏదో మహత్తర శాంతి లభించినట్లుగా వుంది. తెల్లగోడల నిరాడంబరతలో ఏదో అనిర్వచనీయ మాధుర్యం అతనికి కనపడింది. భోజన పదార్థాలు తమ ముందర వుంచి, వెనుక వైపున నిలబడ్డ జోసెఫా అక్కడ ప్రశాంత వాతావరణానికి కారకురాలు. కొత్త మనుష్యుల మధ్య భోజనానికి కూర్చున్నా, స్వగృహంలో వున్నట్టుగానే వుంది లెటూర్‌కి. ఆ నలుగురూ మంచి వాళ్ళు, వారి మాటల తీరులో ఆప్యాయత వ్యక్తమవుతోంది. భోజన పదార్థాలు ముట్టుకోడానికి పూర్వం, తను దైవప్రార్థన చెప్పినప్పుడు, వారు మోకరిల్లి ఫాదర్‌ని తమ వద్దకు పంపిన జగన్మాతకు తమ కృతజ్ఞతా పూర్వక వందనాలు తెలిపారు. ఇక నుంచి

తమ పిల్లలకి బాప్టిజమ్ జరుగుతుంది. తమ ప్రజల వివాహాలు పవిత్ర బంధాలుగా చేయబడతాయి. పిల్లల్ని వృద్ధి రించేందుకూ, దాంపత్యాలు పవిత్రం చేసేందుకు మత గురువు ఒకడు వచ్చాడుగా తమకి! ఊరు చుట్టూ గల నేల తమదని చెప్పేందుకు వ్రాతకోతలేమీ లేవు తమ దగ్గర. దూరానగల ఏ అమెరికనులో వచ్చి 'యిదంతా మాది' అంటే తమని రక్షించే దిక్కెవరు? ఇక్కడి మెక్సికనులలో ఏ ఒక్కరికీ వ్రాయడం చదవడం రాదు. బెనిటో పెద్ద కొడుకు సాల్వటోర్, ఆల్బకుర్క్యు పట్నం వెళ్ళి, అక్కడి ఒక కన్యని మత గురువు సమక్షంలో, శాస్త్రోక్తంగా వివాహం చేసుకు వచ్చాడు. ఆ కర్మకాండ జరిపించినందుకుగాను మతగురువు యిరవై వరహాలు వసూలు చేశాట్ట. ఆ యిరవైతో కొత్త సంసారానికి కావలసిన సామగ్రిలో సగం వచ్చేదట. ఈ దండుగ వ్యవహార మెందుకని అతని తమ్ములూ, యితర బంధువులూ శాస్త్రోక్త వివాహాలు మానుకున్నారు.

లెటూర్ వారిని అనేక ప్రశ్న లడిగాడు. వారికంత దాపరికం లేదు. నిర్మలమైన జీవితాలు వారివి. సుఖపడగల మార్గం తెలుసుకు, ఆ దారి వెంట నడిచే సుజనులు యిక్కడి మెక్సికనులు. ఉన్ని బట్టలు నేయడం, గోధుమ, మొక్కజొన్న, పొగాకు మొదలగు పంటలు పండించడం; ప్లమ్సు, యాప్రికాట్సూ నిలవ జేయడం – వారి పని. సంవత్సరానికోసారి వారు ఆల్బకుర్క్యుకి, తమ ధాన్యం మర

పట్టించేందుకు మోసుకు వెళ్ళేవారు. అటువంటప్పుడే ఆ ధాన్యానికి బదులుగా నాజూకు వస్తువులైన పంచదార, కాఫీ గింజలూ మొదలైనవి తెచ్చుకునేవారు. పంచదార ధర ప్రియంగా వుంటే, తేనె వాడేవారు యిక్కడి వాళ్ళు, తేనె కొనుక్కోవలసిన సరుకు కాదుగా- తేనె పట్లు కావలసినన్ని! తన తాతగారు ఏ సంవత్సరంలో యిక్కడికి వచ్చి స్థిరపడినదీ, బెనిటో చెప్పలేక పోయినాడు, రెండెడ్ల బళ్ల మీద సామానులు వేసుకు 'షిహుహా' నుంచి యిక్కడికి వచ్చి పడ్డాడట వాళ్ళ తాతయ్య. 'ఏమైనా అది ఫ్రెంచి వాళ్ళు తమ రాజుని నరికేసిన తరువాత జరిగి వుంటుంది. ఫ్రెంచి ప్రజలు తమ రాజుని చంపేసిన సంగతి మా తాతయ్య నా చిన్నప్పుడు చెబుతూండేవాడు' అన్నాడు బెనిటో.

'నేను ఫ్రెంచివాణ్ణని మీరీపాటికి గుర్తించివుండాలే!' అన్నాడు ఫాందర్ లెట్రాక్.

నిజానికి వాళ్ళు గుర్తించ లేదు. వాళ్లింతకీ యితను అమెరికను మాత్రం అయి వుండడని అనుకున్నారు. పెద్ద మనుమడు జోసీ ఈ అతిథిని మొదట్నుంచీ ఎంతో శ్రద్ధగా కనిపెడుతున్నాడు. జోసీవి ఆలోచనా పూరిత నేత్రాలు. జుట్టు కొంచెంగా ముఖంమీద పడుతూ వుంటుంది. ఇందాకటి నుంచి శ్రద్ధాసక్తులతో వింటున్న ఆ యువకుడు మొట్టమొదటిసారిగా నోరు విప్పాడు.

'అల్బకుర్క్యాలో అనడమేమిటంటే, మేమందరమూ అమెరికనులమేనని. అది నేను వొప్పుకోను. నే నెప్పటికీ అమెరికన్ని కాను. వాళ్ళు వొట్టి నాస్తికులూ మతభ్రష్టులూను,' అన్నాడు జోసి.

'అందరూ అలా కాదు. నేను ఉత్తర అమెరికాలో ప్రదేశాలపాటు వున్నాను - అమెరికనులలో గూడా విశుద్ధ మత వర్తనులు అనేకులు వున్నారు,' అన్నాడు ఫాదర్.

జోసీ అంత తొందరగా వొప్పుకునే బాపతుకాడు. 'వాళ్ళు మా చర్చి మందిరాలు ధ్వంసం చేశారు పవిత్ర స్థలాలని గుర్రపు శాలలుగా వాడుకున్నారు, మా జీవన స్రవంతిని కలుషితం చేశారు. ఇప్పుడు మా మతం అపహరింప జూస్తున్నారు. వారికీ మాకూ పొత్తు కుదరదు. మా మతం మాది, మా పద్ధతులు మావి. వాటిని మేం ప్రాణ సమానంగా కాపాడుకుంటాం.'

ఫాదర్ లెటూర్ ఓహియో రాష్ట్రింలోని ప్రాటెస్టెంట్లతో తనకిగల స్నేహ బాంధవ్యం మొదలైనవి చెప్పి చూశాడు గాని ఆ మాటలు వారిని సంతుష్టి పరచలేక పోయాయి. తమ దేవుణ్ణి కొలవని వారందరూ విశ్వాస రహితులు అనుకుంటారు కొందరు! అటువంటి వారికి ఏం చెప్పీ లాభంలేదు.

భోజనాలయాక ఫాదర్ లెటూర్ ఒక దీపము పుచ్చుకుని ఆ యింట్లో ఉన్న పవిత్ర విగ్రహాలు పరిశీలించ

సాగాడు. మెక్సికోలో ఎంతటి బీదవాళ్ళ యిళ్ళలోనైనా సరే సాధు పుంగవుల విగ్రహాలు కనపడుతూ వుంటాయి. వాటిని చూసిన కొద్దీ లెటూర్‌కి ఆశ్చర్యంగా వుండేది. ఈ విగ్రహాలలో ఏ రెండూ ఒక దానిని పోలి ఒకటి వుండేవి కాదు. దేని రూపం దానిది. బెనిటో తాత పిహోహూ నుంచి అరవై సంవత్సరాల క్రితం తీసుకువచ్చినవి ఈ సాధు పురుషుల శిల్ప ప్రతిమలు. ఏ భక్తుడో ఈ విగ్రహాలను చెక్కి, వానికి రంగులువేసి వుంటాడు. కాల గమనంతో రంగు కొంచెం తగ్గినా, ఆ తేజం మాత్రం తగ్గలేదు. ఆ విగ్రహాలకి బట్టలు తొడిగి, ఆట బొమ్మల మాదిరి తయారు చేశారు. ఏమైనా ఓహియో రాష్ట్రపు ఫాక్టరీలలో తయారయే ప్లాస్టర్ బొమ్మల వంటివి కావివి. ఆ దారు శిల్పంలో 'వర్జిన్' తెల్లని కండువామీద నల్లని మేలి ముసుగుతో శోకమూర్తియైన పెద్ద కుటుంబంలోని మెక్సికన్ వనితవలె, జాలి గొలుపుతూ దర్శనమిస్తోంది. వర్జినుకి కుడి పక్కగా సెయింట్ జోసెఫ్, ఎడమ పక్కగా మెక్సికన్ దుస్తులలో ఒక గుర్రపు రౌతు. గుర్రపుస్వారీ చేస్తున్న అతని బొమ్మ మన దృష్టిని అరికట్టుతుంది వింతగా.

ఇద్దరు మనుమల్లో రెండవ అతను 'ఆయన నా గురువు సాంటియాగో' అంటూ ఆ రౌతు బొమ్మని చూపించాడు.

'నీ గురువు కూడా నాకు మల్లేనే ఒక గుత సాధకుడు. మా దేశంలో ఆయన్ని సెయింట్ జాక్వీజ్ అని పిలు

స్తాము. సెయింట్ జాక్వీజ్ కి ఒక చేతిలో కర్రా, ఒక చేతిలో సంచీ ఉంటాయి. ఇక్కడ దేశ పరిస్థితిని బట్టి గుర్రం ఉండాలనుకో.'

'ఈయన మాకు గుర్రాల దేవుడు. మరి మీ దేశంలో కూడా అంతేనా?' అని అడిగాడా యువకుడు ఫాదరీని.

'గుర్రాల దేవుడనే సంగతి నాకు తెలియదు. గుర్రాల కాయన ఎలా దేవుడయ్యాడు?' అని అడిగాడు లెటూర్.

'ఆయన గుర్రాలని దీవిస్తాడు. ఆయన ఆశీర్వాద బలం వల్లనే అశ్వ సంపద వృద్ధి అవుతుంది. మేమే కాదు. ఆట వికులైన రెడ్ యిండియనులు కూడా ఈ విషయం నమ్ముతారు. శాంటియాగోను అలక్ష్యం చేశామా గుర్రాలు వ్యాధుల పాలవుతాయి.'

రాత్రి ప్రార్థన లయాక ఫాదర్ లెటూర్, బెనిటో పెద్ద మంచం మీద నడుం వాల్చాడు. అతిధికని ఆ పెద్ద మంచం యిచ్చారు. దప్పికతో ఆ ఎర్ర కొండల ఎడారిలో స్పృహ తప్పి నిద్రపోవలసిన తనకు తోడి మానవుల ప్రేమానురాగాలతో యింతటి సుఖమయ వాతావరణం, ఇంతటిలో, చిత్తస్థయిర్యము, హృదయశాంతినీయగల ప్రదేశంలో హాయిగా, గుండెల మీద చేయి వేసుకు నిద్రించ గల భాగ్యం కలగడం ఆ భగవంతుని చిద్విలాసమను

కున్నాడు ఫాదరీ. జోసఫ్‌గాని తన వెంట ఉంటే ఇదంతా ఒక 'మహాత్మ్యము' కింద జమకట్టి ఉండును. ఫ్రాన్సీఫారమ్ చెట్టుని ఉద్దేశిస్తూ తను జరిపిన ప్రార్థన ఫలితంగా ఆ ప్రార్థనకు సమాధానమా అన్నట్లుగా, తన నిస్సహాయ పరిస్థితిలో ఏదో వెలుగు కిరణం తనకు దారి జూపింది నిజమే. ఆ చూపినది జగన్మాతేననీ ఆమె ఎటువంటి చీని చీనాంబరాలు ధరించిందో కూడా వర్ణించి ఉండేవాడు జోసఫ్.

మర్నాడు మధ్యాహ్నం బిషప్ నీటి గట్టమ్మట తిరుగుతూ, జరిగిన విషయాలన్నీ జ్ఞప్తికి తెచ్చుకుంటున్నాడు. బెనిటో, అతని కుమార్తె 'వర్జిన్' విగ్రహం ముందు ఫల పుష్పాదులు ఉంచి, భక్తి శ్రద్ధలతో ప్రార్థన చేశారు. ఉదయం జరిగిన సమూహ ప్రార్థనకి రోగపీడితురాలైన శాల్వటోర్ భార్య తప్ప మిగతా అందరూ వచ్చారు. వివాహాలకి శాస్త్రోక్త విధి నెరవేర్చి, పిల్లల బాప్టిజమ్ పూర్తిగావించి, ప్రజలు చెప్పుకునే 'కన్‌ఫెషన్సు' ఆలకిస్తూ మధ్యాహ్నం వరకూ ఆ కార్యక్రమంలో గడిపాడు. ఆ తరువాత విందు. విందు భోజనానికి మేక మాంసం వండారు. ఫాదర్ లెటూర్ తనకి వడ్డించే దానిలో మసాలా తక్కువ వేయమని కోరగా, మసాలా తినడం పాపకార్యమా అని అడిగింది జోసెఫా. ఫ్రెంచి వారు మసాలా దినుసులు ఎక్కువ తినరనీ పరిమళానికి మాత్రమే వాడుతారనీ వివరించి చెప్పాడు.

బరువు భోజనానికి అలిసి నిద్రపోతున్న పిల్లల్ని ఋళ్ళకి చేర్చారు. మొగవాళ్ళు మాత్రం పెద్ద చెట్టు చుట్టూతా చేరి చుట్టలు ముట్టించారు. ఏకాంతాన్ని అభిలషించే బిషప్, అలా పదడుగులు నడిచి వస్తానని వారి నించి తప్పుకున్నాడు. తనకి ఎవరూ సాయం రానక్కరలేద న్నాడు. అలా నడిచి వెళుతున్నప్పుడు అతనికి ఆదిమ సమాజం వారి వ్యవసాయపు పనిముట్లు అగుపడ్డాయి. కొండపైన మేకల గుంపు కనపడింది. వాటి అరుపులో ఏదో ప్రత్యేకత ఉంది. ఈ అంగోరా మేకల గుంపు నీటి ప్రవాహాన్ని శరవేగాన దాటబోయింది. ఆ మేకల ముఖాలు సాధుశీలతకి చిహ్నంగా కనపడ్డాయి. పెద్దవాటి కంటె చిన్నవి మరీ ముద్దుగా ఉన్నాయి. ఎదిగీ ఎదగని కొమ్ముల తళతళతో, దేహకాంతితో అవి కంటిని కట్టేస్తున్నాయి. కాని ఆ మేకల ముఖాలు యువకుడైన మతగురువుకి ఏదో మహత్తర సందేశం తెలుపుతున్నాయి. అవి తమ ఉన్నితో ఎందర్ని చలి బాధ నుండి కాపాడాయో, తమ క్షీరంతో ఎందరు బాలకులకి జవశక్తిని సమకూర్చాయో!

నీటి వాగమ్మట ఒక మైలు ఎగువకి నడవగా పత్తి చెట్ల ప్రదేశం కనపడింది. గోపురాకారంలోని ఎర్ర కొండలు అక్కడికి కనుచూపు మేరలో ఉన్నాయి. ఈ నిర్జీవపు ఎడారిలో నీటి జల ఎలా పుట్టిందో ఆశ్చర్యమే! భూగర్భానపోయే అంతర్వాహినేదో అంధకారం భరించ లేక, ఒక్కసారి పైకి తన్నుకు వచ్చినట్టుంది. చెకట్లు

తెంచుకు పైకెగసి వచ్చిన జలదేవత చలవవల్ల ఈ మహా శూన్యంలో పచ్చని మొక్కలకీ, యిల్లు వాకిళ్ళకీ, పంట పొలాలకీ, అవకాశమంటూ ఏర్పడింది. వంటిళ్ళలోని పొగ, ఆకాశంలోకి హారతివలె ప్రయాణం చేస్తోంది.

మతగురువు నీటివాగు పక్కన కూచుని అస్తమయ సూర్యుని అరుణ కాంతులలో మునిగిపోయిన ప్రకృతి సౌందర్యం వీక్షిస్తూ మనోగతంలోకి చూసుకుంటున్నాడు. తనకి ఆతిథ్యమిచ్చిన ఈ బెనిటో తాతగారు యిక్కడికి వచ్చాడన్నమాట. వాళ్ళింట్లో స్పెయిను దేశీయులు వాడిన వస్తువులున్నాయి. ఆ తాత రావడానికి పూర్వం కూడా యిక్కడ జనులు నివసించి వుంటారు. జన పదాలలోని జాతులూ, రంగులూ, కాల వైఖరినిబట్టి మారుతూంటాయి. మహా ఎడారిలో ప్రాణప్రదాయినిగా దర్శన మిచ్చిన ఈ జలదేవత, మానవుని లిఖిత చరిత్రకి పూర్వపుది. రోమనులు ఒక కొత్త చోటుకి వెళ్ళినప్పుడు అక్కడ తమకు కనపడ్డ నదీ సుందరికి తమ సంప్రదాయానుసారమైన విగ్రహం ప్రతిష్టించే వారు. ఆ తరువాత క్రిస్టియనులు ఆ చోటుకి రాగానే ఆ విగ్రహం స్థానే శిలువని వుంచారు. ఎటొచ్చీ, వెనకటి పద్ధతులు నూతన ప్రజాగమనంతో మారి పోయాయి. ఎడారిలో మొలచిన ఈ కుగ్రామం తన అధీనం లోది. ఏనాడో స్పానిష్ మతగురువులు పాతివెళ్ళిన విత్తనం యింకా అలానే ఉంది. ఆ లేత మొక్కకి నీళ్ళు పోసి పెంచితే యిక్కడి ప్రజల కష్టంతో అది ఒక వృక్షమై

కాయలు కాస్తోంది. శాంటాఫెలోనివారు, ఫాదర్ మార్టినెజ్ కుతంత్రాలకి లోనై తన ఆధిపత్యం గుర్తించక పోతేనేం గాక, యిక్కడ ఈ అమాయకులకి తన అవసరం ఎంతయినా వుంది! సామాన్యులెప్పుడూ అమాయక హృదయులే!

# 3

క్రిస్‌మస్ మధ్యాహ్నం లెటూర్ తన బల్లముందు కూచుని ఉత్తరాలు వ్రాసుకుంటున్నాడు. శాంటాఫె వచ్చినప్పటి నుంచి ఉత్తరాల సంఖ్య పెరిగింది. పై అధికారులకి తెలియ జేయవలసిన విషయాలు ఎక్కువయాయి. ప్రతిదీ తను వారికి సవిస్తరంగా తెలియ బరచాలి. ఇక స్వదేశానికి వ్రాయవలసిన విషయాలూ బోలెడన్ని!

లెటూర్, శాంటాఫె చేరుకుని తొమ్మిది రోజులే అయింది. డురాంగో బిషప్ అతి కష్టంమీద అధికార పత్రాలు తనకి వొప్ప జెప్పాడు. ఆ పత్రాలు పుచ్చుకు మళ్ళీ పదిహేను వందల మైళ్ళు తిరుగు ప్రయాణంచేసి, స్వస్థలం చేరుకున్నాడు. శాంటాఫెలో తనకి శత్రుత్వమే యెదురౌతుందనుకున్న ఫాదర్ లెటూర్‌కి, అక్కడి పరిస్థితులు ఆశ్చర్యం కలిగించాయి. స్థానికంగా వున్న ఫాదర్ జోసఫ్ అక్కడి ప్రజల్ని అప్పటికే ప్రసన్నుల్ని చేసుకో గలిగాడు. ఈ చీకాకులకి మూలకారకుడైన మెక్సికన్ పాదరీ తన ఆటలు యింక సాగవని, ఓల్డు మెక్సికోకి పారి

పోయాడు. జోసఫ్ అతని యిల్లు స్వాధీనం చేసుకు, లోపల గల వస్తువులన్నీ చక్కగా సర్దించాడు - కోటలోని మిలిటరీ అధికారులూ, అమెరికను వణిజులూ, మెక్సికను స్త్రీలూ ఈ విషయంలో జోసఫ్‌కి సాయపడ్డారు.

మతగురువు నివసించే పురాతన భవనాన్ని కాలాను గుణంగా మార్చారు. లెటూర్ 'చదువుకునే గది' అని ఒక చివర గది ఏర్పరచుకొన్నాడు. అది క్రిస్‌మస్ సాయంత్రం. గది విశాలంగా వుంది. గోడలు దళసరివి అవడం వల్ల చలి భయం లేదు. మానవుని రెక్కల కష్టం, ఈ యింట్లో ప్రతి మూలా కనపడుతుంది, అసలు ఈ భవనపు కిటికీలు, దర్వాజాలూ, పైదూలాలు, తలుపులమీద చెక్కడపు పని, ప్రతి గదికీ మూలగాగల నిప్పు గూడూ యివన్నీ కూడా మానవుని ప్రేమారాధనలకి చిహ్నంగా కనపడతాయి. 'స్టడీ' లోపలి భాగానికి ఈ మధ్యనే వెల్ల వేశారు. నిప్పు గూడులోని అగ్ని, దీపనాలిక తెరిచినప్పుడల్లా, గది గులాబి వర్ణంతో తళుక్కుమనేది. ఈ గదికి గలది నిర్జీవమైన ధవళతమాత్రంకాదు.

అది సజీవమైన లేత ఎరుపు. గులాబీనుంచి ఎర్రదనంలోకి మారే ఈ కాంతి, కెరటాలవలె ప్రవహించేది. వెచ్చదనమూ, గది గోడల మీద ఆ కెరటాలతోబాటు చాందినీ మీదగల చిత్రాలూ, మొత్తం మీద అదొక సజీవ వాతావరణం. నేలమీద పరిచిన దళసరి తివాసీలూ తలుపులకి

వేలాడ తీసిన రంగు తెరలూ గదిలోగల వాతావరణానికి వన్నె తెస్తున్నాయి.

నిప్పు గూడుకి చెరోవైపునా చిన్న చిన్న గూళ్ళు న్నాయి. ఒకదానిలో పూజావిగ్రహమూ మరొకదానిలో పుస్తకాలూ వున్నాయి. ప్రాణాలకు తెగించి కాపాడు కున్నాడే ఆ పుస్తకాలే అవి!

ఆ ఇంట్లో ఉన్న సోఫాలూ, కుర్చీలూ, యితర కర్ర సామాగ్రీ పలాయితుడవుతున్న మెక్సికను ఫాదరీ వద్ద చవుక ధరకు కొనినవే. సోఫాలూ, కుర్చీలూ మరీ బరు వైనవి. సొగసైనవీ నాజూకువనీ చెప్పలేముగాని ఏదో ఫరవాలేదనిపిస్తుంది. లెటూాక్ గదిలో ప్రతి వస్తువూ, చేతితో చేసినదే. అప్పటి కింకా న్యూమెక్సికోలోకి యంత్రాలు దిగుమతి కాలేదు. ఇనుప మేకులు ఎలా ఉంటాయో అక్కడి వారెరుగరు. అందుచేత, ఆ కుర్చీ లకూ, బల్లలకూ, కర్రమేకులే ఉండేవి. పనివాడు టేబుల్ అనగా నాలుగు కాళ్ళూ ఒక బల్లా అనుకోడం కాకుండా తన పనితనం చూపగల అవకాశంగా భావిస్తూ తయారు చేసేవాడు. అందుకనే ప్రతిదీ ముద్దర కొట్టినట్టుగాక ప్రత్యేకపు టందంతో విరాజిల్లేది. ఆ గదిలోని వ్రాత బల్ల మాత్రం, కోటలోని మిలటరీ అధికారులు చర్చికి బహుమతిగా పంపారు. క్రొవ్వొత్తులు వెలిగించే వెండి సెమ్మాలు బిషప్, ఫ్రాన్సు నుంచి తెచ్చుకున్నాడు. వాటిని

వాళ్ళ మేనత్త అతని మత ధర్మ స్వీకార సందర్భంలో యిచ్చింది.

లెటూర్ చేతిలోని కలం ముత్యాలకోవ వంటి వూదా రంగు అక్షరాలు ఫ్రెంచి భాషలో, కాగితం మీద వొంపులుతూ నర్తకిలా సుడులు తిరుగుతూ ముందుకు సాగుతోంది.

'ప్రియసోదరా, ఈ నా కొత్త 'సడీ'ని గురించి ఏమని వ్రాయను? ఎటు చూసినా పరిమళాలే! ఇక్కడ నిప్పు గూళ్ళలో వేసుకునే దేవదారు చితుకులు ఒక ప్రత్యేక పరిమళం గలవి. అది మల్లి ఘాటైన వాసన కాదు సుమా! అతి మృదువైన సుగంధం. సర్వవేళలా ఆ లేత సువాసన మమ్మల్ని ఆవరించి ఉంటుంది. నీవూ, సిస్టరూ, ఈ పరిమళ ప్రశాంతతని ఏనాటికైనా గ్రహించ గలరా, అని? వృత్తిరీత్యా మేము ఫాదరీలం. పగలంతా పొడుగు కోటూ పెద్ద హేటూ ధరించి, అమెరికన్ వర్త కులలా తిరుగుతూ వుంటాము. సాయంత్రం యింటికి వచ్చాక ఆ బట్టలు వదలి, నిక్షేపంలాంటి పొడుగు గౌను వేసుకునేసరికి, 'హమ్మయ్య' అనిపిస్తుంది. ఆ గౌను వేసు కున్నప్పుడే నేను మత గురువుననిపిస్తుంది. మిగతా రోజంతా ఒక మాదిరి వ్యాపార దృక్పథమే. అమెరికను లతో ఎంత కలసి మెలసి తిరుగుతున్నా, అప్పుడప్పుడు నేను ఫ్రెంచివాణ్ణనిపిస్తూ వుంటుంది. అమెరికను వ్యాపా

శుల దయాంతఃకరణ, కోటలోని మిలిటరీ ఉద్యోగుల ప్రియవర్తన - పై మెరుగులవంటివి కావు. వారి మనసులు నిష్కల్మషములు. కోటలోని వుద్యోగులకు నాచేతనైన సాయం చేయాలని వుంది. నేను ఎంత సాయపడగలనో వారు తెలుసుకోలేరు ఒక పక్షాన. 'కోట' కంటె చర్చి ఎప్పుడూ పటుతరమైనది; ప్రజలను సన్మార్గులుగా మార్చ గల శక్తి చర్చికి మాత్రమే ఉంది. ప్రజలు సన్మార్గులైతే తప్ప, పరిస్థితులు బాగుపడవు.

'నా బాధ్యతలను గురించీ, నా ఉన్నతాశయాలను గురించీ వ్రాయవలసిన రోజు కాదిది. ఈ క్రిస్ మస్ శుభ సమయాన మేము మీ అందరితో కూడా కాక, దూర తీరాన వున్నాము. మనసు ఇంటివైపే గంతులేస్తోంది. ఫాదర్ జోసఫ్ ఈపూట వంట మనిషిని పంపించేశాడు. క్రిస్ మస్ నాటి విందు భోజనం తనే, స్వయంగా వండుతానన్నాడు. ప్రస్తుతం వంటింట్లో తన పాకశాస్త్ర ప్రావీణ్యత చూపెడు తున్నాడు. ఇక్కడి ఆచారము ప్రకారం నిన్నసంతా నోవెనాలో ప్రార్థనలు జరిపాడు. మళ్ళీ అర్ధరాత్రి ప్రార్థ నలు వున్నాయి. విశ్రాంతి తీసుకోవయ్యా అంటే, 'నాకు విశ్రాంతి ఎందుకు?' అంటాడు. ఇక్కడ మాకు ఈ సమ యాన కూరగాయలు దొరకవు. 'లెట్యూస్' అనే మొక్కను గురించి యిక్కడివాళ్ళు విన లేదట. వంటింట్లో నుండి మసాలా వాసన వస్తోందిక్కడకు. ఈ రాత్రి యిక్కడ యిద్దరు క్రైస్తవాచారులు మీ ఆయురారోగ్యాలు కాంక్షిస్తూ,

మీకు శుభములు కలుగాలని దేవుని ప్రార్థిస్తూ, విందు చేసుకుంటారని మరువకండి.'

లెటూర్, కలం టేబులుమీద వుంచి, నిప్పుగూడు దగ్గరకి వెళ్ళి, వెలుగుతున్న ఒక చితుకుతో కొవ్వొత్తులు వెలిగించాడు. నీలిరంగు ఆకాశాన్ని, తెల్లమంచు కప్పుతోంది. ఆ ధవళ నీలంలోంచి శుక్రనక్షత్రం లేత ఎరుపు వన్నె దాల్చింది. లోకాన్ని వెండికాంతులు అలుముకొన్నట్లు వున్నాయి. ఆ చదువుకునే రోజుల్లో పాడుకుంటూండే భక్తిగీత మొకటి గొంతుకలోకి వచ్చింది. మెల్లగా ఆలాపిస్తూ, కొవ్వొత్తులు చేత పుచ్చుకొని, భోజనాల గదిలోకి వెళ్ళాడు లెటూర్. జోసఫ్ అప్పటికప్పుడే 'యాప్రన్' తీసివేసి పొడుగాటి గౌను ధరించాడు. అతను లెటూర్ వలె అందగాడు కాదు, అనాకారుల్లో ప్రథమునిగా జమ కట్టవచ్చు. ఈ అనాకారిలోని మృదుహాసవదనం మాత్రం సాటిలేనిది. పొట్టిగా బక్క పల్చగా కాలమంతా గుర్రపు స్వారీలో గడపడం చేత ఏగ్వడ్డవొంగిన నడుంతో, చూడటానికి మనిషి అందంగా లేకపోయినా, దయలో ఔదార్యంలో అద్వితీయుడు. నలభై యేళ్ళకే ముసలి వాలకం వచ్చింది. చలి ప్రదేశాలలో ఎక్కువగా తిరుగుట వలన, ఒళ్ళు మొరటుబారింది. అసలే పొడుగు మెడ. ఆ మెడ, ఈ ముడతలతో, కొంచెం ఒంగినట్టయింది, కొనతేరిన ముక్కు, చీలినగడ్డమూ, పెద్దనోరు, ఏదో ఒక యోచనతో ఎల్ల వేళలా అదిమివుండే పెదిమెలు, ఎండు

గడ్డివంటిజుట్టూను! దూరపు వస్తువులు కనపడక పోవడమనే కంటిజబ్బు చిన్నప్పటినుంచీ వున్నదే! ఇక ఆ పాలిపోయిన నీలపు కళ్ళు ప్రసరింపగల కాంతు లేముంటాయి? వ్యక్తిలో గల పట్టుదలనూ నిశ్చలదీక్షనూ సూచింపగల రూపురేఖ లెంతమాత్రం కావతనివి. మెక్సికనులతో ఎలా మసలు కోవాలో మాత్రం అతనికి బాగా తెలుసు. లెటూర్ శాంటాఫె తిరిగి వచ్చేసరికి పరిస్థితులు మారిపోయాయంటే, అందుకు కారణం ఈ పూచిక పుల్లలో గల దృఢ సంకల్పమే!

భోజనాల గదిలోకి వచ్చాక లెటూర్, తన చేతి లోని కొవ్వొత్తులు నిప్పుగూడువద్ద వుంచాడు. ఎంచేతనంటే అప్పటికే టేబులుమీద ఆరు కొవ్వొత్తులు, సూప్ పాత్ర చుట్టూ ఉన్నాయి. ఇద్దరూ కొంచెంసేపు నిలబడి ప్రార్థన చేశారు. ఆ తరువాత లెటూర్, సూప్ కొంచెం రుచి చూసి, చెంచాను పాత్రలో ముంచి, కుర్చీలో వెనగ్గా జేర గిలబడి 'ఓ - మహాద్భుతంగా వుంది. మిసిసిపీనదికీ పసి ఫిక్ సముద్రానికీ మధ్య గల ప్రాంతంలో ఏ నరమాన వుడూ యింతటి రుచికరమైన సూప్ తయారు చేయలేడు' అన్నాడు జోసఫ్‌ని అభినందిస్తున్నట్టుగా.

'ఫ్రెంచివాడై పుడితే తప్ప యిటువంటి సూప్ చచ్చినా తయారుచెయ్యలేడు' అని అనేశాక, తన నేస్తం పలుకులలోని వ్యంగ్యం తట్టింది జోసఫ్‌కి.

'ఇటువంటి సూప్ తయారుచేయడమనేది ఒకవ్యక్తికి తన జీవితకాలంలో లభించే నేర్పుకాదు. ఈ పాకశాస్త్ర నైపుణికి వెనక వెయ్యిసంవత్సరాల చరిత్ర వుంది. సహస్ర వర్షముల సంప్రదాయ జ్ఞానం యిందులో నిగూఢమై వుంది.'

'రాజావంటి లెట్యూస్ లేకుండా సూప్ ఎవడు మాత్రం ఎలా తయారు చెయ్యగలరు? ఆజన్మాంతం వుల్లి గడ్డలతో గడపలేం కదా!' అన్నాడు జోసఫ్.

సూప్ పాత్రను లోపలకి తీసుకు వెళ్ళిపోయి, రోష్టు చికెన్, సెలాడ్నూ తీసుకువచ్చాడు జోసఫ్. 'మనం యింకెప్పుడూ ఈ కందమూలాలతో జీవించవలసి వచ్చేట్టుంది. సాండస్కీలోని ఆ తోట తలుచుకుంటే నా కడుపు చెరువవుతోంది. ఆ కాయగూరలూ, ఆ ద్రాక్షతీగెలూ,-అవన్నీ వొదులుకు యిక్కడికి రమ్మన్నావు. సాండస్కీలోని ద్రాక్ష తోట మాట చెబితే, నాకీపూట తిండి సహించదు. నా ద్రాక్షతీగల ద్రాక్షరసాన్ని ఏ అదృష్టవంతుడు సేవిస్తున్నాడో! ఫాదరీల జీవితమే అంత. మొక్క వేసేది ఒకరూ, ఫల మనుభవించేది మరొకరూ!'

ఆ రాత్రివేళ మిత్రులిద్దరూ తమ స్వాభావికమైన ఫ్రెంచిలో మాట్లాడుకుంటున్నారు. ఈ మధ్యంతా వారి మాటలు ఇంగ్లీషులోనే. అప్పుడప్పుడు భాషాభివృద్ధికోసం స్పానిష్‌లో సంభాషించడం అలవరచుకోవలసి వస్తోంది.

'ఈ సాండాస్కీ విసుగుపెడుతోందనీ, ఈ సుఖాలు ముళ్ళవలె వున్నాయనీ నీవు వాపోయినమీదటే కదా

రప్పించినది! స్థబ్ధుగా ఒకచోట పడివుండటం బావుాలేదని, నీవు చేసిన గొడవంతా మరచిపోయావు కాబోలు.'

'అవ్వా కావాలి, బువ్వా కావాలనే సామెతమనకు కొత్తకాదుగా! మన స్వభావాలు అంతే! ఇంతకీ నేను చెప్పొచ్చేదేమిటంటే, రాగలిగినంత దూరం వచ్చాను, ఇక ముందుకి తరమకు' అంటూ ద్రాక్షరసం సీసామూత 'టెరి చాడు. పగడపు కాంతితో ద్రాక్షరసం ఘుమ ఘుమలాడు తోంది. 'మెక్సికనులకి ద్రాక్షరసం విలువ తెలుసు, ఈ ప్రాంతాల ధన మెక్కడో ద్రాక్షరసమక్కడ' అంటూ సీసాలోది కొంచెంగా పాత్రలోకి వొంపేడు.

లెటూర్ కుర్చీలో కొంచెం వెనకగా జేరగిలబడి అన్నాడు. 'ఫాదరీలకి దూరమూ దగ్గిరా ఏమిటి?–అన్నీ దగ్గరే. నా 'డయోసీస్' ఎంత మేరవుందో నాకే తెలీదు, కోటలోని అధికారులకు కూడా ఈ దేశవైశాల్యం గురించి తెలియదు. కిట్ కార్సన్‌కి కొంత తెలియవచ్చునంటున్నారు.'

'విస్తీర్ణపు గొడవలు మనకెందుకు? ప్రస్తుతం శాంటాఫె లో వున్నాం. ఎక్కడికి వెళ్ళినా, మూడునాలుగు రోజులకి మించిన దూరపు ప్రయాణం పెట్టుకోవద్దు ఒకయేడాది పాటు. ఇంట సరిదిద్దుకోవలసినది బోలెడంత వుంది.'

'చదువుకునే రోజుల్లో నీవు తపోనిష్టలో గడపాలనే వాడివి కదూ, అలాగే ఉంటాయి నీమాటలు!'

'ఇప్పటికీ ఆ ఆశ నాకు వుంది. ఒకనాడు నేను యివన్నీ తెంచుకు, ఫ్రాన్స్ చేరుకు, హోలీమదర్‌ను ఆరాధిస్తూ, రోజులు గడుపుతాను. నాకింకా ఆ పిలుపు రాలేదు. పిలుపు వచ్చేదాకా కార్యరంగంలో పని చేయాలి. ఏమైనా, శాంటాఫే దగ్గర మనం ఆగుదాం - యింకా లోపలికి చొచ్చుకు పోవద్దు.'

'ఎంతదాకా వెళ్ళాలో నిర్ణయించగలవాళ్ళం మనమా?' దారి సీయనిపర్వతశ్రేణులూ, కుంపట్లవలె కాల్చే ఎడారులూ, ఆవులించే కొండలూ, త్రుళ్ళింత పెట్టే నీటి వాగులూ, యిలాటి వనేకం పిలువే జీవన జ్యోతిగా దాటుకొచ్చిన జోసఫ్ 'యిక చాలు' అనడం ఆశ్చర్యమే! ఆత్మగతాన్ని అక్కడితో ఆపి, 'ఈ బటాణీల సెలాడ్ బాగా కుదిరింది కదూ! యిందులో ఒక్కటంటే, ఒక్క వుల్లిపాయ వేశాను - పరిమళంకోసం,' అన్నాడు జోసఫ్.

భోజనానంతరం ఎండు ద్రాక్షలు నములుతూ, స్వదేశంలో లెటూర్ కుటుంబ భవనంలోని తోటలోని ఫల పుష్పాదుల గురించి మాట్లాడుకున్నారు. స్వగ్రామమూ, స్వగృహమూ, 'నా' అనే వాళ్ళూ, ఆ కొండ కోనలూ చిన్ననాటి మధురస్మృతులూ, అవన్నీ వరసగా చీకట్లని తరిమే దీపకాంతుల్లా మనోవీధిని మెరిశాయి. మొట్టమొదట తాము ఏ చర్చి మందిరంలో అయితే దీక్ష స్వీకారం చేశారో, ఆ చర్చి, ఆ పవిత్ర వాతావరణమంతా జ్ఞాపకం వచ్చింది.

స్మృతిపథంలో జీవించటమనే నీరసగుణం వారికి స్వభావరీత్యా లేదు. కాని క్రిస్మస్ రోజున ఎందుకో పాత సంగతులు మనసుని దొలుస్తున్నాయి. ఖాదిమీాదికి దోబూచులాడుతూ వచ్చే ఆ జ్ఞాపకాలని వారు తరిమి కొట్టక, అనునయంతో పల్కరించారు. ఆ అతి ప్రశాంత వాతావరణాన్ని భంగపరుస్తూ తుపాకీగుళ్ళమోత, కెవ్వున కేకలు, గుర్రాల డెక్కల చప్పుడూ వినిపించాయి. లెటూర్ సగం లేచి నిలబడగా, జోసఫు అతన్ని కూచోబెట్టి అన్నాడు. 'దీనికేమంత కంగారు పడనక్కర్లేదు – వెనుక 'ఆల్ సోల్స్ డే' రోజున కూడా యిదే ప్రకారం జరిగింది. చెడ తాగిన యువకులు, యోధవరుల్లా తుపాకులు పేలుస్తూ, పాటలు పాడుకుంటూ, కోట ప్రాంతాల తిరుగుతారు. అది తాగుబోతుల సరసం. నువ్వు ఆదుర్దాపడవలసిన దేమీాలేదు అందులో.'

# 4

డురాంగో నుంచి వచ్చిన మర్నాడు బిషప్ నిద్ర లేవడం కొంచెం ఆలస్యమైంది. గడచిన రోజున అరవై మైళ్ళు ఏకదారన ప్రయాణం చేయడంచేత, ఆరుకొట్టే దాకా మెలకువ రాలేదు. అతి శ్రావ్యమైన ఘంటారావమేదో అతని చెవులలో మ్రోగింది. తనకి రోమ్ నగరంలో వున్నట్టనిపించింది. ఇంతటి అతి మధురమైన ఘంటానాదం ఒక్క రోమ్‌లోనే ఉంది – వెండి గంట మోగిన శబ్దమది.

అంతటి శ్రవణానందకరమైన శబ్దం ఆ పవిత్ర భూమిలో తప్ప మరొక చోట వుండటానికి అవకాశం లేదే! తను రోమ్‌లో వున్నాడా, అనిపించింది లెటూర్‌కి! తను రోమ్‌లో వున్నట్టు అపూర్వమైన కల! కాని, కళ్ళు తెరుపులకొచ్చే సరికి అది శాంటాఫే.

ఉదయం కాఫీ పుచ్చుకుంటూ జోసఫ్‌తో అన్నాడు– ఆ వెండి గంటలు వినిపించిన సంగతి. 'సముద్రం మీదుగా కొన్ని వేలమైళ్ళు ప్రయాణం చేస్తేగాని శ్రవణానందంగా వినపడని ఆ మధుర నాదం యిక్కడ ఏలా వినపడిందో ఆశ్చర్యంగా ఉంది.'

'అది కలకాదు – నిజమే! ఆ వెండి గంట యిక్కడిదే! శానుమిగుయల్ భవనం అడుగు భాగాన ఈ బ్రహ్మాండమైన గంట వుంది. ఈ గంటని మోయగల మంటపము యిక్కడెక్కడా లేదు. అది యిక్కడ వంద యేళ్ళకి పైనుంచీ వుంటోందిట. సుమారు ఎనిమిది వందల పౌనులకి పైగా బరువు. దీనిని నిలబెట్టేందుకు ఒక ఎత్తు దిమ్మ చేయించి, ఎద్దుల సాయంతో దానిని పైకెత్తించి, అడ్డ చెక్కలమీద నిలబెట్టి, వేలాడదీయించాను. ఒక మెక్సికను కుర్రవానికి గంట ఎలా మోగించాలో నేర్పించాను. రోజూ సూర్యోదయానికి పూర్వం అతను మోగిస్తాడు గంటని.'

'అంత పెద్ద గంట యిక్కడికి ఎలా వచ్చింది? ఎవరు తీసుకువచ్చి వుంటారు? బహుశా స్పానియర్డ్స్ అయి వుండాలి.'

'అంతే అనుకుంటా. ఆ గంట మీద వున్న అక్షరాలుకూడా స్పానిష్‌లోనే వున్నాయి. 1356 లో దానిని సెయింట్ జోసపుకి కానుకగా సమర్పించారు. దానిని మెక్సికో నుంచి ఎండ్లబండీలో వేసి పట్టుకు వచ్చారట. సెయింట్ జోసఫ్‌కి అని గంటమీద వ్రాసివుంది. ఈ గంట విషయమై ఒక కథకూడా వుంది. మూరులతో యుద్ధం జరిగినప్పుడు, వారు తమ పట్నాన్ని దోచుకునేటట్టుండగా, ఊళ్లో వాళ్ళందరూ సెయింట్ జోసపుకి కానుకగా సమర్పితమయే ఈ గంట నిర్మాణంలో తమవద్దఉన్న వెండి బంగారాలన్నీ పడేశారట. దీని తయారీలో వెండి పాలు చాలా వుండటం చేతనే మ్రోగినప్పుడల్లా ఆ మధురస్వరం వెలువడుతోంది. వెండిగాక మరొకటైతే ఆ శబ్దంరాదు,' అన్నాడు జోసఫ్.

ఫాదర్ లెటూర్ ఆలోచించసాగాడు. ఈ వెండి యెవరిది? మూరులదా? స్పెయిన్ వారిదా? ఇది మూరులు తయారుచేశారా? స్పానిష్ వారు తయారుచేశారా? 'స్పానియర్డ్స్ తయారు చేసివుంటే ఆ పనితనం మూరులవద్దనుంచి నేర్చుకున్నదే అయివుంటుంది. వెండితో వస్తువులు చేయటం వెండిని ఉపయోగించటం స్పెయిన్ దేశీయులు మూరుల వద్ద నుంచే నేర్చుకున్నారు!'

'ఏమంటున్నావు, లెటూర్? మతరాహిత్యులైన మూరులు భగవత్ చిహ్నమైన ఈ గంట తయారుచేసి వుంటారంటావా?'

ఫాదర్ లెటూర్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు, 'ఈ ఉదయపు వేళ నాకు వినపడ్డనాదంలో ప్రాచ్యరీతి తోచినది. మాంట్రీయల్‌లోని ఒక జెసూట్ మిత్రుడు, యూరప్ ఖండపు చర్చి మందిరాల్లోని గంటలూ, ఆ గంటలు మోగించే ఆచారమూ ప్రాచ్యదేశ ప్రభావమని చెప్పాడు. రోమ్ నగరంలోని 'ఏంజిలెస్' గంట క్రూసేడ్ల కాలంలో ప్రాచ్య ప్రాంతాలనుండి పట్టుకువచ్చిందేనట! అసలీ గంటలు కొట్టడమనేది మస్లిముల ఆచారం.'

జోసఫుకి ఈ మాటలు నచ్చలేదు. 'వైజ్ఞానికులెప్పుడూ, పవిత్రమైన మతధర్మాన్ని చులకనచేసే పద్ధతిని వాడిస్తారు.'

'చులకన చేయడమేముంది యిందులో? అలా అంటే నే నొప్పుకోను. ఈ గంటలో మూరుల వెండికూడా వుందంటే, యింకా సంతోషింపదగ్గ విషయమే. శాంటాఫెలో మనకి కనపడ్డ పనివాడు కంసాలి. స్పానియర్డ్స్ తమ పనితనాన్ని మెక్సికనులకి నేర్పారు. మెక్సికనులు నవాజోలకి నేర్పారు. ఏమైనా, యిదంతా మూరులవద్ద నేర్చుకున్న విద్యే.'

'నేను పండితుణ్ణీగాదు, శాస్త్రజ్ఞుణ్ణీగాదు. ఆ విష యాలు నాకంతగా తెలియవు. పొద్దుటివేళ యిటువంటి తర్కవాదములోపడితే కుదరదు. సేంటాక్లేరా ఫాదరీ మెక్సికోనుంచి వస్తూ యిక్కడ ఆగాడు - బిషప్ దర్శనం చేసుకోవాలని. తన అనుభవాలు మనకి నివేదిస్తాడట 'గాడలుపె' అను కాథలిక్ క్షేత్రం దర్శించుకుని యింటికి మళ్ళుతున్నాడు. ఈ క్షేత్రము యిక్కడివాళ్ళకి చాలా పవిత్రమైనది.'

లెటూర్ తన స్టడీలోకి వెళ్ళాడు. ఆ తరువాత జోసఫు సేంటాక్లేరా ఫాదరీని ప్రవేశపెట్టాడు. ఆయన డెబ్బయ్యేళ్ళవాడు. నలభై యేళ్ళుగా ఆయన ఫాదరీ ఉద్యోగంలో ఉంటున్నాడు. చిరకాలవాంఛితమైన 'గాడలుపె' యాత్రా సందర్శనాభిలాష యిన్నాళ్ళకి తీరింది. లెటూర్ అతనికి కుర్చీయిచ్చి కూచోమనేసరికి, ఆ వృద్ధుడు అమితా నందమునొంది అణకువగా కొంచెం ముందుకువంగి కూచుని రెండు చేతులూ మోకాళ్ళమీద ఆన్చుకుని, తనకు అను భవమైన అద్భుతాలు వివరించసాగాడు. రోమునగరంలోని ప్రధాన మతాధికారికూడా, 'గాడలుపె'కి కానుకలు పంపాడట.

1531 డిసెంబరు 9 వ తేదీ శనివారంనాడు ఒక బీద ఫాదరీ కొండమీదనున్న సెయింట్ జేమ్సు మొనాస్టరీ నుంచి మెక్సికో పట్నంలో జరుగుతున్న సమూహ ప్రార్థ నకి వేగంగా వెళ్తున్నాడు. అతని పేరు జువాన్. వయస్సు

ఏబదిఐదు. కొండ సగం దిగివచ్చి, ఒకమలుపు తిరుగుతూ వుండగా, దారికడ్డంగా ఒక కాంతి పడి, ఆ కాంతిలో నుంచి, ఒక బంగారు స్వరూపం వెలువడింది. అతనిని పేరుతో పిల్చి, 'జువాన్, నీవు బిషప్ దగ్గరకు వెళ్ళి, నే నెక్కడయితే వెలిసేనో, అక్కడ నా పేరన ఒక ఆలయం కట్టించమని చెప్పు, నీవు వచ్చేదాకా నే నిక్కడే వుంటాను.'

జువాన్ తన గమన వేగం మరింత హెచ్చించి, తిన్నగా బిషప్ దగ్గరకు వెళ్ళి, ఈ జరిగిన విషయం నివే దించాడు. 'మాత నీకు దర్శనమిచ్చిందా! ఎంత ధైర్యం నీకు! ప్రభుసేవకై జీవితాలర్పితంచేసిన మాలాటి మహా మహుల మనేకమందిమి యిక్కడ వుండఃగా, నీలాటి నిర్భా గ్యుడికి దర్శనమిస్తుందా మాత?' అని అతనిని కసిరికొట్టి, ఈ జువాన్ని ఒకకంట కనిపెట్టి చూస్తూవుండండని, తన అనుచరులకి చెప్పాడు బిషప్ జుమర్రాగా.

నిరుత్సాహంతో జువాన్, అస్వస్థుడై వున్న తన పెత్తండ్రి బెర్నార్డినో యింటికి వెళ్ళాడు. ఆయన వ్యాధి గ్రస్తుడై మంచంమీద పడున్నాడు. రెండురోజుల పాటు ఆ పెత్తండ్రికి సేవచేస్తూ అక్కడే ఉండిపోయాడు జువాన్. మాత తను ఫలానా స్థలంలో వుంటానంది. కాని బిషప్ ఆ ప్రకారం కసిరి కొట్టిన తరువాత, తను ఆ దయామయిని యే ముఖం పెట్టుకు చూడగలడు? మంగళవారం నాడు పెత్తండ్రికి ఏదో మందులకోసం మొనాస్టరీకి బయలు

దేరాడు. వెనుకటి త్రోవను వెళితే, మాత కనపడుతుం దేమోనని భయపడి కొత్తదారి పట్టాడు జువాన్.

తను యింకోదారిన వెళుతున్నా, సగం కొండ ఎక్క సరికి ఆ దయామయి దారి కడ్డంగా ప్రత్యక్షమై 'దగ్గర దారి వుండగా యిలా ఎందుకు వెళ్తున్నావు?' అనిఅడిగింది.

జువాన్ బొటబొట కన్నీళ్ళు కారుస్తూ, బిషప్ తన మాటలు విశ్వసించ లేదనీ, యీ రెండురోజుల బట్టీ రోగ పీడితుడైన పెదనాన్నకి సేవ చేస్తున్నాననీ చెప్పాకున్నాడు. మాత అతన్ని సముదాయిస్తూ, 'యింకో గంటలో మీా పెద నాన్నకి నయమవుతుంది. జుమరాగా వద్దకు మరొకసారి వెళ్ళి, యిక్కడ నా పేర మందిరం కట్టడం గురించి చెప్పి ధా,' అంది. బిషప్ తన మాటలు నమ్మడం లేదనీ, అతనికి నమ్మకం కలిగించే చిహ్నం ఏదైనా కావాలనీ అడిగాడు. 'అలా అయితే ఆ గుట్ట దగ్గిరికి వెళ్ళి గులాబీలుకోసి తీసుకు వెళ్ళు' అంది.

అది డిసెంబరు నెల. గులాబీలు పూసేకాలం కాదు. మాత మహిమవల్ల గుట్టవెనక లెక్కలేనన్ని గులాబీలు ఉన్నాయి. బుజంమీాద ఉన్న నారబట్ట నేలపై పరిచి, దాన్నిండా పువ్వులు పోసి మూటకట్టుకు మాత వద్దకువచ్చి 'యివిగో పువ్వులు' అన్నాడు.

'ఈ కట్టినమూట బిషప్ దగ్గిరకు వెళ్లేవరకు విప్పకు' అంది ఆ అదృశ్యశక్తి.

అలాగే నంటూ ఆ పువ్వుల మూటతో జువాన్ పట్నంలోకి పరిగెత్తాడు. బిషప్ ఆ సమయాన, యితర ఫాదరీలతో ఏదో సంప్రదిస్తున్నాడు. జవాన్ తిన్నగా లోపలి కొచ్చి 'ఇదుగో ఈ గులాబీ పువ్వులు మీకు గుర్తుగా పంపింది మాత' అన్నాడు మూట విప్పుతూ. మూటలో నుంచి గులాబి పువ్వులు వడివడిగా రాలాయి. బిషప్ మిగతావారూ ఆశ్చర్యపోయారు. ఆ నార బట్టకి లోపల అంటుకుని వుంది ఒక అపురూపమైన చిత్తరువు. అక్కడ వున్నవారందరూ మోకాళ్ళమీద వ్రాలి, లోక మాతని ఉద్దేశిస్తూ ప్రార్ధన చేశారు. ఆ దయామయి రూప చిత్రం 'మిరకిల్' అని చెప్పవచ్చు. జువాన్‌కి దర్శన మిచ్చిన సువర్ణమూర్తిని పోలివుంది ఆ రూప చిత్రం.

ఆ వరప్రసాదాన్ని పదిలపరిచేందుకు ఒక మందిరం కట్టించాలని వెంటనే, అప్పటికప్పుడు నిర్ణయం జరిగింది.

సేంట్‌క్లేరాఫాదరీ ఆ చిత్ర మహాత్మ్యం పొగడ సాగాడు. ఉదయారుణ ఛాయని పోలిన బంగారు తళుకు ఆ ముఖ కాంతులలో ఉందట. ఏ దైవాంశ సంభూతుడో చిత్రించిన అపూర్వ కళాఖండమది. ఎందరో చిత్రకారులు ఆమూర్తికి ప్రతి చిత్రాలు వ్రాద్దామనుకొని ఎంతో శ్రమించారు గాని కృతకృత్యులు కాలేకపోయారు. ఆ పవిత్ర క్షేత్రం నుంచి తాను తీసుకువచ్చిన పతకములను లెటూరకీ, జోసఫుకీ బహూకరించాడు ఆ వృద్ధుడు. ఆ మాత ఏ

దేశానికీ చెందదు. సర్వ దేశాలకీ సమస్తప్రజలకీ పూజనీయురాలట.

సేంటాక్లేరా మతగురువు వెళ్ళిపోయాక, తనకా పవిత్రక్షేత్రం దర్శించి రావాలని వుందని లెటూర్‌తో అన్నాడు జోసఫు, 'ఇక్కడి ప్రజలమీద యిటువంటి 'మిరకిల్స్' అద్భుతంగా పనిచేస్తాయి. ఇక్కడి కాథలిక్‌లకి దివ్యదర్శనంమీద మహా గొప్పనమ్మకం, సామాన్య ప్రజకి అద్భుతాలూ, విచిత్రాలూతోగాని మతంమీదనమ్మకంకలగదు.'

'ఎక్కడైతే గొప్ప ప్రేమ వుంటుందో అక్కడ మిరకల్స్ జరుగుతాయి. మనకి గాలిలో 'గాలి'వలె కనిపించే అదృశ్యావతారం, మానవ నేత్రం విశ్వప్రేమ ద్వారా సృష్టించుకునే మధురమూర్తి కావచ్చు. గాలిలో కనపడే బొమ్మలన్నీ దేవతలూ కాదు, దెయ్యాలూ కాదు! జోసఫు, నీవు నాకు, నాకు నీ పట్లగల ప్రేమద్వారా వ్యక్తమవుతున్నావు. క్రైస్తవమతం చెప్పే మిరకిల్స్, ఆ అనిర్వచనీయ శక్తులన్నీ, వాటిని మనం అర్థం చేసుకోవడం ద్వారా వ్యక్తమవుతున్నాయి. మనోచక్షువు వుంటేనే మమత. శ్రవణేంద్రియ శిక్షణ వుంటేనే గాన మాధుర్యం. ఆ జరుగుతున్నాయనే అద్భుతా లన్నీ, మనోమందిరం ద్వారా ప్రసరించగల దివ్యరోచిస్సులు. ఈ మనసు నిష్కల్మష భావానికీ నిశ్చలసౌందర్యానికీ నిలయమైననాడు, అనంతవాహిని ఒక తృటిలో మనకు సాక్షాత్కరిస్తుంది.' అన్నాడు లెటూర్.

# 2




## ఫాదరీ ప్రయాణాలు

మార్చి మధ్యను జోసఫు, ఆల్బకర్కీ నుంచి వస్తూ మాన్యుయల్ పొలము వద్ద ఆగి కొత్తగా పెండ్లి చేసుకున్న వధూవరులను ఆశీర్వదించి చంటి పిల్లలను బాప్టైజ్ చేశాడు. ఆ రాత్రి మాన్యుయల్ యింట్లో మకాం చేసి, మర్నాడో మూడోనాడో శాంటాఫె మార్గంపట్టి, దారిలో డొమింగోవద్ద మరొక మజిలీ వేశాడు. ఈ డొమింగోలో ఒక పురాతన చర్చి మందిరం వుంది. అక్కడి వారికి మత విశ్వాసం ఉంది, గాని శిక్షణ తక్కువ. వారం రోజుల క్రితం తను ఆల్బకర్కీ వెళ్తున్నప్పుడు అక్కడ ఒక ప్రార్థనా సమావేశము జరిపించాడు. ఇంటింటికీ వెళ్ళి, రంగుబొమ్మ లిచ్చి, పతకములిచ్చి, వాళ్ళని బతిమాలితేగాని ఆ కొద్ది మందీ కూడా ప్రార్థన వేళ పోగవలేదు. డొమింగో వూరు బాగానే వుంటుంది. రయోగ్రాండీ లోయని అంటిపెట్టుకు నున్న ఈ గ్రామం పక్కన పంట పొలాలు బోలెడు

వున్నాయి. ప్రార్థన కొచ్చిన కొద్దిమందీ ఫాదర్ జోసఫు వచ్చీ రాని స్పానిష్‌లో చేసే మత బోధన శ్రద్ధతో విన్నారు. అందరూ మంచి బట్టలు వేసుకువచ్చి, కుదురుగా కూర్చుని విన్నారు. ప్రార్థన కొచ్చినవారు తమ పిల్లల్ని 'జ్ఞాన స్నానం' చేయించేందుకు తీసుకురాలేదు. ఎప్పుడో రెండు వందల యేళ్ళ క్రితం స్పానియర్డ్స్ వాళ్ళని న్యూనత పరిచారట – ఆ కక్ష యింకా మనసులో పెట్టుకుని కూచున్నారు. అదీ డొమింగో విషయం.

ఇక్కడ పాపం జోసఫుని ఒక దగుల్బాజీ వర్తకుడు మోసముచేసి మొండి గుర్రాన్నొకదాన్ని అంటగట్టాడు. అది వారం రోజులు ప్రయాణం చేసేసరికి చిక్కి శల్యమై ఎందుకూ పనికిరాకుండా పోయింది. రోజుకు యిరవై, ముప్ఫయి మైళ్ళ కంటే నడవలేక పోయేది. మాన్యుయల్ క్షేత్రం చేరుకునేసరికి, జోసఫు మనస్థితి ఏమీ బాగులేదు. మాన్యుయల్‌ది చిన్న గ్రామం – అయినప్పటికీ అక్కడ, గుర్రాలూ, గుర్రపు సామగ్రీ, జంతు చర్మాలూ సమృద్ధిగా లభ్యమయేటట్లున్నాయి.

జోసఫు గ్రామములో ప్రవేసించగానే నాలుగు వైపుల నుంచీ, పిల్లలు చేరి అతని గుర్రం వెంట పరుగెత్తసాగారు. ఈ పిల్లల్ని అనుసరిస్తూ, మేలిముసుగుల్లేని స్త్రీలు వీధుల్లోకి వచ్చారు. ఈ పిల్లలూ, ఈ స్త్రీలూ, వీళ్ళందరూ, మాన్యుయల్ తన విశాల భవంతి నుంచి నడి

వీధిలోకి వచ్చేసరికల్లా జాడ తెలియకుండా మాయ మయారు. మాన్యుయలంటే అందరికీ అంత భయము కాబోలు! హాట్ చేతులోకి తీసుకు, చిరునవ్వుతో, గుర్రం మీద వున్న కాతుకి చేయి అందించాడు మాన్యుయల్: 'ప్రభుసేవకునికి మా సుస్వాగతం' అంటూ. మాన్యుయల్ వయస్సు ముప్ఫయి అయిదు ఏళ్ళు వుంటాయి - దృఢ కాయుడు.

'ప్రభువు మిమ్మల్నీ మీ యింటినీ కాపాడుగాక! ఏరీ వధూవరులు?' అని అడిగాడు జోసఫ్.

'వాళ్ళక్కడ పొలాల్లో వున్నారు. ఇప్పుడేం తొందర లేదు. మీరు కొంచెం కాఫీ అదీ పుచ్చుకు, బడలిక తీరేందుకు ద్రాక్షరసం సేవించి, కాసేపు విశ్రాంతి తీసుకున్నాక ఈ తతంగం జరిపించవచ్చు' అన్నాడు మాన్యుయల్.

'కొంచెం రొట్టె, కాస్త ద్రాక్ష రసం పుచ్చుకుంటాను. అసలు నేను భోజనాల వేళకే ఇక్కడికి జేరుకోగల ననుకున్నాను. కాని యిది వట్టి పనికిమాలిన గుర్రం అవడంవల్ల రెండు గంటలాలస్యమైంది. ఆ గుర్రం మీద సామాను దింపేస్తే, నా దుస్తులు వేసుకుంటాను. పొలాల్లో పనిచేస్తున్న మీ మనుషుల కోసం వెంటనే కబురు పంపించండి, పవిత్ర కార్యం కోసం ఒక గంటసేపు పనిమానితేనేం!'

ఫాదరీకి యింత తొందరేమిటా అని ఆశ్చర్యపోయాడు మాన్యుయల్. 'అలాగే, మీరు చెప్పినట్టే

చేస్తాను ఫాదర్. పిల్లల్ని బాప్టైజ్ చేయవలసిన కార్యక్రమం ఒకటుందిగదా! చేతులూ కాళ్ళూ కడుక్కు, బట్టలు మార్చుకు, విశ్రాంతి తీసుకోవడం మీ కిష్టం లేకపోతే జ్ఞానస్నానం వెంటనే మొదలుపెట్టించండి.'

'బట్టలు మార్చుకునేందుకు స్థలం చూపిస్తే, మొఖమూ, చేతులూ కడుక్కు, బట్టలు మార్చుకుంటాను. ఈ లోపల పిలిపించండి. ముందు వారిని యథావిధిని దంపతులుగా ఆశీర్వదించాక కదా, పిల్లల్ని 'బాప్టైజ్' చేయటం. ముందు వివాహకాండ, ఆపైన బాప్టిజమూ. అదే సక్రమపద్ధతీ, అనాది నుంచీ వస్తున్న ఆచారమూను, కాదనేందుకు మనమెవరము? నిజానికి ఇవ్వాళ పెళ్ళిళ్ళు, రేపు బాప్టిజము చేస్తే బావుంటుంది' అన్నాడు జోసఫు.

మాన్యుయల్, జోసఫుని లోపల గదిలోకి తీసుకు వెళ్ళాడు. పొలాల్లో పని చేస్తున్న యువతీ యువకులను తీసుకురావడం కొరకు పెద్దపిల్లలు వెళ్ళారు. మాన్యుయల్ కూతుళ్ళిద్దరూ పూజావేదిక నిర్మించసాగారు. ఇద్దరు వృద్ధస్త్రీలు నేలంతా తుడిచారు. మరొకావిడ కుర్చీలూ, కుర్చీపీటలూ చేరవేసింది.

వృద్ధస్త్రీలలో ఒకామె అన్నది. 'ఏమిటీ ఫాదరీ అంత అనాకారిగా వున్నాడు. అలాంటి కోతిముఖం నేనెప్పుడూ చూడలేదు. అంత అనాకారి గనక తప్పకుండా సన్మార్గుడై ఉంటాడు. గడ్డంక్రింద ఆ పులిపరికాయ చూశా

వూ? ఆ పులిపిరికాయేమిటి అసహ్యంగా! మా అమ్మమ్మ బతికివుంటే యిట్టే బాగుచేసివుండేది. పిమేయోలోని మంత్ర శక్తికల మన్నును గురించి అతని కెవరేనా చెబితే బావుండును. ఆ మన్ను అంటిస్తే అది యెండేసరికి దానితో కలిసి వచ్చేస్తుంది పులిపిరికాయ. ఇప్పుడీ రోజుల్లో పులిపిరి కాయలు బాగుచేసేవాళ్లే లేరు!'

'రోజులన్నీ మారిపోయాయి. వెనకటి కాలమా యిది? యిప్పుడు వీళ్ళకి పెళ్ళిళ్ళు చేస్తాడట ఆ ఫాదరీ, ఎందుకో, ఏడవను? వాళ్ళు హాయిగా కాపరాలు చేసి, పిల్లల్ని కన్నాక, ఆ పెళ్ళిళ్ళు పవిత్రం చేయటమేమిటో, వాళ్ళ మొఖం, నా మొఖం! అదీ ఒకందుకు మంచిదే యేమోలే! ఈ మొగాళ్ళు పాబ్లోకిమల్లే, అందమయిన వని తల వెంటపడరు. మొన్న ఆదివారం రాత్రేం, ఆ పాబ్లో ఉన్నాడే అతను, ట్రినిడాడ్ కుటుంబంలోని పెద్దమ్మా యితో పొదల చాటునుంచి రావడం నేను కళ్ళారా చూశాను.'

జోసఫు అక్కడికి రావడంతోనే ఆ ముసలమ్మలు మాటలు చాలించవలసి వచ్చింది. అప్పుడే అమర్చబడ్డ దైవపీఠం ముందు జోసఫు వంగి, భగవన్నామ స్మరణ చేయసాగాడు. స్త్రీలు చడీ చప్పుడూ గాకుండా ఒక ప్రక్కకు తప్పుకున్నారు. మాన్యుయల్ తన సేవకుల ఇంటి వైపువెళ్ళి 'తొందరతొందరగా వివాహవేదిక వద్దకు రండి' అంటున్నాడు వాళ్ళతో. స్త్రీలకు ఎంతో నవ్వుగా వుంది

యిదంతా. తమతమ మంచి రుమాళ్ళు మెడకి చుట్టుకు, ముసిముసి నవ్వులతో వేదికముందుకి వచ్చారు. కొందరు పురుషులు తమ మట్టిచేతులు కడుక్కోనుకూడా లేదు. దంపతులను వరసగా నిలబెట్టి, త్వరగా వివాహపు తంతు పూర్తిచేసి, ఒకరి తరువాత ఒకరికి భగవదాశీర్వాదమును అందిచ్చాడు.

మర్నాడు ఉదయం పిల్లలకు మంచి బట్టలు కట్టి తీసుకురమ్మనమన్నాడు బాప్టిజమ్‌కి. ఆ పూటకి మత సంబంధమైన కార్య కలాప మయాక, ఫాదరీగాను మడత పెట్టి, సంచీలో పెట్టుకు, కడుపులో కరకరలాడుతూవుండటం చేత 'మీ వూళ్లో భోజనాలు ఎన్నిగంటలకి చేస్తారేమిటి?' అని అడిగాడు జోసఫు. అతను సూర్యోదయం కాకపూర్వం ఏదో కాస్త ఎంగిలిపడ్డాడు. మళ్ళీ అప్పటినుంచి నోరు మెదపలేదు.

'మా భోజనము మాటా? ఎప్పుడు వంటలైతే అప్పుడు. చీకటి పడ్డాక గంటా గంటన్నరలో భోంచేస్తాము ఇవాళ మీరొస్తున్నారని మంచిమంచి పదార్థాలు వండాము' అన్నాడు మాన్యుయల్.

విందు సమయాన మాన్యుయల్, జోసఫులతో పాటు ఊళ్లో వున్న యువకులూ, పురుషులూ, ఒక పొడుగు టేబులు ముందు కూచున్నారు. మొగవాళ్ళ భోజనాల యాక స్త్రీలూ, పిల్లలూ తింటూరు. ఫాదరీకీ, మ్యాను

యల్‌కీ ఒక కొసని వడ్డించారు. ఇద్దరికీ మధ్య 'బోర్డో' వైన్ సీసా వుంది. ఈ 'బోర్డో వైన్' మెక్సికో నగరం నుంచి పనిమనిషిని పంపి తెప్పించాడు మాన్యుయల్. శాంటాఫె తిరుగు ప్రయాణం గురించి పెద్దలిద్దరూ మాట్లాడు తున్నారు. తను డొమింగోలో ఒక పూట ఆగుతాన న్నాడు జోసఫ్.

'క్రితంసారే అక్కడ మీరీ గుర్రాన్ని వొదుల్చు కుని వుండాల్సింది. ఇది మిమ్మల్ని శాంటాఫె తీసుకు వెళ్ళ గలదా అని నా అనుమానం. ఈ గుర్రం మార్చేయడం మంచిది' అన్నాడు మాన్యుయల్.

'అబ్బే, డొమింగోలో గుర్రాల బేరం చేయకూ డదు, వాళ్ళు అసలే అనుమాన మనస్కులు. ఈ ఫాదరీ ఏదో లాభసాటి బేరానికి యిటు వచ్చాడు, అని లేనిపోనివి మనకి అంటగడ్తారు.'

తన తెల్లనిపళ్ళు కనపడేటట్టు మాన్యుయల్ నవ్వాడు. 'అల్బుకర్కీలోని ఫాదర్ గల్లిగోస్ మీకు తెలు సుగా? బాగా డబ్బు గలవాడు. ధనంతోపాటు ధైర్య సాహసాలు కూడా వున్నాయి. నేను అతనితో ఒకటి రెండుసార్లు బ్రిడ్జి ఆడాను. మంచి ఆటగాడు. పదివచ్చినా, పదిపోయినా లెక్కజేసే తంతుకాదు.'

'నాకు డబ్బుగల మతగురువుల మీదా, బ్రిడ్జి ఆడే వాళ్ళమీదా, ఆట్టే గౌరవం లేదు' అన్నాడు జోసఫ్.

'అయితే మీకు బ్రిడ్జిచేత కాదా? భోజనాలయ్యాక ఆడుకోవచ్చునని ఆశపడ్డానే! ఇలాటి చోట పేకకూడా లేకపోతే రోజు లెంత దుర్భరమో!'

'నాకు ఆటలతో గడపవలసిన పనిలేదు. వెచ్చగా నిప్పుగూడు పక్కన కూచుని, ద్రాక్షరసం పుచ్చుకుంటూ వుంటే దానంతటదే కాలక్షేపం అవుతుంది. ఇక్కడి గ్రేప్ బ్రాందీ ఫ్రెంచి వైన్‌లా వుంటుంది.'

'అవునట, ఫ్రెంచి వైన్ గురించి మా తాతగారి కాలంలో చెబుతూవుండేవారు. ఇప్పటికీ బెర్నలిలో తయారు చేస్తున్నారట - కాని మునుపటి రుచిలేదు.'

మర్నాడుదయం కాఫీ అనంతరం, పిల్లల బాప్టిజమ్ అయ్యాక జోసఫ్‌ని మాన్యుయల్ తన గుర్రపుశాల లోకి తీసుకువెళ్ళి, అక్కడ ఉన్న గుర్రాలు చూపించాడు. అందులో తెల్లని గుర్రాలు రెండు నిగనిగలాడుతూ చాలా బాగున్నాయి. ఆ గుర్రాలను బయటకు తీసుకువచ్చి, అవి ఎంతటి మేలుజాతితో, వాటి గుణగణాలు వర్ణించసాగాడు మాన్యుయల్.

'కంటెంటో, ఏంజలికా - అని పేర్లు. ఈ గుర్రాలు చూపులకే కాక బుద్ధిలో కూడా గణింపదగ్గవి. నేను వాటితో మాట్లాడినప్పుడు, అవి తలఎత్తి నా మాటలు అర్థంచేసుకుని, స్నేహభావంతో పల్కరిస్తాయి. ఈ రెండు గుర్రాలూ ఒకదాన్ని విడిచి ఒకటి వుండలేవు.'

జోసప్ కంటెంటో అను గుర్రాన్ని కళ్ళెంపుచ్చుకు ముందుకు తీసుకు వచ్చాడు. 'ఇంత అందమైన గుర్రాన్ని నే నింతవరకూ చూడలేదు,' అన్నాడు ఫాదర్. మాన్యుయల్ ఆ పొగడ్తనుండి తేరుకుంటూ ఉండగా, జోసఫు ఆ గుర్రముపైకి ఒక్క ఎగురున ఎక్కి కళ్ళెం చేత పుచ్చుకున్నాడు. 'కంటెంటో' ఈ కొత్తరౌతుని కుదిపి కింద పడేయబోయింది – వెర్రిగంతులు వేసింది. కాని జోసఫు 'మిడత' వలె దాన్ని కరుచుకు వుండటం, మాన్యుయల్‌కి ఆశ్చర్యం కలిగించింది. ఈ బక్కపలచని మనిషిలో యింతటి నేర్పువుందా అని ఆశ్చర్యపోయాడు.

'మీకు గుర్రాల సంగతి బాగా తెలిసినట్టుందే.'

'ఈ దూర దేశంలో గుర్రమేకదా నా ఆప్తప్రాణి. అశ్వాలగురించి ఆ మాత్రం తెలీకపోతే ఎలా బతకగలను? నావంటి పొట్టికాళ్ళ మనిషి, దినమూ ఎనిమిదిగంటలు ఈ గుర్రంమీద ప్రయాణం చేయడమంటే, ఎంతశ్రమో ఆలోచించండి. ఫాదరీ లంటేనే నిరంతర బాటసారులు. అను నిత్యం మేము ప్రయాణం చేస్తూ ఉండవలసిందే. ఇక్కడనుంచి శాంటాఫే వెళతాను. అక్కడేదో మీటింగు ఉంది. అదయాక మర్నాడే 'మోరా' ప్రయాణం' అన్నాడు జోసఫు.

'మోరాకా? అంతదూరం ఈ గడ్డు గోడ్ల మీదనా? మీ బక్కగుర్రం మిమ్మల్ని మోరా చేరుస్తుందా? నాకు నమ్మకం లేదు. అదెక్కడో దాన్లో చతికిలపడటం ఖాయం.'

మాన్యుయల్ ఈ మాటలు మాట్లాడుతున్నాడు. జోసఫు కంటెంటో మీదనే కూచుని ఆ గుర్రాన్ని నెమ్మదిగా నిమురుతూ, దాన్ని మచ్చిక చేసుకొంటున్నట్టున్నాడు.

'ఆ బక్క గుర్రం తప్ప నాకు మరొకటి లేదు. భగవంతుని పనికదా! ఒకవేళ అది చతికిలపడ్డా తిండీ నీరూ లేనిచోట చతికిలబడకుండా వుండుగాక అని ప్రార్థిస్తాను - అంత కంటే చేయగలదేముంది? నా ఫాదరీ గౌనూ పవిత్ర గ్రంథాన్ని మించిన బరువు మోయలేని సుకుమారి నా గుర్రం!'

ఫాదరీ మాటలు శ్రద్ధగా వింటూ మాన్యుయల్ ఏదో ఆలోచనలో పడ్డాడు. ఆ ఆలోచనతో చిట్లించుకున్న నుదురు మళ్ళీ మామూలుగా అయింది. మొఖంలోకి చిరునవ్వు వచ్చింది. ఒడిపిల్లవాని ఉత్సాహంతో మాన్యుయల్ అన్నాడు - తన మాటలకి, కొంచెం ఉపన్యాస వైఖరి కలుపుతూ: 'ఫాదర్ మీ రాకవల్ల మా గృహం పావనమైంది. వైదిక సంస్కారం లేకుండా జీవిస్తున్న స్త్రీ పురుషుల్ని మీరు పవిత్రులుగా చేశారు - వారి పిల్లలకి భగవత్ కరుణ ప్రసాదించారు. మీకు మేము ఋణపడి వున్నాం. ఆ ఋణం ఎలా తీర్చుకోవాలో తెలీడంలేదు. మీరు ఈ 'కంటెంటో'ని మా కానుకగా స్వీకరించి, మీ ప్రార్థనలలో ఈ మాన్యుయల్‌ని గుర్తుంచుకుంటే, నా జీవితం ధన్యమవుతుంది.'

జోసఫ్ గుర్రంమీద నుంచి నేలమీదకి దూకి మాన్యుయల్ చేతులు పుచ్చుకు, 'మీరు చేసిన ఈ మహోపకారానికి భగవంతుడు మిమ్మల్ని సర్వదా కనిపెడతాడు. నేను మీ విషయమై తప్పక ప్రార్థన చేస్తాను,' అన్నాడు.

మాన్యుయల్ సంతోషపడ్డాడు. ఇద్దరూ ఒకరి నొకరు ఆదరంతో కౌగలించుకున్నారు. మిగిలిన కార్య కలాపం పూర్తి చేసేందుకు దైవపీఠం దగ్గిరికి వచ్చారు.

మర్నాడుదయం మాన్యుయల్ జోసఫుని కాఫీ కని పిలవడానికి వెళ్ళాడు. అతను తన గదిలో గాక అశ్వశాలలో ఉన్నాడు. జంట గుర్రాలని యిటూ అటూ తిప్పుతున్నాడు. అతని ముఖం నిన్నటంత వుత్సాహంగా లేదు ఎంచేతనో!

'మాన్యుయల్, మీ రిస్తానన్న బహుమతిని నే నంగీకరించలేను. నిన్న రాత్రంతా ఆ విషయమే ఆలోచించాను. స్వీకరించరాదని చెప్తోంది నా మనసు. నే నెంత శ్రమపడతానో, మా బిషప్ (లెటూర్) కూడా అంతే శ్రమపడతాడు. అతని గుర్రమూ నా గుర్రంవలె బక్క చిక్కినదే! ఇంతకంటె మెరుగైనది కాదు. రెండూ ఒకే మాదిరిగా వున్నాయి. గాల్వెస్టాన్ పడవ ప్రమాదమప్పుడు అతను తన సమస్తం పోగొట్టుకున్నాడు. ఈ ప్రాంతాల తిరిగేందుకని ఒక పెట్టె బండీ కట్టించుకున్నాడు. అది

కూడా మునిగిపోయింది. నాకు పై అధికారి అయిన బిషప్ సామాన్య గుర్రంమీద వెళుతూ ఉండగా, నేనీ మేలురకం గుర్రం ఎక్కి ఎలా తిరుగగలను? తిరిగితే బాగుంటుందా? నా ముసలిగుర్రమే నాకుండనీయండి – మీా బహుమతే నాకు వొద్దు' అన్నాడు జోసఫు.

ఆఖరు క్షణాన జోసఫు తన బహుమతిని ఈ ప్రకారం తిరస్కరించడము మాన్యుయల్ కి ఎంతో బాధ అనిపించింది. నిన్ననంతా మహా సంతోషంగా వున్నాడు. ఎప్పుడైతే బహుమతి నిరాకరింపబడిందో, తను తన హోదా ర్యపు మెట్టునుంచి కొంచెం జారిపడ్డట్టు భావించుకోసాగాడు. 'పోనీ, అది కాకపోతే ఈ అశ్వశాలలో మీాకు నచ్చిన గుర్రం మరేదైనా తీసుకోండి. ఇక్కడున్న గుర్రాలన్నీ మీా బక్కగుర్రం కంటే శ్రేష్ఠమైనవే. మీా యిష్టంవచ్చింది తీసుకోండి.'

'వద్దు, వద్దు. ఆణి ముత్యాలవంటి ఈ మంచి గుర్రాలను చూశాక మరొక గుర్రంమీద మనసు పోతుందా? అంతగా అయితే విహాహాలఫీజు పెంచి, వాటిని కొనగలిగేటంత డబ్బు నిలవచేసి, ఏనాటికైనా అవి మీా దగ్గర్నుంచి కొనుక్కుంటాను. మత ప్రచారకుని ఒంటరి జీవితంలో స్నేహపాత్రంగా వుండే గుర్రం కావాలి.'

ఏం చేయడానికీ తోచక వెర్రిముఖం వేశాడు మాన్యుయల్. ఈ గడ్డు పరిస్థితి తప్పించుకునేందుకు ప్రయస్తున్నాడు.

'నేనే మీ అంత భాగ్యవంతుణ్ణయితే, ఏం చేస్తానో తెలుసా? యిది వికార్‌కీ, యిది బిషప్‌కీ అని రెండూ సమర్పించి, ప్రభు సందేశం నలువైపులకీ చాటే మత సాధకులకి నా గుర్రాలు వుపయోగపడుతున్నాయి కదా అని నిండు హృదయంతో సంతోషిస్తాను' అన్నాడు జోసఫు.

గత్యంతరం లేక మాన్యుయల్, 'పోనీ అలాగే కానీయండి. నా సంపద అంతటిలోనూ నేను ఎక్కువగా ప్రేమించే ఈ రెండు గుర్రాలూ మీకు ధర్మం చేస్తున్నాను, నా ఆత్మవిమోచనకై ప్రార్థన చేయండి. ఈ గుర్రాలు ఒకదాన్నొకటి వొదిలిఉండలేవు. విడదీశారా, బాధ పడ్తాయి. ఒకదాని కొకటి బాగా అలవాటై పోయాయి. నా కెంతో ప్రీతికరమైన ప్రాణుల్ని తమకి అర్పిస్తున్నాను. అంతకంటె చెప్పవలసిన దేముంది?'

'మీ త్యాగ నిరతికి దృష్టాంతంగా నిలిచే ఈ మంచి పని మీకు నూతన సంతోష హేతువు అవుతుంది.' అన్నాడు జోసఫు మెచ్చుకుంటూ. కాఫీ అయాక జోసఫు కంటెంటో మీద చక్కగా కూచొని, ఏంజెలికాని దాని వెనక కట్టి, మాన్యుయల్ భవనం నుంచి బయటికి వచ్చాడు. ఫాదరీ తన మంచి గుర్రాలు రెండింటితో, ఇలా వెళ్ళిపోతూ ఉండటము మాన్యుయల్‌కి ఎంతో వేదన కలిగించింది. కాని అది పైకి చెప్పుకోకూడదని ఏడుపు. దేవుని ప్రతినిధి అయిన మతగురువుకి, ప్రభుసేవ నిమిత్తం వస్తువును ఒకటి సమర్పించి, ఎందుకిచ్చేనా అని వాపోతే,

చేసిన పుణ్యం కాస్తా బూడిదపాలవుతుంది. బిషప్ ఒక గుర్రమూ, వికార్ ఒక గుర్రమూ ఎక్కి మూలమూలలకీ ప్రయాణం చేస్తారు. జోసఫు అన్నట్లు వికార్‌కి మంచి గుర్రం వుండి, బిషప్‌కి లేకపోతే లోకులు ఏమనుకుంటారు? కంటెంటో; ఏంజిలికాలింక దైవ కార్యానికి ఉపయోగ పడతాయి. ఆ అశ్వాల్ని ఆ ప్రకారం అందజేయటం కూడా, ఒక విధంగా తనకు సుకృతమేనని సరిపెట్టుకున్నాడు మాన్యుయల్.

## 2

బిషప్ లెటూర్, వికార్ జోసఫు ట్రూచాస్ పర్వతాల గుండా వర్షపాతంలో ప్రయాణం చేస్తున్నారు. ఆ చినుకులు సీసపు ముద్దల్లా యేటవాలుగా పడుతున్నాయి. మంచు కప్పిన పర్వతాగ్రాల మీదుగాకొట్టే గాలి, ప్రయాణీకులను విపరీతంగా బాధపెడుతోంది. ముక్కు మీదా, చెంపలమీదా పడేవర్షపు చినుకులు చిరుకప్పల వలె వున్నాయని వూహించసాగాడు లెటూర్. పడే చినుకు ఛెళ్ళున పడేది.

పర్వత శ్రేణుల మధ్య వున్న మైదానంగుండా ప్రయాణం చేస్తున్నారు ఈ మతగురువులు. చుట్టూ నేల పసరికతో పచ్చబడుతుంది. ఇప్పుడు మాత్రం బలపం రంగులో ఉంది. మీద పడ్డ వర్షపు చినుకు రఫీమని పేలుతోంది. మేఘాలు పైపైకి వస్తున్నాయి. ఎటు చూసినా

దేవదారు చెట్లు – మేఘ మాలికలు వింత రంగులతో చుట్టూ తేలుతున్నాయి. గుర్రానికి కప్పిన బట్టలుకూడా బాగా తడిశాయి. షావరీల ముఖాలు ఆ చలికీ, వర్షానికీ కందగడ్డల్లా ఎర్రబడ్డాయి. ముందు లెటూార్ గుర్రం వెళు తోంది. లెటూార్ వెనక జోసఫు. ముఖంమీద వర్షం పడు తూంన్నా, కళ్ళు తుడుచుకుంటూ మార్గం తెలుసుకుంటు న్నాడు లెటూార్. జోసఫుకి సరిగా దృష్టి ఆనదు – యిటు వంటి ఈదురు గాలిలో కళ్ళజోడు కూడా ఎందుకు, దండగ అని, లోపలదాచేశాడు. 'కంటెంటో' మెడ మీదుగా ఒరిగి, దైవ ప్రార్థన చేస్తున్నాడు జోసఫు. లెటూార్ తన 'ఏంజెలికాని' ముందు పోనిస్తున్నాడు. వెనక కంటెంటో వస్తోంది. జోసఫు సోదరి ఫిలోమినా స్వదేశంలోని ఒకా నొక కాన్వెంటులో 'మదర్ సుపీరియర్'గా వుంటూ, తన సోదరుడూ, బిషప్ లెటూారూ ఈ దూర ప్రయాణాలు ఎలా చేసేదీ, సెయింట్ ఫ్రాన్సిస్ ఎగ్జివర్ యాత్రా పటాన్ని చూసి వూహించేది. ఆమె సృష్టించుకున్న స్వప్నం కడు రమ్యమైనది. కాని వాస్తవికత ఎప్పుడూ దారుణ మేగా! వాస్తవికతలోకి కళామయ వాతావరణం ఎక్కడ నుంచిపట్టుకురాగలం? ఈయిద్దరూ వేటగాళ్ళనిగానీ, వ్యాపా రస్తులనిగానీ ఎవరూ అనుకోలేరు. మత గురువులు వేసు కునే కాలర్లు వేసుకున్నారు. అంతేగాక బిషపు కోటుమీద వెండి గొలుసుతో, వెండి శిలువ వేలాడుతోంది.

ప్రయాణం మొదలు పెట్టి, అప్పుడే మూడురోజు లయింది. తెల్లవారినప్పటి నుంచీ యింతదాకా వారు, నర సంచారం చూడలేదు. ఒక్క బాటసారి కూడా కనిపించక పోవడం వల్ల, తాము వెళుతున్నది సరియైన మార్గమవునో కాదో అని సంశయం కలిగింది. కాని పరీక్షించుకునేందుకు అవకాశ మెక్కడ? ఎవరేనా కనపడితేగా, ఈ దారి ఎక్కడికి కెళుంది? — అని అడిగేందుకు! బయలుదేరిన రాత్రి శాంటాక్రజ్‌లో గడిపారు. అక్కడికప్పుడే వసంతం వచ్చేసింది, 'ఎస్‌పనోలా' దాటాక గాలీ ధూళీ ఎక్కువయాయి. మొదట్లో యిసుక తుపానులూ, యిప్పుడు వడగళ్ళతో వర్షమూను! లెటూర్ 'మోరా' అనే చోటికి, అక్కడి కాందిశీక సమస్య విచారించేందుకు వెళుతున్నాడు. స్థానిక మతగురువు బిషప్ సాయం కోరాడు. ఈమధ్య నేటివులు 'కొనిజోస్' లోయమీద ధ్వాడిజరిపి అక్కడున్నవాళ్ళందరినీ నరికేసేరుట. చావగా మిగిలినవాళ్ళు ప్రాణాలు అరిచేతబట్టుకు,తమ తాతముత్తాతల ప్రదేశమైన 'మోరా'కి వలస వచ్చారుట. ఈ కొత్తగా వచ్చినవాళ్ళందరినీ ఏమిటి చేయడమని స్థానిక మతగురువు లెటూరుకి కబురుపెట్టాడు — స్వయంగా వచ్చి ఈ సమస్య పరిష్కరించమంటూ.

లెటూర్ జోసఫులు పర్వత లోయదాటి పీఠభూమి చేరుకోక పూర్వమే వర్షధార, మంచు కురవడంగా మారింది. వర్షమైతే తట్టుకోవచ్చు; కాని మంచుతో వేగడమెలా? వెన్నముద్దల్లా రాల్తోంది మంచు. ఈ రాత్రికి

గుర్రాలూ తాము ఎక్కడ బస చేయాలో తెలియడం లేదు. చలి మంట వెలిగించే ఆస్కారం కూడా లేదే, నేలంతా బురద బురదగా వుంది. నాలుగు గంటలకే సంధ్య కాంతులు కమ్ముకోజొచ్చాయి. పగటి వెల్తురు యింకెంత సేపో వుండేటట్టు లేదు.

'గుర్రాలు బాగా అలసిపోయాయి. వీటికేదైనా ఆహారం పెట్టాలి' అన్నాడు లెటూర్ జోసఫుతో.

'ఇప్పుడప్పుడే కాదు. ఇంకొంచెం ముందుకిపోయాక ఆలోచిద్దాం, చీకటిపడేలోపున మనకి తలదాచుకునే స్థలం కనపడకపోదు' అన్నాడు జోసఫు. తను యిందాకట్నుంచీ చేస్తున్న ప్రార్థన దేవుడు ఆలకించి వుండడా అని అతని నమ్మకం. చీకటి ముంచుకొచ్చేలోపల, యే పాతయిల్లో నిధిగా కనపడుతుందని అతని ఉద్దేశం. అదే విధంగా కనపడింది కూడా. అది ఒక గుర్రపుశాల. అయినా ఫరవా లేదనుకున్నారు. మత గురువులు తమ గుర్రాలని ముందు వాకిట్లోకి పోనిచ్చారు. గుర్రాలు వచ్చిన అలికిడి అవగానే, లోపలనుంచి ఒక మనిషి బయటకు వచ్చి, ఏదో కొత్త భాషలో వీరితో మాట్లాడాడు. ఆ భాష వీళ్ళ కర్థం కాలేదు. 'ఈ రాత్రికి మీరిక్కడ వుంటారా? ఉండండి. సదుపాయంగానే ఉంటుంది' అని అర్థం వచ్చే సంజ్ఞలు చేశాడు అవతల మనిషి. లెటూర్‌కి ఎందుచేతనో ఆ వ్యక్తిపట్ల సదభిప్రాయం కలగలేదు. వంకర మెడ, చిన్న తలాగల తాటిచెట్టులాటి ఆ మనిషిని చూసి, లెటూర్ లోన అసహ్యించుకున్నాడు. ఆ

చూపులలో మానవత్వము కనపడలేదు లెటూర్‌కి. కాని, మోరా వెళ్లేదారిలో ఉన్న తలదాచుకోగల స్థలం యిదొక్కటేనాయెను - అంచేత, అయిష్టంగా వున్నప్పటికీ సమాధానపడక తప్పిందికాదు.

గుర్రాలని, శాలలో కట్టేయవచ్చునా అనీ, వాటికి దాణా ఎక్కడ పెట్టాలనీ అడిగారు మత గురువులు.

'మీరు లోపలికి రండి. నేను వర్షపు కోటు వేసుకు వచ్చి ఆపని చూస్తాను' అన్నాడు యింటి యజమాని.

లెటూర్, జోసఫులు అతని వెంట లోనికి వెళ్లారు. ముందు, చేతులు వెచ్చచేసుకుంటేనేగాని ప్రాణం నిలిచేటట్టు లేదు - అప్పటికే కొంకర్లుపోతున్నాయి. గుప్పెట్లు పట్టేసుకున్నట్లయి, వేళ్ళు తెరుపులకి రానడంలేదు. ఇద్దరూ నిప్పుగూడువద్ద నిలబడి అరచేతులు వెచ్చజేసుకుంటున్నారు. ఇంటి యజమాని నడవకి మధ్యగావున్న పార్టిషన్ దగ్గరకి వచ్చి, యేదో భాషలో అరిచేసరికి, లోపల నుండి ఒక మెక్సికను స్త్రీ బయటికి వచ్చింది.

లెటూర్, జోసఫులు ఆమెను స్పానిష్ భాషలో పల్కరిస్తూ, వందనమర్పించారు. పెదవులు విప్పక, కళ్ళు వాల్చి, భయభ్రాంతురాలై నిలబడిందామె. మతగురువులిద్దరూ ఒకరి మొఖాలు ఒకరు చూసుకున్నారు - ఆవిడ పిచ్చిదా అన్నట్టుగా! ఆమె చూపులు కూడా పిచ్చి చూపులే.

'బట్టలు కుర్చీలమీద పడేస్తే ఎలా? నలుగురు వచ్చీ పోయే యిల్లని తెలీదూ?' అని తిట్టివుంటాడు ఆ యింటి పెద్ద. అంచేత నేకాబోలు ఆమె మూలనున్న బట్టలు, కుర్చీలపై వున్న తడి తువ్వాళ్ళు, తడి మేజోళ్లూ అవన్నీ తీసి, ఒక మూటగా కట్టింది. ఆమె చేతులు వణుకుతున్నాయి. ఏది ముట్టుకున్నా కింద పారేసేటట్టుంది. ఆమె వయసేమంత ఎక్కువ కాదు. కాని ముఖంలో గోచరించేది శూన్య భావమూ, కళ్ళలో కనిపించేది పిచ్చి చూపూను!

వర్షపు కోటూ పొడుగు జోళ్ళూ వేసుకున్న ఆమె భర్త, గుమ్మం వద్దకు వెళ్ళి, తలుపు తెరిచి ఒక్కసారి వెనక్కి తిరిగి, ఆమె వంక తీక్షణ దృష్టులు ప్రసరించాడు. 'ఇట్లా రా, నీతో పని వుంది' అన్నట్టున్నాడు.

కొక్కెంనుంచి నల్ల శాలువ తీసుకు మెడమీద కప్పుకుని, భర్త ఆదేశ ప్రకారం వెళ్ళిందామె. నడవ తలుపు తెరుచుకు వెళ్తూ. వొక్కసారి వెనక్కి తల తిప్పి, అతిథుల ముఖాల్లోకి భావ గర్భితంగా చూసి, 'వెళ్ళి పొండి, వెళ్ళి పొండి' అన్నట్లుగా చేతి వేళ్ళు వూపింది. ఆ వెర్రి ముఖం, తెగించి చెప్పిందా సందేశాన్ని. భాష చెప్పలేని భీతి ఆమె కళ్ళలో ద్యోతక మయింది. ఆమె వేదనకీ, సూచనకీ అర్థమేమిటా అనుకున్నారు ఫాదరీలు. అంతా అగమ్యగోచరంగా వుంది. నోటమాట లేక ముఖాలు చూసుకున్నారు యిద్దరూ. 'జాగ్రత్త సుమా' అన్నాయి ఆమె కళ్ళు.

మొట్టమొదట నోరు మెదిపింది ఫాదర్ జోసఫే. 'ఏదో ప్రమాదం రానుంది. నీ తుపాకీలో గుళ్ళున్నాయిగా!'

'గుళ్ళున్నాయిగాని తుపాకీ బాగా తడిసిపోయింది. ...కాని, మరేం ఫరవాలేదు.'

ఫాదరీలిద్దరూ యింట్లో నించి బయటికి వచ్చారు. ఇంకా కొద్దిగా వెలుతురు వుంది. వర్షం మాత్రం రివ్వున కొడుతోంది. అశ్వశాలవైపు నడిచారు.

'మా గుర్రాలు బయటికి తెచ్చి పెడతారా?' అని అడిగాడు బిషప్ ఆ యింటి యజమానిని.

ఆ అమెరికన్ అశ్వశాలలోంచి బయటకు వచ్చి, 'ఏం కావాలి మీకు?' అని అడిగాడు.

'మా గుర్రాలు! మేము మనసు మార్చుకున్నాం. తిన్నగా 'మోరా' కే వెళదామనుకొంటున్నాము. మీకు అనవసరంగా శ్రమ యిచ్చినందుకు క్షంతవ్యులం'

అమెరికన్ కోపోద్రిక్తుడై, తాచు పాము పడగ ఆడించినట్లు తల తిప్పుతూ, 'ఏం, ఏమొచ్చింది మీకు? నా కొంప నచ్చలేదా?'

'సంజాయిషీలతో పనిలేదు. జోసఫ్, గుర్రపుశాలలోకి వెళ్ళి, మన గుర్రాలు బయటికి తీసుకురా,' అన్నాడు లెటూర్.

'నా గుర్రపు శాలలోకి మీరెలా అడుగు పెడతారో చూస్తాను. ఎంత సాహసం!' అన్నాడు అమెరికన్.

బిషప్ తన తుపాకీ బయటికి తీసి, అమెరికను వేపు గురి పెడుతూ, 'మహానుభావా, నిన్ను కష్టపెట్టడం మా కిష్టంలేదు. ఆ దురుసు మాటలు తగ్గించి, అక్కడ కుదురుగా నిలబడు, కదిలేవో కాల్చేస్తాను,' అన్నాడు ఫాదర్ లెటూర్ నిశ్చల కంఠంతో.

అమెరికను చేతిలో తుపాకీలేదు. నిరాయుధుడవడం వల్ల లెటూర్ ఆజ్ఞ శిరసావహించక తప్పిందికాదు. జోసఫ్ లోపలికి వెళ్ళి గుర్రాలని బయటికి తెచ్చాడు. వాటి జీనూ కళ్ళెం యింకా అలానే వున్నాయి. అలసిపోయిన ఆ గుర్రాలు ఆహారం నములుతున్నాయి. వాటికూడా యిక్కడ వుండటం యిష్టం లేనట్టుంది. రౌతుల్ని యెక్కించుకోవడం తరువాయిగా అవి దౌడు తీశాయి. లోయ దిగుతున్నప్పుడు జోసఫ్ అన్నాడు. 'వాళ్ళ యింట్లో తుపాకీ వుండకపోదు. మనని వెనుక నించి కాలుస్తాడేమో ఆ కసినాత్ముడు!'

'గుర్రంమీద వెంబడిస్తే తప్పమనని అందుకోలేడు. ఆ గుర్రపు శాలలో యింకా గుర్రాలున్నాయా?'

'లేవు. కంచర గాడిద ఒకటి వుంది.'

'అయితే, భయంలేదు.'

ఎదురుగా కనపడే కొండగుట్ట ఎక్కి దిగుతూండే సరికి బాగా చీకటిపడింది. వర్షం ఏకధారగా పడుతోంది. 'మనం రోడ్డువెంట వెళుతున్నట్టు లేదు. దారి తప్పిపోతేనేం గాని, మన నెవరూ వెంటాడటం లేదు - అంతవరకూ అదృష్టవంతులమే! మన గుర్రాల వివేకంమీద మనం ఆధారపడాలి. అవే మనని ఓ దరికి చేర్చగలుగుతాయి. పాపం, ఆమెని అనుమానించి చెడతిడుతూవుంటాడు' అన్నాడు లెటూర్, ఆ చీకటిలో అతనికి ఆమె ప్రసన్న వదనం పదేపదే కనపడుతోంది.

'మోరా' చేరుకునే సరికి అర్థరాత్రి దాటింది. స్థానిక మతగురువు యిల్లు కాందిశీకులతో నిండివుంది. లెటూర్ కీ జోసఫ్ కీ పడుకునేందుకు పక్కలు యేర్పాటు చేశారు.

మర్నాడు వుదయం గుర్రాలశాలనించి ఒక కుర్ర వాడు వచ్చి, గడ్డిమేటిదగ్గర ఒక పిచ్చి మనిషి పడివుందనీ, తెల్లగుర్రాలమీద వచ్చిన ఫాదరీల దర్శనం చేయించమని ఆవిడ మొత్తుకుంటోందనీ చెప్పాడు. ఆమె ధరించిన బట్టలు పీలికలై వున్నాయి. కాళ్ళూ, చేతులూ, ముఖమూ, జుట్టూ, బురదతో అంటుకుపోయాయి. ఒక్క రాత్రిలో ఆమె రూపు యింతగా మారిపోయిందేమా అని ఆశ్చర్య పోయారు జోసఫు లెటూర్లు.

తను మళ్ళీ ఆ యింట్లోకి వెళ్ళనే లేదట. ఫాదరీ లిద్దరూ గుర్రాలెక్కి వెళ్ళిపోయాక, ఆ అమెరికన్ గబ

గబా యింట్లోకివెళ్ళి తుపాకీ తీసుకువచ్చాట్ట. ఆమె నీళ్ళ కుండు వెనక దాక్కుంది. భర్త కనుమరుగు అవగానే మోరావైపు దారి పట్టింది. ఎక్కడ వెనకనుంచి వచ్చి కాల్చేస్తాడేమోనని భయపడుతూ బయల్దేరిందట. కాని అతను రాలేదు. ఈ వూరు చేరుకునేసరికి తెల్లవారుజామయింది. ఆ చలివేళ గుర్రపుశాలలో, గడ్డిలో పడుకుని ప్రాణాలు పోకుండా కాపాడుకుంది. తెల్లారిలేచేక తనని చూస్తారనీ, బతికివున్నా చనిపోయినా ఈ సంగతి ఫాదరీలకు తెలుస్తుందనీ అనుకుందట. బిషప్‌కి పాదప్రణామం చేస్తూ తన భయానకగాథ వివరించి చెబుతూండేసరికి, అతను సగం విని, 'ఇది సివిల్ అధికారులకి సంబంధించిన విషయం. ఇక్కడ మేజస్ట్రేట్ ఎవరూ లేరా?' అనిఅడిగాడు.

అక్కడ మేజస్ట్రేటు ఎవరూ లేరట. పిరియాన్ అను రక్షణాధికారి యిటువంటి దరియాప్తులు జరుపుతాడట ఆ చుట్టుపట్ల! అతనికి కబురు వెళ్ళింది. ఈలోగా కాందిశీక వనితలు ఆమెకి స్నానం చేయించి, కట్టుకునేందుకు బట్టలిచ్చారు. దెబ్బలు తగిలినచోట మందు రాశారు.

కడుపులో తిండీ, కరుణతో మాటా ఆ అభాగ్యవతికి ధైర్యం సమకూర్చాయి. ఆమె వయస్సు పాతికఏండ్లుండవచ్చు. పేరు మాగ్డలీనా, భర్తపేరు జక్ స్కేల్సు. అతను జన్మతా అమెరికన్. మెక్సికన్ అమ్మాయిలకి అమెరికన్ని పెళ్ళి చేసుకోవడం ఒక గొప్ప! ఈ మాగ్డలీనా జక్ స్కేల్సుని ఆరేళ్ళక్రితం పెళ్ళాడింది. అప్పట్నుంచీ ఆ కొండ

లోయని అనుకున్న యింట్లో ఉంటున్నారు. మోరాపట్నా నికి వచ్చే బాటసారుల్ని, తమ యింట్లో ఆ రాత్రికి వుండ మని కపటవినయంతో చెప్పి, వారిని హతంచేస్తూ వుండే వాడు బక్ స్కేల్సు. వాళ్ళదగ్గిరగల ధనం దోచుకునేవాడు. ఇలా నలుగురుని చంపివేశాడు. ఆ ప్రయాణీకులకు ఈ ప్రాంతం క్రొత్త గావడంవల్ల బక్ స్కేల్సు మాయమాటల్లో బడి ప్రాణాలు కోల్పోయారు. వాళ్ళ పేర్లేమిటో తను మర్చిపోయింది. చనిపోయిన నలుగురిలోనూ ఒక జర్మను యువకుని ముఖం మరుపురానిది. అతనికి కొంచెం స్పానిష్, కొంచెం ఇంగ్లీషూ వచ్చు. నీలినేత్రాలతో ఎంతో సుందర మైన వదనబింబ మతనిది. అతన్నికూడా నరికేశాడు బక్ స్కేల్సు. ఈ శవాలన్నిటినీ, గుర్రపుశాలవెనక పాతి పెట్టాడు తన భర్త. ఏదైనా పెద్ద వర్షపాతం వచ్చినప్పుడు అవి బయటపడి తమ పాపం బద్దలవుతుందేమోనని ఎప్పుడూ భయమే తనకి! ప్రయాణీకుల్ని కడదేర్చి, వాళ్ళ గుర్రాల్ని రాత్రికిరాత్రీ తీసుకువెళ్ళి నేటివులకి అమ్మేసి వచ్చేవాడు. మాగ్డలీనాకి ముగ్గురు పిల్లలు కలిగేరట. కాని ఆ ముగ్గుర్నీ క్రూరాతిక్రూరంగా చంపేశాడు బక్ స్కేల్సు. అతను తన మొదటిపాపను పొట్టనెట్టుకున్నాక, ఈ కాపరం వద్దు మొర్రో – అని పుట్టింటికి పారిపోయిందట. రాంచోస్ లోని తన తలిదండ్రులవద్దకి వచ్చి ఈ బక్ స్కేల్సు 'నువ్వు నాతో రాకపోతే నీ తలిదండ్రుల్ని యేం చేస్తానో చూసుకో' అన్నాడట. ఎవరినిపోయి సహాయం అడగ్గలదు? ఎవరు

తననీ నరరూపరాక్షసుని కబంధ హస్తాలనుంచి కాపాడ గలరు? తను ఎవరిదగ్గరకైనా వెళితే, వాళ్ళకే అపకారం జరుగుతుంది. తన భర్త యింట్లో లేనప్పుడు వెనక రెండు సార్లు ప్రయాణీకులను మృత్యు ముఖమునుండి కాపాడిందట. ఈసారి ఫాదరీలని చూడగానే ధైర్యం వచ్చింది. వారు సజ్జనులూ, ఆర్తులను కాపాడేవారూ వలె కనిపించేరు. వారి గుణాధిక్యత తనను పాపపంకిలం నుంచి కాపాడగలదనిపించింది. తనకీ జీవితంలో యింకేమీ అక్కర లేదు. నిశ్చింతగా చనిపోగలదు. తన కడపటిక్షణాలు ఏ మతగురువు సన్నిధినో, అతను తన ఆత్మశాంతికై ప్రార్థిస్తూ. వుండగా గడిస్తే చాలు!

ఈమె చెప్పిన కథంతా నిజమేనని రుజువు చేసుకునేందుకు, సెయింట్ విరియాన్ అతని బృందమూ బక్ స్కేల్సు నివసించే చోటికి వెళ్ళారు. మాగ్డలీనా చెప్పినట్లుగానే గుర్రపుశాల వెనుక నాలుగు శవాలు కనపడ్డాయి. పెళ్ళాం పుట్టింటికి పారిపోయిందేమోనని వెతకడానికి వెళ్తున్న బక్ స్కేల్సుని, టావోస్ కి వెళ్ళేదారిలో పట్టుకు, బంధించి మోరా తీసుకువచ్చారు. ఆ సైన విరియాన్, టావోస్ మేజస్ట్రేటు కోసం మనిషిని పంపాడు.

మోరాలో జైలంటూ లేదు. అంచేత స్కేల్సుని ఒక ఖాళీ గుర్రపుశాలలో పెట్టి నాలుగు వైపులా కాపలా వుంచారు. ఈ ఘనుణ్ణి చూడటానికి చుట్టూ జనులు పోగయారు. స్కేల్సు తన భార్యని తిట్టేతిట్లు వినడం ప్రజలకి

తమాషాగా వుంది. గదిలో ఒకమూలగా చాపమీద కూచుని, తనని ఎట్లాగైనా శాంటాఫె తీసుకు వెళ్ళమని లెటూర్‌ని వేడుకుంటోంది. శాంటాఫెలో వుంటే తనభర్త అంతదూరం రాలేడనీ, తనకి ప్రాణభయం వుండదనీ అంటుంది. స్కేల్సుని యిక్కడ తాళ్ళువేసి కట్టి వుంచినా, ఆమెకి ప్రాణాపాయమనీ, యిది ప్రమాద స్థితి అనీ బిషప్‌కి తెలియకపోలేదు. అతనూ విరియానూ చెరో తుపాకీ పుచ్చుకు, ఆమెకి కాపలా కాశారు అపాయం జరక్కుండా.

తెల్లవారే సరికి మేజస్ట్రేటు తన పరివారంతో టావోస్ నించి వచ్చాడు. ఈ కేసు వివరాలు నలుగురికీ వినపడేటట్టు విరియాన్ చెప్పాడు. టావోస్‌లో మాగ్డలీనాని సురక్షితంగా ఉంచగల స్థలం యేదేనా వుందా అని బిషప్ అడిగిన మీదట, బక్‌స్కిన్ దుస్తులు వేసుకున్న ఒక పెద్దమనిషి, జనసమూహం నుంచి వెలుపలకి వచ్చి, మాగ్డలీనాని తను సంరక్షించగలనన్నాడు. ఫాదర్ లెటూర్ అతనిని లోపలికి తీసుకు వెళ్ళాడు. ఈ కొత్త మనిషి గౌరవ సూచకంగా హాటు తీసి చేతిలో పుచ్చుకు, ఆమె వద్దకు వెళ్ళి, స్పానిష్‌లో అడిగాడు: 'మాగ్డలీనా నేను జ్ఞాపకం లేనా?' అని.

అగాధమైన తన కళ్ళు పైకెత్తిందామె. ఆ విషాద నేత్రాలలోకి ఒక చిన్న వెలుగు వచ్చి, ఆరిపోయింది. చాపమీద కూచున్న మాగ్డలీనా తన రెండు చేతులూ

అతని కాలిమోచిప్పలపై వుంచి, 'క్రిస్టోబాల్, క్రిస్టోబాల్ నువ్వా, నువ్వా!' అంది.

'మాగ్డలీనా, నిన్ను నా వెంట మా యింటికి తీసుకు వెళ్ళుతాను. మా ఆవిడ నీకు సాయం వుంటుంది. నీకు మా యింట్లో భయం ఉండదు.'

'ఎంత మాట? మీా యింట్లో వుంటే నాకు భయమేమిటి!' అంది మాగ్డలీనా ఆనంద బాష్పాలతో.

'నువ్వు మొదటి నుంచీ మంచి పిల్లవే, మాగ్డలీనా. ఈ కారు మేఘాలు వాటంతటవి పోతాయి. కొంచెం ధైర్యంగా వుండు' అన్నాడు.

'ఫాదర్ లెటూార్, ఈమెను నా వెంట తీసుకు వెళ్తాను. నేను టావోస్ దగ్గిర వుంటున్నాను. నా భార్య కూడా మెక్సికనే. అంచేత సాటి ఆడదాని కష్టాన్ని అర్థం చేసుకో గలుగుతుంది. ఈ బక్ స్కేల్సు జెయిలు గోడలు దూకి వచ్చినా, మా యింటి పొలిమేరలకు రాడు. నేనంటే వాడికి సింహ స్వప్నం. నా పేరు కార్సన్.'

కిట్ కార్సను విషయం లెటూార్ వెనకనే విని వున్నాడు. ఇతన్ని కలుసుకోవాలని చాలా రోజులబట్టీ అనుకుంటున్నాడు కూడా. కార్సను కొంచెం పొట్టి మనిషి. లెటూార్ అంత చక్కని విగ్రహం కూడా కాదు. అతన్ని ఇంగ్లీషు వుచ్చారణలో దక్షిణ ప్రాంతపు యాస వుంది.

నేత్రాలెప్పుడూ యోచనాముద్ర దాల్చి వుంటాయి. ఆ మీసకట్టు అతని వ్యక్తిత్వానికి ఒక ప్రత్యేకత నిస్తుంది. అతని పెదవులూ నోరూ ఎంత గంభీరంగా వుంటాయో, ఆ గంభీరతతో పాటు అంత సహృదయతని దాచుకున్న సంగతి చాలా మందికి తెలియదు. కార్సన్ని చూసీ చూడగానే లెటూర్ కతనిమీద గౌరవం ఏర్పడింది. అతని దుస్తులూ ఆ నుంచున్న తీరూ, ఆ మాట పొందిక, కార్సన్ని ఒక ప్రత్యేక వ్యక్తిగా తోపింప జేస్తాయి.

లెటూర్ కార్సనుతో కరస్పర్శ చేస్తూ 'మిమ్మల్ని ఎన్నాళ్ళబట్టో కలుసుకుందామనుకుంటున్నాను. ఈనాడు ఇల్లా సమకూడింది,' అన్నాడు. ఒక చిరకాల స్నేహానికి అది నాందీ ప్రస్తావన. మోరాలో జరగవలసిన వ్యవహార కాండ అయాక, కార్సను వ్యవసాయ క్షేత్రానికి ప్రయాణ మయారు లెటూర్ జోసఫులుమాగ్డలీనాతో సహా. మాగ్డలీనా జోసఫుతో వెనకని వస్తోంది. బిషప్పూ కార్సనూ-ముందు వెళ్తున్నారు కబుర్లు చెప్పుకుంటూ. తను ఒక కాథలిక్ ననీ, కాథలిక్ అయినా ప్రాటెస్టెంట్ అయినా ఒకటేననీ మెక్సికను పిల్లలని పెళ్ళిచేసుకునే అమెరికనులు కాథలిక్ ధర్మం స్వీకరిస్తారనీ కార్సన్ అన్నాడు. 'నా కెందుకనో మతాచారాలమీద నమ్మకం లేదు. నాకు కనపడ్డ పరిస్థితులు మరోవిధంగా నాకు సాక్షాత్కరించి వుండవచ్చు. ఆ ఫాదరీలు మాత్రం అలాటివాళ్ళయి వుండవచ్చు. ఆ టావోజ్ లోని మార్టినెజ్ విషయమే చూడండి. లోకహితం కోసే

మనిషి అటువంటి విశృంఖల జీవనుడైతే ఎట్లా చెప్పండి? లూసినో ఫాదరీ పిసినిష్టితనం చెప్ప తరం కాదు. స్వర్గ ద్వారాలు తెరిపించేందుకు, బీదవాళ్ళ దగ్గిర ఎంత క్రూరంగా డబ్బు గుంజుతాడో చెప్పలేను.'

బిషప్‌కి కార్సన్ వివేకబుద్ధి పట్ల అమిత గౌరవం యేర్పడింది. ఇద్దరూ యించుమించు సమవయస్కులే - నాలుగుపదులు దాటినవారే! ప్రపంచానుభవంతో వాళ్ళ మేధాశక్తి వివేకవంతమూ, కరుణరసపూరితమూ అయింది. ప్రపంచపు నలుదిక్కులూ చూసినవాడు కార్సన్. ఇప్పుడు మెక్సికన్ భార్యతో స్థిరపడ్డాడు గాని, బాల్యం నుంచీ అతను సాహసోపేత జీవనం గడిపాడు. శాంటాఫెకీ, పసిఫిక్ తీరానికీ మధ్యనున్న ప్రదేశం యింకా సర్వే చేయబడలేదు. మాపులూ అవీ లేవు. ఆ ప్రాంతమంతా కార్సన్‌కి కొట్టిన పిండి. అక్షరం ముక్కరాని ఈ ప్రతిభాశాలి ముఖాన్ని బట్టి మనిషినీ, మొక్కని బట్టి నేలనూ తెలుసుకో గలడు. అతి కష్టంమీద సంతకం పెట్టడం నేర్చుకున్నాడు. వ్రాయడం చదవడం రాకపోవచ్చు. కాని అతనికి గల భూగోళ జ్ఞానమూ, లోకానుభవమూ అపారం. అతనికి అక్షరజ్ఞానం లేకపోవడం, ఒక విధంగా చారిత్రక ధర్మమేమో! అచ్చు పుస్తకాల్లో వుండేవి, అతను చదవ నవసరం లేకుండా, అనుభవమనే గీటురాయితో తెలుసుకున్నాడు. పధ్నాలుగో ఏటినుంచీ ఇరవయిదాకా గుర్రపు బళ్ళతోలేవానిగానూ, వంటవానిగానూ, ఎందరో ముష్క-

రులవద్ద పనిచేసి, కఠినత్వానికీ, క్రూరత్వానికీ ఈ లోకంలో గల ఎల్లలు తెలుసుకున్నాడు. అతి దారుణ పరిస్థితుల్లో కూడా తన ఆత్మశక్తినీ, జాలిగుండెనీ విడనాడనివాడవటం వల్లనే మాగ్డలీనాని కాపాడేందుకు తనకు తానుగా, ముందుకు వచ్చాడు. 'ఈమె చిన్నపిల్లగా ఉన్నప్పుడు టావోస్‌లో చాలాసార్లు చూశాను, ఎంత చక్కగా ఉండేదప్పుడు! ఆ లేతపువ్వు యిలా వాడిపోతూంటే, అయ్యో అని కూడా అనలేమా!'

న్యాయ విచారణ అయాక బక్‌స్కేల్సుని వురితీశారు. ఏప్రెల్‌లో లెటూర్ శాంటాఫే నుంచి సెయింట్ లూయీ వెళ్ళి, అక్కడనుంచి బాల్టిమోర్ వెళ్ళాడు ఫాదరీల మీటింగులో పాల్గొనేందుకు! సెప్టెంబరులో తిరిగి వస్తున్నప్పుడు, శాంటాఫె లోని ఆడపిల్లల స్కూలు కోసమని 'లోరెట్టో సిస్టర్సు' అయిదుగుర్ని తీసుకువచ్చాడు. ఈ అయిదుగురు 'నన్స్' కీ పని సాయంకోసం మాగ్డలీనాకి కబురంపించాడు. వీరి యింటిపనులూ వంటపనులూ మాగ్డలీనా చూసేది. 'నన్స్' అంటే మాగ్డలీనాకి మొదట్నుంచీ ఎంతో గౌరవం. చర్చి ప్రాంగణంలో, మానవసేవలో మాగ్డలీనా తన కష్టం మరచిపోగలిగింది. ఫాదర్ లెటూర్‌కి ఒక విధంగా ఆమె దేవతా స్వరూపిణి. 'లోరెట్టో సిస్టర్స్‌ని' చూడడానికి వచ్చినప్పుడు లెటూర్ వీధి గుమ్మం ద్వారా కాకుండా పెరటి దారమ్మట లోపలకి వచ్చేవాడు. ఎంచేత

నంటే 'కిచెన్ గార్డెన్' దగ్గిర మాగ్డలీనా దయాపూరిత వదనం దర్శన మిస్తుంది. కార్సన్‌కి చిన్నప్పుడు చక్కని అమ్మాయిలా కనపడ్డ మాగ్డలీనా, మళ్ళీ సుందరరూపం దాల్చింది. ఉద్రేకపు టుయ్యాల యవ్వనారణ్యాన్ని దాటి, ఆ బాలమూర్తి, నేడు మళ్ళీ తేజోమూర్తిగా, ప్రభు భవనానికి వెలుగు తెస్తోందనుకున్నాడు ఫాదర్ లెటూర్.

# 3

## ఎకో వూ

శాంటాఫె జేరిన మొదటి సంవత్సరంలో బిషప్ లెటూర్ నాలుగు నెలలపాటే తన 'డయొసీస్'లో వున్నాడు. బాల్టిమోర్ వెళ్ళి రావడం ఒక ఆర్నెల్లు పట్టింది. శాంటాఫె నించి సెయింట్ లూయీకి వెయ్యి మైళ్ళు గుర్రంమీద ప్రయాణం చేసి, అక్కడనుంచి, పిట్స్‌బర్గ్‌కి స్టీమరుమీద వెళ్ళి, ఆ తర్వాత కంబర్‌లేండు మీదుగా పర్వతాలు దాటుకుంటూ, కొత్త రైలుమార్గము వెంట వాషింగ్టన్ చేరుకున్నాడు. తిరిగి వచ్చేటప్పుడు యింకా ఆలస్యమయింది. శాంటాఫెలో స్థాపించబోయే విద్యాలయం కోసం అయిదుగురు సిస్టర్స్‌ని వెంట తీసుకువచ్చాడు. ఆడ వాళ్ళతో ప్రయాణం గనుక, యింకొంచెం ఆలస్యమై, సెప్టెంబరు మూడోవారానికి చేరుకున్నాడు శాంటాఫే.

ఈ వెళ్ళిరావడం వల్ల తన మతప్రదేశంలోని ప్రజలకి యెటువంటి ప్రయోజనమూ లేదు. తను స్వయంగా

చూసుకోవలసినది బోలెడంత ఉంది, తన ప్రజలందరినీ పల్కరించి వారి కష్టసుఖాలు తెలుసుకుంటేగాని తన బాధ్యత నెరవేర్చినట్లవదు. గుర్రాలకు ప్రసిద్ధికెక్కిన డొమెంగో, ధవళచ్ఛాయతో వెలుగొందే యిజ్లెటా, పసరిక ప్రాంతమైన లగూనా, మంచు శిఖరాలతో నిండి వుండే ఎకోమా యివన్నీ చూడాలి యింకా!

బంగరు కాంతుల అక్టోబరులో, జాకెంటో అను గైడ్‌ని వెంటబెట్టుకు, పర్యటన ప్రారంభించాడు లెటూర్. ఇక్కడి దారులు లెటూర్‌కి తెలియవాయె - అంచేత దారి తెలిసిన మనిషి వెంటనుంటేగాని లాభం లేదు. మొట్ట మొదట ఆల్బకర్క్యూ ఫాదర్ గెల్లిగోస్‌ని కలుసుకుందామనుకున్నాడు. శాంటాఫె తర్వాత తగిలే పెద్దపట్నం ఆల్బకర్క్యూ. ఆల్బకర్క్యూలోని చర్చిని మెక్సికన్ కుటుంబాలకి మిత్రుడైన గెల్లిగోస్, సర్వ స్వతంత్రంగా నిర్వహిస్తున్నాడు. గెల్లిగోస్, లెటూర్ కంటె పదేళ్ళు పెద్దగాని, వరసని అయిదురాత్రులు, బడలిక నేది లేకుండా మెక్సికన్ డాన్సు చేయగలడు. వేటగాళ్ళూ, జూదరులూ అతని మిత్రకోటిలోవారు. ఈ గెల్లిగోస్ ఎల్‌పాసో నుంచి ద్రాక్షరసాలూ, టావోస్‌నుంచి విస్కీ, బెర్నలిలో నుంచి ఫ్రెంచి బ్రాందీ, మొదలైన మేలురకం పానీయాలు తెప్పించి, యింట్లో యెప్పుడూ స్టాకు ఉంచేవాడు. అతిథి సత్కారం, సుఖ భోజనం అతనికి ప్రీతిపాత్రమైనవి. కడుపునిండా భోంచేశాక, కాసేపు సరదాకి జూదమాడితే తప్పా? - అని

ప్రశ్నించే ఫాదరీ ఈయనగారు. ఒక ధనికవితంతువు గెల్లి గోస్ పట్ల ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తూ, అతను యిచ్చేవిందు లకి, తన నవుకర్లనీ వంటవాళ్ళని పంపేదట. తను స్వయంగా వచ్చి అతిథులకి స్వాగత మిచ్చేవట ఆ మెక్సికన్ మహిళ. ఆదివారాలప్పుడు ప్రార్థనానంతరం, చర్చి ఆవరణకి బయట నున్న ఆమెగారి పెట్టె బండిలో ఎక్కి, వారి యింటికి భోజ నానికి వెళ్ళేవాడట గెల్లిగోస్. అంత చక్కని పెట్టె బండి ఊరు మొత్తానికి అదొక్కటే!

లెటూర్ కి ఈ గెల్లిగోస్ నడత విషయమై వెను కనే, అనేక ఫిర్యాదులు వచ్చాయి. అవన్నీ పరిశీలించి, ఈ క్రిస్మస్ లోపున గెల్లిగోస్ ని పదవీ విముక్తుని చేయడం ప్రజలకి మంచిదేమోననుకున్నాడు.

లెటూర్ కి గెల్లిగోస్ చక్కటి స్వాగతం యిచ్చాడు. ఆ ఫాదరీ చూపే వింతలూ, కొత్త సంగతులు లెటూర్ కి ఆశ్చర్యం కలిగించలేదు. అతను చూపినవన్నీ శ్రద్ధతో చూశాడు. ఇష్టంగానీ అయిష్టంగానీ పైకి కనపడనీయకుండా అతను చెప్పిందంతా విన్నాడు.

ఈ బిషప్ తనని వెంట రమ్మంటాడేమో, వేళకి భోజన సదుపాయం లేకుండా ఎండ వానలు లక్ష్యపెట్ట కుండా నేనెక్కడ ప్రయాణం చేయగలను? నల్లరాయే పట్టు పరుపు అనుకోవడం ఎలా? అంటూ గెల్లిగోస్, అయి దారు రోజుల క్రితమే ఆలోచించి ఒక ఎత్తు వేశాడు.

కాలికేదో గాయం అయిందని పెద్ద కట్టు కట్టుకు, కపట బాధ మధ్యమధ్య నటిస్తున్నాడు. ఎకోమాలో ప్రార్థనా సమావేశము జరిపించి యెన్నాళ్ళయిందని లెటూర్ అడిగేసరికి, తిన్నగా సమాధానం చెప్పక, అక్కడి నేటి వులు వాళ్ళ పండుగల సమయంలోనే గాని ఇతర సమ యాలలో ప్రార్థనలకు సమకూడరనీ, క్రితంసారి తను వెళ్ళి నప్పుడు, చర్చి తాళాలు తమ దగ్గర లేవన్నారనీ అన్నాడు. మాట వరుసకి అడిగాడే గాని, ఆ విషయం తర్కించదలుచుకోలేదు, లెటూర్.

నిజానికి లెటూర్‌కి గెల్లిగోస్ తన వెంట రావటం యిష్టంలేదు. రావద్దని ఎలా చెప్పడమా అని అతను తట పటాయిస్తున్నాడు. ఈ కల్పిత గాయం వల్ల యిద్దరూ తెరి పిన పడ్డారు. సద్వచనాలతో వీడ్కోలు పొంది, ఆల్బకూర్కీ నుంచి ప్రయాణమయ్యాడు లెటూర్. గెల్లిగోస్ దుర్మా ర్గుడు కాదు, సౌఖ్యాన్వేషి. మత గురువుగా అతను పనికి రాడు. సంతుష్టాంతరంగుడైన గెల్లిగోస్ సుఖాలు వొదులు కోలేడు. అంచేత ఏదీ మార్చేందుకు యిష్టపడడు. అతని ముఖం మారనట్టే, స్వభావమూ మారదు.

గెల్లిగోస్‌ని పదవీచ్యుతునిగా చేయడం తప్ప మరొక మార్గం లేదు. అది మిగతా ఫాదరీలకి గుణపాఠం అవుతుందేమో చూడాలి - అనుకున్నాడు లెటూర్. జోసఫు, లెటూర్ని ఒక రాత్రి యిస్లెటాలో మకాం చేసి,

వృద్ధుడైన డిబాకాని పల్కరించి రమ్మన్నాడు. డిబాకా అతని ప్రజలకు ఎంతో యిష్టుడు.

యిస్లెటా అన్న వూరు యింకొంచెం దూరంలో వుండగానే ఫాదర్ లెటూర్‌కి ఎందుకనో హృదయం తేలికైనట్టనిపించింది. ఇక్కడ ఎర్రమన్ను లేదు. చుట్టూ తెల్లదనం, ఆ ధవళతలో చెట్టూ చేమా మరింత చక్కగా ప్రకాశిస్తోంది. ఆ వూళ్లోగల చర్చి మందిరమూ, నివాస గృహాలూ అన్నీ తెలుపులోనే ఉన్నాయి. ఈ ఊళ్లోకి వస్తూవుండగా లెటూర్‌కి, ఫ్రాన్సు దేశ దక్షిణ తీరానగల తన బంధువింటికి వెళుతున్నట్లనిపించింది. వాళ్ళ తోట, వాళ్ళ కబుర్లూ అవన్నీ జ్ఞప్తికి వచ్చాయి. తిన్నగా చర్చి దగ్గరకి వచ్చాడు. అక్కడ ముసలి మత గురువు డిబాకా బయటికి వచ్చి, కళ్ళమీదుగా చేయి వుంచుకు లెటూర్ ముఖంలోకి చూసి, అతనికి వందనం తెలియబరుస్తూ, 'పూజ్యపాదులైన మీరు యింత చిన్నవారా?' అని ఆశ్చర్యంతో అన్నాడు. ఆ తరువాత డిబాకా, బిషప్‌ని చర్చి వెనక, తోటని అంటిపెట్టుకు వున్న తన యింట్లోకి తీసుకు వెళ్ళాడు. అక్కడ ఎన్ని రకాల నాగదాళి మొక్కలో! ఇక పంజరాల సంగతి చెప్పనే అక్ఖరలేదు. ఎన్ని పంజరాలో, యెన్ని చిలకలో! చిలకలు నేలమీద గెంతుతున్నాయి. వాటి రెక్కల్లో ఒకటి కోయడంచేత అవి యెగరలేవట. చిలక ఈకలంటే యిక్కడి నేటివులకి వైఢూర్యాలతో సమానం. అవి తమ దుస్తులకి తగిలిం

చుకు ఎంతో మురిసిపోతారట. ఆ ఈ కలిస్తానని ఆశ పెడితే గాని వాళ్ళు చర్చికి రారు. అంచేత డిబాకా యిన్ని చిలుకల్ని పెంచుతున్నాడు.

డిబాకా యిల్లు లోపలా బయటా ధవళ వర్ణంలో వుంది. ఇస్లెటాలోని అందరి యిళ్లూ యించు మించు అంతే. డిబాకా చాలా బీదవాడు. అతని మనసు ఎంతో మెత్తనిది. ఒక నేటివు స్త్రీ, అతనికింత ఉడకేసి పెడుతోంది. పదార్థాలు రుచికరంగా చేయడం చేతకాకపోయినా, వేళకింత వండి పెట్టేది. ఇక్కడి వీధులూ యిళ్ళూ చాలా పరిశుభ్రంగా వున్నాయనుకున్నాడు లెటూర్. ఇస్లెటాకి దగ్గరిలో తెల్ల సున్నపు గుల్ల దొరుకుతుంది. అది వెల్లవేసుకునేందుకు వూళ్లోవాళ్ళందరూ వుపయోగించేవారు. ఆ తెల్లరాయితో వెల్లవేసుకోవడమనే ఆచారం వారికి ఎన్నో తరాలబట్టీ వుంది. డిబాకా చాలా అమాయకుడు - అతనిది పసి హృదయం. కొంచెం మూఢ నమ్మకాలు కూడా వుండేవి గాని అతనిది బంగారము వంటి మంచితనం. కుడి కంట్లో పువ్వు లేచి ఆ కన్ను నిరుపయోగమయిపోయింది - ఎడమ కన్నుతో మాత్రమే చూడగలడు. అంచేత, మాట్లాడుతున్నప్పుడు కొంచెం తల ఒరగేసి మాట్లాడ్డం అతని అలవాటు.

ఇంటి ముందుకి వచ్చిన లెటూర్‌కి, అక్కడ తగిలించిన ఒక కర్ర చిలుక బొమ్మ కనపడింది. కర్ర చిలుకని ముట్టుకు చూసి ఆశ్చర్యపడ్డాడు. జీవించి వున్న పక్షిలా

గానే వుందది చూపులకి. ఎంతో నేర్పుగా చెక్కారు. ఎటువంటి పనితనం! రెక్కలూ, ఈకలూ అవన్నీ ఆ పనివాడు కర్రలోనే చూపించాడు. ఈ కర్ర పక్షి ఇంత తేలిగ్గా వుందేమిటా, అనిపించింది లెటూర్కి. వేలువేస్తే జారిపోయేటట్లు వుంది ఆ కర్ర నునుపు.

కర్ర పక్షిని పరిశీలిస్తున్న లెటూర్ని వుద్దేశించి డిబాకా అన్నాడు. 'నా ఐశ్వర్యమేమిటో మీరు గ్రహించారు. ఆ కర్ర పక్షి ఈ వూళ్లోగల వస్తువులన్నిటిలోకి పురాతనమైనది. ఈ చర్చి కంటె, యిక్కడి మనుషుల కంటే, ఈ ప్రజల జ్ఞాపకాల కంటె పురాతనమైనది.'

అచ్చుటివారికి చిలుకలంటే ఎంత యిష్టమో, వాటిని ఏవిధంగా ఆరాధిస్తారో, డిబాకా బిషప్కి వివరించి చెప్పాడు. ఒకప్పుడు వాటి ఈకలకు చెప్పలేనంత విలువ వుండేది. వ్యాపార నిమిత్తం వచ్చిన స్పానియర్డ్స్ పెట్టెల నిండా ఈకలు పోసుకు, తీసుక వచ్చి, యిక్కడి వారికి యిచ్చి, ఇక్కడ లభ్యమయే సరుకులు శాంటాఫె తీసుకు వెళ్ళి, అక్కడ వర్తకం చేసేవారు. వ్యాపారులు పక్షి ఈకలు తీసుకువచ్చేవారే గాని, బతికి వున్న పక్షిని తీసుకు రావడం అరుదు. ఒక్కొక్కసారి యేవరేనా బతికి వున్న పక్షిని తీసుకువచ్చారా, వారికి బ్రహ్మరథమే! ఆ. పక్షిని ఎంతో గొప్పగా పూజిస్తూ దానికి తెగమర్యాద చేసేవారు. అది ఖర్మవశాత్తూ మరణించిందా, వూళ్లో అందరూ ఏడుస్తూ కూచునేవారు. దాని అస్తికలు ఎంతో పవిత్రంగా అట్టేపెట్టి,

పూజా పునస్కారం జరిపేవారు. ఇస్లెటాలో ఒక అతి పురాతనమైన చిలుక శిరస్సు వుందట. ఈ క్రపక్షిని డిబాకా ఒక వృద్ధుని వద్దనుంచి పుచ్చుకున్నాడు. ఆ వృద్ధుడు నిస్సంతుగా మరణిస్తూ, దీనిని తనకి వొప్పజెప్పాడు. ఈ క్ర పక్షి ఏదో అసలు పక్షికి ప్రతిరూపమై వుంటుంది. ఆ పక్షిని ఎవరో పూర్వీకులు ఆరాధించి వుంటారు.

లగూనాలోనూ, ఎకోమాలోనూ ఉన్నవారిని గురించి తనకు గల జ్ఞాపకాలు బిషప్‌కి చెప్పాడు డిబాకా. చిన్నతనంలో, జవసత్వాలు బాగా వున్నప్పుడు ఆప్రాంతా లన్నీ గుర్రంమీద తిరిగి వచ్చేవాడట. వాళ్ళు తనతో ఎప్పుడూ మంచిగానే ఉండేవారట.

'ఎకోమా నా వుద్దేశంలో ఒక పవిత్ర క్షేత్రం. అక్కడ సెయింట్ జోసఫ్ చిత్రపటం వుంది. దానిని ఎవరో స్పెయిన్ రాజు చాలా సంవత్సరాలక్రితం పంపిం చాడట. సెయింట్ జోసఫ్‌లో అద్భుత శక్తులు వున్నాయి. వర్షాలు బాగా పడకపోతే, ఆ చిత్రపటాన్ని పొలాలచుట్టూ వూరేగించి ప్రార్థన చేస్తారట. అదేమి చిత్రమోగాని ఈ ప్రార్థనలయాక, విధిగా వర్షం పడుతుంది. పరిసర ప్రాం తాల్లో కరువు కాటకాలు వున్నాయేమోగాని యెకో మాలో అటువంటిదేనాడూ లేదు. పొరుగుప్రాంతమైన లెగూనాలో వర్షం పడకపోవచ్చు. కాని ఎకోమాలో, సెయింటు జోసఫ్ ధర్మమా అని విధిగా వర్షాలు కురు స్తాయట.'

# 2

తెల తెలవారుతూండగా డిబాకా వద్ద సెలవు తీసుకుని లెటూర్, తన గైడ్ జాకింటోతో పడమర వైపుగా ప్రయాణం సాగించాడు. అది ఒక ఎడారిప్రదేశం. కళ్ళు పొడుచుకున్నా పచ్చని మొక్క కనపడ్డంలేదు. అంతా ధూళీ, యిసకాను. కుందేళ్ళు దాక్కునే పొదలు మచ్చుకి కూడా లేవు. మాడిపోయిన బ్రహ్మచెముడు డొంకల మీదుగా, అడవి గుమ్మళ్ళు మాత్రం తెగపాకాయి. అవొక్కటే యిక్కడి వృక్ష జీవనానికి తార్కాణం.

పొద్దెక్కుతున్న కొద్దీ తుపాను తీవ్రత పెరగ సాగింది. వేడిమితో యిసుకకి నూతనశక్తి వచ్చిందికాబోలు. లెటూర్ కి కొత్తగాని, జాకింటోకి ఈ ప్రాంతమంతా కొట్టినపిండే! లగూనాలో జరిగే నృత్యాలలో పాల్గొనేందుకు ఈదారమ్మట తను ఎన్నోసార్లు వెళ్ళాడు. నోటిమీదుగా రుమాల్లు కట్టుకొని, తల కొంచెం కిందుకి వాల్చి, రివ్వున ముందుకు సాగిపోవడమే. ఈ ఎడారి ఒక పెద్దదికాదు జాకింటో దృష్టిలో! మిట్టమధ్యాహ్నా మయాక ప్రయాణం ఆపి, యజమానికి కాఫీచేసి పెట్టేందుకు నాలుగు చితుకులు ఏరి, చిన్నమంట చేశాడు. ఆ చితుకుల మంట మీద కాఫీ నీళ్ళు కాగుతూండగా, యిద్దరూ నేలమీద చతికిల పడి, తాము తెచ్చుకున్న బ్రెడ్ తిన్నారు.

పగలంతా అలా ప్రయాణం చేస్తూనే ఉన్నారు. ఎర్రధూళి వెనక, నారింజపండులా కనిపించాడు పడమటకి

వాలుతున్న సూర్యుడు. ఎటు చూసినా చెట్లంటూ లేవు. విశాలమైన ఆరు బయలులో కంబళ్ళు చుట్టలా చుట్టుకు పడుకున్నారు. పగలు ఎండ ఎలా పేల్చేసిందో, రాత్రి చలి అలా పీల్చేస్తోంది. రాత్రంతా దారుణమైన చలిగాళులు కొడుతూనే ఉన్నాయి. సూర్యోదయం కాక పూర్వమే మెలకువ వచ్చింది లెటూర్ కి. చేతులూ, కాళ్ళూ కొంకర్లు పోయే ఆ చలిలో ప్రాణాలుగ్గపట్టుకుని, ఎంతసేపు కూర్చున్నాడో! చిట్టచివరకు లోక బాంధవుని దర్శనమయింది. ప్రధమ కిరణపు వెలుగులో తమ వస్తువులు సద్దుకు, మళ్ళీ ప్రయాణం మొదలు పెట్టారు లెటూర్, జాకింటోలు.

మధ్యాహ్న మవుతూవుండగా జాకింటో, పచ్చని యిసుక గుట్టలమధ్య యింకొంచెం పసుప్పచ్చగా వున్న దృశ్యాన్ని చూపుతూ, 'అదుగో అదే లగూనా' అన్నాడు. ఆ పచ్చగుట్టల వెనుక నెక్కడ వుందో, లెటూర్ చూపుకి ఆనలేదు. ఊరు చేరువవుతున్నకొద్దీ యిసుక గుట్టలు తగ్గి రాళ్ళ గుట్టలు పెరిగాయి. ఇవి ధగ ధగ మెరిసే పసుప్పచ్చని రాతి కొండలు. ఆ కొండ రాళ్ళని చీల్చుకు జుని పర్ మొక్కలు తప్ప, వేరు వృక్షసంతానం లేదు. పచ్చ కొండల కడుగున ఒక చక్కని నీటిమడుగు వుంది. ఆ సరోవరాన్నిపట్టే, ఆ వూరికి లగూనా అనే పేరు వచ్చింది.

ఇస్లెటా ఫాదరీ డిబాకా తమ బిషప్ యిలా వస్తున్నాడని లగూనా ప్రజలకి ముందే కబురంపాడు. అంచేత లెటూర్ రాకకై అక్కడివాళ్లు ఎదురుచూస్తున్నారు.

చర్చిలోని దుమ్మూ దుమ్మూ దులిపి పరిశుభ్రం చేసివుంచారు. ఇక్కడి చర్చి పెళ్లియను సేనానుల యుద్ధ డేరావలె వుంది లెటూర్ కళ్ళకి. ఆ డేరా నమూనాని లెటూర్, లైన్స నగరంలో జరిగిన ఎగ్జిబిషనప్పుడు చూశాడు. చర్చిలోపల వర్ష దేవుడూ వాయుదేవుడూ బొమ్మలూ సూర్య చంద్రాదుల బొమ్మలూ – యిలాటి వనేకం చిత్రించబడి వున్నాయి. చర్చిలోని చెక్కడపుపని స్పానిష్ మతగురువులో, క్రీస్తు మతం స్వీకరించిన నేటివులో చేసివుంటారనుకున్నాడు లెటూర్.

మర్నాడుదయం ప్రార్థనా సమావేశము జరుప వచ్చుననీ, జ్ఞానస్నానం కావలసిన పిల్లలు చాలామంది వున్నారనీ, వారికి స్వాగతమిచ్చిన లగూనా గవర్నరు అన్నాడు. రాత్రికి చర్చిలో మకాం చెయ్యమనీ, అక్కడ బాగానే వుంటుందనీ గవర్నరు చెప్పినప్పటికీ లెటూర్ చర్చిలో బసచేయటానికి అంగీకరించలేదు. తనూ తన గైడూ కొండలపైన జునిపర్ చెట్లకింద ఆరుబయట విశ్రమిస్తామని అన్నాడు.

జాకింటో వంటచెరుకూ మంచినీళ్ళూ పట్టుకు వచ్చాడు. ఉత్తరదిశని కొండమీద ఆ రాత్రి గడపటానికి నిశ్చయించుకున్నారు.

'ఆ యెదురుగా కనిపించే పర్వతశ్రేణిని ఏమంటారో తెలుసా?' అని అడిగాడు లెటూర్ జాకింటోని.

'దాన్ని పాశ్చాత్యు లేమంటారో నాకు సరిగ్గా తెలీదు. లగూనా ప్రజలుమాత్రం 'మంచుపిట్ట' అంటారు.'

'లగూనాలో వారు ఏమంటారో అదే నేనడుగు తూంట. మంచుపిట్టా? ఎంత చక్కటి పేరు, ఆ ధవళ శిఖరాలకి.'

'మంచిపేర్లు వెతకడంలో ఇచ్చటివారు అఖం డులు. లగూనాలో ప్రజలు మీగురించి ఏమనుకుంటు న్నారో తెలుసా? ఇంత చిన్నవాడు 'బిషప్' ఏమిటి? – అని ఆశ్చర్యపోతున్నారు. గవర్నరు యిందాక అంటు న్నాడు: నా కొడుకులకంటె చిన్నవాడే, యితన్ని ఫాదర్ అని పిలవట మేలా అని!'

జాకింటో కంఠంలో విధేయతకంటె సహజత్వం కన పడేసరికి బిషప్‌కి సంతోషమైంది. ఇష్టపడటం దాకానే గాని, యిష్టపడితే ఇచ్చట వారు ప్రాణ మిస్తారు.

'మీరందరూ అనుకునేటంత చిన్నవాడిని కాదు నేను, నా హృదయానికి పెద్దతనం వచ్చింది. నీ వయస్సు ఎంతన్నావు?'

'ఇరవై ఆరు'

'పిల్ల లున్నారా?'

'ఒక్కడే కొడుకు. ఇంకా పసివాడు, యేడాది నిండ లేదు.'

ఆ పైన కొంచెం సేపు వారిద్దరూ మాటలు లేకుండా మౌన ముద్ర దాల్చారు. కాఫీ పాత్ర పొయ్యి దగ్గర వుంది. కప్పులో కాఫీ పోసుకు తాగుతున్నాడు లెటూర్. సూర్యుడు అపరాంబుధి గ్రుంకడంతో పచ్చ కొండలు, గోధుమ రంగు దాల్చాయి. పశ్చిమాకాశం బంగారు దుప్పటి పరిచినట్టుంది. ఊళ్లోనివారు దీపాలుముట్టి స్తున్నారు. మినుకు మినుకు మనే ఒక చిన్న నక్షత్రం ప్రక్కన శుక్రుడు తేజోరాసిలా వెలుగుతున్నాడు.

జాకింటో తను కాలుస్తున్న చుట్ట అవతల పారేసి 'శుక్రుని పక్కన వున్న ఆ మినుకు మినుకు మనే నక్షత్రం చూశారూ? దాన్ని యిక్కడి వారు ఏమంటారో తెలుసా? 'గైడ్' అంటారు.'

యజమానీ సేవకుడూ మిత్రుల వలె ఎవరి ఆలోచనలు వారు నెమరువేసుకుంటూ, చుట్టూ అలముకొంటున్న నిశీధిలో, యెవరి ఆత్మల్లోకి, వారు చూసుకుంటున్నారు. జాకింటోగల మత విశ్వాసాల గురించి, అభిప్రాయాల గురించీ ఏనాడూ ప్రశ్నించలేదు లెటూర్. అటువంటివి అడగటం మర్యాద లక్షణంకాదు. అడిగినందువల్ల ప్రయోజనం లేదు. తనది పాశ్చాత్య నాగరికత ద్వారా అవగతం చేసుకున్న మనోభావాలు. అవి జాకింటోకి చెప్పడమెలా? చెప్పినా అర్థమవుతాయా? చిరకాల సంప్రదాయ ఫలితంగా ఏర్పడ్డ అనుభవసారమూ ఏ భాషలోకీ తర్జుమా కాలేని గుణ విశేషమూ ఇచ్చట వారిలో వున్నాయి.

వారిలో ఒకడు ఈ జాకింటో! చీకటితోపాటు చలిగాలి కొట్టింది. తన వూలు కోటు వేసుకు, శాలువా కప్పుకు కూచున్నాడు లెటూర్. జాకింటో తను కప్పుకున్న దుస్తులు కొంచెం వొత్తిగించి ఆకాశ వీధిలోకి చూస్తున్నాడు.

'ఎన్ని నక్షత్రాలో! ఈ నక్షత్రాలన్నీ ఏమై వుంటాయి, ఫాదర్ ?'

'శాస్త్రకోవిదులు ఆ నక్షత్రాలన్నీ మన భూలోకం వంటి గోళాలని అంటున్నారు.'

జాకింటో, తను కాలుస్తున్న చుట్ట ఒకసారి గట్టిగా పీల్చి అన్నాడు. 'అదేమిటి అలా అంటారు ? ఆ నక్షత్రాలు మహాపురుషుల ఆత్మలు. ఆకాశాన అలా వెలుగొందుతూ వుంటాయి – అవి లోకపూజ్యుల ఆత్మలు.'

'అయియుండవచ్చును. అవి గోళాలైనా, ఆత్మలకు చిహ్నాలైనా ఏమైనప్పటికీ చాలా గొప్పవి. అవి ఏమిటో పరిశీలించడానికి బదులు వాటి ఉత్కృష్టతనీ ఘనతనీ అంగీకరించి, వినమ్రులమై శిరసు వంచి పరాత్పరునికి ప్రణమిల్లాలి. మనసు పాడుచేసుకోక నిద్రపో. అవేమిటో నీకూ నాకూ అర్థం కావు,' అన్నాడు లెటూర్.

వేసుకున్న మంటకు, చెరో వైపున, మోకాళ్ళ మీద వంగి దైవ ప్రార్థన గావించారు వారిద్దరూ. జాకింటో తనకి గైడే కాకుండా మిత్రుడు కాగల అవకాశముంది. ఈ యువకునిలో ఆటకాయితనం కంటె సంప్రదాయ గౌర

వమూ, సన్మార్గవర్తనా ఎక్కువగా కనపడతాయి. తాత ముత్తాతల వద్ద నుండి వంశానుక్రమంగా ఈ యువకులు పొందే శిక్షణ వారికి ఏ పరిస్థితినైనా, చాకచక్యంగా ఎదుర్కోగల శక్తిని సమకూరుస్తోంది. ఎడారులకీ జడి వానలకీ భయపడక గమ్యం చేరుకోగల ధీమంతుడీ యువకుడు – అనుకున్నాడు లెటూార్.

లెటూార్ జాకింటోని ఏ ప్రకారం అర్థం చేసుకుందామని ప్రయత్నిస్తున్నాడో అదేవిధంగా జాకింటో కూడా ఈ బిషప్‌ని తెలుసుకుంటున్నాడు. గల్లిగోస్‌తో మాటాడినప్పుడు చకర్కగా మాట్లాడాడు. ఆ మనిషికి తగట్టు అక్కడ ప్రవర్తించాడు. ఇస్లెటా ఫాదర్ డిబాకాతో మనసు విప్పి ఎంతో ప్రేమగా మాట్లాడాడు. గల్లిగోస్ వద్ద కావలసింది, మాట నేర్పరితనం. డిబాకా దగ్గర కావలసింది, మనసు మంచితనం. ఇక నేటివ్‌లతో మాటాడుతున్నప్పుడు ఈ శ్వేతజాతీయుడు, తనేదో అధికుణ్ణి అనే భావంతో కాక సమాన స్తులతో మాట్లాడుతున్నట్లుగా, వారిని ఆదరంతో పలకరిస్తాడు. కల్ల బొల్లి మాటలూ నటనలూ లేవు. ఫాదర్ జోసఫ దయగలవాడేగాని లెటూార్‌కి మల్లే కాదు. ఉన్నమాట మొఖం మీద అనేస్తాడు – అవతల వాళ్ళకి కష్టం కలుగుతుందేమో అను ఆలోచన లేకుండా. లగూనా గవర్నరుని పలకరించినప్పుడు లెటూార్ ఎంతటి ప్రసన్నవదనంతో ఉన్నాడూ! అది గుర్తించినది జాకింటో ఒక్కడే.

# 3

మర్నాడుదయం ప్రార్థనలు అయాక లగూనా నుంచి ఎకోమా వెళ్ళేదారి పట్టారు లెటూరూ అతనికి త్రోవ చూపే మనిషీ. చుట్టూ నేల, ఎర్రని యిసుక ఎడారివలె వుంది. నేలలో నుంచి మొలుచుకు వచ్చిన ఇసుక శిఖరాలు యూరప్ ఖండంలోని చర్చి గోపురాలవలె వున్నాయి. ఈ ఇసుక శిఖరాలు మరీ దగ్గరగా కాక ఒక దాని కొకటి యెడం యెడంగా వున్నాయి. అక్కడక్కడ జునిపర్ మొక్కలూ, పచ్చపొదలూ, దూరానికి సముద్రకెరటాల మాదిరితోపించే గోధుమవన్నె వృక్ష సంపదతో ఆ పీఠ భూమి ఏదో అసంపూర్ణతతో దర్శన మిచ్చింది. ఇక్కడేదో అద్భుతమైనవి సృష్టిద్దామనుకున్న భగవంతుడు, సగం పని కానిచ్చి మానుకున్నట్టుగా వుంది ఆ దృశ్యం.

ఎకోమా ప్రయాణ మార్గంలో ప్రత్యక్షమయే ఇసుక శిఖరాలు, లెటూర్ మనసులో చెరక్కుండా నిల్చి పోయాయి. ఈ శిఖరాల మీదుగా యిసుక మేఘాలు పరుచుకు కనిపించేవి. కొన్నిటి మీద అవి పైకి ఆకాశ మండలంలోకి ప్రయాణం చేస్తున్నట్లుగా వుండేవి. ప్రతి శిఖరానికీ, ఈ యిసుక టోపీ వింతరూపులో కనపడేది. పొగ అనేది నిప్పులో ఒక భాగమైనట్లూ, నురుగు అనేది కెరటంలో భాగమైనట్లు, ఈ యిసుక టోపీలు కూడా ప్రతి యిసుక గుట్టకీ ఒక భాగమై కనిపించేవి.

లెటూర్‌కి రాను రాను నేల కంటె ఆకాశ మొక నీలపు యెడారిలా కనపడ జొచ్చింది. నేలమీద దృశ్యంలో కొలది మార్పులు వున్నాయి కాని, ఆకాశమండలం ఒకే ఒక్క నీలం. శిఖరాలుగల యిసుక టోపీలూ యిసుక మేఘాలూ తప్ప, ఆకాశం మీద చాలా సేపటి వరకూ మేఘ మాలికలంటూ లేవు. పెకోస్‌కి పశ్చిమంగా తిరిగే సరికి దృశ్యం మారిపోయింది. సోమరిగా నాట్యం చేసు కుంటూ పోయే మేఘ కన్యలు ఆకాశవీధిని అలంకరిస్తూ, నేలమీద గల యిసుక గుట్టలని తమ వెలుగు జిలుగులతో మార్చసాగాయి. ఈ ప్రదేశమంతా అపురూప కాంతు లతో ప్రకాశిస్తోంది.

లెటూర్ ఆ అద్భుత కాంతులకి ఆశ్చర్యపడుతూ వుండగా, జాకింటో తన గుర్రాన్ని ఆపి, 'అదే ఎకోమా' అన్నాడు.

జాకింటో వేలుపెట్టి చూపుతున్న వేపుగా లెటూర్ తన దృష్టిని పోనిచ్చాడు. రెండు యిసుక గుట్టల కావల, కొన్ని మైళ్ళ దూరాన చతురస్రాకారాన, ఏదో కనపడు తోంది.

'అదుగో, ఆ కనపడుతున్నదే' అన్నాడు జాకింటో మళ్ళీ. తాము చేరుకోవలసిన గమ్యం వంక ఆశగా చూస్తు న్నారు యిద్దరూ. దూరాన్నెక్కడో గోధుమ వన్నెలో కనపడుతోందది. ఒక కొండ దగ్గరకు వచ్చాక, 'అక్కడ

వెనక ఒక ఊరు వుండేది. ఆ కొండమీద ప్రజలు నివశించే వారట. కాలక్రమేణా అక్కడి ప్రజలు తిండీ లేక మాడి మరణించారని చెబుతారు.'

'ఆ శిల మీద, నేలా నీరూ లేని చోట వాళ్ళు ఎలా బతక గలిగారు?' అని అడిగాడు లెటూర్.

మానవుడు ఆత్మరక్షణ కోసం ఎటువంటి చోటికైనా జంతువువలె పరుగెడతాడు. ఉత్తరాన్నించి నవాజోలూ, దక్షిణాన్నించి అపాచీలు తమని జంతువుల్ని వేటాడినట్లు తరుముకొస్తూ వుండగా ఆ పై శిలలో వారు తలదాచుకునే వారట. ఈ ప్రదేశమంతా ఆటవిక జాతులతో నిండివుండేదనీ, యిక్కడి నేటివులు ఒకరినొకరు దారుణంగా వేటాడే వారనీ లెటూర్ తెలుసుకునేందుకు ఎంతోసేపు పట్టలేదు. పర్వతం పైన దాక్కున్న మనుషులు, యుద్ధ భీతి లేని కాలంలో పీఠ భూమి మీదకి వచ్చి పంట పండించుకుంటూ శత్రువుల అలికిడి అవగానే మళ్ళీ పర్వతంలోని తమ రహస్య స్థలంలోకి పోయి దాక్కునేవారు. బలవంతులైన శత్రువులతో తాము పోరాడి నెగ్గలేక పోవచ్చు. కాని పారిపోయి దాక్కునేందుకు ఒక స్థలం అంటూ వుండేది, ఎకోమా శిలని యింత వరకూ ఎవరూ ఆక్రమించుకోలేక పోయారు - ఒకసారి స్పానియర్డ్స్ మాత్రం స్వాధీన పరుచుకున్నారు. ఈ శిల పీడిత మానవుల పాలిట మహోపకారి. ఆత్మరక్షణకీ ఆత్మశిక్షణకీ ఒక సజీవ నిదర్శనమై నిలిచింది.'

కొండ శిలల మధ్య భగవంతుడు దాగి వుంటాడా అనిపించింది లెటూర్‌కి.

ఇక్కడి వారి జీవితం తమ జీవితానికి భిన్నమయినది. ఐరోపా వాసులను ఆశ్చర్యచకితులను చేసే అనేక విషయాలు తెలుసుకుంటున్నాడు లెటూర్. సర్వమానవాళికి వలెనే, ఎకోమా ప్రజలు కూడా అనిత్యజగత్తులోని నిత్యానంద స్వరూపాన్ని తెలుసుకోవాలని తంటాలు పడ్డారు. ఈ శిలమీద వారు జన్మించారు. ఈ శిలలో వారు పెరిగి పెద్దవారై ఆనంద విషాదాల మీద తేలియాడుతూ మృత్యుసన్నిధిని చేరుకున్నారు. అతి సామాన్య విషయాలలో వైచిత్రి సర్వసహజమేమో!

నల్ల మేఘాలు, ఆకాశం మీద అక్కడక్కడ విదిలించబడ్డ సిరా బొట్లలా కనపడుతున్నాయి. బాటసారులకు ఎకోమా చేరువవుతోంది.

వర్షం వచ్చేట్టుంది అనుకుంటూండగానే వర్షం పడింది. తేలిపోతాయనుకున్న మేఘాలు వర్షించ సాగాయి. దొలుచుకొచ్చిన కొండ అడుగున గుర్రాలు రెండూ నిలబెట్టి, తమ రగ్గులు తీసుకు కప్పుకు కొండ ఎక్కారు. జాకింటో ఎక్కమన్నాడు - లెటూర్ అనుసరించక తప్పింది కాదు. ఆ ఎగుడు దిగుడు మెట్లు ఎక్కడ జారతాయో అన్నంత భయంగా ఉన్నాయి. పిల్లులు కూడా పరుగెత్తలేనంత నునుపుగా ఉన్నాయి ఆ రాళ్ళు. పర్వతం పైభాగాన చెట్టూ చేమా లేదు కాని తాము

ఎక్కో చోట మాత్రం తెల్లటి ఈస్టర్ లిల్లీస్ ఉన్నాయి. వాటి పరిమళం ఏమంత బాగులేదు. ఏవో పట్టు పువ్వుల్లా కృత్రిమ రూపంతో కనపడుతున్నాయి ఆ లిలీస్.

చెవులు చిల్లులు పడే వురుములతో వర్షం తీవ్ర మయింది. గుహాలో తల దాచుకున్న ఈ యిద్దరూ తమ రక్షణ స్థలానికి వెలుపల కుండ పోతగా వర్షం పడ్డం చూచి ఆశ్చర్యపోయారు. పది నిముషాల క్రితం తాము నిలబడ్డ ప్రదేశం ఒక చిన్న వాగై పోయింది. ఎటు వంక చూసినా నీటి మడుగులే. నీరు యెక్కడి కక్కడ చక్కగా పరుచు కోవడంతో సాయంత్రపు నీరెండ తళ తళ మెరుస్తోంది. కొండ వాగు జల జల పరువు లెడుతోంది. సూర్యు డొక్క సారి ముసుగు తొలిగించుకు వచ్చి చిరునవ్వు నవ్వాడు. సృష్టి ప్రారంభాన భూకాంతని నీటిధారతో పునీతం చేసి, యిలాగే నవ్వి వుంటాడు సూర్యభగవానుడు.

అంత వుధృతంగా వచ్చిన వర్షం, అరగంటలో మాయమయింది. లెటూార్ జాకింటోలు నెమ్మదిగా కొండ గుహ దాటి బయటకు వచ్చి, తమ మార్గాన బయలు దేరారు. ఎకోమా నగరం ధగ ధగ లాడుతోంది సూర్య కాంతితో. వర్షం పడటంతో ఆ ఊరు వీధులు వాటం తటవి శుభ్ర పడ్డాయి. నీళ్ళ గుంటల నిండా పరిశుభ్రమైన వర్షపు నీరు నిలిచింది. బట్టలు వుతుక్కునేందుకు స్త్రీలు తమ బట్టల్ని ఈ నీళ్ళ మడుగుల వద్దకు తీసుకు వస్తున్నారు. మంచినీళ్ళ కుండలు నెత్తిన పెట్టుకు మరి కొందరు తమ

యిళ్ళకు వెళ్తున్నారు. ఆ నీళ్ళు భూగర్భంలో గల నీటి జల నుంచి తెచ్చుకునేవి. ఆ నీటిజల మున్నాళ్ట అరవై రోజులూ వుంటుంది. అది తాగేందుకు మాత్రమే ఉపయోగిస్తారు. మిగతా వాటికి ఈ వర్షపు నీరు వాడతారు. వర్షం పడ్డ రోజున బట్టలు వుతుక్కోవడం వాళ్ళ ఆచారం.

కొండపైన సుమారు పది యెకరాల నేల ఉంటుంది. అక్కడ ఒక చెట్టుగాని పుట్టగాని లేవు. చర్చి మందిరం, దాని చుట్టూ గల గోడలూ తప్ప యింకేమీ లేవు. ఈ శిలమీద పడే సూర్యరశ్మి ఊళ్లో వారిని బాధపెట్టదు. వాళ్ళ యిళ్లు ఎంతో అనువుగా కట్టుకున్నారు.

శిల మీద ఉన్న చర్చి మందిరం దూరం నుంచి చూడటానికి ఏదో భయంగా ఉంటుంది. ఆ శిథిలమైన చర్చి బురుజు డెబ్బయి అడుగుల యెత్తు ఉంది. చూపులకి ఆ చోటు కోటలా ఉంటుంది గాని ప్రార్థనా మందిరంలా మట్టుకు లేదు. భవనం యెంత విశాలమైనదో చెప్పతరం కాదు. ఆ విస్తీర్ణత లెటూర్ కే కొంచెం బెరుకు పుట్టించింది. మధ్యాహ్నం వేళ సమూహ ప్రార్థన జరుపుతున్నప్పుడు మొత్తం అరవై కంటె యెక్కువ మంది లేరు. ఆ కొద్దిమంది కూడా ఏదో నత్తల వలె ఉన్నారు. నత్త భయపడినపుడు గుల్ల లోపలికి చొచ్చుకుపోతుందే అదే మాదిరి వీరు కూడా తమ బొందెలు మాత్రం చర్చిలోకి తీసుకు వచ్చి మనసు లెక్కడో దాచినట్టున్నారు. లెటూ

ర్‌కి ఈ ఎకోమా అనుభవ మొక ఆధ్యాత్మిక అపజయంలా తోచింది.

దైవకార్యం అయాక, ఫాదరీ గౌనూ అదీ తీసి వేరే వుంచి, జాకింటో వెంట చర్చి పరిశీలించడానికి బయల్దేరాడు. లోపలి పనితనం పరిశీలించిన కొద్దీ అతని ఆసక్తి వృద్ధి జెందింది. ఎకోమాలో యింత బ్రహ్మాండమైన చర్చి ఎవరు నిర్మించారు? ఎందుకని? ఇంత పెద్ద భవనం కట్టడానికి యేదో ప్రబల కారణం వుండాలి. 17వ శతాబ్ది ప్రారంభంలో రామ్‌రెజ్ అనే మత గురువు ఎకోమా శిల మీద ఈ చర్చిని నిర్మించాడు. ఇది కట్టేందుకు యిరవై సంవత్సరాలకు పైగా పట్టింది. ఇందుకయే సాధన సామగ్రి అంతా గుర్రాల మీద, గాడిదలమీద అడుగునించి పైకి మోసుకు వచ్చి, ఈ నల్ల రాయి మీద యిటువంటి చర్చి భవంతి కట్టారు.

లెటూర్‌కి ఆ పరిసరాలు గమనించిన కొద్దీ రామ్‌రెజ్ గాని ఆయన తరువాత వచ్చిన స్పానిష్ ఫాదరీలు గాని, ఈ చర్చిని అక్కడ స్థానిక వాసుల వుపయోగం కోసం గాక తమ కీర్తి కోసం, తాము శాశ్వితంగా చరిత్ర పుటలలో నిలవాలనే కాంక్షతోనూ యిది కట్టించారా అనిపించింది. ఆ శిలామయ ప్రదేశం చుట్టూ గల సౌందర్య దీప్తులు, స్పానిష్ ఫాదరీలని యిటువంటి సౌధ నిర్మాణానికి పురికొల్పింప చేసి వుంటాయి. ఎందరు నేటివులు ఈ చర్చి కోసం రాళ్ళను పైకి మోసుకొచ్చారో! ఇందు

లోని ప్రతి రాయీ మానవుని బుజాల మీద కెక్కి ఇక్కడికి వచ్చినదే ; ఎందరు స్త్రీ పురుషులూ బాల బాలికలూ యివి మోశారో ! జునిపర్ మొక్కలు తప్ప, కలప అంటూ లేని ఈ ప్రాంతాల ఆ దూలాలు ఎలా సంపాయించారో !

'ఆ కలప యెక్కడిదై వుంటుంది ?' అని అడిగాడు లెటూర్ జాకింటోని.

'శాన్ మేటియో పర్వతం దగ్గిరిదా కర్ర' అన్నాడు జాకింటో.

'శాన్ మేటియో పర్వతాలా ? అవి యిక్కడికి నలభై యాభై మైళ్ళ వున్నాయనుకుంటా. అది ఎలా తీసుకు వచ్చారు ?'

'ఎలా తీసుకురావడ మేమిటి ? ఎకోమా ప్రజలు మోసుకువచ్చి వుంటారు' అన్నాడు జాకింటో.

సింహద్వారం, లోపలి వసారాలూ, యిటూ అటూ గల దారులూ, పక్కలనున్న వసారాలూ, ముందు ఉన్న చిన్న గోపురమూ యివన్నీ నిర్మించేందుకు ఎకోమా ప్రజలు యెంత శ్రమపడి వుంటారో ! ఈ కొండ మీద చక్కటి తోట. ఇప్పుడంటే పాడైపోయింది గాని ఒకప్పుడు పీచెసూ, ద్రాక్షా, సమృద్ధిగా పండిన గుర్తులు యింకా వున్నాయి. చర్చికి ఈశాన్యంగా ఒక విరామ మందిరం వుంది. అక్కడ ఆ రాత్రి మకాం చేదామనుకున్నాడు లెటూర్, ఆ విరామ వాటిక కొసని నిలబడి, సూర్యాస్తమయ శోభ చూస్తూ

కమ్ముకొంటూ వచ్చే నీడలు, నల్లదనం లోకం పైకి చిమ్మడం, కాంక్షతో వీక్షిస్తున్నాడు. రాతి యుగంలోని మనిషి వలె కూచున్నాడు లెటూర్. స్వగృహమూ, స్వదేశమూ జ్ఞాపకము వచ్చాయి. తను పాశ్చాత్య పౌరుడు. వాంఛలతో స్వప్నాలతో కూడిన ఉత్కృష్ట చరిత్రగమనం సూచించే పాశ్చాత్య నాగరికతకి చెందినవాడు. ఆకాశ మండలం ప్రతి ఉదయాన, ఎటువంటి కాంతులతో మారిపోతుందో, ఆ ప్రకారం శతాబ్దుల కనుగుణంగా పాశ్చాత్యవాసులు మారిపోతున్నా, యిక్కడి ప్రజలు మాత్రం మార్పులేక, కోరికలూ అవసరాలూ పెంచుకోక, ఈ రాళ్ళ మధ్య, శిలాయుగ వాసులై, సంతృప్త జీవనం గడుపుతున్నారు. ఆ సంతుష్టిలో సరీసృపధర్మం కనపడుతుంది – అనగా అత్యవసరమనిపిస్తేనే కొద్ది దూరంపాకి, మళ్ళీ వానపాముల్లా మట్టిలో జొరబడి, రోజులు గడిపేయడం.

తిరుగు ప్రయాణంలో లెటూర్, యిస్లెటా ఫాదరీ డిబాకాతో మరొక రోజు గడిపాడు. ఇద్దరూ ఎన్నో విషయాలు మాట్లాడారు. అందులో ఈ ఎకోమా కథ ఒకటి ఉంది. ఇది చాలామంది మర్చిపోయారట. కాని డిబాకా తనకి జ్ఞాపక మున్నంత వరకూ చెప్పాడు ఈ ప్రకారం.

## 4

18 వ శతాబ్దపు ప్రారంభ కాలం. తెల్ల మత గురువుల మీద స్థానిక ప్రజలు విజృంభించి, అప్పటికి ఏభై

సంవత్సరాలవుతుంది. ఆ ప్రథమ విప్లవంలో అచ్చటి వారు కంటికి కనుపడ్డ తెల్లవారందరినీ నరికేయడమో, తరిమేయడమో చేశారు. ఆ హింసాకాండ జరిగిన నలభై యాభై సంవత్సరాలకి పాశ్చాత్యులు మళ్ళీ పునరాక్రమణ ప్రారంభించారు. ప్రాణాలర్పించిన పాత మత గురువులలో ఒకడు బాల్టజార్. ఇతను తిన్నగా ఎకోమాకి వచ్చాడు. కొంచెం క్రూరుడూ, కఠినుడూను. ప్రజల చేత చచ్చే చాకిరీ చేయించేవాడు. మత గురువామెను-ఆయన మాట పాటించవలసిందే! ప్రజల రక్త మాంసాలు పీల్చి, వారి కాయకష్టం మీద ఈ ఎకోమా చర్చిమందిర నిర్మాణం జరిపించాడు బాల్టజార్. వాంఛల పల్లకీలో వూరేగే మతగురువు ఈయన గారు. చుట్టుపక్కల గల మత గురువులందరిలోనూ తను గొప్పవాణ్ణని పేరు పొందాలి-ఆ కీర్తి దాహంతోనే ఈ బ్రహ్మాండమైన చర్చి తల పెట్టాడు. ఇటువంటి ప్రభు మందిరాలని సుందరవంతం చేయడం కంటె జీవిత పరమార్థ మేముంది ఈ నేటివులకి ?-అనుకునేవాడు. తను దేవుని ప్రతినిధి కనక, అక్కడ లభ్యమయే వాటిలో, శ్రేష్ఠమైనవి ఎన్నుకోవడం తన ధర్మం అని భావించేవాడు. ధాన్యంలో ఒకటోరకమైనవీ, ఫలాల్లో ప్రత్యేకమైనవీ, తనకి నచ్చిన మాంసం, తనకి కావల్సిన సామాగ్రి, యిలాటివన్నీ తరలించుకు పోయేవాడు. వీటితో తృప్తి పడేవాడా ? అవి చాలవు. అడుగు నుంచి కొండ మీదకి తట్టలతో మట్టి తెప్పించి తోట వేశాడు. పాటి మన్నూ పెంటా మొదలైన

ఎరువులు అడుగు నుంచి తీసుకువచ్చి ఈ దొడ్లో వేయాలి. మొక్కలకి బోదులు చేసి వాటిని నీళ్ళతో తడపాలి. గ్రామంలోగల ప్రతి స్త్రీ, ఫాదరీకి వారానికి యిన్ని కుండల నీరు అని లెక్క చొప్పున, నీటి మడుగులలో నుంచి నీరు మోసుకువచ్చి వప్ప జెప్పాలి. అన్ని మెట్లు వొగరుస్తూ యెక్కి, చర్చి వెనుక భాగానున్న ఆ తోట తడపాలి. ప్రజలకీ, ఈ కాయకష్టం యేమంత బాధ అనిపించ లేదు. కాని తమకున్న కొద్దిపాటి నీరూ ఈ ఫాదరీ మొక్కలు తడపటానికి వ్యయమవుతోందే అని ఏడుపొచ్చేది.

బాల్టజార్ సోమరికాడు, ఉత్సాహవంతుడు. మనుషుల్ని జంతువుల వలె తోలుతూ పని చేయించగల సమర్థుడు. ఎకోమా వచ్చిన కొద్ది కాలానికే. నీరు వొంటబట్టి, వొళ్ళు వచ్చింది. మొక్కలకోసం, విత్తనాల కోసం అప్పుడప్పుడు ప్రయాణాలు చేస్తూ వుండేలాడు. పీచెస్‌లో మంచివి యేరేందుకు ఒక్రైబి వెళ్ళాడు. ఒకసారి 'సోనోరా' వెళ్ళి ద్రాక్ష అంట్లు కుండీలలో పెట్టుకు, ఆ మట్టి కుండీలు కంచర గాడిదల మీాద పెట్టించి, ఒక పెద్ద పరివారంతో అవి తీసుకు వచ్చాడు. తోటలో వేసే రకరకాల కాయ గూరల కోసం శాంటాఫె యెన్నోసార్లు వెళ్ళాడో చెప్ప తరం కాదు.

స్పెయిన్‌లోని కులీన కుటుంబంలో నించి వచ్చిన ఈ బాల్టజార్ చిన్నప్పటి నుంచీ సుశిక్షణ పొందినవ్యక్తి. అతనికి వంటపనీ, వడ్రంగం రెండూ తెలుసు. ప్రపంచపు

కోసని ఈ శిలమీద నివాస మేర్పరచుకోడం తన జీవన ధర్మం అయింది కనక ఈ శిలాగృహాన్ని యెంత సుఖ వంతంగా చేసుకోవచ్చునా అని, యెప్పటికప్పుడు ప్లానులు వేస్తూ వుండేవాడు. తన పనులు చేసి పెట్టేందుకు యిద్దరు నౌఖరులు కావాలన్నాడు. ఒకతను కంచరగాడిదను కని పెడుతూ తోట పని చూసేందుకూ, రెండో అతను వంట చేసి వడ్డించేందుకూను! కాలక్రమాన శరీరం పెరగడంతో ఈ యిద్దరూ కాక మరో నౌకరుకూడా అవసరమయాడు. దూరాభారపు ప్రయాణాలకి తను వెళ్ళలేక, ఈ యువ కుడిని పంపుతూ వుండేవాడు. ఏదైనా యినుప సామగ్రి కావలసొచ్చినా బట్టా పాతా కావలసొచ్చినా, యితణ్ణిపట్నం వెళ్ళి అవి తీసుకు రమ్మనేవాడు. వస్తూన్నప్పుడు బెర్న తేలో ఆగి, తోలు సంచి నిండా ద్రాక్ష రసం నింపుకు రావడం, ఆ అనుచరుడు మర్చిపోయేవాడు కాదు. ఫాదరీ, ఉపవాస దినాల్లో తినేందుకుగాను, ఈ యువకుడు ఒక్కో సారి, అయిదు రోజులు కాలి నడకను వెళ్ళి, శాండియూ పర్వతశ్రేణిదాటి ఉప్పు చేపలు తీసుకు వచ్చేవాడు. జూసీలోని సీమకుందేళ్ళంటే తెగ యిష్టం ఫాదరీకి. అంచేత అవి కూడా మర్చిపోయేవాడు కాదు.

ఎకోమా ఫాదరీకి ఆత్మ విచారం కంటే, కడు పాత్రం ఎక్కువ. ఉండడమేమో గండశిలమీద అవడం వల్ల, రకరకాల కాయగూరలు పండించేందుకు, అతని బుర్ర అద్భుతంగా పని చేసేది. తత్కారణంగా జిహ్వా

చాపల్యం పెరిగేది. నడివయసులో వున్న ఈ ఫాదరీ. అక్కడికి వచ్చే నేటివు స్త్రీలతో సంబంధం పెట్టుకోడం ఏమంత కష్టతరం కాదు. కాని ఆ విషయంలో మాత్రం చాలా ఘట్టిగా వుండేవాడు. ఈ మత గురువులు కొత్తదేశం వచ్చిన మొదట్లోనే గ్రహించారు, యిలాంటి వాటిలో తప్పటడుగు వేస్తే, తమ పలుకుబడి మంట గలుస్తుందని! అంచేత యెన్ని తప్పులైనా చేసేవారుగాని, ఈ తప్పు మాత్రం జరగనిచ్చే వారు కాదు. ఫాదరీని ఆదర్శ పూజ్యునిగా నేటివులలో కొందరు బ్రహ్మచర్యం అవలంబించేవారు ఆత్మ నిగ్రహం కోసం! నిగ్రహ జీవితం వల్ల దయ్యాల్నీ భూతాల్నీ తరిమి కొట్టవచ్చునని వారి నమ్మకం. అందుచేత ఈ స్పానిషు ఫాదరీల బ్రహ్మచర్యావలంబన ఒకవిధంగా మేలు చేసింది. కాని బాల్టజార్‌లోని నిగ్రహాన్ని ఉదాత్తశక్తి అనగలమా, అది అతని నీరస గుణాలని కప్పి పెట్టే ముసుగు గాని!

బాల్టజార్ ఎకోమాలో పదిహేను సంవత్సరాలు హాయిగా గడిపాడు. చర్చిని అభివృద్ధి పరచి, తన మందిరం యింకొంచెం చక్కగా నిర్మించుకు, కొత్తజాతుల కాయగూరలు వనమూలికలూ పెంచుతూ, సుఖంగా గడిపాడు పదిహేనేళ్ళు. శరీరం లావు దేలినా, చేతుల్లో శక్తీ, కండరాల బలమూ, వేళ్ళ నైపుణీ - యివి మాత్రం తగ్గలేదు. తనతోటే ఒక చిన్న రాజ్యంగా, ఆ రాజ్యానికి తను ప్రభువైనట్టుగా, రుచికరమైన కాయగూరలు

పెంచుతూ, స్త్రీలు తనకి చెల్లించవలసిన నీటి శిస్తు ఒక్క కడవ కూడా విడవకుండా రాబడుతూ సుఖజీవనం సాగిస్తున్నాడు. మొదట జేరిన ముగ్గురు సౌఖర్లకి వివాహాలవటంతో, కొత్త వాళ్ళు మరో ముగ్గుర్ని తన సర్వీసులోకి తీసుకుని వాళ్ళకి ట్రయినింగు యిచ్చాడు.

బాల్టజార్‌లోని నిరంకుశత్వం నానాటికి వృద్ధికాజొచ్చింది. ఒక్కోసారి ఏకోమా ప్రజలు తిరగపడదామనుకునేవారు. కాని ఈ ఫాదరీ దగ్గర వున్న మంత్ర తంత్రాలెటువంటివో జడిసి, యితడు తమని రాళ్ళగానే చేస్తాడో, బూడదగానే మారుస్తాడో అని భయపడి వెనకాడేవారు. ఇది యిలా వుండగా స్పెయిన్ దేశపు రాజు ఈ ఫాదరీ కోరిక ప్రకారం సెయింట్ జోసఫు చిత్రాన్ని పంపించాడని తెలియటంతో ఆ చిత్ర మాహాత్మ్యం వాళ్ళని మరింత భయపెట్టింది. స్థానిక మాంత్రికుల ప్రయత్నాలు విఫలమైనప్పుడు, ఈ సెయింట్ జోసఫు పటాన్ని పొలాల వెంట తిప్పితే, విధిగా వర్షం పడేది. ఈ చిత్ర పటానికి తగు మర్యాదలు చేసి, లాంఛనాలన్నీ సక్రమంగా జరిపించి వూరేగిస్తే, లగూనాలోనూ, జూనీలోనూ పడని వర్షాలు యిక్కడ పడుతున్నాయి. ఈ చిత్రపటం వచ్చినప్పటి నుంచీ, నీటి యెద్దడీ కరవుకాటకాలూ లేవు. ఈ చిత్రాన్ని తెప్పించింది బాల్టజార్ కదా! అతని కేదైనా ద్రోహం తలపెడితే, అది తమకి బెడిసి కొడుతుందేమో అని భయపడేవారు.

లగూనా వాసులు ఎకోమా వారికి తరుచూ వినతి పత్రాలు పంపుతూ ఉండేవారు, తమ దగ్గర ఉన్న పవిత్ర పటాన్ని మాకు ఒకసారి అరువివ్వగలరా అని. అరువు యిచ్చినందుకుగాను, యిదుగో మీకింత అద్దె చెల్లిస్తాం - అని బేరాలు కూడా పెట్టేవారు. బాల్టజార్ తన ప్రజలతో చెప్పాడు. 'దీన్నిక్కడ నుంచి కదిపారా, ఆపైన నా బాధ్యత లేదు. ఈ చిత్రపటం మన పొలిమేర దాటి వెళ్ళాక మనకు యెటువంటి విపత్తయినా సంభవించవచ్చు. ఆపైన నన్నని లాభం లేదు' అని పిరికి మందు పోశాడు. ఒక వేళ ఫాదరీ మాట నెదిరిస్తే, తాము ఏమైపోతామో అని వాళ్ళకి మహా చెడ్డ భయం. అంచేత కిమ్మనకుండా ఆ మత గురువు చెప్పిన దానికల్లా తల వొగ్గుతూ, ఆయనకి కావలసిన ఆహారపు సరుకులు సమర్పిస్తూండేవారు.

ఇలా వుండగా ఒక వేసవి కాలంలో ఫాదరీకి తన చక్కటి ఉద్యానవనమూ, నీటి కూజాలతోను రంగు కంబళ్ళతోనూ అలంకరించబడ్డ తన విశ్రాంతి మందిరమూ చూసి మెచ్చుకునే అతిథులు వస్తే బాగుండునని అనిపించి, ఒక చిన్న డిన్నర్ పార్టీ యిద్దామనుకున్నాడు. జూనిలోనూ, లగూనాలోనూ, యిస్లేటాలోనూ వున్న మత గురువుల్ని ఎకోమా ఫాదరీ ఫలానా రోజున విందుకు ఆహ్వానిస్తున్నట్టుగా చెప్పి రమ్మని కబురంపాడు సేవకుణ్ని. అప్పట్లో జూనిలో యిద్దరు ఫాదరీలుండేవారు. విందు రోజున కొండ ముఖ ద్వారాన ఒక సేవకుడు వుంచ

బడ్డాడు. అతిథులు రాగానే వారి అశ్వాలను తీసుకువెళ్ళి లోన కట్టేసి, కొండ యెక్కే మెట్ల దారి చూపడం అత గాని డ్యూటీ. అన్ని మెట్లూ ఎక్కాక కొసని కనపడ తాడు బాల్టజార్ అతిథుల్ని ఆహ్వానిస్తూ. ఎండెక్కాక పూర్వాం వచ్చిన అతిథులు చర్చి చుట్టూ తిరుగుతూ, ఈ గండ శిల మీద యింత చల్లని మందిరం ఎలా కట్టించ గలిగాడో మనవాడు, అని స్వజాతీయుని మెచ్చుకుంటూ, ద్రాక్ష తీగెల మీదుగా వచ్చే మలయ మారుతానికీ, కారెట్ వుల్లి మొదలైన వాటిమీద నుంచి మట్టితో కలసి వచ్చే సుగంధ పరిమళాలకీ సంతోషాంతరంగులై, బాల్ట జార్ సాధించిన ఘన విజయం మనందరం గర్వపడదగ్గదని లోన అనుకుంటూ, కరువుదీరా పచార్లు కొట్టి మధ్యాహ్న సమయానికి భోజనాల బల్ల చేరుకున్నారు. నేను సామా న్యుణుడిననుకున్నారా? అన్నట్టుగా కొంచెం కీపీ వెళ్ళ బోశాడు బాల్టజార్. అతిథుల భోజనాల విషయమై మొద ట్నుంచీ అమిత శ్రద్ధ తీసుకున్నాడు. ప్రతీ పదార్థం స్వయంగా చూచి తన తయారు చేయించాడు. అసలీ పాక శాస్త్ర విద్య బాల్టజార్‌కి శెవిల్లోలో వుండగా అలవడింది. అప్పుడప్పుడు ఆ శెవిల్లికి స్పానిష్ రాజూ అతని సామం తులూ వచ్చి కడుపు నిండా భోంచేసి వెళుతూ వుండేవారు.

బయట గండ శిల మీద విపరీతంగా వేడి. ఇక్కడ ఈ లోపల చుట్టూ చక్కని మొక్క లుండటంచేత ఎంతో చల్లగా వుంది. అతిథులు నలుగురుకీ ఈ విందు మహా

ధానందంగా వుంది. ఇలాటి భోజనం ఆరగించి యెన్ని సంవత్సరాలైందో! మరిచి పోయిన రోజులు జ్ఞప్తికి తెస్తున్నాడు ఈ బాల్టజార్, అనుకున్నారు. తను కొద్ది కాలంలో ఒక ఫౌంటెన్ కట్టించబోతున్నాననీ, ఫౌంటెన్ అక్కడ వుంటే లోపల యింకా చల్లబడుతుందనీ దర్జాగా చెప్పాడు బాల్టజార్. నింపాదిగా కూర్చుని, వచ్చే రుచికరమైన పదార్ధాలన్నిటినీ సావకాశంగా ఆరగింపమని కోరాడు తన అతిథులను. సూపు తర్వాత టర్కీ వస్తుంది. ఆ టర్కీ వంటకం తాను స్వహస్తాలతో తయారు చేశాడు. అందులో కారట్లూ, వుల్లి సువాసనకు మాత్రం వేశాడు. ఆ రోజు అసలు వంటవాడేమో పదార్ధాలు యేవీ చల్లబడకుండా మోతాదైన వేడిలో వుంచడానికి వంటింట్లో వుండిపోయి, ఒక దాని తర్వాత ఒకటి సర్వరుకి అందిస్తున్నాడు. గుర్రాల దగ్గర పని చేసే నౌకరు వడ్డన పని చూస్తున్నాడు. ఇతను సరిగా వడ్డన చేయగలడో లేడోనని మొదట్లో సంశయించాడు బాల్టజార్. కాని, అతని నేర్పరితనానికి మెచ్చుకు వెండి పతకం బహూకరిద్దామనుకున్నాడు.

ఇన్సెటా ఫాదరీ ఒక హాస్యభరిత సన్నివేశం వర్ణిస్తున్నాడు. నౌకరు 'టర్కీ'ని పెద్ద పాత్రలో పెట్టుకు, ఆ పాత్ర రెండు చేతులా జాగ్రత్తగా పట్టుకు, వేడి వేడి ద్రవంతో తేలే టర్కీని డైనింగ్ టేబుల్ వద్దకు తెస్తున్నాడు. అతనికి కొద్దిగా స్పానిష్ భాష రావడం చేత,

ఫాదరీలు చెప్పుకునే కథ అర్థమై ఫక్కున నవ్వు వచ్చి, నవ్వు ఆపుకోలేక కొద్దిగా ముందుకి వంగడంతో పాత్ర లోని గోధుమ రంగు వేడి ద్రవం, జూనీ నుంచి వచ్చిన పెద్ద ఫాదరీ తల మీదా బుజాల మీదా పడింది. అసలే బాల్టజార్ కోపిష్టి. అందులో ఈ మధ్య ద్రాక్షరసం తెగ తాగుతున్నాడు. అందువల్ల వెర్రి కోపం పట్టలేక, టేబుల్ మీద తన కుడి ప్రక్కనున్న ఇత్తడి కూజాను తీసుకు, శక్తి కొద్దీ నౌకరు ముఖం మీద కొట్టాడు. అది తిన్నగా వెళ్ళి అతని కణతలకి తగిలిందేమో, చేతులోని పాత్రతో కొంచెం సేపు తూలి, యిక నిలబడలేక నేల మీద కొరిగాడు. అతను యింక మళ్ళీ లేవలేదు. కదలక పడి వుండే సరికి కొద్దిగా వైద్యం తెలిసిన జూనీ ఫాదరీ, తన ముఖం మీద పడ్డ పదార్థం తుడుచుకుంటూ, ఆ యువకుని మీదకి వొరిగి, అతని నాడి పరీక్షించి, తన పక్క నున్న జూనియర్ ప్రీస్టుని, 'పద, పోదాం' అన్న సౌంజ్ఞ చేస్తూ, కోటుచ్చుకు లాగాడు. ఇద్దరూ మరో మాట లేకుండా మెట్ల దగ్గరకు వెళ్లారు. జూనీ ఫాదరీలు చల్లగా తప్పుకోవడం చూసి, లగూనా, యిస్లేటా ఫాదరీలు కూడా అదే మార్గం అవలంబించారు. నలుగురు ఫాదరీలూ ఎంత వేగంగా మెట్లు దిగి పారిపోయారో చెప్ప లేము.

బాల్టజార్ ఒక్కడూ మాత్రమే వున్నాడక్కడ, తన దుష్కార్యానికి ఫలితం అనుభవించేందుకు. నడవలోకి

వెళ్ళిన నౌకరు ఎంతకీ రాకపోయేసరికి, వంటింట్లోని వంట వాడు భోజనాల బల్లదగ్గరికి వచ్చి, అక్కడి దృశ్యం చూసి, ఒక్క పరుగున అక్కడ నుంచి పారిపోయాడు.

బాల్టజార్ వంట ఇంటిలోకి వెళ్ళేసరికి అక్కడ ఎవరూ లేరు. వేడివేడి పదార్థాలు పాత్రల నిండా పడి వున్నాయి. అవేమీ తినాలనిపించలేదు బాల్టజార్‌కి. ఎందు కంత తొందరపడ్డానా అని కాసేపు పరితపించాడు. తను కూడా పారిపోతే ఎలా వుంటుందనే ఆలోచన కలిగింది. భయపడి పారిపోతే తన పరువు ప్రతిష్టలు మంట కలు స్తాయి. తన మాటకి విలువ నశిస్తుంది. అసలిక్కడి నుంచి పూర్తిగా బిచానా ఎత్తేస్తేనో ? – అనుకున్నాడు. బాగా ఎదిగిన తోటా, పక్వానికి వస్తున్న పీచెస్, పండ్ల భారంతో వారిగిన ద్రాక్ష తీగెలూ వీటిని వొదిలిపెట్టి వెళ్ళడమేలా? పాత్రలో తేలుతున్న టర్కీని ఒక్కసారి బయటకి తీశాడు. 'ఇది బతికివున్నప్పుడు ఎంత చక్కని పక్షో! చంపుతున్న ప్పుడు అది ఎంత గిలగిల లాడిందో!' అనే భూతదయ కలి గింది. ఈ విందు కోసం దాని ప్రాణం తీశాం కదా, అను కుంటూ తన విశ్రాంతి మందిరంలోకి వెళ్లాడు. పూజా గ్రంథం తెరిచి, వాక్యాలు చదువుతున్నాడే కాని అవి తల కెక్కడము లేదు.

అతని ఆరామ మందిరం ఒక కర్ర పంజరం. అందు లోకి గాలి బాగా వస్తుంది. ఆ పంజరంలో కూచుంటే చుట్టూగల లోకమంతా కనిపిస్తుంది. కింద వున్న గ్రామం

అలికిడి లేకుండా ప్రశాంతంగా వుంది. కడవలతో నీళ్ళు మోసుకు వెళ్ళే స్త్రీలు గానీ, నీటి మడుగువద్ద ఆడుకునే పిల్లలు గానీ కనపడటం లేదు. మరొకవైపు తల తిప్పే సరికి, మెట్ల దగ్గర నల్లని శిరస్సు దర్శన మిచ్చింది. అప్పుడే ద్వారం దగ్గర కాపలా పెట్టేశారన్నమాట తను పారి పోకుండా!

ఆ నలుగురు ఫాదరీలతోపాటు తను కూడా పారి పోయి వుంటే ప్రాణాలు దక్కేవి కదా! - అనుకున్నాడు. ఇప్పుడు విలపించడం చేతులు కాలాక ఆకులు పట్టుకోవ డమే! ఈ గండశిలమీద కాక, ప్రపంచంలో ఎక్కడ వున్నా తను తప్పించుకు పారిపోవచ్చు. ఈ శిలే తనని బందీగా చేసింది. ఇక్కడకు వచ్చేందుకు రెండే దారులు వున్నాయి. ఒక దారి దగ్గర కాపలా పెట్టినప్పుడు, రెండో దారి వొదిలి పెట్తారా? మూడువందల అడుగుల ఎత్తుగల ఈ శిల మీద నుంచి ఎటు పారిపోవడానికీ దారిలేదు. తెగించి దిగబోయినా, ఆధారంగా పట్టుకునేందుకు ఒక్క మొక్కకూడా లేదు. ఎలా తప్పించుకోవడం?

సూర్యుడు అస్త్రాద్రి చేరుకుంటున్నాడు. కిందగల గ్రామం నుంచి రకరకాల కంఠాలు వినిపిస్తున్నాయి. ఏదో హడావిడిగా వున్నారక్కడి ప్రజలు. 1680 లో యిక్కడి వారు మత గురువుల్ని పెట్టిన హింసలు జ్ఞాపకం వచ్చాయి బాల్టజార్ కి. ఒక ఫ్రెంచి మతగురువు కళ్ళు రెండూ వూడ పెరికారట. మరొకతన్ని నిలువునా మంట పెట్టారట.

జామజ్‌లోని ఫాదరీని దిగంబరునిగా చేసి కాళ్ళూ చేతుల మీద అతన్ని దేకించారట. అక్కడితో వూరుకున్నారా? కొన ఊపిరితో వున్న అతని శరీరాన్ని గుర్రాలతో తొక్కించారట!

చంద్రోదయంతో బాల్టజార్ మనసు పరిపరి విధాల పోయింది. ఎడారిలో పడే చంద్ర కిరణాలు భయం గొల్పుతాయి. ఈ రాత్రి చంద్రుడుదయించకుండా వుండు గాక, అని వేయి దేవుళ్ళకి మొక్కుకున్నాడు బాల్టజార్, కాని వొక్కరూ అతని మనవి ఆలకించినట్టు లేదు.

చంద్రోదయంతో, యెకోమా ప్రజలలో హడావిడి ఎక్కువయింది. వారు యేది తల పెట్టినా చంద్రోదయంతో గాని ప్రారంభించరు. కొందరు శిలపై కెక్కుతున్నారు. చూస్తూ చూస్తూ వుండగానే - కొందరు చర్చిలో ప్రవేశించి, తన ఆరామ మందిరం వద్దకు వచ్చారు. ఏం కావాలి, ఎందుకు వచ్చారు? - అని గాంభీకంగా అడిగాడు బాల్టజార్. వాళ్ళేమీ సమాధానం చెప్పలేదు. రెక్కలు విరిచి కట్టి కాళ్ళకి తాళ్ళు వేశారు.

అతను వాళ్ళని ఎదిరించలేదు, పోరాడలేదు. వారు ఒక విషయమై నిశ్చయానికి వచ్చారా, యింక దానికి తిరుగులేదు. తను స్పెయిన్ దేశీయుడు; వీళ్ళు తన అధికారానికి బద్ధులై నడచుకోవలసినవాళ్ళు-అనే ధీమాతో వున్నాడు చివరిదాకా.

అతన్నా శిల మీద నుంచి మెట్ల దారివెంట క్రిందికి దింపి, అక్కడ ఉన్న ఒక మెట్టమీదకి తీసుకు వెళ్ళారు. ఎకోమా స్త్రీలు పగిలిపోయిన పాత్రలూ, కుళ్ళి పోయిన ఆహార పదార్థాలూ ఆ గుట్టపైనుంచి అవతలకి గిరవాటు పెట్టేవారట. అలాటి చోటికి అతన్ని తీసుకువెళ్ళి, తాళ్ళు విప్పి నలుగురు మనుషులు కాసేపతనిని వుయ్యాల లూపి, చివరికి శిఖరం మీద నుంచి గిరవాటు వేశారుట.

తమ రక్తం పిండిన కిరాతకుణ్ణి ఆ ప్రకారం వొదుల్చుకున్నారు ఎకోమావాసులు. అతనితో పాటు అతను వాడుకునే సామానులన్నీ కూడా గిరవాటు వేశారు. అంతే గాని చర్చిలోగల పూజాసామగ్రి మైల పరచలేదు వారు. ఫాదరీ కష్టపడి పెంచిన ద్రాక్ష తీగెలూ, పీచ్ మొక్కలూ నీళ్ళు లేక మాడిపోతూ వుంటే, నిన్న మొన్నటి దాకా కడవలతో నీళ్ళు మోసుకు వచ్చిన స్త్రీలే 'వాటికి అంతే కావాలి' అని ఒకళ్ళతో ఒకళ్ళు చెప్పుకుంటూ. నవ్వుకునేవారు.

కొన్ని సంవత్సరాల తర్వాత యింకో మత గురువు వచ్చాడు. అతడు మెక్సికన్. అతనికి ద్రాక్ష తీగెలూ, పీచెసూ అక్కర లేదు. ప్రజలందరితో పాటు బటాణీలూ, గోధుమలూ తినేవాడు. బాల్టజార్ తోట పాడు పడింది. పీచెస్ ఆయా ఋతువుల్లో తల ఎత్తేవి గాని ఆలనా పాలనా లేక మళ్ళీ వాడిపోయేవి.

# 4

## సర్పం కథ

ఆల్బుకుర్కీ ఎకోమాల సందర్శించి వచ్చిన నెల్లా ళ్ళకి ఫాదర్ లెటూర్ గల్లిగోస్‌ని పదవీచ్యుతునిగా చేశాడు. అతని బాధ్యత కూడా జోసఫు నెత్తి మీదనే పడింది. గల్లిగోస్ స్థానే ఫ్రెంచి ఫాదరీ కొత్తతను రావ డంతో ఆల్బుకుర్కీ ప్రజలలో, ముఖ్యంగా విలాసవతులైన వనితలలో నిస్పృహ బయలుదేరింది. ఈ జోసఫు వచ్చీ రాగానే సంస్కరణలంటూ తల పెట్టాడు. గల్లిగోస్ కాలంలో పర్వదినాలు సరదాగా వుండేవి. ఈయన గారొచ్చి పర్వదినాలంటే పవిత్రమైనవనీ ఆనాడు విలా సాలూ, వినోదాలూ కాక నిష్కల్మష మనసుతో భగవ దారాధన జరపాలనీ ప్రకటించాడు.

అక్కడి మెక్సికనులకి యిదంతా మొదట్లో అర్థ రహితంగా కనిపించింది. కాని విశృంఖల జీవనానికి అల వాటు పడ్డ ఆ మనుషులు, నియమవంతులవడానికి ఆట్టే

కాలం పట్టలేదు. ఫాదర్ జోసఫ్ ఫ్రాన్సులో వున్న తన సోదరి ఫిలోమినాకి ఉత్తరం వ్రాస్తూ యిలా అన్నాడు: 'నా వికారేజ్‌లోని ప్రజలు బడి పిల్లలవలె నున్నారు. అల్లరి ఆగడం మొదలు పెడితే, ఎవరెక్కువ అల్లరిచేస్తారా, అని పంతాలాడుకున్నట్టే, చదువు విషయంలో ఎవరెక్కువ బాగా చదువుతారా, అని పోటీ పడ్డట్టే, ఈ అమాయక ప్రజలు వెనకటి విశృంఖలతని యెలా ఆనందించారో, యిప్పటి నియమనిష్టలని కూడా అదే ప్రకారం ఆవ రిస్తున్నారు.'

ఫాదర్ జోసఫ్‌కి మామూలు కార్యభారంతోపాటు మరొక కొత్తది నెత్తిన పడింది. ఫిబ్రవరిలో అతను లాస్ వెగాస్ అనే ప్రదేశానికి బిషప్ ఆజ్ఞ ప్రకారం వెళ్ళ వలసి వచ్చింది, తిరిగి రావలసిన రోజుకి రాకపోయేసరికి, ఎందుకు రాలేదు చెప్మా - అని లెటూూర్ ఆందోళన పడ సాగాడు.

ఒకరోజు పొద్దుట, ఒక కుర్రవాడు, ఫాదర్ జోసఫ్ ధవళాశ్వమైన కంటెంటో యెక్కివచ్చి, ఒక విచార వార్త తెలిపాడు. పెకోస్ ప్రాంతాల ఒక గ్రామంలో విశ్రమించినప్పుడు, జోసఫ్‌కి నల్లబొబ్బల వ్యాధి అంటు కుందట. అక్కడ చాలామంది ఈ వ్యాధితో మరణిస్తు న్నారని తెలిసి, చనిపోయిన వారి ఆత్మలకి పారిశుద్ధ్య కర్మ జరిపేందుకు వెళ్ళాడు జోసఫ్. అక్కడ బయలు

దేశేసరికి వ్యాధిలేదు గాని, మార్గమధ్యాన ఈ కుర్ర వానికి ఆ వ్యాధి పొడసూపింది.

యువకుణ్ణి తమ తోట చివరభాగానున్న పాకలో వుంచమనీ, అతన్ని పది మందితో కలవనీయక వేరేగా అట్టే పెట్టమనీ ఆజ్ఞాపించాడు బిషప్. లొరెటా సిస్టర్సుని అతని కావలసిన మందూమాకూ సంగతి కనుక్కో-మన్నాడు. ఆ అబ్బాయికి మరీ ఎక్కువగా తిండిపెట్ట వద్దనీ, ఒక డొక్కమాడుస్తూ వుండమనీ వంటవానికి ఆదేశించి, తను ప్రయాణానికి సిద్ధమయాడు. తన నౌఖరు 'ఏంజలికా'ని తీసుకుని వచ్చేసరికి, ఈ ప్రయా-ణానికి యిది వద్దనీ కంటెంటో, ఏంజలికాలని ఒక దగ్గి రుంచమనీ చెప్పి, జోసఫు అనారోగ్య వార్త తెలిసిన రెండు మూడు గంటలలో శాంటాఫె నుంచి బయలు దేరాడు లెటూర్.

పెకోస్ వెళ్ళి జాకింటోని తోడు తీసుకు ముందుకు వెళ్ళాలి. జాకింటో గ్రామం చేరుకునేసరికి మిట్ట మధ్యా-హ్నం దాటింది. కొండల మధ్య పొందికగా వున్న గ్రామ మది. జునిపర్ మొక్కలూ, దేవదారు వృక్షాలూ, ఎర్ర పొదలూ అమితంగా కనిపిస్తున్నాయి. తన గుర్రా లిక్కడ మార్చుకుని, వేరు గుర్రాలమీద యిక్కడ నుంచి ప్రయాణం చెయ్యాలని బిషప్ అనుకున్నాడు. జాకింటో, ఆ గ్రామంలోని మిగతా పెద్దలూ రాత్రివేళ పర్వతా-రోహణ క్షేమదాయకం కాదనీ, ఆ రాత్రికి అక్కడ వుండి

పోయి తెల్లవారగట్టే వెళ్ళమనీ అన్నారు. నీలి ఆకాశం మీద పడమటి దిక్కున పర్వతాలకు వెనగ్గా ఒక దళసరి మేఘం చలనం లేక అతుక్కుపోయినట్లు కనపడుతోంది. ఊరి పెద్ద ఆ మేఘం వంక పరిశీలనగా చూసి 'ఈదురు గాలి తప్పదు' అన్నాడు.

ఆ పూటకి అక్కడ వుండేందుకు అయిష్టంతోనే బిషప్ గుర్రం దిగి, జాకింటోకి ఒప్పజెప్పాడు. ఈ పెద్దల మాట మన్నించేందుకు అతి విలువైన కాలాన్ని పాడు చేసుకోవలసి వస్తోందే అనిపించిందతనికి. మరో రెండు గంటలకిగాని సూర్యాస్తమయ మవదు. ఒక గంటసేపు అక్కడున్న పురాతన చర్చి మందిరం చూస్తూ గడిపాడు. ఎట్టకేలకు ఆకాశం మీది నారింజపండు తామ్ర వర్ణం దాల్చి, పొదలమాటుకి జారిపోవడంతో లోకమంతా నల్లదనం ఆవహించింది. ఎర్ర యిటుకల చర్చి గోడలు చారిత్రక ధూళితో అలసటొచ్చి ఆవులిస్తున్నట్టుగా వున్నాయి. ఆ శిథిల ప్రాంగణంలో పచార్లు చేస్తూ వుండగా, సహచరుడైన జోసఫ్ గురించి యెన్నో తలంపులు వచ్చాయి. అతను యెటువంటి అవస్థల్లో ఆ కుగ్రామంలో పడి వుంటాడో! జోసఫ్ మొదటి నుంచి అర్భకుడే. అతని ఆరోగ్యం ఏమంత దృఢమైనది కాదు. మత శిక్షణ పొందుతూ వుండే రోజుల్లో కూడా అతన్ని ఆర్నెల్లకీ, ఏడాదికీ విశ్రాంతికని ఆరోగ్య కేంద్రాలకి పంపుతూ వుండేవారు. తనూ జోసఫ్ ఓహియో రాష్ట్రంలో ఫాదరీలుగా పని చేస్తూ ఉండగా రెండుసార్లు

తను మృత్యు ముఖంలోకి ప్రయాణం చేశాడు. ఒకసారేమో అతని పేరు, 'చనిపోయిన వాళ్ళ పట్టీ'లో కూడా వేసేశారు. కాని బతికి బయటపడ్డాడు. రెండుసార్లు మృత్యువుకి టోకరా యిచ్చిన మనిషి, ఈసారి మాత్రం తప్పించుకోలేడా అని లెటూార్ ఆశ.

ఆ జీర్ణ మందిరం చుట్టూ తిరుగుతూ, ఎన్నో విషయాలు ఆలోచించ సాగాడు లెటూార్. ఈ ప్రదేశం ఎంత పొడిగానూ పరిశుభ్రంగానూ వుందో! గోడల్ని ఆనుకుని రాతి బెంచీలు కూడా ఉన్నాయి. వాడకం లేని గదులెన్నో కనపడ్డాయి. ఈ రాత్రికి తను యిక్కడ విశ్రమించవచ్చునని అనుకున్నాడు. ఏ జాగా బావుంటుందో కూడా ఎన్నుకున్నాడు. గాలి కీచుమని రొదిస్తోంది. చూస్తూ వుండగానే చుట్టూ చీకటి కమ్ముకుపోయింది. చర్చికి కొంచెం దిగువగా వున్న ఆ గ్రామంలోని యిళ్ళలో దీపాలు ఎర్ర కాంతితో వెలిగాయి. జాకింటో తన కోసం, కొంచెం దూరంగా ఒక శిల మీద, దళసరి దుప్పటీ కప్పుకు, చలికి బుజాలు కొంచెం ముందుకు వంచుకు నిలబడ్డాడు.

'వంట అయింది' అని జాకింటో చెప్పేసరికి, లెటూార్ అతనిని అనుసరించాడు. ఆ రాత్రికి బిషప్ భోజనం వారింట్లోనే! ఆ గ్రామంలోని యిళ్ళన్నీ అరలమాదిరి ఉన్నాయి. జాకింటో యింటి ముందు ఒక నిచ్చెన వుంది. ఆ నిచ్చెన మీది నుంచి మిద్దె మీదికి వెళ్ళవచ్చు. మిద్దెలో మరొక కాపురం వుంటోంది. గుమ్మం పొట్టిదవడంవల్ల ఏ మాత్రం

ఏమరు పాటుగావున్నా బుర్ర రంగుమంటుంది. అందుచేత బిషప్ శిరసు వంచుకుని యింట్లోకి వెళ్ళాడు. ఈ పొట్టి గుమ్మాలవల్లా నేల కిందుగా యిళ్ళు వుండటం వల్లా చలి గాలుల ఉధృతం కొంత తగ్గుతుందని అక్కడి వారి నమ్మకం. గది సన్నగా పొడవుగా వుంది. గోడలు శుభ్రంగా వెల్ల వేయబడి వున్నాయి. ఏవో రెండుమూడు జంతు చర్మాలు తగిలించబడి వున్నాయి తప్ప మిగతా మేర యావత్తూ అతి ధవళంగా వుంది. రంగు కంబళ్ళు దళసరివి ఒక మూలని నేల మీద మడతలతో పేర్చబడి వున్నాయి. అక్కడే ఒక మూలగా గదిలో నిప్పుగూడు వుంది. నిప్పుగూడు దగ్గరనే ఇంట్లో వాళ్ళు పడుకుంటారు. పూర్తిగా మట్టి నేల అవడంవల్ల పొగటివేళ పీల్చుకున్న వేడిని, ఇది రాత్రంతా అట్టే పెట్టుకోగలుగుతుందట. అంటే ఈ మట్టి నేల బయట నేలంత తొందరగా చల్లబడదు. వేగంగా చల్లబడకుండా వుండేందుకు, నిప్పుగూడు కూడా సాయ పడుతుంది. నిప్పుగూడులో వేసిన కర్రపేళ్ళు గదిని తమ సుగుంధంతో ముంచెత్తుతున్నాయి. వేడితోపాటు పరిమళాన్ని కూడా ఇచ్చే చెక్కలవి. నిప్పుగూడుని ఆను కునే వంటపొయ్యి ఉంది. జాకింటో భార్య క్లేరా అతిధి కోసమని గోధుమ రొట్టె, బటాణీల వేపుడూ మొదలైన వాళ్ళ ప్రత్యేక వంటకాలు కొన్ని చేసింది. బిషప్ భగ వన్నామం స్మరించి భోజనం ముట్టుకున్నాడు. పురుషులిద్దరూ భోంచేస్తూ వుండగా, క్లేరా వుయ్యాలలో పడుకున్న పాపని

వూపుతోంది. ఆ పాపకి ఒంట్లో నలతగా ఉంటోందిట. ఏం జబ్బు ?-అని లెటూర్ అడగలేదు. ఆఖరికి చూస్తానని కూడా అనలేదు. ఎంచేతనంటే వీరు తమ పసి పిల్లలని ఈ చలికాలంలో వూపిరాడనన్ని బొంతలు, చుట్టూ చుట్టి పడుకోబెడతారు. చలికాలంలో పాపలకి నీళ్ళే పొయ్యరు. అటువంటి వాళ్ళకి సలహాలిచ్చి ప్రయోజనమేమిటి ?

జాకింటో పాపకి తనేమీ ఉపకారం చేయలేక పోయాననే, అని లెటూర్‌కి దిగులేసింది. పెకొస్‌లో ఈనాడు వుయ్యాలలంతగా లేవు. శిశు మరణ సంఖ్య విపరీతంగా వుండటంవల్ల జాతి నానాటికి క్షీణిస్తోంది. ఇక వయసులోవున్న స్త్రీ పురుషులు తగినంతమంది సంతానాన్ని యెందుకనో కనడంలేదు. బహుశా ఆ జాతిలోని జీవ శక్తి క్షీణిస్తోందేమో! మశూచికం మొదలైన అంటువ్యాధులు వారి మీద ఎప్పటికప్పుడు దాడి జరిపి, తమ వంతు పుచ్చుకుంటాయి.

శిశు మరణాలు, ప్రమాద వ్యాధులు, యువతీ యువకుల అలసత్వం - యివే కాకుండా, యింకా బోలెడన్ని కారణాలు చెబుతారు. అసలీ ప్రాంతాల ప్రతి తెగకీ సంబంధించిన కథలు అనేకం యిలాటివి వున్నాయి. ఈ తెగ ప్రజలు యేదో కొండ గుహలో, ఒక పవిత్రాగ్నిని తర తరాలుగా కాపాడుతున్నారనీ, అది యేనాటికీ ఆరదనీ, ఆ పవిత్రాగ్ని యెక్కడ ఉన్నదీ, శ్వేత జాతీయులకు

చచ్చినా, తెలియ నివ్వరనీ, ఆ అగ్ని దేవతను తృప్తి పర చడం కోసం ఈ జాతి ప్రజలు తమ శక్తినంతా వినియోగి స్తున్నారనీ ఒక కథ! ఆ అగ్ని ఆరిపోకుండా కాపాడవల సిన భారం యువకులదట. అందుచేత, ఉత్తమ యువకు లందరూ ఆ అగ్నిని సంరక్షించే నిమిత్తం ప్రాణాలు ధార పోస్తున్నారట. ఈ కథ లెటూర్ కి నమ్మ శక్యంగా తోచ లేదు. 'ఒకవేళ పవిత్రాగ్ని అంటూ ఒకటి ఉన్నప్పటికీ చుట్టూ యిన్ని చెట్లు, యింత కలప ఉన్న ప్రదేశంలో అగ్నిని కాపాడటం ఏమంత కష్టమైన పని? యిది నిరా ధారమైన కథలా కనపడుతోంది' అనుకున్నాడు లెటూర్.

పవిత్రాగ్ని తర్వాత సర్పం కథ ఒకటుంది. 'నాగ రాజు' సంగతి స్పానిష్ పరిశోధకులూ, అమెరికన్ పరిశోధ కులూ బయటకు తీశారు. నాగదేవత కథ నమ్మడానికి చాలా కారణాలు కనపడతాయి. ఈ జాతి ప్రజలు సర్పా రాధకులు. అంతేగాక, వీళ్ళందరూ తమ యిళ్ళల్లో ఒక కట్ల పాముని పెంచుతారట. అది యింట్లో ఒక రహ స్యపు సొరంగంలో పెరుగుతూ వుంటుందట. ఇళ్ళలో కట్ల పాముల విషయం యిలా వుండగా, పర్వతం మీద ఒక బ్రహ్మాండమైన పాము వుంది. ఆ సర్పరాజని వీళ్ళు పండుగ రోజున పర్వతం మీద నుంచి వూళ్ళోకి పట్టుకు వచ్చి, ధూపదీప నైవేద్యాలతో దానికి పూజలు చేసి తమ పసి పిల్లలని ఆ 'నాగప్రభువు'కి బలి యిచ్చేవారట. ఆ కారణంగా జాతి సంఖ్య తగ్గిపోయిందని పరిశోధకుల వాదన.

వీటన్నిటి కంటె పాశ్చాత్యులు పట్టుకు వచ్చిన అంటు వ్యాధులు అసలు కారణం కావచ్చు. స్థానిక ప్రజలలో కొంత దగ్గు, చీడ, గవజ బిళ్ళలూ లాటివి కూడా, కలరా అంత ప్రమాదకరంగా పరిణమిస్తాయి. వ్యాధి సోకాక, బతకడం బతకక్కపోవడం అనేది వీరు జరిపే వైద్య ప్రక్రియ మీద ఆధారపడి వుండదు. వారు వైద్యాలు చేయరుగా - దేవతలకి శాంతి చేస్తారు. అందుచేత, నూకలుంటే బతకడమేగాని మందువల్ల కాదు. ఏమైనా పెకోస్ జాతి నానాటికి క్షీణిస్తున్న మాట మట్టుకు నిజం. జాకింటో యిల్లు ఆ గ్రామానికి చివరని వుంది. పాడుపడ్డ యిళ్ళు అనేకం కనిపిస్తాయి ఆ వూళ్లో. ఒకప్పుడు ఆ గ్రామ జనాభా ఆరు వేలు వుండేదట. ఇప్పుడున్నది నూరుమంది. స్పానిష్ దేశీయులు వెనుక యిక్కడ స్థావరంగా ఉండి, వీరి దగ్గర నుంచి ధాన్యం జంతు చర్మాలూ మొదలైనవి కప్పంగా పుచ్చుకునేవారట. ఒక వసంత కాలంలో వీరు కర్ణాకర్ణిగా వినపడుతున్న 'ఏడు బంగారు నగరాలు' వెతికేందుకు పెకోస్‌లోని పురుషులని బానిసలుగా మార్చి, స్త్రీలను ఉంపుడు కత్తెలుగా చేరదీసి ఆ 'సప్తపురి అన్వేషణ'లో కొండలూ గుట్టలూ దాటుకు ముందుకి చొచ్చుకుపోతూ యేదో మహాబిలంలో కూరుకు పోయి మరణించారట. ఇప్పటికీ ఈ 'సప్తపురి కథ'ని అక్కడి వాళ్ళు చెప్పుకుంటూ వుంటారు.

నిప్పు గూడు పక్కగా కూచున్న లెటూర్‌ని, పర్వతాల మీదుగా అవ్యక్తగానం ఆలాపించుకుంటూ వచ్చే వాయువులు స్పృశిస్తున్నాయి. ఎన్నో వింత సంగతులతో నిండిపోయింది లెటూర్ మనసు. తన పక్కగా కూచున్న జాకింటో మనోవీధిలోకి కూడా, తనకు కలిగిన వంటి తలంపులే వచ్చాయా? ఒక్కోసారి రివ్వున కొట్టే ఆ గాలి, భూత కాలాన్ని తుడిచేసే తీవ్ర వాదిలా వుంటోంది. దేన్నో చెరిపేసెయ్యాలనే ఆత్రంతో గంతులెడుతోంది. ఆ మహోధృతాన్ని మానవలోకం తల వంచుకు ఆలకించాల్సిందే. కాని ఉయ్యాలలో పసిపాప మాత్రం ఆ వాయుదేవత ఆగ్రహాన్ని లక్ష్యపెట్టడం లేదు. తన శక్తి కొద్దీ తనూ యేడుస్తోంది. జబ్బు పిల్ల లేడవడం సర్వసహజం, అనే నిశ్చింతతో ఒక మూలకి నక్కి కూచుంది క్లేరా. వెచ్చని నిప్పు గూడులోకి చూస్తున్నాడు జాకింటో.

బిషప్ తన ప్రార్థన పుస్తకం తెరచి, ఒక గంటసేపు ఆ వెలుతురులో ప్రార్థన గీతాలు చదివాడు. ఆ దైవనామ, సంకీర్తన అతనికి కాస్త ప్రోత్సాహ మిచ్చింది. నూతనోత్సాహుడై, కంబళ్ళు కప్పుకు, తను పరుండవలసిన చోటుకని బయలుదేరాడు. చర్మపు దుస్తులతో జాకింటో అతని వెంట వెళ్ళాడు. ఎన్నో యిళ్ళు దాటుకుని శిథిల ప్రాంగణం చేరుకున్నారు. ఆ చర్చి గోడలు చాలా చోట్ల పడిపోయి వున్నా, 'మేము పూర్తిగా పడిపోలేదు

సుమా, ఈ తుఫాను లెన్నో మేము చూశాం...'అని అంటున్నాయి ఆ నక్షత్ర కాంతిలో.

## 2

ఎంత చలి అయినా, సూర్యోదయం కాక పూర్వం లేవడం అలవాటు బిషప్‌కి. అర్ధరాత్రి గడిచాక మరీ ముడుచుకు పడుకోవలసి వచ్చింది. కళ్ళు తెరుపులకి వచ్చాక మొట్టమొదటి పనేమిటంటే భగవధ్యానం. తెల్లారి లేచాక మొదటి పని ప్రార్థన అనుకునేవాడికి, ఏ పనికైనా, బోలెడు తీరిక వుంటుందని – జోసఫ్ అభిప్రాయం.

లెటూర్ లేచేసరికి. గ్రామం యింకా మేల్కొలేదు. జాకింటో యింటికి వెళ్ళి, తలుపుతట్టి లేపి కుంపటి చెయ్యమన్నాడతన్ని. అతను అశ్వాలు సిద్ధం చేసేలోపున కాఫీ పెట్టుకొని, తన దగ్గరున్న మెక్సికన్ బ్రెడ్ ఒక ముక్క కోశాడు. ఆ రొట్టె ఆ నీళ్ళ కాఫీ వుంటే రోజులకి రోజులు ప్రయాణం జెయ్యగలడు లెటూర్. ఇంత పొద్దుట తిండేమిటని జాకింటో గునిశాడు. అలాకాదు అని లెటూర్ అతన్ని కూచోపెట్టి, తన రొట్టెలో చెరి సగం అతనికి యిచ్చేడు. క్లేరా యింకా నిద్ర పోతోంది, గదిలో ఒక మూలగా.

నాలుగయేసరికి ప్రయాణీకు లిద్దరూ రోడ్డు మీదకి వచ్చారు. ముందు జాకింటో దారి తీస్తున్నాడు; వెనక బిషప్. మధ్యాహ్నం దాకా అలా ప్రయాణం చేస్తూనే

వున్నారు. 'ఇక్కడ కాసేపు ఆగుదామా!' అన్నాడు, లెటూర్. జాకింటో ఆకాశంవైపు చూసి, 'వద్దు వద్దు'- అన్నాడు. ఆకాశమండలంలో సూర్యదర్శనమే లేదు. మొదట్లో తేలికగావున్న గాలి, రానురాను బరువెక్కింది. అంటే కొంతసేపట్లోనే మంచు పడుతుందన్న మాట. చూస్తూ వుండగానే సరుగుడు చెట్లమీద మంచు ముద్దలు పేరుకుంటున్నాయి. ఒక సుడిగాలి బాటసారు లిద్దరినీ కొంచెం సేపు చుట్టేసింది. సముద్రంలో తుపాను లాగానే వుంది నేలమీంది ఈ మంచు తుపాను కూడా. మంచుకన్నె పరిచయంతో గాలి దేవునికి ద్విగుణీకృతోత్సాహం కలిగినట్టుంది. దారి తీస్తున్న జాకింటో, లెటూర్‌కి కనపడటంలేదు. అతను కప్పుకున్న కంబళీ రంగూ, అతని తల, అతని భుజమూ, అతని గుర్రపు తోక - ఈ ప్రకారం ఆనవాళ్ళు చూసుకుంటూ ప్రయాణం సాగిస్తున్నాడు బిషప్. కళ్ళ ముందు కనబడే సరుగుడు చెట్లు చూస్తూ వుండగానే మంచుతో కప్పడిపోయాయి. దారి, దారి గుర్తులూ, పర్వతమూ, పర్వతము మీంది రాళ్ళూ యివన్నీ కూడా, మంచుతో కప్పడిపోయి, ఒకే తెల్లని దుప్పటిని లోకం మీద పరిచాడా దేవుడు - అన్నట్లుంది,

జాకింటో తన గుర్రం మీద నుంచి క్రిందికి దిగి, కంబళ్ళు తను పుచ్చుకు, సామానుల సంచీ బిషప్ వేపుగా గిరవాటు వేస్తూ 'తొందర పడాలి. ఒక క్షణం ఆలస్యం

చేయకూడదు. నాకీ దగ్గరలోనే ఒక స్థలం తెలుసు'
అని పెద్దగా అరిచాడు.

'ఈ గుర్రాల్ని యిక్కడ యెలా వొదిలి పెడ
తాం?' అని బిషప్ నోరు లేని జీవాల తరఫున మాట్లా
డాడు. 'వాటి దారి అవి చూసుకుంటాయి. మన దారిని
మనం పోదాం,' అన్నాడు జాకింటో నిర్దాక్షిణ్యంగా.

ఆ తర్వాత ఒక గంటసేపు లెటూర్ యమయాతన
అనుభవించాడు. కంటి కేమీ ఆనడం లేదు. గాలి
పీల్చ లేకుండా వున్నాడు. నోరు తెరుచుకు ఆయాస
పడుతూ వూపిరి తిత్తులు నింపుకుంటున్నాడు. కనిపడీ
కనపడని రాళ్ళమీదుగా, నేల కొరిగిన చెట్లమీదుగా,
మంచుగుంటల్లో పడుతూ, లేస్తూ, యిక్కడితో యిక
అయిపోయిందనుకుంటూ, మళ్ళీ జీవితేచ్ఛ ప్రసాదించే
కడసారపు సాహసంతో ఒక అడుగు ముందుకు వేస్తూ,
దీనాతిదీనంగా, ఆ జాకింటో బుజాలమీద వుండే రంగు
దుప్పటి కోసం దృష్టిని కేంద్రీకరిస్తూ, ఒక్కొక్క అడుగే
ముందు వేస్తున్నాడు. ఒక గంటసేపు అలా పోరా
డాడు ప్రాణాలమీద తీపితో.

క్రమేణా, దళసరి మంచు కాస్త పల్చబడింది.
జాకింటో మెత్తు ప్రదేశం మీద నిలబడ్డాడు. బిషప్
కూడా ఆ చోటు చేరుకు, అతని పక్కగా నిలబడ్డాడు.
ఆ గండశిలమీద నిలబడి చూస్తే, చుట్టూ పరుచుకు

పోయిన తెల్ల మంచు, ఆ మంచు తుపాను పుథ్భుతమూ స్పష్టంగా వాళ్ళకి కనపడ్డాయి. తుపానుకి బయట నుండి వాళ్ళు తుఫానును చూడగలిగారు. దుప్పట్ల మూట భుజం మీదనుంచి క్రిందికి దింపి, శిఖరాగ్రం ఎక్క బోతున్నాడు జాకింటో. బిషప్ తలపైకెత్తి చూశాడు. తెరుచుకున్న రాతి పెదవుల్లా వుంది ఆ కొండ శిఖరం. జాకింటో క్రింద పెదవి మీదికి ఎక్కి, లెటూర్‌ని కూడా అంతదాకా ఎక్కించి, తను క్రిందకి వెళ్ళి దుప్పట్లమూట తీసుకువచ్చేదాకా, అక్కడే నిలబడమన్నాడు. బిషప్‌కి తనేదో రాతి రాక్షసి నోటిముందు నిలబడ్డట్టుగా వుంది. జాకింటో మూట పట్టుకువచ్చాక, యిద్దరూ లోనికిదిగారు. క్రింద పెదవినుంచి లోపలకి దిగేందుకు కర్ర నిచ్చెన ఉంది.

ఈ బిలంలో ప్రవేశించాక బిషప్ మనసు పరిపరి విధాలపోయింది. ఇదేదో అత్యద్భుత ప్రదేశం. ఇక్కడి వాసన, ప్రాణభీతివల్ల తనిక్కడికి నచ్చి దాక్కోడం యివేమీ బిషప్‌కి బొప్పూలేదు. బిలంలో కూడా చాలా చల్లగానే వుంది గాని బయటంత ఘోరం కాదు. తన శిరస్సుకి యిరవై అడుగుల యెత్తునున్న ఒక రంధ్రం ద్వారా వెలుతురు వస్తోంది లోపలికి.

బిషప్ ఆ బిలాన్ని ఆశ్చర్యంతో పరికిస్తూ, దీని వైశాల్యం ఎంత ఉంటుందా అని లెక్కకట్టబోయాడు, జాకింటో నాలుగుమూలలా ఏదో వెతుకుతున్నట్టుగా చూశాడు. లోపల కావలసినన్ని చితుకులు వున్నాయి,

తొందరగా నిప్పు రాజెయ్యి; లేకపోతే ఈ చలికి బిగుసుకు పోతాము' అన్నాడు లెటూర్.

'ఫాదర్, మిమ్మల్నీ స్థలంలోకి నేను తీసుకువచ్చి ఉండకూడదు. యిది మావాళ్ళ పవిత్ర స్థలం. ఇక్కడ నుంచి వెళ్ళాక ఈ సంగతి మీరు పూర్తిగా మర్చిపోవాలి. ఇటువంటి స్థలం ఒకటున్నట్టూ, యిది చూసినట్టూ, మీరెవరితోనూ అనకూడదు సుమండీ!'

'తప్పకుండా మర్చిపోతాను. కాని ఈ చలినుండి బతికి బయటపడ్డాక కదా, మర్చిపోవడాలూ, జ్ఞాపక ముంచుకోవడాలూను. నా తల గిరగిర తిరుగుతోంది. వెంటనే వెచ్చనిమంట వెయ్యకపోతే, నే నింక కళ్ళు తెరుస్తా ననుకోను.'

జాకెంటో మూటవిప్పి, అందులో .ూడిగా వున్న కంబళీని, వొణుకుతున్న బిషప్ కిచ్చి కప్పుకోమన్నాడు. ఈలోగా అక్కడి బూడిదయెత్తి, కాలిన కట్టెలు ఒక పక్కగా చేర్చి, చెకుముకి రాళ్ళతో నిప్పుచేసి, ఆ నిప్పుకి చితుకులువేసి మంటని పెంచాడు.

ఆ కొండ బిలంలో అనేకచోట్ల కంతలు అవుపడు తున్నాయి. అవన్నీ పూడ్చడం సాధ్యమయే పనికాదు, ఒక వైపుగా ఒకకంత మానవుని శిరసంతది, నేలకి ఏడడు గుల ఎత్తున ఉంది. బిలంలోగల చిన్న చిన్న రాళ్ళు అక్కడ పేర్చి, రాళ్ళతో దాన్ని పూర్తిగా మూయడ

మయాక, దోసిళ్ళతో కాలిన బూడిద తీసుకు, తడిమంచూ బూడిదా కలిపి, దానితో ఆ రాళ్ళపేర్పుని జాగ్రత్తగా అలికాడు జాకింటో. ఒక పావుగంట పట్టింది ఆ కార్య క్రమం, ఈలోగా చలిమంట పెద్దదై, వెచ్చదనం చుట్టూ ఆవరించడంతో, బిలంలోని వెనుకటి దుర్వాసనపోయి, చితుకులు కాలడంవల్ల ఒక కొత్తపరిమళం రా నారంభిం చింది. ఆ చితుకులేవో సుగంధవృక్షానివి కాబోలు! లెటూ ర్‌కి ఏదో మగతగా ఉంది. తలలో ఏదో గిరగిరతిరుగు తోన్నట్టుంది. తన దేహంలోని రక్తప్రవాహం పైన పడే శీతల ప్రభావమే యిటువంటి వైపరీత్యానికి కారణమేమో అనుకున్నాడు కాసేపు. తుమ్మెదల ఝుంకారమూ దూరా న్నుంచి యేదో డప్పులు మోతా వినపడుతోందతనికి. 'నీకూ వినపడుతోందా అలాటిది?' అని అడిగాడు జాకిం టోని. మొదటిసారిగా జాకింటో పళ్ళికిలిస్తూ నవ్వి, కాలే చితుకొకటి దీపం మాదిరి చేతపుచ్చుకు, ఫాదరీని తన వెంట బిలం లోపలికి తీసుకువెళ్ళాడు. అక్కడ ఒకచోట కొద్దిగా బీట వారినట్టుండి. ఆబీటవారిన ప్రదేశంమీద మట్టిపూత పూసిఉన్నది. జాకింటో ఆ మట్టిపూతని తన దగ్గిరున్న చాకుతో కోసి, ఆక్కడ చెవివుంచి అడుగునుంచి వస్తున్న శబ్దం తను విని, బిషప్‌నికూడా వినమన్నాడు.

ఫాదర్ లెటూర్‌కి ఆ బీట అడుగు నుంచి ఒక మధురమైన శబ్దం వినపడింది. అది పృథ్వీమాత అనాది గానం భూగర్భం నుంచి ప్రవహించే ఒక నదీమ తల్లి ఆ

బిలం అడుగు భాగం నుంచి జలజల పరుగులెత్తుతోంది. ఆ ప్రవాహ వేగానికి బిలం యావత్తూ దద్దరిల్లుతోంది. నీరు చాలా అడుగ్గా, పర్వత పీఠానికి యింకా లోతుగా, మానవుని కంట పడటం యిష్టంలేనట్టు, ఆ చీకట్లని తెంచుకు మహోద్వేగంతో పరుగు తీస్తోంది.

'ఎంత వేగం, ఎంత వేగం! భయం పుట్టించేటట్లుంది ఆ పారుదల?' అన్నాడు ఫాదరీ లేచి నిలబడుతూ. జాకింటో, బీటవారిన ప్రదేశానికి తిరిగీ మట్టిపూత పూస్తూ, 'మీ మెదడులో కల్పితమయ్యే ధ్వనులకి యిదీ కారణం' అన్నాడు.

ఇద్దరూ చితుకులమంట వున్న చోటు చేరుకున్నారు. రాతి పెదవుల వెనుక, పగటి కాంతి పల్చబడుతోంది. ఆ రోజు దినకరునికి అస్తమించడం యిష్టం లేనట్టుగా వుంది. తాము తెచ్చుకున్న కాఫీ పాత్రా, బ్రెడ్డుముక్కా ముందర పెట్టుకు, నిప్పులవైపు చూస్తున్నాడు లెటూర్. పొడి దుప్పటిమీద మంచుముద్దలు కాసిని పోగుచేసి, వాటిని కాఫీ పాట్‌లోవేసి నిప్పులమీద వుంచాడు జాకింటో. అతను కాఫీ ప్రయత్నంలో వుండగా, బిషప్ తన జేబులోంచి 'టావోస్ విస్కీ బాటిల్' తీసుకుని నాలుగు గుక్కలు గడగడ పుచ్చుకున్నాడు.

కాఫీ తయారయింది. ఇద్దరూ కాఫీ బ్రెడ్డూ పుచ్చుకుంటున్నారు.

'మనం నిజంగా అదృష్టవంతులం. తెగించి గుర్రాలని వదిలేశాం కాబట్టి, యిక్కడికి చేరుకోగలిగాం. నేనైనా యిక్కడికి ఒకటి రెండు సార్లు వచ్చానేమో-అంతే! చేరుకోలేక పోతామా అని మొండి ధైర్యం చేశాను' అన్నాడు జాకింటో.

'ఇంత ప్రమాదం ముంచుకొస్తోందని నాకు తెలీనే తెలీదు. నువ్వు వుద్దండుడివి' అన్నాడు బిషప్, తన ప్రాణాలు కాపాడిన కుర్రవాణ్ణి అభినందిస్తూ.

ఆ రాత్రి లెటూర్ తన ప్రార్థనా గ్రంథం చితుకుల వెలుగులో తెరిచాడు. అసలు యివ్వాళ తెల్లారినప్పట్నుంచీ, దైవ చింతన ఒకసారి కూడా కలుగలేదు. జాకింటో చేత ప్రార్థన గీతాలు చెప్పించి, భగవన్నామం జిహ్వాని మాధుర్యంతో నింపుతూ వుండగా కంబళ్ళు చుట్టుకు, పాదాలు నిప్పులు దెసగా వుంచి, నిద్రా ప్రయత్నంలో పడ్డాడు. లెటూర్ ఒక రాత్రివేళ మెలుకువ తెప్పించుకు, బిలంలోకి వచ్చీ రాగానే జాకింటో రాళ్ళతోనూ మట్టితోనూ పూడ్చేసిన ఆ కంత ఏమిటో చూద్దామనుకున్నాడు.

అనుకున్నట్టుగానే, అర్ధరాత్రి మెలుకువ వచ్చింది. చితుకుల మంట ఉజ్వలంగా వెలుగుతోంది. ఆ కాంతివల్ల బిలమంతా వెచ్చదనంతోబాటు తేజోవంతమయింది. ఏకంతనైతే మూశాడో, అటువైపు చేతులు పరుచుకు,

అక్కడ అడ్డంగా పడుకున్నాడు జాకింటో. నిద్రలో కూడా అతని చెవులు, ఆ కంతకి వెనకాలగల ఏదో శబ్దాన్ని ఆల కిస్తున్నట్లుగా వున్నాయి. బిషప్ తను పడుకున్న చోటు నుంచి కదల్లేదు సరికదా, తెరచిన కళ్ళు వెంటనే మూసే సుకు, జాకింటో కనుగప్పి ఆ రహస్యం తెలుసుకోవాలనే దుర్బుద్ధి తన కెందుకు కలగాలా అని వాపోయాడు.

మర్నాడు తెల్లారేక యిద్దరూ ఆ రాతి పెదవుల నుంచి వెలుపలకి వచ్చారు. చుట్టూ కనిపించే ధవళ లోకం, అరుణ కిరణాలతో చెలిమిచేసి, ఎర్రదనం తెచ్చు కుంది. గులాబీ మేఘాలు మంచుకన్నెలతో పరిహాసమాడు తున్నాయి. లోకంలోగల మెత్తదనమూ, మృదుత్వమూ ఆ ఉదయపువేళ శిఖరంమీదనున్న ఆ పునర్జీవితు లిద్దరికీ కనపడ్డాయి. హిమ సమూహంలో కప్పడిపోవలసిన ఈ దేశాలని భగవంతుడు ఎందుకనో అట్టేపెట్టాడు - అను కున్నాడు లెటూర్.

గుర్రాల కోసం వెతకడం అనవసరమన్నాడు జాకింటో. అవి మంచులో ఖచ్చితంగా కూరుకుపోయి వుంటాయి. మంచు కరిగాక, తమ జీనులూ, కళ్ళేలూ, యితర సామగ్రి దొరుకుతాయన్నాడు. ఎనిమిది మైళ్ళు కాలినడకని ప్రయాణంచేసి, అక్కడొకచోట రెండు గుర్రాలు అద్దెకు పుచ్చుకు, ఆ రాత్రి నక్షత్ర కాంతిలో మిగతా ప్రయాణం పూర్తిచేసి, జోసఫ్ వున్న గ్రామం చేరు కున్నారు. జోసఫ్‌కి జ్వరం బాగా తగ్గింది. మనిషి కోలు

కుంటున్నాడు. లెటూార్ కంటె ముందుగా చేరుకున్నా డక్కడికి కార్సన్. కిట్ కార్సన్ దుప్పుల వేటకై అటు వైపు వచ్చి, జోసఫ్ జబ్బుపడ్డాడన్న వార్త తెలియ టంతో, వెంటనే ఆ గ్రామం వచ్చాడు. జోసఫ్కి గుర్రం మీద కూచోగల వోపిక రాగానే, శాంటాఫెకి ప్రయాణం చేయించి తీసుకువెళ్ళారు - కార్సన్, లెటూార్లు. రోగిష్టి మనిషితోగనక తిరుగు ప్రయాణం నాలుగు రోజులు పట్టింది.

*   *   *

లెటూార్ తన మాట నిలబెట్టుకున్నాడు. జాకింటో చూపిన కొండ బిలం గురించి ఎవరితోనూ ఎక్కడా అన లేదు. కాని, అందు విషయమై ఆశ్చర్యపడకుండా వుండట మెలా? తల్చుకున్నప్పుడల్లా ఆ అనుభవం అతన్ని భయ సంభ్రమాలలో ముంచెత్తేది. ప్రాణాపాయ స్తితిలో వుండగా ఆ బిలం తన ప్రాణాలు కాపాడింది. ప్రాణప్రదాయిని అనే సంతోషంకంటె, దానిని గురించిన తలపు వచ్చినప్పు డల్లా హడలు పుట్టేది లెటూార్కి.

జాకింటో స్వభావమూ, ఆ కొండ బిలమూ అతనికి అర్ధంకాని విషయాలైపోయాయి. పెకోస్ మతస్తులలో కొన్ని వింత ఆచారాలు, విపరీత ధోరణులూ నిజంగా వున్నాయేమో ననిపించింది. శాంటాఫెలోని మెక్సికనులకు గాని, తెల్లవారికిగాని ఈ స్థానిక ప్రజల మనస్తత్వమూ, మనోధర్మమూ పూర్తిగా తెలియవు.

వారిని గురించి తనకు తెలిసినంతవరకూ చెప్పి, గ్లోరిటా కనుమవద్ద నివసించే జెబ్ అనే వ్యాపారస్తునికి యింకా బాగా తెలుసు - అన్నాడు కార్సన్. ఆ జెబ్ తల్లి పాశ్చాత్య స్త్రీ, తండ్రి స్థానికవాసుడు. పర్వత ప్రాంతీయులకు పంచదార, వుప్పు, పొగాకు, విస్కీ, మొదలైనవి అమ్ముతాడట జెబ్. ఒకసారి అతను పెకోస్ పిల్లని ప్రేమించి, ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని పట్టుపట్టడంతో, వాళ్ళమ్మ పెద్ద రాద్ధాంతంచేసి, ఆ పెళ్ళి తప్పించడంతో, యిక పెళ్ళే చేసుకోనని ఘోటక బ్రహ్మచారిలా ఉండిపోయాడట.

తన ఉద్యోగ ధర్మానికి చెందిన ప్రయాణాలలో ఒకసారి లెటూర్, ఆ జెబ్ యింటివద్ద ఆగాడు, ముఖ్యంగా అతని నోటివెంట పెకోస్ జాతివారి ఆచార వ్యవహారాలు విందామనే ఆశతో.

పవిత్రాగ్నికి సంబంధించిన కథ అబద్ధం కాదేమో- అన్నాడు జెబ్. ఎటొచ్చీ, ఆ అగ్ని పర్వతాలలో ఉందా, గ్రామం మధ్యని ఉందా, అనే సంగతి చెప్పలేమన్నాడు. ఇక సర్పాలని గురించిన కథ విషయం ఊళ్ళో కట్లపాములు వుండటం సర్వ సామాన్యం. అంచేత అవి యింట్లోనూ వుండవచ్చు. రెండేళ్ళ క్రితం ఒక కుర్రవాడికి పాముకరిస్తే, విస్కీ పోసేందుకు తన దగ్గరకు తీసుకు వచ్చారట. పాము అందరినీ కరిచినట్టే వాడినీ కరిచిందట.

'వారు సర్పరాజుని దాచివుంచడం సంగతేమిటి?'- అని జెబ్‌ని అడిగాడు లెటూర్.

'అది సర్పమో, కొండ చిలువో, మరొకటో మనకి తెలియదు. అదేమిటో తెలియదు గాని, దానిని పర్వదినా లప్పుడు పూజా పునస్కారాలు జరిపేందుకు మాత్రం తీసుకువస్తూవుంటారు. ఏమైనా వీరినిగురించి మనం పూర్తిగా తెలుసుకోలేము.'

జెబ్, అతని బాల్యంలో ఈ పాము కథలు చాలా వినివుండటం చేత, ఒకసారి పెకోస్ వారి ఉత్సవ సమయాన, వాళ్ళకి తెలీకుండా, ఆ రహస్యంగా తీసుకువచ్చే దేమిటో తెలుసుకునేందుకు కాపలా కాశాడట. 'సన్నగా పొడుగ్గా ఉన్నదా పెట్టె. నలుగురు మోస్తున్నారు భుజాలమీద. మోత కర్రలు ఆ బరువుకి కొంచెం వంగాయి కూడా. అలాటిపెట్టె నలుగురు తెల్లవాళ్ళు మోసుకు వస్తూవుంటే, అందులోవి, ధనరాసులో, విస్కీ సీసాలో, తుపాకీమందో- ఈ మూడింటిలో ఏదో ఒకటని పందెంకట్టి చెప్పేయవచ్చు. కాని, వీరి విషయంలో మన లెక్కలు సరిగావు. ఆ నలుగురూ అంత కష్టపడి మోసుకువచ్చేది ఒక రాయికావచ్చు. అది వాళ్ళ తాతముత్తాతల కాలంనుంచీ పూజా గౌరవాలందుకుంటున్న 'రాయి' అయితే, వీళ్ళు దానిని ఎంతో భక్తి శ్రద్ధలతో కొలుస్తారు. వాళ్ళ విలువలు వేరు, మన విలువలు వేరు. వాళ్ళ మనసులూ, వాళ్ళ నమ్మకాలూ

వేరు. మన మాటలు వాళ్ళ నమ్మకాలను పీసమంతకూడా మార్చలేవు.'

'పాతకాలపు సంప్రదాయాలు మన్నించడం ఒకందుకు మంచిదే! తరతరాలుగా వచ్చే ఆచారాలు ఆ జాతి ప్రజలకు బలాన్నిస్తాయి గాని నష్టమేమీలేదు' అన్నాడు లెటూర్.

'వీరిలో క్రీస్తుమతావలంబకులు వుండవచ్చు, కాని వాళ్ళు తమ పూర్వాచారాలు వొదిలిపెట్టరు. వీరి పూజార్ల మాటలు ఎంత నిజమో, ఎంత అబద్ధమో నాకు తెలీదుగాని, నా చిన్నప్పుడు ఒక రాత్రివేళ, ఒక పెకోస్ వనిత చంటిపిల్లాడిని చేతుల్లో దాచుకు మా పెరట్లోకి వచ్చి, 'ఈ ఉత్సవమయేదాకా, నన్నూ మా అబ్బాయిని దాచండి' అని కాళ్ళావేళ్ళా పడి మా అమ్మని బతిమాలింది. నిజంగా ఆ కుర్రవాడిని సర్పరాజుకి బలియిద్దామనుకున్నారో, లేక బలియిస్తారని ఈ అమాయకురాలు ఊరికే భయపడిందో, యేమయితేనేం, ఆనాటి దృశ్యం మాత్రం నే నిప్పటికీ మరిచిపోలేకుండావున్నాను. మా అమ్మ వాళ్ళిద్దర్నీ ఆ రాత్రికి ఎలానో దాచేసింది. ఆ చిన్ననాటి జ్ఞాపకం చెరక్కుండా మిగిలిపోయింది నా మనసులో' అన్నాడు జెబ్.

# 5

## మార్టినెజ్

ఆల్బుకర్క్యూ తరువాత భాగ్యవంతమైన గ్రామం టావోస్. అక్కడి ఫాదరీకీ ప్రజలకీ కూడా అమెరికను లంటేనూ, శ్వేతజాతీయులంటేనూ వైరుధ్యం ఏర్పడింది. స్పెయిన్ దేశీయుడు గాని ప్రతి పాశ్చాత్యునీ వారు సంశయ భావంతో చూసేవారు. ఫాదరీ ప్రజలూ ఒకరి కొకరు తోడై, మతభక్తిని మంటగలిపారు,

ఒకసారి లెటూర్ జాకింటోని వెంటబెట్టుకు టావోస్ గ్రామానికి అధికార రీత్యా వచ్చాడు. రావడానికి పూర్వమే కార్సన్ ద్వారా యిక్కడి మతగురువైన మార్టినెజ్ గురించి బోలెడంత వినివున్నాడు, మార్టినెజ్ ఒక నియంత, అతని పలుకుబడికి ఆ చుట్టుపట్లగల మత గురువులు గజగజలాడేవారు.

మార్టినెజ్ గురించి వున్న కథలు యిన్నీ అన్నీ కాదు. అయిదు సంవత్సరాలక్రితం అమెరికన్ గవర్నర్

మీాద స్తానిక వాసులు జరిపిన తిరుగుబాటుకి, యితనే సూత్రధారుడంటారు. అప్పుడు, వారు అమెరికన్ గవర్నరునీ, మరొక పన్నెండుగురు తెల్లవారినీ దారుణంగా చంపి, చర్మం వొలిచారట. అందుకు ప్రతిగా ఏడుగురు స్థానిక వాసులను ఉరితీయవలసిందిగా మిలటరీ కోర్టువారు తీర్పు చెప్పారు. సామాన్యులను వురికంబం ఎక్కించారే గాని ఈ కుట్రతో సంబంధం గల మార్టినేజ్‌ని ఎవరూ ఏమీా అనలేకపోయారు. అదలాఉండగా, ఈ ఏడుగురు నీ మరణ దండన నుంచి తప్పిస్తాననీ, ఉన్నతాధికారులతో తను స్వయంగా మాట్లాడి అంతా సరిచేస్తాననీ వారికి ఆశ పెట్టి, వాళ్ళ యిళ్ళూపొలాలూ స్వాధీనం చేసుకున్నాడు మార్టినెజ్.

ఉరిశిక్ష విధింపబడ్డ ఏడుగురూ 'యిదేమి ఘోరం, మమ్మల్నిలా గోతులో దింపేవేమిటి?' అని ఫాదరీని అడగ్గా నేనున్నానుకదా, మీారేమీా ఆదుర్దాపడక్కర్లేదు' అని వాళ్ళచేత పత్రాలమీాద సంతకాలు కూడా పెట్టించుకు, పై ఆఫీసరులతో మాట్లాడేందుకు వెళుతున్నానని, తన స్వగ్రామం చేరుకున్నాడు. ఆ ఏడుగురినీ అనుకున్న రోజున వురితీశారు. కొన్నాళ్ళు గడిచి, ఈ సంగతి పాతబడ్డాక మళ్ళీ టావోస్ చేరుకుని, తనకు సంక్రమించిన సుక్షేత్రాలు నిర్విచారంగా సేద్యం చేయించసాగాడు మార్టినెజ్.

బిషప్‌కీ మార్టినేజ్‌కీ మధ్య జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలు 'మీారు పెద్దలంటే', 'మీారు పెద్దలు', అనే ధోర

ణీలో వుండేవి. లెటూర్ వెనుకొకసారి టూవోన్ వొద్దా మనుకున్నాడు గాని రాలేక పోయాడు. ఇప్పుడు తప్పనిసరి అయింది మార్టినేజ్‌ని చూడటం లెటూర్‌కి. అదే మొదటిసారి అయినా తెలిసిన మనిషిని చూస్తున్నట్లుగా ఉంది. ఆ ఠీవీ, ఆ దృఢ చిత్తమూ ముఖంలోనే కనపడు తున్నాయి. లెటూర్ కంటె అతను ఏమంత పొడగరి కాదు. పెద్ద పెద్ద బుగ్గలూ, లావుపాటి మెడ, విశాలమైన ఛాతీ, దారుఢ్యంగా కనపడే చేతులూ, కోల ముఖమూ అతన్నొక మరుపురాని వ్యక్తిగా మనో ఫలకంమీద చిత్రి స్తాయి. ఆ పెదవుల కదిలికలోనే అతని భోగాలాలసత్వము వ్యక్తమవుతుంది. వాంఛా జలధిలో మునిగితేలే భావుకు డతను.

వ్యక్తులు తమ యిష్టప్రకారం శాసించి, తాము చెప్పినదే న్యాయమనే రోజులు గడచిపోయిన సంగతి, మార్టినెజ్‌కు తెలియదనీ, ఎంతటి మహనీయుడైనా, న్యాయ సూత్రాలకు కట్టుబడక తప్పదనీ లెటూర్ విశ్వాసం. ఈ మార్టినెజ్ వెనుకటి శతాబ్దానికి చెందిన వాడు. ఒక రకంగా, ఆ తరహా వ్యక్తుల కాలం తీరిపో యింది. అయినప్పటికీ తన శక్తి యుక్తులతో పలుకుబడి నిలబెట్టుకుంటూ వస్తున్నాడు.

బిషప్, జాకింటోలు పర్వతాల చాటున వుండగానే దుమ్ము లేవడం కనపడింది. జాకింటో ఆ దుమ్ము బిషప్‌కి

చూపెడుతూ, మార్టినెజ్ ఏర్పాటు చేస్తున్న స్వాగత మన్నాడు.

గుర్రాల మీద వున్న ఆ వందమందిలోనూ మార్టినెజ్‌ని గుర్తు పట్టడం ఏమంత కష్టంకాదు. బక్ స్కిన్ బ్రీచెస్, పొడుగు జోళ్ళూ, వెండి బకిల్సూతో ఆ మెక్సికన్ హాట్‌లో అతను ప్రత్యేకంగా కనబడుతున్నాడు. తిన్నగా బిషప్ వద్దకు వచ్చి అతనికి సవినయంగా స్వాగతం చెప్పాడు.

ఫాదరీ లిద్దరూ పక్క పక్క గుర్రాలమీద గ్రామం వైపుగా ప్రయాణం చేస్తున్నారు. టావోస్ అనేది చాలా చిన్న పట్టణం. ఆ వూరు గోడలన్నీ పసుపు పచ్చ రంగులో వున్నాయి. వీధులు అష్ట వంకరలు తిరిగాయి. ఇక పళ్ళ తోటలు లెక్కలేనన్ని. చర్చి మందిరం ప్రవేశించేందుకు ఫాదరీ లిద్దరూ గుర్రాలు దిగారు. వీరికి స్వాగతం తెలిపేందుకు సమకూడిన ప్రజలందరూ ఒక పెట్టున జయనాదాలు చేశారు. బిషప్ మట్టి నేలమీద నడవడమేమిటని, అతను నడిచి వచ్చేందుకు, దారి పొడుగునా దుప్పట్లు పరిచారు. మోకరించి వున్న ఆ స్త్రీ పురుషులు ఫాదరీ వేలినున్న దివ్యాంగుళీయాన్ని ముట్టుకు, తమ కృతజ్ఞత తెలియపరిచారు. ఇటువంటి స్వాగతమూ ఈ మాదిరి పటాటోపమూ స్వదేశంలో అయితే లెటూర్ నిస్సంశయంగా గర్హించి వుండేవాడు. కాని యిక్కడి పద్ధతులూ, వీరి జీవన విధానమూ వేరు. ఆర్భాటం చేయడం వారి తత్వంలో ఉంది.

ఇక్కడి ప్రజలు మతాన్ని ఆధ్యాత్మిక చింతనతోగాక, బాహ్య ప్రదర్శనతో కూడా కొంతవరకూ కొలుస్తారు.

మార్టినెజ్ యిల్లు చర్చికి ఎదురుగా వుంది. ఆ యింటి ముంగిటకూడా కొందరు స్త్రీ పురుషులు మోకరించి వున్నారు. అందులో ఒక పది పన్నెండేళ్ళ కుర్రవాడు మాత్రం, అందరితోపాటు వినమ్రంగా వుండక, నెత్తిమీద హాటుతో దర్జాగా నిలబడ్డాడు. దేబిమొహంతో జనాన్ని చూస్తున్న ఆ బాలుని వద్దకు మార్టినెజ్ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వచ్చి, వాడి నెత్తిమీద టోపీ గిరవాటు వేసి, రెండు చెంపలూ వాయించాడు. 'అలా చేయి చేసుకోవడ మేమిటి, మనం దౌర్జన్యవాదులం కాకూడదు' అని ఏదో నెమ్మదిగా లెటూర్ చెప్పబోయేసరికి, మార్టినెజ్ టక్కీమని అనేశాడు. 'వాడు నా కొడుకు. పదిమందిలో ఎలా మసులుకోవాలో పన్నెండేళ్ళొచ్చిన కుంకకు తెలియకపోతే ఎలా?'

అయితే యిక్కడి మత వ్యవహారాలు ఈ పద్ధతిని సాగుతున్నాయన్నమాట - అని తనలో అనుకున్నాడు లెటూర్. తాను సుశిక్షణకు అలవాటుపడి వుండటంచేత, మార్టినెజ్ అహంకార ప్రవర్తనని అతను ఏవగించుకున్న సంగతి, ముఖంలో కొద్దిగా కూడా తెలీచేలేదు. తన చేతికింద మనిషి తనను ఎదిరిస్తూ మాట్లాడినప్పటికీ చిరునవ్వుతో వూరుకున్నాడు.

ఇంట్లో ప్రవేశించాక లెటూర్నీ తన 'చదువుకునే గదిలోకి' తీసుకు వెళ్ళాడు మార్టినెజ్. అక్కడ ఆ పుస్తకాల గదిలో నేలమీద పడుకుని నిద్రపోతున్నాడొక యువకుడు. బాగా పుష్టిగా లావుగా వున్న ఆ యువకుడు, ఒక బరువు పుస్తకం తలగడగా పెట్టుకు, వెల్లకిలా పడుకుని గురక తీస్తున్నాడు. అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు గంగాళం వంటి అతని పొట్ట, క్రిందికీ పైకీ వూగుతోంది. ఫ్రెంచి యువకులు వేసుకునే గోధుమవన్నె గౌను ధరించి పొట్టి క్రాపు పెట్టుకున్నాడు. ఆ నిద్రబోతుని చూడగానే మార్టినెజ్‌కి ఒక్కసారిగా నవ్వు వచ్చింది. పకపకా నవ్వి, తన కాలి వేళ్ళతో అతని డొక్కలో పొడిచి, మళ్ళీ మరోకసారి నవ్వాడు. ఆ నిద్రబోతు ఖంగారు పడుతూ లేచి, తెరిచివున్న ద్వారం గుండా తోటలోకి పరుగు తీశాడు.

'ఏయ్, యేమిటా నిద్ర? రాత్రి వేళ కష్టపడే యువకులే పగలు నిద్రపోతారు. దీప కాంతిలో రాత్రంతా చదువుతున్నావా? నీకు తత్వ శాస్త్రంలో పరీక్ష పెడతాను జాగ్రత్త' అని మార్టినెజ్ అనేసరికి, కిటికీ వెలుపల నుంచి అచ్చట ఉన్న స్త్రీల వికటహాసము వినిపించినది. ఆ యువకుడు ఎండేసిన బట్టల వెనక్కి వెళ్ళి దాక్కున్నాడు.

'వాడు ట్రినిడాడ్ - నా విద్యార్థి. మొదట్లో డురాంగో పంపాము. అక్కడ మావాడికి ఒక అక్షరం ముక్క అంటలేదు. మొద్దు తలకాయో, యింటిమీద

మమతో తెలీకుండా ఉంది. ప్రస్తుతం చేతనైన శిక్షణ యిస్తున్నాను. ఎప్పటికో ఒకప్పటికి అతన్ని మత గురువుగా చేసి తీరుతాను,' అన్నాడు మార్టినెజ్.

'ఇది మీ స్వగృహంగా భావించుకోండి,' అని మార్టినెజ్ లాంఛన ప్రాయంగా అన్నప్పటికీ లెటూర్ ఆ యింటిని అలా స్వగృహంగా భావించుకోదలుచుకోలేదు. క్రమ జీవనానికి అలవడ్డ బిషప్‌కి ఈ యిల్లు గందర గోళంగానే ఉంది. మార్టినెజ్ టేబులుమీద పుస్తకాలు ఒక గుట్టగా పడివుండడమే గాకుండా అవి పూజా విగ్రహాలని కప్పేస్తున్నాయి. ఇక ముక్కుపొడుం టేబుల్ మీద ఎక్కడ పడితే అక్కడే! కుర్చీలో పుస్తకాలు, టేబులుమీద పుస్తకాలు, మంచంమీద పుస్తకాలు, గది నిండా అవి చిందరవందరగా చిమ్మబడి వున్నాయేగాని పుస్తకాల బీరువాలో ఒకటీలేదు. అది మాత్రం ఖాళీగా బోసిగా వుంది. నేలమీదున్న పుస్తకాలు మంచు తుపానులూ యిసుక తుపానులూ రుచిచూసి వుంటాయి.

ఇక యింట్లో పనివాళ్ళెంవరూ, చాలామంది స్త్రీలే. వయస్సులో వాళ్ళూ, వయసు మళ్ళినవాళ్ళూ మొత్తం మీద గృహకృత్య భారమంతా స్త్రీలదే. సమస్తం వారి చేతులమీదుగానే నడుస్తున్నట్లుంది. ఆ స్త్రీలకి తోడు పచ్చని పిల్లులు. ఈ ప్రత్యేక జాతి మార్జాలాలని ఫావరీ గారు ఎంతో మోజుపడి తెప్పించారట. అవి గూళ్ళలోనూ కిటికీల్లోనూ నివాసమేర్పరచుకొని సుఖజీవనం సాగిస్తు

న్నాయి. ఈ మార్జాలాలలో కొంచెం ధైర్యం గలవి, యజమాని భోజనాల బల్ల దగ్గరికి వచ్చి, ఆయన కరు ణించి పడవేసిన పదార్థాలు తింటాయి.

ఆ రోజు భోజనాలవేళ మార్టినెజ్ లెటూర్‌కి, నేల మీద గుర్రు పెడుతూ నిద్రపోయిన యువకుణ్ణి పరిచయం చేశాడు. ఆ బొజ్జయువకుడు మార్టినెజ్ దగ్గర విద్యార్థే కాకుండా అతనికి కార్యదర్శికూడానట. కాని, రోజులో చాలాభాగం వంటగదిలో గడుపుతూ, వంటకత్తెల పనికి అడ్డు తగిలేవాడట.

మార్టినెజ్ ఈ మాటలు ఆ యువకుని ముఖంమీద అన్నప్పటికీ అతగాడు చలించినట్టు లేదు. అతని దృష్టంతా నోటిముందున్న భోజనంమీద నేలగ్నమై ఉన్నది. ఈ యువ కునికి, ఆఖరికి, సాధారణ మర్యాదలు కూడా తెలియవే- అనుకున్నాడు లెటూర్. బీదబంధువుల్నీ నౌకర్లనీ చూసి నట్టు మార్టినెజ్ ఈ ట్రినిడాడ్‌ని చూడటం, లెటూర్‌కి ఆశ్చర్యం కలిగించింది. ఇదుగో ఈ పుస్తక మందుకో; ఆ జోళ్ళు యిలా పట్టుకురా; నిప్పుగూడు చితుకులు తక్కు- వగా వున్నాయి, కాసిని తీసుకురా; గుర్రానికి జీనూ కళ్లెం వేశావా? - యిటువంటి పనులు పురమాయించేవాడు మార్టినెజ్. లెటూర్‌కి ఆట్రినిడాడ్ ముఖం చూడడమే అసహ్యమనిపించింది. భోజన సమయాన అతనొక్క మాట కూడా మాట్లాడలేదు. మాటలతో ఆ కొంచెం కాలం

వృధాచేయడ మెందుకని యావచ్ఛక్తీ భోజనం వైపే తిప్పాడు. ఏదైనా ఒక క్షణకాలం అతనిదృష్టి తింటున్న ప్లేటునుంచీ, తినబోయే పదార్థాలనుంచీ మళ్ళిందా, ఆ చూపు తిన్నగా వడ్డిస్తున్న వంటకత్తెమీదకే. అటూ యిటూ తప్ప అతనికి చూడవలసింది, మరొకటి లేదీ లోకంలో. ఇతని చూపుని ఆ వంటకత్తె మాత్రం అసహ్యంతో చీదరించుకునేది. కాని తత్వశాస్త్రం నేర్చుకుంటున్న ఈ విద్యార్థి మీద, అ చీదరింపులు పని చేసేవి కాదు.

మార్టినెజ్ కడుపునిండా భుజిస్తూ, హాయిగా ద్రాక్షరసం సేవిస్తున్నాడు. ఇంట్లో వంటవాళ్ళు యింత మంది వున్నప్పటికీ మార్టినెజ్‌కి పదార్థాలు రుచికరంగా ఉండేవి కాదు. ఎల్బాసోనుంచి తెప్పించిన ద్రాక్షరసంతో సరితూగేవి కాదు అవి. భోజన సమయాన మార్టినెజ్, లెటూర్‌ని ఒక సున్నితవిషయమై కదిపాడు. 'ఫాదరీలకి బ్రహ్మచర్యం అంత అవసరమా?' అని, అడిగాడు.

'ఈ విషయమై ఎన్నో శతాబ్దాలు క్రింద మనవాళ్ళొక నిర్ణయానికి వచ్చి, యుక్తాయుక్తాలు తేల్చేశారు. దానిని గురించి రెండు అభిప్రాయాలంటూ లేవు' అన్నాడు లెటూర్.

'ఏ విషయమై కూడా సర్వకాలాలకి పనికివచ్చే నిర్ణయం వుండదుగా! కాలగతిని బట్టి అభిప్రాయాలు

మారుతాయి. ఫ్రెంచి ఫాదరీలు బ్రహ్మచర్యం ముఖ్యం అనుకున్నారు గాని మావాళ్ళావిధంగా ఏనాడూ అనుకో లేదు. సెయింట్ అగస్టిన్ అంతటివాడు ప్రకృతి ధర్మానికి వ్యతిరేకంగా నడవటం భావ్యం కాదన్నాడు. జీవితమంతా బ్రహ్మచర్యంతో గడిపినందుకు, సెయింట్ అగస్టిన్ తన వార్థక్యంలో ఎంతో సంతాపం పొందాడు. అందుకు తగ్గ సాక్ష్యం మనకు ఆయన రచనల్లోనే దొరుకుతుంది' అన్నాడు మార్టినెజ్,

సెయింట్ అగస్టిన్ రచనలు క్షుణ్ణంగా చదివిన ఫాదర్ లెటూర్, అటువంటి అభిప్రాయం ఆ మహనీ యుడు, వెలిబుచ్చిన గ్రంథభాగంలో చూపితే తను సంతో షిస్తానన్నాడు.

'ఎందుకేనా మంచిదని, నే నివన్నీ వ్రాసి అట్టే పెట్టాను. మీరు వెళ్ళబోయే లోపున నేను మీ కవి చూపి స్తానుగా! మీరు బహుశా ఆయన రచనలు భక్తి తత్పర తతో చదివివుంటారు. అసలీ బ్రహ్మచర్యం మనో వైశా ల్యాన్ని పెంచదు. పశ్చాత్తాపమూ, క్షమాగుణమూ, అనేవి పాపం చేసినవాళ్ళకిగాని, బ్రహ్మచారుల కేం తెలు స్తాయి? పాపం అంటే యేమిటో మనం స్వానుభవంతో తెలుసుకుంటే తప్ప పాపుల నెలా కనికరించగలం? అంచేత పాపకర్మలు చేయడం కూడా అన్ని అనుభవాలలో దే. ప్రార్థనలవల్ల ఉపవాసాలవల్ల ఆత్మ, పారిశుద్ధ్యాన్ని పొందదు.

పాపమనే గొడ్డలితో నరకబడ్డ ఆత్మ, పశ్చాత్తాపంవల్ల అతకబడి; తన సహజత్వాన్ని పొందగలుగుతుంది. అలా కానప్పుడు మత విశ్వాసమనే దొక మృతప్రాయమైన తర్కమే అవుతుందిగా!'

'ఈ విషయమై మనం తర్వాత మాట్లాడుకుందాం, నేను శాంటాఫే బిషప్‌నై వున్నంతకాలం, పాతపద్ధతిలోనే మతారాధన మత కార్యక్రమం జరగవలసి వుంటుంది. భగవంతుని మ్రోలనిలబడి మనం చేసిన వాగ్దానాలు, మనమే నిలబెట్టుకోలేకపోతే, ప్రజలను ఏమి బాగుచెయ్యగలము. ఏమైనా యిటువంటి విషయాల్లో నేను ఛాందసుణ్ణి' అన్నాడు లెటూర్, ఆ వాదాన్ని అక్కడితో తుంచేస్తూ.

మార్టినెజ్ వెకిలిగా నవ్వుతూ తన భుజంమీంద కెక్కినపిల్లిని కిందికి గిరవాటుపెట్టి అన్నాడు. 'మీరు వయస్సులో చిన్నవారు, ఈ ప్రాంతాలకిక్రొత్త. మీ కిక్కడి రీతినీతులు కొన్ని తెలియవు. ప్రకృతి శక్తుల్ని అవరోధించడం మంచిపని కాదు. నేటి మతగురువులు మీరుమెచ్చుకునే ఫ్రెంచి జెసూట్లకంటె ఉత్తములు. ఇక్కడ ఉన్న చర్చి, మతానికి సజీవనిదర్శనము. అంతేగాని యూరపులోని పెద్దచర్చికి చెందిన వికలాంగం కాదు. ఇక్కడి మత వృక్షపు వేళ్ళు, ఈ గడ్డలో పాతుకుపోయాయి. ఎక్కడో దూరానున్న రోమ్ ఈ ప్రజలమీద అధికారం చెలాయించదల్చుకుంటే, అది జరిగేపని కాదు. ఇక్కడివారు 'రోమ్' పంచిపెట్టే విరాళాలకి చెయ్యి జాపరు. వారు అకారణంగా

కల్పించుకున్నా వూరుకోరు. ఇక్కడి మతసిద్ధాంతం, ప్రజల కాయ కష్టంతో పెరిగి, జాతీయతని అలవరచుకుంది. 'ప్రభువు' పట్ల భక్తిశ్రద్ధలు యిక్కడివారి కున్నట్లు మరె వరికీ లేవేమోకూడా! యూరప్ ఖండపు బాహ్యాడంబరా లతో యిక్కడివారిలో గల సహజభక్తిని చెడగొట్టేరా, వాళ్ళు మోసగాళ్ళూ వ్యర్థులుగానూ తయారవుతారు.'

మార్టినెజ్ యిచ్చిన ఈ ఉపన్యాసానికి లెటూర్ ముక్తసరిగా జవాబు చెప్పాడు. 'నేను ఈ ప్రజల మత జీవనం చెరిపేందుకు రాలేదు. ఎ:గొచ్ఛి, మతగురువులు నియమవంతులై, తమ పవిత్రతద్వారా ప్రజలలో పరివ ర్తన తీసుకురాగల మార్గమేదేనా వుందేమో ఆలోచి స్తాను.'

మార్టినెజ్ తన పాత్ర నిండా ద్రాక్ష రసం నింపు కుంటూ, నిర్విచారంగా అన్నాడు. 'మీరు ఏ ప్రాంతాల ఎటువంటి మార్పులు చేసినాసరే కాని, నా పట్నాన్నీ, నా ప్రజలనీ మార్చేందుకు మాత్రం ప్రయత్నించకండి. నా ప్రజల మతజీవనానికి నేను బాధ్యుణ్ణి. అంతగా కాదు కూడదంటే, మీరు ఒక ఫ్రెంచి ఫాదరీని యిక్కడ వేయ వచ్చు. అతను రోమ్‌కి ప్రతినిధిగా వుంటాడిక్కడ. నేనేమో ప్రజల ప్రతినిధిగా నా పని నేను చూసుకుంటాను' అంటూ మార్టినెజ్ కుర్చీలో నుంచి లేచి, నిప్పుగూడు దగ్గరకు వెళ్ళి, నిప్పుగూడు వైపుగా వెనుదిప్పి, ఆ వెచ్చదనం లోపలికి పీల్చుకుంటూ, 'బిషప్ మీరింకా వయస్సులో

చిన్నవారు. ఆ సంగతి మళ్ళీ మీకు జ్ఞాపకం చేస్తున్నాను. ఇక్కడి వారిని గురించిగానీ, మెక్సికనుల గురించిగానీ మీ కేమీ తెలియదు. యూరప్ నాగరికత యిక్కడ ప్రవేశ పెట్టేరా, అది యిక్కడి ఆచార వ్యవహారాలతో కలు వక మొత్తానికే బెడిసి కొడుతుంది. వీరు జరిపే జంతు బలులూ, మూఢాచారాలూ మనము వద్దన్నామా, వాళ్లు మన చర్చి పొలిమేరలకే రారు. ఫ్రెంచి సోదరా! రెండు ఆటవిక జాతులమధ్య జీవిస్తున్న సంగతి మీరు మరవ కండి. మీరు సంస్కరణలని భావించేవి, యిక్కడ ప్రవేశ పెట్టే ముందు, యిక్కడివారి ఆచార వ్యవహారాలు పూర్తిగా తెలుసుకోవాలికద! ఫ్రెంచివారి శాసనలు యిక్కడి నప్పవు. చర్చి విధించే ఆంక్షలు కొన్ని, నేటి వుల మతజీవనంలో అంతర్భాగమై ఉండటంవల్ల, వాళ్ళు వాటిని మన్నిస్తున్నారు.'

ఈ మాటలు వింటూన్న ట్రినిడాడ్‌కి మళ్ళీ నిద్ర వచ్చిందో యేమో, కుర్చీలో నుంచి లేచి సాష్టాంగ దండ ప్రణామం చేస్తున్నట్టు ఒంగి నమస్కరించి, వంట గది వైపు జారుకున్నాడు. ఆ విద్యార్థి కనుమరుగయ్యాక, లెటూర్ తన అతిథిని వుద్దేశిస్తూ, కొంచెం కఠినంగా అన్నాడు: 'మార్టినేజ్, ఆ యువకుని ముందు మీరిటువంటి విషయాలు మాట్లాడటం నేను వొప్పను. పైగా అతనికి మత విద్య నేర్పుతున్నానంటారు! మత విద్య నేర్చుకునే యువకుల ముందు మాట్లాడ వలసిన మాటలా యివి?

అసలా యువకుడు ఈ జన్మలో ఫాదరీ కాలేడు. అతని కాగితంగాని నా దగ్గరకు వచ్చిందా, పొరబాటున కూడా నేను ఆమోదించను.'

మార్టినెజ్ పళ్ళు బయటపెట్టి, వికృతంగా నవ్వాడు. 'మీకా చింతేమీ అక్కరలేదు. ట్రినిడాడ్‌కి ఆ ఉద్యోగం వాళ్ళ పెద్దనాన్న నించి వచ్చే వారసత్వం. పెదనాన్న బాగా ముసిలివాడయ్యాడు. ఈ ఉద్యోగము బయట వాళ్ళకు పోకుండా, ట్రినిడాడ్‌కి తర్ఫీదు యిప్పిస్తున్నాడు. ట్రినిడాడ్ నిద్రమోతనీ, భోజనప్రియుడనీ మీ ఉద్దేశం. అది నిజమే, అతనిలోగల భక్తితీక్షణత మీకేం తెలుసు? ఉత్సవాల సమయాన 'ఆల్బకర్క్యూ' వెళ్ళినప్పుడు ఈ మొద్దు మనిషి పూర్తిగా మారిపోతాడు. పెద్దపెద్ద శిలువలు భుజాన వేసుకు, ఎత్తయిన పర్వతాలు అవలీలగా ఎక్కుతాడు. నిరుడిక్కడికి, వాళ్ళంతా బ్రహ్మచెముడుముళ్ళతో వొచ్చే సరికి ఆడపిల్లలందరూ కోడిపిల్లల్లా చుట్టూ చేరి, ఆ ముళ్ళు ఒక్కొక్కటే లాగివేశారు.'

లెటూర్‌కి అప్పటికే విసుగెత్తిపోయింది. తనకని నిర్దేశింపబడిన గదిలోకి వెళ్ళాడు. పరిసరాలంత యిష్టతరంగా లేవుగాని పక్క పరిశుభ్రంగా ఉంది. అసలు ఈ యింట్లో సువాసనలకి ఏదో ప్రత్యేకత ఉంది. పగలంతా అలసివున్నప్పటికీ పక్కమీద పడుకోగానే నిద్ర పట్టలేదు లెటూర్‌కి. గిన్నెలు కడుగుతూ నిర్విరామంగా సొదచేస్తూన్న స్త్రీల కంఠాలు ఒకపట్టాన తగ్గితేనా?

స్త్రీల కిచకిచలూ, గిన్నెల చప్పుడూ వాటాలు వేసుకొన్నట్టు అతనికి నిద్రాభంగం చేయసాగాయి. ఈ శబ్దాలు తగ్గాక యిక నిద్రపోవచ్చుగదా అనుకొనేసరికి, కోపంతో ఉన్న ఎద్దు, బుసలు కొట్టినవిధంగా మరొక వైపునించి శబ్దం వచ్చింది. ఈ యింటిగోడలు దట్టమైనవి, ప్రక్క గదిలో శబ్దం వినపడ్డానికి వీల్లేదు. కాని మార్టినెజ్ తన గదితలుపులు తెరుచుకుపడుకున్నట్టున్నాడు. అందుకని ఆయనగారి గురక సుళ్ళుతిరిగి లెటూర్ మీదికి దాడి చేసింది. ఈ బుసలుకొట్టే గురకమధ్య తనకు నిద్రపట్టడం అసంభవమనుకొని, గదిలోని కొవ్వొత్తి వెలిగించి, తలుపు తెరుచుకు వసారాలోకి వచ్చి, మార్టినెజ్ గది తలుపులు వోరవాకిలిగా వేసి, మళ్ళీ తన గదిలోకివెళ్ళాడు లెటూర్. ఈసారి గురక వినిపించడం తగ్గిందిగాని గోడమీద చిన్న యెలకవంటి ప్రాణేదో కనపడింది. అది ఎలకేనా, అనినిశ్చ యించుకునేందుకు, మళ్ళీ దీపంవెలిగించి చూడబోయేసరికి, అది స్త్రీ శిరోజాల తుట్టఅని, చేతితో ముట్టుకున్నమీదట తెలిసింది. ఆ క్షణాన లెటూర్‌కి, ఎంత వెలపరింత కలిగిందో! ఇటువంటి దౌర్భాగ్యపు గదిలో పడుకోవలసి వచ్చింది గదా, అని విచారిస్తూ కళ్ళు మూసుకున్నాడు.

మర్నాడు ఉదయం పదకొండుగంటల వేళ పెద్ద ప్రార్థనకి ఏర్పాట్లుజరిగాయి. లెటూర్ మతాధిపతి కుర్చీలో ఆసీను డయాడు. టావోస్ లోని చర్చి అద్దంలా పరిశుభ్రంగా వుంది. అక్కడికొచ్చిన ప్రజలు కూడా భక్తి ప్రపత్తులు

గల ఉత్తముల్లా ఉన్నారు. పూజాపీఠం దగ్గిర నగిషీ వస్తువు లనేకం ఉంచారు. పాలమీగడవంటి తెల్లని బట్టలమీద, అల్లికకుట్లు కుట్టి ప్రార్థనావేదికపై పరిచారు. ప్రార్థన గీతం మార్టినెజ్ అందుకోగానే, సమావేశమైన ప్రజలందరూ కంఠం కలిపారు. అసలు మార్టినెజ్ కంఠంలోనే గంభీరత వుంది. కంఠ నైర్మల్యతతో పాటు, ఉద్రేకపూరితమైన వాక్కు, ఆ పాటనొక కమనీయ గానామృతంగా చేసింది. చర్చికి సంబంధించిన ప్రతి చిన్న విషయములోనూ ఎంతో జాగ్రత్త కనబరిచారు. బిషప్ లెటూర్‌కి సంతోషం కలిగే టట్టు ప్రవర్తించారు అందరూ. ముఖ్యంగా, ప్రార్థన సమయాన మార్టినెజ్‌ని చూసేసరికి లెటూర్‌కే ఎంతో ఆశ్చర్యమేసింది. విశృంఖల జీవనుడనుకున్న ఈ మనిషిలో ఎంతటి ప్రగాఢభక్తి వున్నదీ, త్రికరణశుద్ధిగా తననితాను భగవదర్పితం చేసుకోగలుగుతున్నాడే, అని విస్మయం చెందాడు. మార్టినెజ్ కంఠగళంలోని రక్తనాళాల కుదుపు ద్వారా ఆ మనిషి వ్యక్తిత్వం గోచరమయింది లెటూర్‌కి. ఇతను మెక్సికన్ అయినప్పటికీ చాలా సమర్థుడు, ఆకర్షణాబలంతో ప్రజలనికట్టేయగల శక్తిసంపద అతనిసొమ్ము – అనుకున్నాడు లెటూర్ లోలోన.

ప్రార్థనానంతరం మార్టినెజ్ ఒక గుర్రంమీద, లెటూర్ మరొక గుర్రంమీదా బయలుదేరారు. టావో‌స్‌లో తనకున్న పొలంపుట్రా ఈ ఉన్నతాధికారికి చూపిం

చాడు మార్టినెజ్. మాటల సందర్భాన అమెరికన్ గవ ర్నరు బెంటు హత్యగురించీ, అందుకు ప్రతిగా ఏడుగురు స్థానికులకు మరణశిక్ష పడడం గురించీ, యేదో లోకవ్యవ హారం చెబుతున్నట్టుగా అన్నాడు. ఏ విప్లవమైనా ముందు టావోస్‌లో ప్రారంభమై ఆ పైన న్యూమెక్సికోకి పాకు తుందట.

మధ్యాహ్నపు వేళ బంగారపు వన్నె దాల్చి, పిర మిడ్ల ఆకారంలో వున్న రెండు మందిరాలలోకి లెటూర్‌ని తీసుకువెళ్ళాడు మార్టినెజు. ఆ రెండిటిలోనూ యేవో విగ్రహాలు వున్నాయి. వాటిమీద ఏదో వింత వెలుగుపడు తోంది పైనుంచి. మేకపిల్లల అరుపులూ ధూమ్రవర్ణం దాల్చిన ధూళీతప్ప ఆ చుట్టుపట్ల మరింకేమీ లేవు. ఆ రెండు మందిరాలలోనూ ఏదో పవిత్రనిశ్శబ్దత కనపడింది లెటూర్‌కి.

సుమారు వెయ్యి సంవత్సరాలక్రితం ఈ రెండింటినీ యెవరో కట్టించారనీ, కొలది మార్పులతో వెయ్యేళ్ళ బట్టీ అవి యీ ప్రకారమే వుంటున్నాయనీ, మొట్టమొదట కొర నాడో మనుష్యులు వీటి ఆచోకీ తెలుసుకు యూరోపియను లకు తెలియజేశారనీ మార్టినెజు చెప్పాడు.

చుట్టూ పర్వతాలనిండా బోలెడంత కలపవుంది. చెట్టూ చేమతో పచ్చగా ఉన్నాయి కొండలు. ఇంక కొండవాగులు, వంకర్లు తిరిగే ఏర్లూ, సుళ్ళు తిరిగే ప్రవా

హాలూ బోలెడన్ని ఆ ప్రాంతాల. ఆ పర్వతము, ఆ పర్వతపు లోయలు, అందులోగల రహస్యప్రదేశాలు ఇచ్చటి వారికి మెన్నో శతాబ్దాలనుండీ ఆరాధన స్తలాలట. వారికి సంబంధించిన అనేక రహస్యాలు ఈ కొండకోనలు తమ గుండెల్లో దాచుకున్నాయి

'పీళ్ళీ కొండల్లో ఏమూలనో, తెల్లవాళ్ళ కంట పడకుండా పోప్ ప్రతిమని కూడా తయారుచేసి పూజిస్తూ వుంటారు. ఎటొచ్చి ఆ 'పోప్' విగ్రహం మన కళ్ళ పడనీయరు. 1680 లో విప్లవం జరిగినప్పుడు పోప్ విగ్రహాన్ని నాలుగేళ్ళపాటు లోపల కప్పెట్టేశారట. మీకా విప్లవం గురించి తెలిసే వుండాలి' అన్నాడు మార్టినెజ్.

'అవునేదో విన్నాను కాని అది టావోస్‌లో ప్రారంభమైందని తెలియదు.'

'నేను మీకు నిన్న చెప్పానుగా, ఏ విప్లవానికైనా టావోస్ లోనే అంకురార్పణ జరుగుతుందని! ఇక్కడ ఒక స్తానిక 'పోప్' బయలుదేరి రోముమీద ఆధారపడడ మెందుకు, నేనే దేవుని ప్రతినిధిని అంటూ విప్లవం లేవదీశాడు. ఒక సామాన్య కార్సికను మహా విజేత నెపోలియను అయినట్టే, టావోస్ నివాసి తను 'పోప్'ని అవుదామనుకున్నాడు'

ఈ ప్రాంతాలకు లిఖిత చరిత్ర అంటూ లేదు. అందుచేత పుక్కిటపురాణాలే చరిత్రకి ఆధారాలుగా

తీసుకోవాలి. 1680 లోని విప్లవము స్పెయిను దేశీయులను సమూలంగా నాశనంచేసిన కథ వర్ణించి చెప్పాడు బిషప్‌కి మార్టినెజు. ఆ విప్లవానంతరం ఎల్పాసోకి ఉత్తరాన తెల్ల వాడు ఒక్కడు కూడా మచ్చుకి లేడట.

ఆ రాత్రి భోజనానంతరం, తనకు ఆతిథ్యం యిచ్చిన పెద్దమనిషి, ముక్కుపొడుం గట్టిగా పీలుస్తున్న సమయాన 'మీ జీవిత కథ చెప్పండి' అని అడిగాడు లెటూర్.

మార్టినెజు టావోస్‌కి పడమటగా నీలపు కొండలకి వెనక నున్న అబిక్యూ అనే చోట జన్మించాడు. మెక్సికనులు ఉండే ప్రదేశాల్లో అది ఒకటి. ఆ ప్రదేశానికీ మిగతా ప్రపంచానికీ సంబంధ బాంధవ్యాలు స్వల్పం. గిరవాటు వేయబడ్డట్టుగా వున్న ఈ ప్రజలు ఐకమత్యంతో మూఢ విశ్వాసాలతో కూడిన తీవ్ర మతవాదంతో జీవించే వారు.

మార్టినెజుకి చదువు సంధ్యలు లేవు. వ్రాయడం చదవడం రాదు. ఇరవయ్యో యేట పెళ్ళి చేసుకున్నాడు. ఇరవైమూడో ఏట అతని భార్య, శిశువూ, యిద్దరూ మరణించారు. మూడేళ్ళ వివాహ ఫలితంగా, అతనికి సాంసారిక జీవితం మీాద రోత జనించింది. భార్య చనిపోక పూర్వమే ఒక మత గురువుతో స్నేహం చేసుకు, మనసుని 'మతం' వైపుకి తిప్పుకునేందుకు ప్రయత్నించాడు. భార్య మరణంతో ఏకాకియై, మత విద్య నేర్చుకునేందుకు తన

దగ్గర వున్న వస్తువులన్నీ అమ్మేసి, నాలుగు జతల బట్టలూ ఒక గుర్రమూ కొనుక్కుని ఓల్డు మెక్సికోలోని డురాంగోకి ప్రయాణమయాడు. అక్షరం వ్రాయడం చేతగాని ఈ యిరవై మూడేళ్ళ యువకుడు డురాంగోలోని మత పాఠశాలలో ప్రవేశించి, ఎబిసిడిల దగ్గర నుంచి, స్పెయిన్ లాటిన్ భాషల్లోని కావ్యాలదాకా విద్యా కాంక్షతో జ్ఞాన తృష్ణతో అహోరాత్రాలు కష్టపడి చదువుకున్నాడు. ఆరేళ్ళు పట్టింది ఈ శిక్షణకి. శిక్షణానంతరం మార్టినెజు తన స్వగ్రామమైన అబిక్యూలో మత సాధకునిగా ప్రవేశించాడు. స్వగ్రామం అబిక్యూ అయినప్పటికీ, ఉద్యోగ కారణంగా టావోస్‌లో వుండవలసి వచ్చింది. మనిషి టావోస్‌లో వుంటున్నప్పటికీ, మనస్సు అబిక్యూని వరించేది. పుట్టి పెరిగిన గడ్డ అంటే అతనికి తెగ అభిమానం. అమెరికనులంటే అతనికి యిష్టంలేదు. ఎంచేతనంటే వారి రాకతో తనవంటి వారి స్థానం పలుకుబడీ చెదురుతాయని భయం. అంచేత ఆరోజు రాకుండా వుండాలని కోరుకొనేవాళ్ళలో మార్టినెజు ఒకడు.

టావోస్‌నుంచి బయలుదేరి యింటికి వస్తూ బిషపు లెటూర్ కిట్ కార్సన్ రాంచి హవుస్ దగ్గర ఆగాడు. కార్సన్, యింటిదగ్గరవుండే సమయం కాదది – గొర్రెలు బేరం చేసేందుకు పర్వతప్రాంతాలకి వెళ్ళివుంటాడు. లోగడ మాగ్డలీనా విషయంలో కార్సన్ సతి చూపిన ఆదరానురాగానికి ఆమెని అభినందిద్దామని, మాగ్డలీనాని

శాంటాఫేలోని సిస్టర్సుతో భగవత్ సేవలో జీవితం గడుపుతోందని ఆమెకి తెలియచేదామనీ అక్కడ ఆగాడు లెటూర్.

ఆదరణలోనూ ఆతిథ్యంలోనూ కార్సన్ సతి మెక్సి కన్ వనిత ననిపించుకుంటుంది. పొడువుగా పీలగా కొంచెం వంగినట్టుండే కార్సన్ సతి నీలి నేత్రాలూ నల్ల కురులూ స్త్రీ సహజ సౌందర్యానికి చిహ్నాలుగా కనబడుతాయి. ఆమెకు వ్రాయడం, చదవడం చేతకాదు. కాని ఆమె సంభాషణమాత్రం ఎంతో చక్కగా పదలాలిత్యంతో మధురంగా ఉంటుంది.

కార్సన్ సతిలో సుశిక్షణ, హాస్యచతురిమ కనపడు తూంటాయి. ప్రసంగవశాన ట్రినిడాడ్ గురించి యిలా చెప్పింది: 'చాలామంది ఆ ట్రినిడాడ్ లూసిగో కుమారు డంటారు. నాకు నమ్మకంలేదు. బహుశా మార్టినెజ్ కొడుకే అయివుండవచ్చు. ఆ స్వేచ్ఛా జీవికి, ఏ నిర్భాగ్యు రాలి ద్వారానో కలిగివుండవచ్చు. నిరుడు అబిక్యూలో వుత్సవాల వేళప్పుడు, ఏమైందో తెలుసా? ఈ ట్రినిడాడ్ తనేదో భగవంతుని ప్రతినిధిలా వేషం వేసుకు, తను ఎటు వంటి దేహబాధకైనా తాళగలనన్నాడు. 'నేను దేవుడి ప్రతినిధిని నాకు దెబ్బలు తగలవు' అంటూ తనని ఆరు వేల దెబ్బలు కొట్టమన్నాడు. కాని ఒకవంద పూర్తికాక పూర్వమే మూర్ఛపోయాడు. అబిక్యూలోని ప్రజలు యిందుకు కోపగించి, ట్రినిడాడ్‌ని బ్రహ్మచెముడు డొంక

లలో బాదారు. ఈయేడు మావూరు రానక్కరలేదు అని కబురుపెట్టారు. ఈ భక్తుని గొప్పదనం చెప్పుకు, ప్రజలందరూ తెగ నవ్వుతారు యిప్పటికీ!'

ఫాదర్ లెటూర్, కార్సన్ సతిని టావోస్ ప్రజల స్వభావం యెటువంటిదనీ మార్టినెజ్‌ని మార్చి మరొకరిని వేస్తే సహిస్తారా అనీ అడిగాడు.

'అటువంటి పిచ్చిపనులు చేయవద్దు. ఇక్కడి వాళ్ళందరూ మార్టినెజు శిష్యులు. మార్టినెజుకి వ్యతిరేకంగా యెవరేం మాట్లాడినా యెవరేంచేసినా వారు సహించరు. వృద్ధులు పాతకాలపు ఆచారాలు మానరు. యువకులు వాళ్ళంతటవాళ్లు మారుతారు. అంచేత తొందరపడడం మంచిపనికాదేమో అని నా అభిప్రాయం.'

మర్నాడు బిషప్ బయలుదేరి వెళుతూఉండగా, కార్సన్ సతి, మాగ్డలీనా కోసమని ఒక అల్లిక రుమాలు యిచ్చింది. 'ఆమెకు ఆస్తిపాస్తులేమీ మిగల్లేదు. ఆ రాక్షసుడు సమస్తం మింగేశాడు. ఉరితీశాక మిగిలినవి, తుపాకీ గుర్రమూను.'

శాంటాఫే వద్ద జోసఫ్, బిషపురాకకై యెదురు చూస్తున్నాడు. ఇద్దరూ ఒకరొన్నకరు చూసుకుని చాలా రోజులైంది. మాట్లాడుకోవలసిన విషయాలు చాలా ఉన్నాయి. లెటూర్ కృషిని రోములోని వున్నతాధికారులు మెచ్చుకు శాంటాఫెలోని 'వికారేట్'ని 'డయోసీస్'గా

మార్చారు. ఆ శుభవార్త తెలిపే వుత్తరంతో పాటు, లెటూర్ నొకసారి కేంద్రానికి రమ్మంటూ కార్డినల్ వద్ద నుంచి పిలుపు వచ్చింది. లెటూర్ రోము వెళ్ళినప్పుడు యిక్కడి వ్యవహారాలు చూసుకోవలసిన భారం జోసఫ్‌ది. పొడుగు గౌనులు వేసుకున్న ఫాదరీ లిద్దరూ కొవ్వొత్తి దీపాల వెలుగున కూర్చుని, ఆ సాయంసమయాన యేవేవో విషయాలు చర్చిస్తున్నారు.

'ఇప్పట్లో నేనా టావోస్ మతగురువుని మార్చను, అక్కడి వ్యవహారాల్లో మనం జోక్యం కలిగించుకోనక్కర లేదు. ప్రజలు మతవిశ్వాసం పట్ల సద్భావపూరితులై ఉన్నారు. ఫాదరీ వ్యక్తిగతంగా ఎటువంటివాడైనా ప్రజలలో మట్టుకు మతచైతన్యం కలిగించాడు. చర్చి సిద్ధాంతాలకి చక్కగా కట్టుబడివున్నారు వారు' అన్నాడు లెటూర్.

'మార్టినెజుకి శిక్షణ గరపగలమా? సజ్జనుడుగా మార్చగలమా?' అని అడిగాడు జోసఫ్.

'ఇక్కడ సజ్జనదుర్జన ప్రమేయం లేదు. చాలాకాలం బట్టి అతను ఆ ప్రాంత ప్రజలకి సర్వాధికారి. మన మిప్పుడొక ఫ్రెంచి మతగురువుని అక్కడ వేసినా, ప్రజలు మార్టినెజు పక్షమే పలుకుతారు. అంచేత ప్రస్తుతానికి మనం అతని లోపాల విషయం మర్చిపోవటం మంచిది.'

'అతనివి క్షమించరాని లోపాలే! మానాభిమానాలు విసర్జించి, అంత బాహాటంగా నీతిబాహ్యమైన జీవితం గడుపుతున్న మార్టినెజుని ఎలా కనికరించి వదిలివేయడము? ఈమధ్య నేనొక కథవిన్నాను. ఎనిమిదేళ్ళ మెక్సికన్ పిల్లను స్థానికులెవరో అపహరించి, ఆ అమ్మాయికి పదిహేనేళ్ళు వచ్చాక, అమ్మజూపారట. పదిహేనేళ్ళ ఆడపిల్లమీద అత్యాచార ప్రయత్నాలు అనేకం జరిగినప్పటికీ, ఆమె కన్యాత్వం భగవదనుగ్రహం వల్ల కాపాడబడింది. ఆ పిల్ల ఏదో ప్రభుసేవాసంస్థలో చేరుదామనుకుంటూ ఉండగా ఆమెపైన మార్టినెజు కన్నుపడింది. ఆమె అతనికంట బడడమేమిటి, పవిత్రత కోల్పోవడమేమిటి, రెండూ ఒకేసారి జరిగాయి. మార్టినెజు ఆ అమ్మాయిని తన నౌకర్లలో ఒకడికిచ్చి పెళ్ళి చేయించాడు. ఇప్పుడామె టావోస్‌లోనే వుంటోంది.'

'అవునవును – ఆ కథ నేనూ విన్నాను. కాని మార్టినెజు పెద్దవాడయిపోతున్నాడు. శృంగార లీలలు యింకెన్నాళ్లో సాగవు. అతనితో కలహం పెట్టుకు, టావోస్ ప్రజలను మతభ్రష్టులుగా చేయడము నా కిష్టము లేదు. అతనిస్థానే టావోస్ ప్రజల మనసుని ఆకట్టుకొనగలిగే మతగురువు మరొకడు మనవద్ద లేడు. పంపితే నిన్ను పంపాలి. నీకు ఆల్బకర్క్యూలో పని వుంది కదా! కొద్ది నెలల్లో నేను రోమ్ ఎలాగూ వెళ్ళాలి! అక్కడికి వెళ్ళినప్పుడు ఎవరైనా స్పానిష్ ఫాదరీ లభ్యమవుతాడేమో చూసి,

అతన్ని పట్టుకు వస్తాను, ఏమైనా స్పానియర్డ్స్ అంటే వారు కొంతలో కొంత యిష్టపడవచ్చు.'

'అవును, అదీ నిజమే. తొందరపడి యే నిర్ణయానికీ రాకూడదు. నువ్వు యూరప్ వెళితే ఈ బాధ్యతలన్నీ ఎలా నెరవేర్చగలనో! నేను ఆల్బకుర్క్యూ వదలిపెట్టి, ఈ శాంటాఫెలో వుండాలి కాబోలు యింక!'

'అవును మరి! ఆల్బకుర్క్యూలో కొన్నాళ్ళు లేక పోతే, ఆ ప్రజలు నీ కోసం యింకా బెంగ పెట్టుకుంటారు. ఆ పరితాపమూ ఒకందుకు మంచిదే. అక్కడ చేయగలదంతా చేశావు. ఇకనుంచి నీ కార్యస్థానమిక్కడ. మనం యిప్పుడేదేనా మాట్లాడుకోవాలని వుంటే, డెబ్బది మైళ్ళ ప్రయాణం చేయవలసి వస్తోంది.'

జోసఫు నిట్టూరుస్తూ అన్నాడు. 'నాకు శాంటాఫె రాసిపెట్టి వుందని అనుకుంటూనే వున్నా. శాండస్కీ నుంచి ఆల్బకుర్క్యూకి బదిలీ చేసినట్లే, ఆల్బకుర్క్యూ నుంచి యిక్కడికి లాక్కు నేట్టున్నావు,' అంటూ జోసఫు తన కళ్ళద్దాలు తీసి పెట్లో పెట్టి, యిక విశ్రమించడానికి వేళైనదన్నట్లుగా లేచి నిలబడ్డాడు. 'అయితే నువ్వు పై ఏడు రోములో ఉంటావు. నేనిక్కడ ప్రజల మధ్య స్వదేశానికి దూరంగా వుంటాను. రోమ్ వెళ్ళగల అవకాశం నీకు లభించింది. నాకు ఆ అదృష్టం యిప్పట్లో పట్టేటట్లు లేదు. స్వదేశం వెళ్ళే నిన్ను చూస్తే నాకు అసూయ కలుగుతోంది. బంధు

మిత్రుల్ని చూసి వాళ్ళతో మాట్లాడగలుగుతావు. పోనీ, మా సిస్టర్ ఫిలోమినానైనా చూసి, ఆమె నా కోసం కుట్టి వుంచిన గౌన్లు పట్టుకు రా,' అంటూ లేచి నిలబడి, ఒక కొవ్వొత్తి దీపం చేత బుచ్చుకు తన గదివైపుగా నడిచాడు జోసఫ్.

# 2

ఫిబ్రవరి నెలలో లెటూర్, శాంటా ఫేనుంచి రోమ్ నగరానికని బయలుదేరాడు ఒకసంవత్సరంపాటు శాంటా ఫేలో లేడు. తిరిగివస్తున్నప్పుడు తన మతవిద్యా సంస్థనుంచి నలుగురు యువక మత గురువులనీ, టలాడ్రిడ్ అను స్పానిష్ మత గురువునీ వెంట తీసుకువచ్చాడు. ఈ టలాడ్రిడ్‌ని టావోస్ పంపేందుకని తీసుకొచ్చాడు. బిషప్ సలహామీదట మార్టినెజు, నామమాత్రమైన రాజీనామా పత్రం దాఖలుచేసి, పెద్ద ప్రార్థనలుమాత్రం తను జరిపేటట్లు ఒప్పుకున్నాడు. సమూహ ప్రార్థనలు జరపడమే కాకుండా జనన మరణాదులూ వివాహాది శుభ కార్యాలూ కూడా తనచేతులమీదుగా జరిపిస్తూ, టలాడ్రిడ్, తనూ- నువ్వెంతంటే నువ్వెంత అనుకునే స్థితికి వచ్చారు.

వీరి పేచీలు సరిపెట్టలేక బిషప్ వుక్కిరిబిక్కిరి అవడం మొదలెట్టేడు. లెటూర్ తప్పనిసరిగా టలాడ్రిడ్ భావమే సబబనవలసివచ్చేది. మార్టినెజు తన చిరకాల మిత్రుడు లూసిరోతో చేయికలిపి 'పురాతన చర్చి' మీద

తిరుగుబాటు జరిపి, వేరొక చర్చి స్థాపించి, అసలైనదీ సిసలైనదీ యిదేననీ, పవిత్ర కాథలిక్ చర్చికి తమ మందిరమే నిజమైన ప్రతి అనీ ఫ్రెంచి బిషప్‌గారి చర్చి అమెరికన్ సంస్థ అనీ, అక్కడికి వెళ్ళడం భగవంతునికి అపచారమనీ, పెద్దమెత్తున ప్రచారం లేవదీశారు. లూసిరో గ్రామంలోని ప్రజలూ, మార్టినెజు గ్రామంలోని ప్రజలూ మొదట్లో పాత చర్చికే వెళుతూవుండేవారు. కొందరు పెద్దవాళ్లు ఈ సమూహ ప్రార్థనకి వెళ్ళడమా, ఆ సమూహ ప్రార్థనకి వెళ్ళడమా అనే అవస్థలోపడి, ఎటుపోయి ఎటు వచ్చినా, రెండిటికీ వెళ్ళడం మంచిదని తీర్మానించుకున్నారు. దీర్ఘ సమాసాలతో కఠినపదభూయిష్టమయిన ఒక ప్రచార పత్రాన్ని అచ్చొత్తించి పంచిపెట్టాడు మార్టినెజు. విగ్రహారాధన ఎలా అతి ప్రాచీనమైనదో, మత గురువులకు బ్రహ్మచర్య మన్నది ఎటువంటి మూఢాచారమో, సకారణంగా వివరిస్తూ వెలువడింది ఆ ప్రకటన పత్రం. కాని మార్టినెజు ప్రజలలో చాలామందికి వ్రాతకోతలు తెలియవు. అక్షరజ్ఞానం లేకపోవడంవల్ల ఆ పత్రాల్లో యేదో గొప్ప విశేషముండకపోతుందా, లేకపోతే మన మార్టినెజు యిలాటివి యెందుకు అచ్చొత్తించి పంచిపెడతాడు, ఏదో వుండేవుంటుంది – అనుకున్నారు. లూసిరో మార్టినెజు లిద్దరూ అప్పటికే వయసుమళ్ళినవారవడంవల్ల ఈ బ్రహ్మచర్యం నిబంధన ఒక్క ట్రినిడాడ్ కే పనికొస్తుంది. పెద్ద మత గురువులిద్దరూ ట్రినిడాడ్‌ని వెను

వెంటనే ఒక మత గురువుగా చేసి, యిటు లూసిరో గ్రామమైన హాండోకి, అటు టావోస్ కి వార్తలు చేరవేసేందుకు వుపయోగించుకోసాగారు.

మార్టినెజు లూసిరోలు మొదలుపెట్టిన ఈ విప్లవం చుట్టుపట్ల ప్రజలని కూడా ఆకర్షించింది. వీరిద్దరి గురించీ ప్రజలు మొదట్నుంచీ రకరకాలుగా చెప్పుకునేవారు. కొన్నాళ్ళు మిత్రత్వం, కొన్నాళ్ళు శత్రుత్వం. పూర్తిగా మిత్రులూ కాదు, పూర్తిగా శత్రువులూ కాదు. వ్యసనంలో మిత్రులు; అధికార ప్రాపకంలో శత్రువులు. నువ్వా నేనా? – అను ప్రశ్న రానంతవరకూ వాళ్ళు ఆప్యాయంతోనే గడిపేసేవారు.

ఇక్కడొక చిన్నవిషయం జెప్పాలి. లూసిరోకీ, మార్టినెజుకీ అధికార దాహం ఒకే పాళంలో వుంది. మార్టినెజు విలాస పురుషుడు, లూసిరోకి కూడా విలాసాలు కావాలి గాని చచ్చినా దమ్మిడీ ఖర్చుపెట్టడు. వయసొచ్చినప్పటినుంచీ, అతను పరమలోభిగా పేరుబడ్డాడు. డబ్బులేక కాదు; కావలసినంత డబ్బువుంది. కాని, ఖర్చుపెట్టడమంటే ప్రాణం పోతుంది. 'నాకేం కావాలి, నేను యెటువంటి పేదరికంలో బతుకుతున్నానో చూస్తున్నావు కదా! నాకు దర్జాలూ అవీ పనికిరావు. బల్లచెక్కేగాని, మెత్తని పరుపులు నా వొంటికి పడవు,' అంటూ తన నిరాడంబరత గురించి ఘనంగా చెప్తూ, ఆనందించేవాడు లూసిరో. పశు

వులు పెంచడ మెందుకు అదో దండగ అని, తనకోసం ఒకే ఒక్క బక్క-గుర్రాన్ని అట్టే పెట్టుకునేవాడు. ఆ బక్క-గుర్రంమీద యెక్కడికి వెళతాడయ్యా అంటే, శతృత్వం లేనికాలంలో టూవోస్‌లోని మార్టినెజుని చూడ్డానికి. లేదా వూరు చివరని వున్న ప్రజలెవరేనా భోజనానికి పిలిస్తే, వాళ్ళయింటికి. ప్రతి శుక్రవారం యిటువంటి విందుభోజన మొకటి తగిలేది. అతని మతపాలనకింద ఉన్న కుటుంబాల్లో ఎవరో ఒకరు ఈ దైవ ప్రతినిధిని, తమ యిల్లుపావనంచెయ్య మంటూ పిలిచేవారు. ఆ గ్రామప్రజలకి లూసిరో అంటే ఎంతో ఇష్టం. అందుకు కారణం ఒక్కటే. మెక్సికనులకి కన్నూ మిన్నూ తెలీకుండా ఖర్చుపెట్టే అలవాటొకటుంది. పూజ్యుడైన మతగురువు జన్మతా లోభి-అదే వారి గౌరవానికి మూల కారణం. గృహిణులు వీధిలో పారేసే పాత చీపుళ్ళు సయితం ఏరించి, ఆ మాత్రానికే వాటిని వీధిలో పారె య్యాలా, అని పొదుపు గురించి చెప్పేవాడు. పుట్టి, బుద్ధి యెరిగాక, లూసిరో డబ్బు పెట్టి కొన్నదంటూ ఏమీ లేదు. మార్టినెజు తను వేసుకునే బట్టలు పాతవైపోయాయని యెవరికేనా దానం చెయ్యబోతే, ఆ దానం తనకే చెయ్య మనేవాడు లూసిరో. స్థూలకాయుడైన మార్టినెజు బట్టలు, బక్కగా వుండే లూసిరోకి యెంతో వదులుగా వున్నప్పటికీ అవే వేసుకు తిరిగేవాడు - కొనకుండా వచ్చిన బట్టలు కదా అను సంతోషంతో. ఈ యిద్దరు ఫాదరీలకీ ఒకసారి బ్రహ్మాం డమైన వైరం ఎందుకొచ్చిందంటే, మార్టినెజు లూసిరోకి

చెప్పకుండా తన పాత బట్టలు, ఎవరో బీద విద్యార్థికి దానం చేశాడట. 'ఈ చలికాలంలో నన్ను చావమన్నావా? ఏమిటి నీ వుద్దేశం?' అంటూ పెద్ద కజ్జా వేసుకున్నాడు లూసిగో.

వీళ్ళిద్దరూ నిశ్చింతగా దాపరికం విడిచి మాట్లాడుకునేవారు ఒకరితో ఒకరు. మార్టినెజు చెప్పగల హాస్యకథలన్నీ లూసిగో గురించే. లూసిగో చెప్పేవన్నీ మార్టినెజు గురించే!

ఒకానొక వివాహ సమయాన లూసిగో అక్కడున్న గల యువక బృందాన్ని ఉద్దేశిస్తూ యిలా చెప్పాడు. 'మీరు ఎన్ని అనండి, మార్టినెజు కంటె నేను శతవిధాల అధికుణ్ని. తిండి ఎక్కువై, అతని బుగ్గలు బలిసిపోతున్నాయి. దేహాన్ని విపరీతంగా పెంచేస్తున్నాడు. ఆ ఆకారాన్ని ఏ వనితలు మెచ్చుకుంటారు? నాకు స్త్రీలంటే ఆ మాదిరి చాపల్యంలేదు. డబ్బుమాట వినపడిందా, అర్ధరాత్రి నిద్రలోంచి కూడా లేస్తాను, నిజమే! అరిచేతులోని డబ్బు మనలను సుఖపెడుతుంది. కాని వొళ్లో కూచున్న పిల్ల మనలను యేట్లో దింపుతుంది. అది తథ్యం అబ్బాయిలూ మరచిపోకండి.'

ధనతృష్ణ తనకు చిన్నప్పటినుంచీ ఉన్నదనీ, అది వయసుతో బాటు తీయనై వార్ధక్యంలో పటిక బెల్లంలా అవుతుందనీ వర్ణించేవాడు. మార్టినెజుకి స్త్రీలంటే యెలా

యిష్టమో, తనకు డబ్బంటే అంత యిష్టంట. అదృష్ట వశాత్తూ వీరిద్దరిదీ అన్వేషణలో చెరో మార్గ మగుటవల్ల గాని, లేకపోతే ఏనాడో బుర్రలు బద్దలుకొట్టుకుని వుందురు. ముద్దుల తనయుడు ట్రినిడాడ్ తనని చూడ్డానికి వచ్చి నప్పుడు 'మార్టినెజు గుణాలన్నీ నేర్చుకు వచ్చావా, నాయనా?' అని అడిగేవాడు. కాని, పెదనాన్న కళ్ళలో ఖారం కొట్టడమే మార్టినెజు నేర్పిన మొదటివిద్య. తన దత్తపుత్రుడు తనంతవాడవుతాడని సంతోషపడేవాడు లూసిరో.

మతవిప్లవం విషయమై నిరంతరమూ వచ్చేవార్తలు వినలేక బిషప్ లెటూర్, 'టావోస్'కి ఫాదర్ జోసఫ్‌ని పంపించాడు. మూడువారాల కాలంలో ఈ మత విద్రోహులిద్దరూ సక్రమ పంథాలో నడుచుకోకపోతే సంఘ బహిష్కారం జరుగుతుందని ప్రకటన చేయించాడు జోసఫ్. మూడువారాల గడువై. నాలుగో ఆదివారం వచ్చింది. అయినప్పటికీ మార్టినెజు తన పొరబాటు వొప్పు కుంటూ, పశ్చాత్తాపం వెలిబుచ్చలేదు. అతనికి గల అధి కారాలన్నీ వూడబీకి, పదవీభ్రష్టుణ్ణి చేశాడు జోసఫ్. అదే రోజున హిండో గ్రామానికి ఆ పద్దెనిమిది మైళ్ళు ప్రయా ణము చేసి మార్టినెజు కిచ్చిన శ్రీముఖం వంటిదే లూసిరోకి కూడా అందచేశాడు.

తను పదవీభ్రష్టుడైనప్పటికీ, తన చర్చి మందిరంలో యథావిధిగా ప్రార్థనలుజరిపించేవాడు మార్టినెజు. కొన్నాళ్ళ

పాటు. కాని ఈ బహిష్కారం జరిగిన కొద్దిరోజులకే, అతను జబ్బుచేసి చనిపోవడంతో ఆకథ అంతటితో పూర్తి అయింది. మార్టినెజు మరణంతో, లూసిరో వంటరివా డయ్యాడు. అతని ప్రతాపం కూడా దిగజారుతోంది గాని, ముసలివాడైన లూసిరో, అర్ధరాత్రివేళ ఒక దొంగని పట్టుకుచంపిన కథ మాత్రం ఆ చుట్టుపట్లంతా వ్యాప్త మయింది.

గూడ్సుబళ్ళమీద దొంగతనం జరిపే ఒక రైలు దొంగ, ఈ హీండో గ్రామంలోని లూసిరో దగ్గిర డబ్బు పాతర ఉందని విని, అది కాజేదామనే తలంపుతో ఒక అర్ధరాత్రివేళ వీళ్ళ యింటిమీద పడ్డాడు. ఎదమరచి నిద్ర పోవడమన్నది లూసిరో ఎన్నడూ ఎరగడు. అర్ధరాత్రివేళ ముందు సావిట్లో పదధ్వని వినపడగానే చెవులు నిక్కించి వింటూ మంచం అడుగునదాచిన పిడికత్తి బయటికితీశాడు. తుపాకీ చేతులో పుచ్చుకున్న ఆ ఆజానుబాహువైనదొంగ, తడుముకుంటూ లోనికి రావడమేమిటి, లూసిరో గురిచూసి ఆ చీకట్లో ఒకపోటు పొడవడమేమిటి, ఒక్క త్రుటిలో జరి గాయి. అంతటి గజదొంగ కుప్పకూలినట్టు రక్తపు మడు గులో పడిపోయాడు. వాణ్ణి పొడిచెయ్యడమయాక, లూసిరో వీధిలోకి వచ్చి, అరిచి బొబ్బలుపెడుతూ, వూరందరినీ లేపాడు. లోపలికొచ్చి చూసినవాళ్ళు, ఈ ముసలివాడింత ధైర్యంగా ఎలా చంపగలిగేడా, అని ఆశ్చర్యపోయారు.

రక్తపుమడుగుతో ఆ గది, కసాయివాని కొట్టులా వుంది వాళ్ళ కళ్ళకి.

ఆనాటి 'షాక్' నుంచి లూసిరో మరి తేరుకోలేదు. ఆ మర్నాడే మంచ మెక్కాడు. దినదిన క్షీణత ప్రారంభ మయింది. టావోస్ వైపుగా ఒకసారి పశువుల డాక్టరు వెళ్తూండగా హీండో ప్రజలు అతన్ని బతిమాలి తీసుకు వచ్చి, లూసిరోని ఆతనికి చూపించారు. ఈ పశువుల డాక్టరు గుర్రాలకీ మనుషులకీ ఒకే విధమైన మందులు వాడేరకం. అశ్వ వైద్యంలో నిపుణుడైన ఆ డాక్టరు మహాశయుడు లూసిరో కేదో గడ్డువ్యాధి పట్టుకుందనీ, బహుశా అది కాన్సర్ అయివుండవచ్చుననీ, చావుకబురు చల్లగా తేల్చాడు.

ఏమయినా లూసిరో మార్టినెజువలెగాక, బహిష్కార ముద్ర పోగొట్టుకుని, పరితప్తహృదయంతో కను మూశాడు. జోసఫు, టావోస్ నుంచి యేదో మతవ్యవహారంమీద మరొక గ్రామం వెళ్తూ, కిట్ కార్సన్ యింటి దగ్గర ఆనాడు తనూ కార్సనూ, కార్సన్ సతీ, భోజనాల బల్లమీద దగ్గరకూచుని ఉండగా, ట్రినిడాడ్ అక్కడికి వచ్చాడు. ఫాదరీలు వేసుకునే పొడుగు గౌను వేసుకుని, మెళ్లోని క్రాసు ప్రస్ఫుటంగా కనపడేటట్టుగా ధరించిన ట్రినిడాడ్, కార్సన్ సతికి వినయపూర్వక నమస్కారం చేసి, తనకు బాగా వచ్చుననుకున్న యింగ్లీషు భాషలో ఫాదర్ జోసఫుతో యిలా అన్నాడు. 'నేను లూసిరో

తమ్ముడి కొడుకుని. మా పెదనాన్న చాలా చాలా జబ్బుగా ఉండి, చనిపోతానంటున్నాడు. ఆమె రక్తంకూడా కక్కుతుంది' అని స్త్రీలింగపులింగశబ్దాలు మిళితంచేసి మాట్లాడాడు. అతను చెపుతున్న దేమిటో జోసఫుకి అర్థంకాలేదు.

'అబ్బాయ్, నువ్వు చెప్పదలచుకున్నది నీ స్వభాష అయిన స్పానిష్‌లో చెప్పకూడదూ, బతికిపోతాను. నీ యింగ్లీషుకంటె స్పానిష్ మెరుగ్గా వుంటుందేమో!'

ఆతర్వాత ట్రినిడాడ్ స్పానిష్‌లో మొదలుపెట్టాడు. కథ ఏమైనా రక్తం కక్కుకోడం సంగతిమాత్రం, నొక్కిచెబుదామనుకునోయేమో, మళ్ళీ యింగ్లీషులోనే మాట్లాడాడు. లూసిగో చావుబతుకులమధ్య వున్నాడనీ, కడసారి ప్రార్థనకి తనను తీసుకురమ్మన్నాడనీ జోసఫుకి యెట్టకేలకు అర్థమయింది.

దైవకార్యం విషయంలో వాయిదాలు పనికిరావు. 'అలాగే, వస్తానుపద' అంటూ వెంటనే ప్రయాణానికి సిద్ధమయాడు జోసఫు. ఈ రాత్రికి విశ్రమించి తెల్లవారి బయలుదేరమనీ, కొత్తదారిని అర్ధరాత్రి ప్రయాణం అంత మంచిదికాదనీ, వారించాడు కార్సన్. గుర్రం నడవలేక పోతే కాలినడకని వెళ్తానని, కార్సన్ దంపతులవద్ద సెలవు తీసుకుని హోండో వైపుగా బయలుదేరాడు జోసఫు. గబగబా భోజనం ముగించి, ట్రినిడాడ్ కూడా జోసఫు వెంట బయలుదేరాడు.

హోండో గ్రామం జోసఫుకి యిష్టమైన ప్రదేశాలలో ఒకటి. ఆ వూరు ఎప్పుడు వెళ్ళాలన్నా, అతనికి సంతోషమే. ఇప్పటికి ఎన్నోసార్లు వెళ్ళాడు అక్కడికి. ఆయా ఋతువుల్నిబట్టి చుట్టూగల ప్రకృతి సౌందర్యం మారుతూ వుంటుందక్కడ.

ఆ ప్రదేశం పైకి పీఠభూమిలావున్నా, ఒక్కోచోట మెట్టలూ పుట్టలూ దర్శనమిస్తాయి. ఈ గుట్టలు గండశిల లంత గట్టిగా వుండేవికాదు. గుట్ట మెట్టలు తర్వాత లోయలు కనపడేవి. లోయప్రాంతాల కాలు జారిందా, యింకేమీ లేదు. పర్వతాలైతే గుర్రాలకి కష్టంలేదుగాని యిటువంటి నేలమీద ప్రయాణం ప్రమాదకరమే! ముఖ్యంగా పొలాలవెంబడి వెళ్తున్నప్పుడు, గుర్రాలని తను నడిపించాల్సి వుంటుంది. ఈ పీఠభూమిలోకి కొండలపై నుంచి ఒక నది ప్రవహిస్తోంది. ఆ నదీ ప్రవాహం ఎంత వుధృతమంటే, నది కడ్డుగా కర్రతొట్టెలుపెట్టి, నీటిని పొలాలవైపు మళ్ళించేవారు. ఈ నీటిని ఒక పెద్దకుండులో నిలువచేసేవారుకూడా. నీటిని సద్వినియోగం చేయడం మెక్సికనులకి బాగా తెలుసు. రాత్రివేళ ఆ నీటికాలువ తెల్లని గుడ్డపీలికలా కనపడింది జోసఫుకి. సమశీతోష్ణ మండలపు పురుగులూ పువ్వులూ ఆ ప్రాంతాల విరివిగా వున్నాయి.

హోండోకి అతనెప్పుడు వెళ్ళినా, పగటివేళ వెళ్ళాడే గాని, చీకటివేళ ప్రయాణం చెయ్యడం యిదే మొదటి

సారి. తన గుర్రం 'కంటెంటో' హాండోకి తనని నిక్షేపంగా చేర్చగలదు గాని దాన్నంత బాధపెట్టడం మంచిది కాదనుకుని, తను దిగి నడుస్తూ, దాన్ని కళ్లెం పుచ్చుకు నడిపించాడు.

లూసిగో యిల్లు చేరుకునేసరికి అర్ధరాత్రి అయింది. ఊళ్లో సగం మంది అక్కడే వున్నారు. నల్ల శాలువలు కప్పుకుని ప్రార్ధనగీతాలాలపిస్తూ, మెక్సికన్ స్త్రీలు పెద్ద కొవ్వొత్తులతో లూసిగో మంచం చుట్టూ కూచున్నారు. ఆ కొవ్వొత్తులు తప్పించుకు ఎలా వెళ్ళడమో తెలీకుండా వుంది జోసఫ్‌కి.

తనకి తెలిసిన గోంజలెస్ అనే ఆవిడని, ఈ కొవ్వొత్తులకు అర్ధమేమిటని అడిగాడు జోసఫు. 'చనిపోతున్న ఫాదరీకి వెలుతురు కనపడటం లేదట; ఆ వెలుతురుకోసం ఈ దీపాలు' అంది గోంజలెస్. ఈ కొవ్వొత్తులన్నీ తన మరణ సమయానికని, ఆ పరమలోభి నిలువ చేసుకున్నాడట.

మంచంమీద ఒక మూలగా లూసిగో రోదిస్తూ, యిటూ అటూ దొర్లుతూ పడుకున్నాడు. ఒకతను లూసిగో పాదాలు పడుతున్నాడు. మరొకతను కడుపులో బాధ తగ్గేందుకు, పొట్టమీద వేడినీళ్ళు కాపడం పెడుతున్నాడు. లూసిగో స్తిమితంగా పడుకోలేకుండా వున్నాడు. ఆరాటంతో యిటూ అటూ ఒకటే దొర్లుడు.

జోసఫు అక్కడి స్త్రీలను వుద్దేశిస్తూ, 'మీరు కొంచెం తప్పుకుని దారియిస్తారా? ఈ కొవ్వొత్తుల వెలుగు నన్ను వుక్కిరి బిక్కిరి చేస్తోంది' అన్నాడు.

జోసఫు మాటలకు భయపడి స్త్రీలు, ఆ కొవ్వొత్తులతో సహా పక్కగా వెళ్ళారు. మరణ శయ్యమీద వున్న లూసిగ్నో అమాంతం లేచి కూచుని 'వద్దు, వద్దు-వెళ్ళకండి. ఈ కొవ్వొత్తుల వెలుగు లేకపోతే, ఎవరేనా దొంగ నామీదపడి దోచుకుంటాడు' అన్నాడు. ఆ మాటలు విని స్త్రీలు భయభ్రాంతలై, మంచం చుట్టూతా చేరారు మళ్ళీ. లూసిగ్నో చిక్కి శల్యమై వున్నాడు. అతని దవడలు లోతుకుపోయాయి. నాసికాపుటం ముఖానికి తగిలించినట్టుగా వుంది. జ్వర తీవ్రతతో కళ్ళు ఎర్రగా వున్నాయి. ఆ నేత్రాలు జోసఫు ముఖంలోకి అనుమానంతోనూ విచారంతోనూ చూశాయి. ఈ చివరి రాత్రి లూసిగ్నో, మెక్సికన్ వలె కాక స్పానియర్డ్‌లా కనపడ్డాడు. జోసఫుని దగ్గిరికి పిలిచి, అతని చెయ్యి గట్టిగా పట్టుకుని, కాళ్ళు పడుతున్న మనిషిని తన శక్తికొద్దీ తన్నాడు ఆ ముసలివాడు.

'నా వొంటిమీద ఈ బట్టలు తీసేయండి. నా కిన్ని బొంతలు ఎందుకు కప్పారు? మత గురువు వచ్చాడుగనుక యింక నేను చెప్పవలసిన విషయమిది. ఇందులో రహస్యమేమీ లేదు. జోసఫు, నీకు నేనూ మార్టినెజు యిద్దరం ప్రబల విరోధులం. అయినప్పటికీ నేను నీకు కొన్ని విషయాలు చెప్పాలి. అంచేత చెబుతున్నాను.'

'మార్టినెజు చనిపోతూ తన ఆత్మశాంతికై అబిక్యూ లోని చర్చిలో ప్రార్థనలు జరిపి, బీదసాదలకి అన్నదానం, వస్త్రదానం చెయ్యమన్నాడు. ఆ ధనం లూసినో ఖర్చు పెట్టక, తన గదిలో ఒక మూల భూస్థాపితం చేశాడట. 'అదిగో ఆ శిలువకింద' – అని గోడవైపు చూపెట్టాడు లూసినో. జోసఫ్ సూచన ప్రకారం కొవ్వొత్తులు చేత బుచ్చుకున్న స్త్రీలు పక్కకి తప్పుకోగానే పెద్దపెట్టున అరిచాడు లూసినో. 'ఎక్కడివాళ్ళక్కడ వుండండి ఈ కొత్త మనిషికి నన్ను వొప్పచెబుతారా? అంత నమ్మక ద్రోహు లనుకోలేదు. అసలీదేవుడు మరణానంతరం కూడా, మన సంపద కాపాడుకోగల రహస్యం ఎందుకు చెప్పలేదా, అని దుగ్ధగా వుంది నాకు. నాకేగనుక వెనుకటి శక్తి వుంటే, ఎవరిమీదా ఆధారపడవలసిన పని వుండదు. కాని యిలా మంచమెక్కి మీ అందరికీ కూడా లోకువయిపోయాను...'

గోంజలెస్, లూసినో వద్దకు వచ్చి అతన్ని శాంతింప జేసి, మళ్ళీ పక్కమీద యథా ప్రకారం పడుండబెట్టి, 'చెప్పదలుచుకున్నదేదో నెమ్మదిగా చెప్పండి' అంది. మార్టినెజు తనకిచ్చిన పైకం, అతని అభీష్టప్రకారం అబిక్యూ చర్చికి పంపమన్నాడు. తన మంచానికి తల దిక్కుగా, గోడకి వేలాడదీసిన శిలువకి కొంచెం అడుగున తవ్వితే తన స్వంతనిలవ అవుపడుతుందిట. అందులో మూడవభాగం ట్రినిడాడ్‌కి యిచ్చి, మిగతా రెండుభాగాలూ శాంటాఫే

చర్చిలో తనపేర జరిపే అన్నదానాలకి వినియోగించ మన్నాడు.

'నీ కోరికలన్నీ నీ యిష్టప్రకారం నెరవేరుస్తాం. పరలోక యాత్రాసమయం ఆసన్నమయింది గనుక ఈ యిహలోకపు బాధలు మరచి, మనసును నిర్మలంగా వుంచు కున్నమీదటగాని నీకు 'సేక్రమెంటు' యివ్వడ మెట్లా?' అన్నాడు జోసఫు.

'ఈ ప్రపంచం వదిలి వెళ్ళడమంటే మాటలా? మీ కేం, మీ రింకా యిక్కడ వుండవలసినవాళ్ళు కాబట్టి, అలానే చెబుతారు. గోంజలెస్, యిలారా, తల్లీ, నువ్వొక్క తెవే నాకు నమ్మకస్తురాలివి. ఈ ప్రాణి యింకా వుండ గానే, ఆ దాచిఉంచిన ధనం బయటికి తీయించి, నా కళ్ళ ముందు లెఖ్ఖ రాయించు. అసలీ లెక్కలూ డొక్కలూ మీ కెవరి కేనా వచ్చా అని, నా కనుమానమే! ఆ కార్సన్ని ఎందుకు పిలిచుకొచ్చావు కాదు, ట్రినిడాడ్? అతని కే తెలుసు ఈ లెక్కలు. ట్రినిడాడ్, నువ్వో మూర్ఖుడవు, అంతదూరం వెళ్ళినవాడివి, కార్సన్ని వెంటబెట్టుకురారూ?'

జోసఫుకి ఈ ధోరణి చికాకు కలిగించింది. 'మహాను భావా, నీ ఆలోచనలు డబ్బుమీద కాక స్వర్గద్వారపు తలుపులవైపు మళ్ళితే కాని 'సేక్రిమెంట్' ప్రసాదించను. ఇటువంటి మనఃస్థితిలో వున్న మనిషికి పారిశుధ్య మివ్వడం భగవంతుని ఎడల అపచారం అవుతుంది.'

లూసినో కళ్ళు రెండూ మూసుకుని, చేతులుజోడించి నమస్కరించాడు. గోంజలెస్ పక్కగదిలోకి వెళ్ళి సేక్రిమెంటుకి తగు ప్రయత్నాలు చేసింది. జోసఫు మామూలు దుస్తులు వొదిలి, మతగురువు దుస్తులు వేసుకుని, పవిత్ర జలమూ, మిగతా వాటితోనూ పారిశుధ్య కార్యక్రమపు తంతు ప్రారంభించాడు. లూసినో తను లోగడ జరిపిన మత విద్రోహచర్యలకు పశ్చాత్తాపం వెలిబుచ్చుతూ, 'కన్ఫెషన్' ప్రారంభించి, తనతప్పు మనస్ఫూర్తిగా అంగీకరించినమీదటనే పవిత్రజలాభిషేకంతో అతని సద్గతికి ప్రార్థన జరిగింది.

ఈ పారిశుధ్యానంతరం, లూసినో ఆరాటం చాలా భాగం తగ్గింది. చేతులు రెండూ గుండెలమీదవుంచుకు భగవత్ ప్రార్థనలో పడ్డాడు. చుట్టూచేరిన స్త్రీలు భక్తిగీతాలు పాడసాగారు. బయట తలుపులమీద వర్షపు చినుకులు పడుతున్నాయి. హాండో గ్రామాన్ని శుభ్రపరిచేందుకా ఆ జలమన్నట్లుగా వుంది. ఏ ఒక్కరికీ బడలిక లేదు. ఇంటికి పోవాలన్న కోరిక లేదు. మరణశయ్యమీద వున్న ఆ మత గురువు అంతిమ ఘడియలు, సజల నేత్రాలతో దర్శించడం. తమ అదృష్టంగా భావించారు వారందరూ.

ఆ రోజులలో పాశ్చాత్య దేశాలలోకూడా మృత్యువుకి ఒక పవిత్రమైన సాంఘిక విలువ వుండేది. ఈ దేహం లోని రక్త ప్రసారం ఆగిపోయి, గుండె నిలిచిపోవడంతో మనిషి చచ్చిపోతున్నాడనే క్రూర పరీక్ష కాదది. దేహ

ధర్మం మాట అటుంచి, మరణమనేది 'ఆత్మ' ఈ లోకం నుంచి మరొక ఉన్నత లోకంలోకి చేసే ప్రయాణంగా భావించేవారు ఆనాటి ప్రజ. అది ఒక శూన్యత్వమూ, అంధకారమూ కాదు. ఈ పంచభూతమయ దేహం నుంచి జీవ శక్తి, మరొక ఉన్నత పథానికి చేసే ప్రయాణం.' ఆ ప్రయాణాన్ని వీక్షించగలగడమొక అదృష్టంగా పరిగణింప బడేది. నెపోలియన్, లార్డు బైరన్ మొదలైనవారు చెప్పిన కడసారి మాటలు ఎంతో ఘనంగా పేర్కొంటూ వుండేవారు. అవి మామూలు శబ్దాలే కావచ్చు గాని వాటిలో ఉత్కృష్టమైన విలువ వుందని నమ్మేవారు ఆనాటి ప్రజలు.

మృత్యు సాన్నిధ్యంవల్ల ఏర్పడే ఆ ప్రశాంత వాతావరణం, ట్రినిడాడ్ వడవడా లోపలికి వచ్చి, బిగ్గరగా ప్రార్థన చెప్పబోయేసరికి భగ్నమయింది. ఈ ట్రినిడాడ్ రాకకు మంచంమీద మగత నిద్రలో వున్న ముసలివాడు 'దొంగ, దొంగ! పట్టుకోండి, పట్టుకోండి' అని బిగ్గరగా అరిచాడు. పెదనాన్న భయాందోళన చూసి, పూర్తిగా శిలువ దగ్గరకు వెళ్ళక పూర్వమే వెనుకకు జారుకున్నాడు, ట్రినిడాడ్.

ఇంకో గంటకి సూర్యోదయమవుతుందనగా, లూసిరోకి శ్వాస పీల్చుకోవడం కష్టమయింది. ఇద్దరు మనుష్యులు అతన్ని ఎత్తి కూచోబెట్టి, ఆనుకునేందుకు దిండ్లు ఉంచారు. స్త్రీలలో గుసగుస ప్రారంభమయింది. కొవ్వొ

త్తులు మరి కొంచెం ముందుకు తీసుకు వచ్చి, వినమ్రులై మోకరించారు అందరూ. చుట్టూ ఉన్నవారి ముఖాలు పరీక్షిస్తున్నాడు లూసినో. అతని నేత్రాలు కాంతివంత ములై వెలుగుతున్నాయి. కళ్ళార్పకుండా కొవ్వొత్తులూ, కొవ్వొత్తుల వెనకాలగల ముఖాలూ చూస్తున్నాడు. అతని పెదవులు రెండుమూడుసార్లు విడివడ్డాయి. ఏదో మాట్లాడాలని ప్రయత్నం కాబోలు. ఆ పెదవులమీది కేదో చింతాక్రాంతమైన చిరునవ్వు తన్నుకుంటూ వచ్చి నట్టు, చూసేవాళ్ళకి కనిపిస్తోంది. కాని అతని స్థూల దేహం ఒక్కొక్క గుక్కె గాలి పీల్చుకునేందుకు, యావ చ్ఛక్తితో శ్రమిస్తోంది. 'మార్టినెజు, నీ కంటే శాస్తి కావాలి,' అని గుర్రం సకిలించినట్లుగా, ఒక్కసారి బిగ్గ రగా అని, ఆ ఒక్క ఊపులో గిలగిల్లాడుతూ మరణిం చాడు.

సూర్యోదయ సమయానికి లూసినో ప్రాణం గాలిలో కలిసిపోయింది. 'పరలోకంలో మార్టినెజు పడుతున్న కష్టాలు మా పెదనాన్న స్వయంగా చూసి, అతనికంటే శాస్తి కావాలన్నాడు' అని ట్రినిడాడ్ అడగనివాళ్ళది పాపంగా ప్రచారం చేశాడు. మెక్సికను స్త్రీలుకూడా, అది నిజమేనన్నారు. ఏమయితేనేమి, హాండో గ్రామంలో ఫావక్ లూసినో చివరి ఘడియలు ఒక కథగా మిగిలి పోయాయి.

చనిపోయిన మతగురువు అభీష్ట ప్రకారం నిధి తవ్వి తీసేందుకూ అతను చెప్పిన చోట్లల్లో తవ్వేందుకూ ఏర్పాట్లు జరిగాయి. ఈ వింత చూసేందుకు టావోస్ నుంచీ, శాంటాఫె నుంచీ, మోరానుంచీ మనుషులు వచ్చారు. లూసిరో దాచి ఉంచిన నిలువలో స్పానిష్ నాణాలేకాక ఫ్రెంచి, అమెరికన్, యింగ్లీష్ నాణాలు కూడా అనేకం వున్నాయి. అందులో కొన్ని చాలా పాతకాలపువి. అవన్నీ గవర్నమెంటు ఖజానాకి పంపి పరీక్ష చేయించే సరికి, వాటిమొత్తం విలువ అమెరికన్ కరెన్సీలో ఇరవై వేల డాలర్లని తేలింది. మామూలు కుగ్రామంలో నివసించే ఒక ముసలి మతగురువు, యిరవై వేల డాలర్ల సొమ్ము పాతరేసి వుంచడం నాటికీ నేటికీకూడా ఆశ్చర్యకరమైన సంగతే! అంత డబ్బు ఎలా నిలవచేశాడో!

# 6



# డోనా యిజబెల్లా

బిషప్ లెటూర్‌కి ఒకేఒక కోరిక వుంది - శాంటాఫె చర్చిని చక్కగా తిరిగి కట్టించడము. ఆ ఆలోచనగురించి తలపోసినకొద్దీ, ఆ వాంఛ, తన భౌతిక కాయం, ఈలోకం నుంచి నిర్గమించిన తదుపరినికూడా, తను చేసిన ఒక మంచిపని మిగుల్తుందనే ఆశాభావానికి కారకమయింది. తను శాంటాఫె వచ్చినప్పటినుంచీ, వున్నదానిలో ఏదో కొంత ఈ చర్చి నిర్మాణానికని వెనుకవేస్తూనే వున్నాడు. కాని, అది ఏపాటి? యాంటోనియో అను మెక్సికన్ ధనవంతుడు తనకి సాయపడటంతో కల నిజమయింది.

పేరుప్రతిష్టలూ లోకానుభవమూగల పెద్దకుటుంబం లోని మనిషి యాంటోనియో. జీవితంలో చాలాభాగం ఎల్పాసోలోనూ, న్యూఆర్లియన్సులోనూ గడిపి, తన అరవయ్యోయేట శాంటాఫెలో స్థిరపడ్డాడు. ఇక్కడికి వస్తూ తనవెంట పదిబళ్ళ సామాను తీసుకువచ్చాడట. 'చిన్న

ప్పుడే మొదటి భార్య గతించడంవల్ల, న్యూఆర్లియన్సులో వుండగా మరో కామెని వివాహం చేసుకున్నాడు. ఆమె కెంటకీరాష్ట్రపు వనిత. లూసియానాలో ఆమె బంధువులు వుండేవారు. ఫ్రెంచి కాన్వెంటులో చదువుకున్న అమ్మాయి అగుటవలన, భర్తను చాలవరకూ పాశ్చాత్య పౌరునిగా తయారుచేసింది. ఆ బట్టలూ ఆ అలవాట్లూ ఆ దర్జా అతని మెక్సికన్ బంధు మిత్రాదులకి కొంచెం కంటక ప్రాయంగా ఉండేది. అతని పద్ధతులూ నిజాయితీ మెచ్చు కునేవారుగాని లోపల యేదో ఈర్ష్యగానే ఉండేది వారికి.

యాంటోనియో భార్య డోనా యిజబెల్లా కాతలిక్ మతస్థురాలు. ఆవిడకు మతగురువులకు ఆతిధ్యమిచ్చుట ఎంతో సరదా. విశాలమైన ముందు వాకిలీ, తోటా ఉన్న యాంటోనియో భవనానికి ఆమె అక్షరాలా గృహలక్ష్మి. ఆమె వయసులో ఉన్నదని చెప్పడానికి వీల్లేదు. కాని ఆ మాట పొందిక, ఆ హుందాతనమూలో అవతల వాళ్ళని కట్టివేయగల ఆకర్షణ వుంది. ఉత్సాహమే జీవరక్తంగా తన ముఖసౌందర్యం కాపాడుకుంటూ వస్తోంది. ఇజబెల్లా తలకట్టులో అక్కడక్కడ మెరిసే వెండి వెంట్రుకలు ఆమె సౌజన్యదీప్తికి చిహ్నాలవలె కనపడ్తాయి. ఫ్రెంచి భాష అన ర్గళంగా మాట్లాడగలదు. స్పానిష్ తడుముకుంటూ మాట్లా డుతుంది; హార్ప్ అనే వాద్య విశేషమును చక్కగా వాయిం చడం వచ్చు; పాటలు శ్రావ్యంగా పాడగలదు.

లెటూర్ కీ జోసఫుకీ వీరి పరిచయం ఒక రకంగా అదృష్టమనే చెప్పవచ్చు. స్థానికులతోనూ నౌకర్లతోనూ తప్ప స్వజాతీయులతో స్వభాష మాట్లాడుకునే అవకాశం లేని ఈ మతసాధకు లిద్దరూ, ఒక్కోసాయింత్రం వారింటికి వెళ్ళి, వారి ఆతిథ్యమును పొంది ఎంతో ఆనందించి, నూతనోత్తేజంతో వెనక్కువచ్చేవారు. కడుపునిండా భోజనం పెట్టి,కమ్మని పానీయాలిచ్చి,మధురమైన సంగీతం వినిపించి, తమ చిన్ని ప్రపంచమేకాక బయట లోకంలో జరుగుతున్న అనేకానేక విషయాలపై ఆసక్తి కనబరుస్తూ, సంభాషించే దంపతులు ఎవరికి యిష్టులుకారు? ఒక్కోసారి ఇజబెల్లా ఫ్రెంచికవుల గీతాలు, జోసఫుతో కంఠం కలిపి పాడేది. స్త్రీ అవడం వల్ల ఆమెలో స్త్రీ సహజమైన అహంకారం కొంత లేకపోలేదు. తను పాడటమే మొదలు పెడితే, తన భర్తకు యిష్టమయ్యే మూడు పాటలు పాడటమేకాకుండా, ప్రతీ పాటా తనకు తెలిసిన మూడు భాషల్లోనూ పాడేది. నీగ్రోల పాటలు అప్పటికింకా అచ్చుకాలేదు. ఆ నోటా ఆ నోటా ప్రచారమైన అపూర్వ గాన మాధుర్యాలవి.

యాంటోనియో పొడ్డూ పొడవూ గల మనిషి. కాస్త స్థూలకాయుడనే చెప్పవచ్చు. నేత్రాలలోని కాంతి, అతన్ని చుట్టూగల మనుష్యులలో ప్రత్యేకునిగా చేసేది. తల యించుమించుగా బట్టతల అయిపోయింది. ఎక్కువగా మాట్లాడేవాడుకాదు. న్యూఆర్లియన్సునుంచి తీసుకువచ్చిన

ఆ పెద్ద కుర్చీలో ఆశీనుడై, పొడుగు చుట్ట నోట్లో పెట్టుకు, తన భార్యామణి సంగీతం మహదానందంతో ఆలకించే వాడు.

ఇజబెల్లా గురించి శాంటాఫెలోని మనుష్యులు రక రకాలుగా చెప్పుకునేవారు. అందం చెడకుండా యిన్నాళ్లు ఎలా కాపాడుకోకలిగిందని కొందరూ, భర్తని తన ప్రేమానురాగాలతో యిన్ని సంవత్సరాలెలా కట్టేయ గలిగింది, అదేవో తమాషాగా వుంది - అని మరికొందరూ, వీలైనప్పుడల్లా యీమె గురించి తర్కిస్తూ వుండేవారు. శాంటాఫెలోని అమెరికనులూ, యాంటోనియో సోద రులూ ఈ ఇజబెల్లా రకరకాల సౌందర్యలేపనములతో తన అందం కాపాడుకుంటోందనీ. ఎల్పాసోలోనూ, న్యూఆర్లి యన్సులోనూ ఆమెకి ప్రియులు వుండివుంటారనీ లెక్కలు గుణించారు. బావగారి కొడుకులూ మేనల్లుళ్ళూ, ఈమె గారికీ న్యూఆర్లియన్సునుంచి యాంటోనియో దంపతులు పట్టుకొచ్చిన పాబ్లో అను మెక్సికన్ కుర్రవాడికీ సంబంధం వుందని కథలు ప్రచారం చేశారు. శాంటాఫె వచ్చాక ఇజబెల్లా గురించి ఎన్ని అభూత కల్పనలు ప్రచార మయాయో అన్ని గౌనులు వున్నాయి ఆమెకి బట్టల బీరు వాలో. ఈ అందమైన గౌనులు అక్కడ పడివుండటమేతప్ప ఆమె ఎప్పుడోగాని ధరించేదికాదు వాటిని ఈ ఊళ్లో, భర్త జేబులోనుంచి డబ్బుతీసి, దాచి అట్టేపెట్టుకుందనీ భర్తకి మందుపెట్టి తనవశం చేసుకుందనీ అంటారు. ఈ కథల్లోని

నిజానిజాలు యిదమిద్ధమని చెప్పడం కష్టం. ఇంట్లో నౌకర్లందరూ యజమానురాలంటే ఎంతో భక్తి శ్రద్ధలతో మసులుకుంటారు.

పోస్టులో వచ్చే వార్తా పత్రికలు, అవి ఏడెనిమిది వారాల క్రితానివి అయినా, ఎంతో సంతోషంగా చదువుకునేవాడు యాంటోనియో. సిగరెట్ల కంటె చుట్టలూ, విస్కీ కంటె ఫ్రెంచి వైనూ శ్రేష్టమైనవని అతని అభిప్రాయం. సోదరులతో మాట్లాడేందుకు అందరకూ ఆసక్తిగల ప్రసక్తి ఏమీ ఉండేదికాదు. షావెజ్ అనే చిరకాల మిత్రుడూ, ఈ యిద్దరు ఫ్రెంచి మతగురువులూ తప్ప శాంటాఫెలో అతనికి హితువు లెవరూ లేరు. స్నేహితులంటే ప్రాణం యిచ్చే బాపతు. యాంటోనియో బిషప్ దగ్గరకు వస్తున్నప్పుడు, జోసఫుకి యిష్టమైన చెర్రీ బ్రాండీ సీసా ఒకటి పట్టుకువచ్చి, కొత్తగా వేసిన తోట ఎలా పెంచాలో సలహాలిచ్చే వాడు లెటూర్ కి. లెటూర్ కి వెండి వస్తువులు ప్రజంటు చేసినది వీళ్లొక్కరే. వాళ్ళిచ్చిన కంచమూ, నీళ్ళ పాత్రా, అలంకరణ సామగ్రి అతను నిత్యమూ వాడుతూండేవాడు. తనకు ఎటువంటి అలంకరణ సామగ్రి ఉన్నదో, అటువంటిదే తయారు చేయించి లెటూర్ కి యిచ్చాడు యాంటోనియో. 'మా వారు ఏది యిచ్చినా జోసఫ్ కైతే రుచి పాకాలకు సంబంధించినవీ, లెటూర్ కైతే మానసికానందం కలిగించేవీ యిస్తారు' అనేది ఇజబెల్లా.

ఈ దంపతులకి ఇనెజ్ అని ఒక కుమార్తె వుంది. ఆ అమ్మాయికి పెళ్ళీడువచ్చి చాలా రోజులైంది కాని పెళ్ళి కాలేదు. ఆ అమ్మాయికిక పెళ్ళి అవదనీ, పెళ్ళి చేసుకోదనీ అందరూ అనుకునేవారు. పరివ్రాజికగా చర్చిలో యింకా ప్రవేశించలేదు. ఒక విధంగా ఆమెది సర్వసంగ పరిత్యాగ జీవితమే. తల్లి లోగల హొయలూ సొగసులూ ఈమెలో లేవు. కంఠం మాత్రం చాలా బాగుండేది. న్యూ ఆర్లియన్సు చర్చి మందిరంలో అప్పుడప్పుడు పాడుతూ వుండేదట. తలిదండ్రులు శాంటాఫె వచ్చాక ఇనెజ్ ఒకే ఒక్కసారి వచ్చింద వాళ్ళని చూడడానికి. ఈ యింటి వాతావరణం ఆమె స్వభావానికి సరిపడ్డట్టు లేదు. ఇనెజ్ శాంటాఫె వచ్చినప్పుడుకూడా చాలా సాధారణపు దుస్తులు వేసుకుని తల్లితోపాటు చర్చికి వెళ్ళింది.

ఫాదర్ లెటూర్ చిరకాల వాంఛితమైన శాంటాఫె చర్చి నిర్మాణానికి యాంటోనియో సహాయం చేస్తానన్నాడు. ఆ దంపతులు స్నేహశీలురవడంవల్ల స్నేహితుల కోర్కె తీరడమే, వారికి ఆనందదాయకం. అదీ కాక యాంటోనియోకి తన స్వగ్రామమైన శాంటాఫెలో కాథెడ్రల్ నిర్మితమవాలని చాలాకాలం నుంచీ ఆశగా వుంది. తను తిరిగి వచ్చిన ప్రదేశాల్లో ఎక్కడ చూసినా పెద్ద పెద్ద చర్చి భవనాలు వున్నాయి. భగవత్ సేవకి ఆ విధంగా ధన ఉపయోగపడటంలోనే తన ధనానికి సార్థకత - అనుకున్నాడు

యాంటోనియో. లెటూార్, అతనూ ఎన్నో రాత్రులు ప్లానులు వేసి, డిజైనులు గీసి, ఎస్టిమేటులు కట్టి, ఎంత డబ్బవుతుందో లెఖ్ఖ వేశారు. 1860 లో, అనగా లెటూార్ అక్కడికి బిషప్‌గా వచ్చిన పది సంవత్సరాలకి, కొత్త సంవత్సరపు విందులో, చర్చి మందిరానికయ్యే పైకం తను విరాళంగా యివ్వనున్నాననీ, మర్నాటినుండీ పని ప్రారంభింప వచ్చుననీ అతిథులందరి ముందూ అన్నాడు యాంటోనియో.

ఆనాటి విందు మరువరానిది. శాంటాఫె నుంచి వెళ్ళిపోతున్న యిద్దరు మిలిటరీ వుద్యోగులతోపాటు ఫాదర్ లెటూార్ కిట్‌కార్సన్ మొదలైన వారెందరో పాల్గొన్నారు ఆ విందులో. భవిష్యత్ విషయమై ఎవరికీ ఎటువంటి ఆందోళనా లేదు. ఇంటినిండా దీపకాంతులు; సన్నని సంగీతం; స్నేహ మాధుర్యంతో కూడిన మిత్రసమాగమం. ఈ ఆనంద సమయంలో ముందు రాగల ఉపద్రవం, ఎవరికీ తట్టలేదు. సరిహద్దు ప్రాంతంలో నివసిస్తున్న కార్సన్ ఈ విందు కోసమని టావోస్ నుంచి రెండు రోజులు గుర్రం మీద ప్రయాణం చేసి, సెయింట్ లూయీలో చదువుకుంటున్న కుమార్తెని వెంటబెట్టుకు వచ్చాడు. బక్‌స్కిన్ కోటూ వెండి గుండీలూ ధరించే కార్సన్, సరిహద్దు ప్రాంతాలలో వుండే యోధుల్లాగానే వున్నాడు. కోట నుంచి వచ్చిన సైనికోద్యోగులు తమ సైనిక దుస్తులలోవున్నారు. సైనికోద్యోగులతోపాటు వారి భార్యలు కూడా వచ్చారు.

ఆనాటి విందువేళ స్త్రీ పురుషులందరూ తెల్ల గులాబీలు ధరించారు. లెటూర్ వెల్వెట్ దుస్తుల ధరించాడు. జోసఫేమో సోదరి ఫిలోమీనా కుట్టి పంపిన కొత్త గౌను వేసుకున్నాడు.

జోసఫ్ తనకు కావలసిన బట్టల కోసం ఫిలోమీనాకి వ్రాయడం, ఫిలోమీనా ఆమె వెంట నుండే సన్యాసినులూ అవి తయారుచేసి పంపడం, లెటూర్‌కి నచ్చేదికాదు. ఎందుకిలా సోదరి ప్రాణం తీస్తాడా, అని అనుకునేవాడు. తను కాన్వెంటుకి వెళ్ళినప్పుడు ఫిలోమీనా ఎక్కడో దూర దేశానున్న మనుషులకు యిటువంటి దుస్తులు కుట్టిపెట్టడం, తమ కెంత సంతోష హేతువో చెప్పేసరికి, లెటూర్ ఆశ్చర్యపోయాడు. ఆ మహారణ్యాలలో, ఆటవిక జాతుల మధ్యకి వెళ్ళి, ప్రభు సందేశామృతం పంచిపెట్టే మనుష్యులు తమకు పూజనీయులు - అన్నారు ఆ పరివ్రాజికలు. జోసఫ్ వ్రాసే ప్రతీ ఉత్తరమూ ఫిలోమినా వారికి చదివి వినిపించేది. ఆ ఉత్తరాలు వారిలో అద్భుత పరిణామాలు తీసుకువచ్చేవి. న్యూమెక్సికోలోని ఎర్రటి యెడారులూ, నీలపు కొండలూ, అడవి దున్నల గుంపులూ, నదీనదాలూ కొండ లోయలూ, అక్కడ నివసించే ఆటవికులూ, వారి విపరీతపు టాచారాలూ - యివన్నీ వూహించుకు, వాటికి వేటికీ జడువక ముందంజ వేస్తున్న మత సాధకులకి మనసులో ప్రణమిల్లేవారట.

ఇజబెల్లా జోసఫు వేసుకున్న కోటు బాగుందని మెచ్చుకునేసరికి, తను ఫిలోమినాని చూడడానికి వెళ్ళినప్పుడు,

కిటికీవద్ద నిలబడి, కాంతివంతమైన నేత్రాలతో కనబడని దేనినో చూస్తూ, మనసులో గల భావాలు విప్పిచెప్పిన, పరివ్రాజిక ముఖం గుర్తుకు వచ్చింది లెటూర్‌కి. భోజనాలూ పానీయలూ అయాక, పాబ్లో వచ్చి పాడసాగాడు. అతిథులు చుట్టలు ముట్టించి పొగ పీలుస్తున్నారు. ఫాదర్ లెటూర్‌కి మొదట్నుంచీ 'బేంజో' అంటే ఎందుకనో అంత యిష్టముండేది కాదు. ఆ శబ్దవాహినిలో యేదో ఆటవిక ధోరణి వుందని అతని అభిప్రాయం. కాని ఈ పాబ్లో ఆ తీగెలు పలికిస్తున్నప్పుడు, కొంత మార్దవం కన్పట్టింది గాని అది కూడా ఒక మాదిరి వైరితనమూ నిర్లక్ష్యాతా వలె తోచింది లెటూర్‌కి. కొండ కోనలు పట్టుకు జీవించే అడవి జాతుల ఆక్రందన అది. చుట్టల పొగ సుళ్ళు తిరుగుతోంది. మెక్సికన్ భూకామందులూ మత గురువులూ ఆ పాటని ఆలకిస్తున్నారు. ఇసుక తుపాను లేచినట్టుగా వుంది అది చేసే శబ్దం.

అందరితోనూ కలిసి కూచున్నా, అందరిలాగాక భిన్నంగా ఆలోచించే ఫాదర్ లెటూర్ ఏదో మూక వేదనలో పడిపోయాడు. కార్సన్ నేత్రాలు బేంజో వంక చూస్తున్నాయి. కాని ఆ బేంజో వెనుకనున్న సరిహద్దుల సంగీతం చూడలేక పోతున్నాయి. అక్కడున్న అందరిలోకీ అందగాడు షావెజ్, భోజనం వేళన తన పక్కన కూచున్న ఈ షావెజ్ మనసులో ఏ అగ్ని గోళాలు వుంటాయో గాని పైకి ఒక్కమాట అనడు; ఇక్కడి మనుషు

లకు ప్రమాదాల మధ్య జీవించడమే స్వభావ నైజమేమో అనుకున్నాడు లెటూర్.

షావెజ్ తన వంశ వృక్షం 1160 నుంచీ చెప్ప గలడు. 1160 లో మూరుల నుంచి షావెజ్ పట్టణాన్ని కాపాడిన యిద్దరు 'కాస్టేలియన్' వీరులలోనూ ఒకని వంశానికి తను చెందుతాడట. షావెజ్‌కి పెర్గోస్‌లోనూ, శాన్ మేటియా పర్వతాలలోనూ భూములున్నాయి. శాంటా ఫెలో ఒకచక్కటి భవనం వుంది. ఆ భవనం చుట్టూ అతిసుందరమైన పూల మొక్కలూ, ఫలవృక్షాలూ వున్నాయి. పువ్వుల మధ్య పళ్ళ మధ్య ఈ మనిషి దాక్కున్నాడా అనిపిస్తుంది. అమె రికనులంటే అతనికి మహా చెడ్డ కోపం. కార్సన్ కూడా యితనికి ఒక విధంగా విరోధే. తుపాకీ పేల్చడంలో కార్సనూ, షావెజూ సమానవుజ్జీలు. ఇక విలువిద్యలో షావెజ్‌ని వోడించగలవారు లేరు. అక్కడ శరసం ధానంలో అతనికతనే సాటి. బాణాలపోటీలలో అతనికి ఎన్ని బహుమతు లొచ్చాయో లెక్కలేదు. ఆటవికులను వోడించడమంటే ఈ మెక్సికనుకి చాలా యిష్టం. వారివద్ద నుంచి, వస్త్రాలూ, వెండి గుర్రాలు మొదలైనవి పందెంలో కాచి గెలుచుకునేవాడు షావెజ్.

మాన్యుయల్ షావెజ్, పదహారో యేడప్పుడు కొందరు మెక్సికను యువకులతో కలసి నవాజోలని వేటా డేందుకు వెళ్ళాడు. నవాజోలమీద దాడి చెయ్యడం, ఆ

నాటి మెక్సికనులకి ఒక క్రీడా వినోదం. లోనికెంత చొచ్చుకు పోయినా మెక్సికన్ యువకులకి నవాజోలు కనపడలేదు. ఇంకా లోపలికి వెళ్ళగా వెళ్ళగా, ఒకచోట ఒక పెద్ద గుంపు కనబడింది. గుంపు కనబడడమేమిటి, వాళ్ళు ఈ మెక్సికన్ యువకుల్ని చుట్టుముట్టెయ్యడ మేమిటి! ఆనాటి పార్టీకి షావెజ్ పెద్దనాన్నగారు నాయకుడు. పార్టీలోవున్న యాభైమంది మెక్సికన్ యువకులనీ ఒకరి తర్వాత ఒక రుగా చంపేశారు నవాజోలు. షావెజ్ యాభై ఒకటో వాడనడం చేత, అతని అదృష్టం బావుండి బతికాడు. ఏడు బాణపు దెబ్బలూ ఒక బల్లెపు పోటూతో, వీడింకా చావకుండా వుంటాడా అని, యాభై శవాల పక్కనా, ఈ షావె జ్ని కూడా పడేశారట.

ఆ రాత్రి నవాజోలు, విజయసూచకంగా విందు చేసుకుంటున్నప్పుడు రక్తసిక్త దేహంతో ఈ కురవాడు, గండశిలవైపుగా పాకి, శిలల మధ్య నుంచి శత్రువుల కంటపడకుండా తప్పించుకుని తూర్పుగా కాలినడకని ప్రయాణ మయ్యాడు. అది వేసవికాలం; ఎండ పేల్చే స్తోంది. గాయాలు భగ భగ మంటున్నాయి. కాని ఇంకా చిన్నతనపు పట్టుదల, మొండితనం వాటికి తగ్గ దేహధారు ఢ్యం వుండటం చేత, రెండు రాత్రులూ రెండు పగళ్ళూ త్రాగడానికి ఒక్క నీటి చుక్కకూడా లేకుండా అరవై మైళ్ళ దూరం ఆ పర్వతాలకి అడ్డంబడి వచ్చాక, ఒక నీటి వాగు కనపడింది. అక్కడ మంచి నీళ్ళు త్రాగి, తన

గాయాలు కడుక్కొని ఆ నీటి వాగు పక్కనే అలసటతో నిద్రపోయాడు.

కళ్లు తెరుపులకి వచ్చేసరికి కడుపులో ఆకలి మండి పోతోంది. బ్రహ్మ చెముడు మొక్కల గుజ్జు కడుపు నిండా తిని, శాన్ మేటియో పర్వతాల వైపుగా నడుచుకుంటున్నాడు. అలా నడవగా నడవగా మెక్సికన్ గొర్రె కాపరుల గుంపు ఒకటి కనపడింది. వాళ్ళు కనపడడమేమిటి స్పృహ తప్పిపోవడమేమిటి, ఒకే క్షణాన జరిగాయి. ఆ గొల్లలు తమ దగ్గర ఉన్న ఆహారం పెట్టి, తమకు తెలిసిన మూలికలతో వైద్యోపచారం చేసి, సెబోల్లెటా గ్రామం చేర్చారు. అక్కడ చాలా రోజులతను ప్రమాదావస్థలో పడి వున్నాడు. షావెజ్‌కి ఆస్తి సంక్రమించాక, ఆ ప్రాంతాన్నంతా ఫలవంతం చేసి అక్కడి ప్రజల కెన్నో సదుపాయాలు చేసేందుకు తోటలూ, భవనాలూ నిర్మించాడు.

అతనికి మొదటి నుంచీ అమెరికన్ పరిపాలన గిట్టేది కాదు. కాని స్థానికులు విజృంభించారని వినడం తరవాయిగా యుద్ధభూమికి పరిగెత్తి, కొత్త గాయాలతో తిరిగి వచ్చేవాడు. లెటూర్ జోసఫ్‌లు స్థానికులతోనూ, అమెరికనులతోనూ అంత చెలిమితో వుండడం షావెజ్‌కి గిట్టేది కాదు. ఎన్ని చెప్పినా అతను మార్టినెజ్ తరహాకి చెందిన మనిషి. ఇజబెల్లా అందచందాలు అభినందించడానికి వచ్చాడు ఈ విందుకి. ఇక్కడ కూడా అమెరికను యూని

ఫారమ్స్ ప్రత్యక్షమగుట అతనికి వెగటుగా కనపిం చింది.

పాబ్లో వాయించే 'బేంజో' అయాక, జోసఫ్ ఇజ బెల్లాని ఉద్దేశిస్తూ 'మా బోటి వాళ్ళకి కొంచెం శాస్త్రీయ సంగీతం వినిపింప జేస్తే...' అంటూ ఆమెను 'హార్ప్' వైపుగా తీసుకు వెళ్ళాడు. తనను అంత ప్రత్యే కంగా మెచ్చుకుంటూ పాడమని కోరుట, ఇజబెల్లా కెంతో సంతోషమయింది.

భర్త కిష్టమైన 'లా పెలోమా' అను కృతి శ్రావ్యంగా పాడింది ఇజబెల్లా. నిద్రాసక్తంగా వున్న భర్త నేత్రాలు చిరునవ్వుతో చూశాయి ఆమె గానమును అభి నందిస్తూ. అదే ఆ దంపతు లిచ్చిన చివరి విందు.

భోజనానంతరం ఆపై ఆదివారం రాత్రి, నిప్పు గూడు దగ్గర నించుని కొవ్వొత్తి వెలిగిస్తున్న యాంటో నియో, నిప్పు వైపు తూలి మరణించాడు. పాబ్లో పరువు లెత్తుకుంటూ వెళ్ళాడు బిషప్ కోసం. నిశిరాత్రి కాక పూర్వమే యాంటోనియో సోదరులలో యిద్దరు, తప్ప తాగి, శాంటాఫెనుంచి ఆల్బకుర్క్యూ గుర్రాలమీద ప్రయాణ మయారు – సమర్థుడైన అమెరికన్ న్యాయవాదిని పెట్టుకు అన్నగారి ఆస్తి తమ స్వాధీనము చేసుకునేందుకు.

## 2

యాంటోనియో అంత్యక్రియలు చాలా గొప్పగా జరిగాయి. అంత్యక్రియల వేళకి జోసఫ్ అక్కడ లేడు. దక్షి

ణానికి ఉద్యోగ రీత్యా వెళ్ళాడు. జోసఫు శాంటాఫే చేరు కునేసరికి, ఇజబెల్లా భర్తృవిహీన అయి అయిదారు వారాలు గడిచింది. జోసఫు యింకా గుర్రం దిగి లోపలికి వచ్చాడో లేదో, ప్లీడరుతో మాట్లాడుతున్న లెటూర్, జోసఫుని తక్షణం తన గదిలోకి రమ్మనమని కబు రంపాడు.

యాంటోనియో తన ఆస్తి వ్యవహారాలు బాయిడ్ అను ఒక ఐరిష్ కాతలిక్ న్యాయవాదికి ఒప్ప జెప్పాడు. ఈ బాయిడ్ బోస్టను నించి కొత్తగా వచ్చాడు ఈ ప్రాంతాలకి ప్రాక్టీసుకోసం. శాంటాఫెలో ఆనాడు పత్రాలు భద్రంగా దాచగల బాంకులూ ఖజానా పెట్టెలూ లేవు. అంతకీ బాయిడ్, యాంటోనియో మరణ శాసనాన్ని తన దగ్గిర ఉన్న గట్టి పెట్టెలో జాగ్రత్తచేశాడు. యాంటో నియో ఆస్తి రెండు లక్షల డాలర్లుగా అంచనా వేయ బడింది. రెండు లక్షలంటే ఆ రోజుల్లో చాలా పెద్ద మొత్తం. తన యెస్టేటు నుంచి వచ్చే రాబడిని, భార్య యిజబెల్లా, కుమార్తె ఇనెజ్ యిద్దరూ తమ జీవిత కాల మంతా యథేచ్ఛగా అనుభవించి, తదనంతరం సదరు ఆస్తిని శాంటాఫెచర్చికీ క్రీస్తు మత ప్రచారానికీ సంక్ర మింప జేయాలని వ్రాశాడు. శాంటాఫె చర్చి నిర్మాణా నికి తను యిస్తా నన్న మొత్తం ఎలా వచ్చేదీ, ఎలాపుచ్చు కోవలసిందీ స్పష్టంగా వుదహరించ లేదు. ఆ సూచనలు

చేసేపాటి వ్యవధి ఏదీ, వారం తిరక్కుండా చనిపోయా డామె !

యాంటోనియో సోదరులు ఈ విల్లు చెల్ల నేరదని ప్రతిఘటిస్తున్నారనీ, అల్బకర్క్యూలో ఒక ప్రముఖ న్యాయ వాదికి వకాలతు యిచ్చారనీ విశదీకరించాడు బాయిడ్. ప్రతివాదంలో ముఖ్యమైన అంశము ఏమిటంటే, ఇనెజ్ వయసులో పెద్దదనీ ఆమె యిజబెల్లా కూతురు అయి వుండ దనీను ! తమ అన్నగారు చిన్నతనపు రోజుల్లో షోకిల్లాగా తిరుగుతూ అనేక స్నేహాలు చేశాడనీ, అటువంటి ఒక స్నేహ ఫలితంగా. ఊరూ పేరూ లేని స్త్రీకి కలిగిన పిల్ల అయి వుంటుంది ఈ ఇనెజు అనీ, యిజబెల్లాకి ఆమె దత్త పుత్రికే గాని నిజ సంతానం కాదనీ వారివాదన. బాయిడ్ న్యూ ఆర్లియన్సు మనిషిని పంపించి యాంటోనియో ఇజ బెల్లాల వివాహపత్రం కాపీ తెప్పించాడు. ఇజబెల్లా జన్మిం చిన కెంటకీ రాష్ట్రానికి ఆమె పుట్టిన తేదీ కోసం మనిషిని పంపాడు గాని అక్కడ జనన పట్టికలు అంటూ లేవు. అవి లేని కారణంగా ఇజబెల్లా అసలు వయసు తెలీడం లేదు. తన వయసు ఈమె చచ్చినా చెప్పదు. శాంటాఫెలో అందరూ అనుకోడం ఆమెకి నలభై రెండు వుంటాయని. ఆ లెక్కన చూస్తే ఇనెజు జన్మించే నాటికి, ఇజబెల్లా వయసు ఆరు లేక ఎనిమిది అయి వుండాలి. ఈ ఒక్క అంశము మీద వీరి వాదము ఎగిరిపోయేటట్టుంది. ఇజబెల్లా అసలు వయసు ఏభైకి పైమాట – ఏభై రెండో మూడో.

ప్లీడరు బాయిడ్ ఈ వ్యవహారము వివరాలు ఆమెకు వివరించి చెబుతూ, 'మీరు మీ వయస్సు ఒప్పుకుంటే ఈ గొడవ వుండదు. అందరి ముందూ కాదు - ఆ న్యాయాధిపతి ముందు ఆ పది నిమిషాలపాటూ ఒప్పుకోండి' అని కాళ్ళా వేళ్ళా పడి చెప్పుకున్నాడు. కాని ఆమె ఈ హితవు పాటించేటట్టు లేదు. ససేమిరా ఒప్పుకోనంది. అందుచేత ప్లీడరుగారు లెటూర్‌నీ జోసఫ్‌నీ 'మీరెలాగో ఆమె గారికి నచ్చజెప్పి, ఒప్పించి, పుణ్యం కట్టుకోండి' అని బతిమాలుకునేందుకు వచ్చాడు.

ఇటువంటి అతి సున్నితమైన విషయంలో తను జోక్యం కలిగించుకోవడం బావుంటుందా, అని లెటూర్ సంశయిస్తూవుండగా, జోసఫు ముక్కుమీద గుద్దినట్టు 'ఆ అమాయక స్త్రీల ఆస్తి హక్కులు కాపాడుతూ, తద్వారా చర్చికి రావలసింది, మొదటికే మోసం జరక్కుండా చూసుకోవలసిన నైతిక బాధ్యత మనది. మన కర్తవ్యం మనం నెరవేర్చక తప్పదు. పదండి. వెంటనే బయలుదేరుదాం' అంటూ విప్పిన కోటు మళ్ళీ భుజం మీద వేసుకు, 'ఎందుకు వినదో చూదాం' అన్నాడు - దైవకార్యంలో ఓటమికి స్థానం లేదని నమ్మే జోసఫు.

న్యూ యియర్ పార్టి అయాక యాంటోనియో యింట్లో మళ్ళీ అడుగు పెట్టడం అదే మొదటిసారి ఫాదర్ జోసఫుకి. యజమానిలేని యిల్లు అప్పుడే కళా విహీనమయింది. ద్వారబంధం గొళ్ళెం వూడి పోయింది. ముందు

భాగాన పాతగుడ్డలు చిమ్మేసినట్లు పడి వున్నాయి. కుక్కలు తిని పారవేసిన మాంసం ముక్కలు అట్లానే వున్నాయి. చిలుక పంజరాన్ని ఈ మధ్య యెవరూ శుభ్రం చేసినట్టు లేదు. అద్దంలా వుండే ముందు వాకిలికి ప్రేతకళ ఆవహిం చింది. బాయిడ్ బెల్ కొట్టగానే పాబ్లో వచ్చి తలుపు తెరిచి, అతిథుల్ని డ్రాయింగు రూములో ప్రవేశ పెట్టాడు. వెచ్చగా వుండవలసిన డ్రాయింగు రూమ్‌లో చలిగా వుంది. నిప్పు గూడులో చితుకులు వెయ్యలేదు సరికదా, అది శాగు చేసి ఎన్నాళ్ళయిందో! కిటికీలలోనూ, కుర్చీల మీందా మెర్రదుమ్ము. గ్లాసు తలుపులు తెరిచినప్పుడల్లా కన్నీటి భారమూ అన్నట్టు 'ఘుయ్' మనేవి. వ్రాత బల్లమీద ఖాళీ సీసాలూ, సగం తాగిన గ్లాసులూ, చుట్ట పీకలూను గదిలో ఒక మూలగా 'హార్ప్' ఆకు పచ్చ ముసుగుతో నిద్ర పోతోంది.

అతిథులని కూచోమని చెప్పి, పాబ్లో యజమాను రాలి కోసం లోపలికి వెళ్ళాడు. ఆమె ఈ మధ్య లోకం వంక చూడ్డం లేదనీ, వంట మనిషి చెయ్యి కాల్చుకోడం చేత నిప్పు గూడులో నిప్పు ఎవరూ వేయలేదనీ, పనివాళ్ళు మరీ సోమరిపోతులై పోతున్నారనీ అడగని సంజాయిషీ చెపుతూ, నాలుగు చితుకులు తీసుకు వచ్చి నిప్పుగూడులో వేసి నిప్పు రాజేశాడు పాబ్లో.

కొద్ది సేపయాక నల్లదుస్తులతో ఇజబెల్లా దర్శన మిచ్చింది. ఆ నల్లబట్టల్లో ఆమె ముఖం పాలిపోయి వుంది.

నేత్రాలు అరుణ వర్ణం దాల్చాయి. మెడమీద పడే వొం కులూ, చెవి మీదుగా జారే వొంకులూ తెచ్చి పెట్టుకున్న తెల్లదనం దాల్చాయి.

జోసఫు పరామర్శవాక్యాలు చెప్పి, ఆమెను కొంచెము వోదార్చిన మీదట ప్లీడరుగారు తమ వ్యవహారము మళ్ళీ విప్పారు. లేసు రుమాలుతో కనురెప్పలూ, ముక్కూ నాజూగ్గా తుడుచుకుంటూ, కదలక మెదలక ప్రతిమలా కూచుంది ఇజబెల్లా. ప్లీడరుగారు చెప్పే **మాటల్లో** ఒక్కటీ ఆమె చెవిలో దూరినట్టు లేదు.

ఆ ధోరణి కాసేపు చూసేటప్పటికి ఫాదర్ జోసఫుకి వళ్ళు మండింది. దగ్గరగా వచ్చి కూచుని, 'అమ్మా, తల్లీ, నీ భర్తగారి సోదరులు నీకూ మీ అమ్మాయికీ చిప్ప చేతి కిచ్చి, ఈ ఆస్తంతా కాజేదామనుకుంటున్నారు. ఆ కారణంగా చర్చికి వచ్చేదికూడా పోతుంది. చనిపోయిన ఆ పుణ్య పురుషుని ఆత్మ శాంతికోసమైనా నువ్వు వాళ్ళనీ పని చేయనివ్వకూడదు. చిన్న పిల్లలా మొండి పట్టుపట్టే సమయమా యిది? నీ భర్తగారి గౌరవ స్మృతిని మలినం చేయబూనే ఆ రాక్షసుల ఆగడాలు నువ్వు సహిస్తావా? ఆయన పవిత్ర నామం కాపాడడం మన ధర్మంకాదా? మేము నిన్నేమీ గుళ్ళు ఎత్తమనడం లేదు, రాళ్ళు ఎత్తమనడం లేదు. కోర్టు వారి సమక్షాన నీ వయసెంతో వొప్పుకుంటే చాలు. ఇనెజ్‌కి తల్లివయేపాటి వయస్సు నీకుందని, జడ్జీని నమ్మించగలిగితే అందరం బయట పడతాం. వయసు చెప్ప

డానికి అంత భయం దేనికి? నా వయస్సు యాభై మూడేళ్లు, అని ధైర్యంగా చెప్పెయ్,' అన్నాడు.

ఇజబెల్లా బెదిరిపోయింది. ఆమె ముఖం పాలిపోయింది. సోఫాలో ఒక మూలగా జరిగి, కళ్ళు రెండూ గోడవైపుకి తిప్పుకు, తలవంచుకు, ఆగ్రహం పట్టలేక అంది: 'నాకు యాభై మూడేళ్ళా? ఇటువంటి నిందా వాక్యం నా ముఖం మీద యింతదాకా ఎవరూ అనలేదు. ఇంత అమర్యాద కరమైన మాట నేను వినవలసి వస్తుందనుకోలేదు. మొన్న డిశంబరు నాలుగో తేదీనే కదా నేను నలభై రెండవ జన్మ దినం చేసుకున్నాను! యాంటోనియో బతికి వుంటే, నా వయసు మీకు చెప్పి వుండేవాడు. ఆయన లేకపోవడం వల్ల కదా, యిందరిచేత యిన్ని మాటలు పడుతున్నాను! డబ్బు వ్యవహారాలు ఆయన నాతో ఏనాడూ మాట్లాడేవాడు కాదు,' అంటూ ఆ చిన్న రుమాల్లో ముఖం దాచుకు శోకించ సాగింది. 'ఆడవాళ్ళతో ఎలా మాట్లాడాలో నీకు తెలీదు' అని లెటూర్ జోసఫుని కూకలేసి ఇజబెల్లా పక్కగా సోఫాలో కూచుని, జోసఫు తరపున తను క్షమా పణ చెబుతూ, ఎంతో అనునయంగా మృదువచనాలతో అన్నాడు. 'మీకు యాభై మూడేళ్ళని ఎవరనగలరు మతి లేని వాళ్ళంటారుగాని! మీ వయసు నలభై రెండని నాకు తెలుసు. మొన్నటి జన్మదినానికి నే నొచ్చానుగా! మీ ముఖం చూస్తే, ఆ పాటి వయసుందని కూడా అనుకోరు ఎవరూ! మీ ముఖమూ మీ మనసూ నవయవ్వనంలో

వున్నాయి. ముఖమనగా ఏమిటి? హృదయానికి ప్రతి బింబం! ఈ చర్చికీ కోర్టులకీ లెక్కలూ అవీ అవసరము. రేపు కేసు నెగ్గే నిమిత్తం కోర్టులో ఏభై రెండు అని మాట వరుసకి అన్నారనుకోండి! అంత మాత్రాన మీ రూప విలాసం తగ్గుతుందా? ముఖంలో ముడత యేర్పడుతుందా చెప్పండి? ఆస్తి పోతే పోతుందని మీరనుకోవచ్చు. ఆస్తితో బాటు సౌందర్యరేఖా కరిగిపోతూందే! స్త్రీ వయ సెప్పుడూ ఆమె ముఖ కాంతిని బట్టి నిర్ణయించమన్నారు పెద్దలు.'

కాంతులు ప్రసరించే సజల నేత్రాలతో తలపైకెత్తి అతని ముఖంలోకి దీనంగా చూస్తూ 'మీరంత ఆప్యా యంగా మాట్లాడ్డం నాకెంతో సంతోషంగా వుంది. ఒకసారి నా వయస్సు ఒప్పుకున్న తరువాత, లోకానికి ముఖమెట్లా చూపగలను? నాకీ డబ్బూ, దస్కం వద్దు. ఆయన సోదరు లనే తీసుకోనియ్యండి' అన్నది ఇజబెల్లా గద్గదస్వరంతో. ఫాదర్ జోసఫు తోకతొక్కిన తాచులా లేచి, ఆమెను నలు సంత వివేకమన్నా కలిగించాలనే ఆశతో ఆమె ముఖంలోకి తీక్షణంగా చూశాడు. 'రెండు లక్షల డాలర్లు, ఆలోచిం చండి!! మీ యిద్దరి జీవితాలూ హాయిగా వెళ్ళిపోతాయి. ఈ అర్థం లేని పట్టుదలతో కన్న కూతురిని బికారిగా చేస్తావా? నీకు పుణ్యం వుంటుంది నా మాట విను. ఇలాగే మొండికేసి కూచున్నావా, దాయాదులు సమస్తం హరించి, నిన్ను వీధిలోకి తరుముతారు' అన్నాడు.

'నా విషయమంటారా, నా కెప్పుడూ డబ్బు మీద మమత లేదు. ఇక ఇనెజ్ సంగతి నేనేం చేయగలనూ? అది యెలానూ 'నన్'గా చేరుతానంటోంది, అంచేత దానికీ డబ్బు అవసర ముండదు.'

ఫాదర్ జోసఫు ఆమె దగ్గరకు వచ్చి. ఆ చల్లబడి పోయిన ఆమె చేతిని తన చేతులలోకి తీసుకు, 'సరి, మీ యిద్దరూ నిక్షేపంగా బికార్లవండి; నా కెటువంటి అభ్యంతరమూ లేదు. కాని మీ మూర్ఖతవల్ల చర్చికి రావలసిన ధనం నిష్కారణంగా పోతోందే! భగవత్ కార్యాలకై వినియోగపడవలసిన ధనం, నువ్వు చేజేతులా చెడగొడతావా? ఇది ఎంత పాప కార్యమో, ఎంత ద్రోహమో, ఆలోచించు!' అన్నాడు జోసఫు.

ఫాదర్ లెటూర్ జోసప్‌ని కొంచెం శాంతి పడమని, సౌంజ్ఞ చేస్తూ, ఇజబెల్లా చేతిని తన చేతిలోకి తీసుకు యిలా అన్నాడు: 'ఇటువంటి విషయమై మనం మరీ బలవంతం చెయ్యకూడదు. యాంటోనియో సతిని స్వంతంగా ఆలోచించుకోనివ్వాలి. ఆమె తనకు తానుగా తన అంతరాత్మను అడగాలి. నలుగురిలో చిన్నతనమని బాధపడే ఆమె, తన అహంకారాన్ని తనకు తానుగా జయించగలగాలి. మనుష్యులు యెప్పుడూ ఆత్మనిర్దేశ ప్రకారం నడుచుకోవలసిన వాళ్ళు. లేమి, దారిద్ర్యం – యివేమో ఒట్టి మాటలు అనుకుంటున్నారు. బావగార్ల దయాధర్మం మీద

బతకడం యెంత కష్టమో మీకు తెలీదు. నేను మిమ్మల్ని నిజం ఒప్పుకోమనడంలో నా స్వార్థం కొంత వుంది. ఆ స్వార్థమేమిటి అంటారేమో! మీరెప్పుడూ యిచే ప్రకారం సౌందర్య రాసిలా వెలుగుతూ, ఈ చుట్టూ గల మాలాటి వారికి ఒక వెలుగు కిరణముగా ప్రకాసింపవలెననే స్వార్థ వాంఛ. ఈ శాంటాఫె నుండి మీ సౌందర్యంకూడా మాయమైతే, యింక మిగిలేదేమిటి?' ఇజబెల్లా ఏడుపు ఆపి, కళ్లు తుడుచుకుని, అతని కోటు బొత్తాము ఒకటి తిప్పుతూ. 'ఫాదర్, ఇనెజ్ తల్లి నయేందుకు, ఎంత వయసుంటే సరి పడుతుంధో చెప్పండి?' అంది.

లెటూర్ వెంటనే చెప్పలేదు. కాస్త ఆగి, ఆలోచించాడు. బాయిడ్‌ని వుద్దేసిస్తూ సూచన చేశాడు.

'ఏభై రెండు. మీరా సంగతి కోర్టులో వొప్పుకొని, చివర వరకూ మాట తిరుగకుండా వుంటే, మనము ఈ కేసు నెగ్గుతాము' అన్నాడు బాయిడ్,

'సరే,' అన్నది, తలవంచుకుని ఇజబెల్లా. అతిధులు వెళ్ళేందుకు లేచారు. దుమ్ము పట్టిన తివాసీల వైపు దీనంగా చూస్తూ 'అందరి ముందూ ఒప్పుకోవాలి కాబోలు, అయ్యబాబోయ్,' అని తనలో తను గొణుక్కుంది.

ఈ స్థానిక ప్రజలందరిలోగల మూఢ నమ్మకాలు పోగొట్టవచ్చు గాని ఒక్క శ్వేతవనితలోని అహంకారం మట్టుకు పోగొట్టలేము - అన్నాడు ఫాదర్ జోసప్ బయటకి వచ్చాక.

'ఇంత క్రూరకార్యం నే నేనాడూ చేయలేదు. ఆమె చేత వయసువొప్పిస్తున్నాను-అంతకంటె ఘోరం ఏముంది?-ఇంకెప్పుడూ యిలాంటి పాపపు పనిలో యిరుక్కోకూడదు,' అన్నాడు లెటూర్.

బాయిడ్ యాంటోనియో సోదరులని వోడించాడు. విచారణ రోజున బిషప్ కోర్టుకి వెళ్ళలేక పోయాడు. కాని జోసప్ మాత్రం మొదటి నించీ చివరి వరకూ అలా నిలబడే వున్నాడు. కూర్చునేందుకు కుర్చీలు లేవు అక్కడ. యువకుడైన బాయిడ్‌కి ఒక పక్క కాళ్ళు వణుకుతూనే వున్నాయి. ఇజబెల్లా వంక వేలెట్టి చూపిస్తూ, 'అమ్మా, మీ వయస్సు ఏభై రెండు సంవత్సరాలు కదూ?' అని అడిగాడు.

నల్లగౌనులో కోర్టుకి వచ్చిన ఇజబెల్లా, 'అవును' అని సన్నని గొంతుతో, అతి కష్టం మీద అనగలిగింది. 'బతికానురా బాబూ' అనుకున్నాడు ప్లీడరుగారు.

తీర్పు యిచ్చిన రోజు రాత్రి యాంటోనియో గృహానికి వెనుకటి కళ వచ్చింది. యాంటోనియో పాతమిత్రులూ షావెజ్ మొదలైన వారూ ఇజబెల్లాని అభినందించేందుకు వచ్చారు. అభినందన ప్రయత్నం జరుగుతోందని తెలియగానే వూళ్ళోవున్న పెద్దలూ, మిలటరీ వుద్యోగులూ, యాంటోనియో సోదరుల శత్రువులూ-వీళ్ళు కూడా ఈ ఈ జమీందారిణికి తమ అభినందనలు తెలిపేందుకు వేంచేశారు. తెల్లషర్టుమీద పాబ్లో వెల్వెట్ జాకెట్ ధరిం

చాడు. వంటమనిషి తొందర తొందరగా పదార్థాలు చేస్తోంది. సెల్లార్ నుంచి విస్కీ, షెర్రీ, షాంపెయిను మొదలయిన పానీయాలు తెప్పించారు.

దావా నెగ్గడంతో యింట్లో అందరికీ నూతనోత్సాహంతోపాటు, యింటికి వచ్చిన వాళ్ళకి కూడా సంతోషంగా వుంది. వైను గ్లాసుల్లోని దుమ్ము పాబ్లో, తను విడిచిన చొక్కాతో తుడిచేస్తున్నాడు. ఎవరూ పురమాయించకుండానే ట్రే తరువాత ట్రే పట్టుకు వచ్చేస్తున్నాడు. పురమాయించేందుకు యజమానంటూ వుంటేగా! తను సైడ్ బోర్డు పక్కన నిలబడి, తాగాలని వున్నప్పుడల్లా పుచ్చుకుంటున్నాడు. ఆ రాత్రి ఇజబెల్లా కూడా కొంచెం షాంపెయిను పుచ్చుకుంది. మొదట, జార్జియాలోని ఒక మిలిటరీ వుద్యోగితో పుచ్చుకుంది. ఆ తరువాత తమ యిరుగుపొరుగు అయిన ఫెర్డినాండ్ తో మళ్ళీ మరొక గ్లాసు పుచ్చుకోవలసి వచ్చింది. వర్షంపడ్డ వెనక తోటలోని పూల మొక్కలన్నీ నవ్వుతాయే, అలా వున్నారు యింట్లోని మనుష్యులూ, యింటికి వచ్చిన అతిథులూను.

ఫాదర్ జోసపుకీ, ఫాదర్ లెటూర్ కీ ఇంత తతంగం జరుగుతోందని తెలియదు. కోర్టులో ఆమె చూపిన సాహసానికి అభినందించేందుకుగాను, రాత్రి ఎనిమిది గంటలకి బయలుదేరారు. ముందు వాకిట్లోకి వచ్చేసరికి లోపల నుంచి సంగీతం వినపడింది. ఇల్లంతా దీపతోర

కాలతో నిండి వుంది. పొడుగు కోట్ల ప్రముఖు లందరూ వున్నారు. న్యాయవాది బాయిడ్, మరికొందరు సైనికోద్యోగులు సైడ్ బోర్డు దగ్గర నిలబడ్డారు. పాబ్లో వారికి గ్లాసు తర్వాత గ్లాసుగా షాంపెయిను పోస్తున్నాడు. డ్రాయింగు రూము అవతల కొసనుంచి, ఇజబెల్లా కంఠ స్వరం వీణానాదంతో మిళితమై వినపడుతోంది.

పాట అయేదాకా గుమ్మం దగ్గర నిలబడి, ఆ తర్వాత తలుపు తెరచుకులోనికి ప్రవేశించారు ఫాదరీలిద్దరూ. తిన్నగా ఆమె వద్దకు వెళ్ళి తమ అభినందన తెలియపరిచారు. ఎప్పటికి మల్లే నల్ల గౌనే ధరించి వున్నది. ఆమె అందమైన శిరోజాలు ఒక పాయ కుడి చెవి మీదా, రెండుపాయలు చెరో కణతమీదా, మరొకటి మెడమీదా తీర్చిదిద్దినట్టు పడుతున్నాయి. మత గురువు లిద్దరూ తనవైపు వచ్చుటను చూచి, సంగీత వాయిద్యం ఆపి, రెండు చేతులూ ముందుకు చాస్తూ, యిద్దరికీ చెరో చేయీ అందిస్తూ కాంతులు వెదజల్లే కళ్ళతో ఆహ్వానించింది. ఆమె ముఖము సహజానురాగంతోనూ సంతోషంతోనూ వికసిస్తోంది. ఆ క్షణాన ఆమెకా ఫాదరీలమీద నిరుపమానమైన గౌరవం కలిగింది. ఆ గౌరవంతోపాటు కొంత చిలిపితనం కూడా పైకి వుబుక్కు వచ్చింది. ఆహ్వాన వాక్యంలో హాస్య చతురిమ కనపడేటట్టు అందరి గుస గుసలనీ అధిగమించే కంఠ

స్థాయితో బిగ్గరగా అంది: 'మీ యిద్దరినీ నే నీ జన్మకి మన్నించేది లేదు. ఫాదర్ జోసఫ్, నిన్ను క్షమించేది కల్ల. బిషప్ లెటూర్, మిమ్మల్నీ అంతే! వయసు విషయమై నా చేత యెంత అబద్ధం చెప్పించారు కోర్టులో!!'

నవ్వులూ చప్పట్లూ మధ్య అందరితోపాటు మత గురువులు కూడా నవ్వుకున్నారు.

# 7

## 'డయోసీస్'

చర్చిపనులు యథా ప్రకారం జరుగుతూండేవి గాని ఒక్కోసారి బయట పరిస్థితుల వల్ల అంతరాయాలు కలిగేవి.

లెటూర్ శాంటాఫె వచ్చిన మూడు సంవత్సరాలకే అమెరికా ప్రభుత్వం మెక్సికోలోని చాలాభాగం అమెరికాలో కలుపుకోవడమూ, తిరుగుబాటు దారైన 'గేడ్స్ డెన్నీ'ని వురితీయడమూ జరిగాయి. రోము నగరంలోని మతాధిపతులు ఈ కొత్త ప్రదేశం కూడా తన 'డయోసీస్'లో కలుపుకోవలసిందిగా లెటూర్‌కి ఆజ్ఞాపత్రం పంపారు. తత్ కారణంగా స్థానికులైన మత గురువులతో అనేక సమావేశాలు జరపవలసి వచ్చింది. రోములోని ఉన్నతాధికారులు చరిత్ర గమనం పరిశీలించే స్థితిలో లేనప్పుడు, గుర్రాలమీద ప్రయాణం చేసే యిద్దరు మత

గురువులు, ఈ సమస్యలన్నీ ఎలా చక్కబెట్ట గలుగుతా రని ప్రశ్నించేవాడు ఫాదర్ జోసఫు.

బోలెడన్ని వుత్తర ప్రత్యుత్తరాలు జరిగినమీదట, మెక్సికన్ ఫాదరీలతో 1858 లో సరిహద్దు తగాదాల పరిష్కారానికి ఫాదర్ జోసఫుని పంపారు. అతను ఆకురాలు కాలంలో బయలుదేరి, చలికాలమంతా త్రోవలోనే గడిపి, ఎల్పాసో చేరుకునే సరికే చాలా రోజులు పట్టింది. అక్కడ నుంచి పడమటగా టస్కాన్ మీదుగా కాలిఫోర్నియా గల్ఫ చుట్టి రావలసి వచ్చింది. తిన్నగా పసిఫిక్ తీరం చేరుకు, మళ్ళీ వెనుకకు మళ్ళాడు జోసఫు.

ఈ తిరిగి వస్తున్నప్పుడు అరిజోనా యెడారిలో మలేరియా జ్వరం వచ్చింది అతనికి. ఆరోగ్యం గురించి లక్ష్య పెట్టకుండా చలి గాలిలో ప్రయాణం చేసిన కారణంగా మలేరియా పట్టుకుంది. ఇతనికి యిలా సుస్తీగా వుందన్న విషయం శాంటాఫెలోవున్న లెటూర్ కి ఒక బాటసారి ద్వారా తెలియటంతో, జాకింటోని వెంటబెట్టుకు బయలుదేరి, జోసఫుని అంచీలమీద తీసుకొచ్చాడు బిషప్ స్వస్థలానికి.

జోసఫ్ ఆ దెబ్బ దెబ్బా, రెండు నెలలపాటు మంచం మీద వున్నాడు. ఫాదర్ లెటూరూ తనూ ఈ శాంటాఫే వచ్చాక వసంతకాలం ఒకచోట గడపటం ఇదే మొదటిసారి. ప్రతి వసంతంలోనూ యిద్దరికీ చెరో పని

వుండేది. కాని ఈ జబ్బు కారణంగా జోసపు యింటి పట్టున వున్నాడు. తోటలో వేసిన పూల మొక్కల సొగసు చూడగల అవకాశం యిద్దరు మిత్రులకూ లభించింది ఈ వసంతంలో.

మేరీ మాత జ్ఞాపకార్థమైన మే నెల అది. ద్రాక్ష తీగల క్రింద ఒక పాత మంచం మీద పడుకుని వున్నాడు జోసపు, ఒంటి నిండా కప్పుకుని, ఆ పరున్న ప్రదేశంలో నుంచి లెటూరూ అతని తోటమాలీ కనిపిస్తున్నారు. యాపిల్ చెట్ల నిండా పుష్పములు వికసించి వున్నాయి. ఛెర్రీలకాలం వెళ్ళిందనే చెప్పవచ్చు. మట్టి వాసనతో మిళితమైన గాలి నూతన పరిమళం వెదజల్లుతోంది. సూర్య కాంతి నేలలోకి చొచ్చుకుపోయి మట్టి బెడ్డల్ని పులకింప చేస్తోంది. పీల్చే గాలిలో భూసౌరభం మిళితమై వుంటోంది. కాలిక్రింద నలిగే పచ్చ గడ్డి ఆకాశపు నీలిమని తనలో ప్రతిబింబించుకుంటోంది.

ఇది ఆరు సంవత్సరాల క్రితం నాటిన తోట. సెయింట్ లూయీ నుంచి కుండీల్లో పెట్టి మొక్కలు తీసుకు వచ్చారు లొరెటా సిస్టర్స్. మొదటి వసంతంలో బిషప్ ఏదో పనిమీద బాల్టిమోర్ వెళ్ళినప్పుడు జోసఫు ఈ తోట పని తన నెత్తిమీద వేసుకు, తోటమాలికి తరఫీదు యిచ్చాడు. మొదట వేసిన కొద్ది మొక్కలే కాక, పెరటి తోటా, పళ్ళతోటా, పూలతోటా మూడుగా విభజించి మొక్కడి వక్కడ నాటించేడు. లెటూర్‌కి తోట పని

అంటే ఎంతో సరదా, అతనికి ఒక వ్యాపకమూ వ్యాయామమూ కూడా. చర్చి మందిరాన్ని స్కూలు భవనంతో కలిపేచోట, యింకా బాగా ఎదగని బూరుగచెట్లు వున్నాయి. వంకర తిరిగిన మొండెములతో మధ్య వృక్షాలు, సూర్యకిరణం కోసం కరువు వాచి, మెడలు సాచుకు కనిపిస్తున్నాయి. ఈ చెట్లు చాలా పాతవి. నీరు పుష్కలంగా వున్నా, వెలుతురు కరువై సూర్యకాంతి కోసం అవి అలమటించడం, వాటి వంక చూస్తేనే తెలుస్తుంది. అంత వంకర టింకరవైనప్పటికీ, వాటి గులాబి రంగు పుష్పాలు చూడడం కనుల పండువే!

జోసఫ్‌కి అన్ని చెట్లకంటె టామరిస్క్ అంటే ఎంతో యిష్టం. అతని ప్రయాణాల్లో యెక్కడ పడితే, అక్కడ ఈ చెట్టు కనిపించేదిట. న్యూమెక్సికో యెడారులలోనూ, అరిజోనా యెడారులలోనూ, ఎటు చూసినా ఈ చెట్లేనట. ఆకు పచ్చని వన్నెతో వీటి పూచికలు ఆకర్షణీయంగానూ వుపయోగకరంగానూ వుంటాయి. మెక్సికనులు తమ గుర్రాన్ని టామరిస్క్ చెట్టు మొదట్లో కడతారు. ఆ చెట్టు నీడలోనే కోడి పెట్టలు పొదుగుతాయి. కాపలా కుక్కలు విశ్రమించేది కూడా అక్కడే. తడిసిన బట్టలు ఎండేసేందుకు ఆ చెట్టు కొమ్మలు వుపయోగపడుతాయి. ఈ చెట్ల కొమ్మలు కూడా, అక్కడి గ్రామ ప్రజలకి అనుకూలంగా యెదిగేయా అన్నట్లు వుంటాయి. వీటి రెమ్మలతో తుడుచుకునే చీపుర్లు కట్టుకుంటారు. వాటిని కుంచెలవలె వుపయో

గించి దుమ్ము దులుపుతారు. ఈ చెట్టు బెరడు అనేక వస్తువులు చేసుకునేందుకు వుపయోగపడుతుంది. టామరిస్క్ చెట్టు మెక్సికనులకి ఒక విధంగా జీవనాధారం.

ప్రక్క మీదున్నప్పటికీ జోసఫుకి ఈ వసంతం ఎంతో బాగుంది. ఏ బాధ్యతలూ ఏ చీకాకులూ లేకుండా భగవత్ సంకీర్తన చేసుకోవచ్చు. సరస్సుల ప్రదేశంలో వున్నప్పుడు, వసంత సమయమప్పుడేదో విశ్రాంతి స్థలానికి వెళ్తూవుండేవాడు. ఇక్కడి వుద్యోగం విశ్రాంతికీ విరామానికీ అవకాశం యివ్వదు. గడిచిన మే నెలలో రోజుకి ముప్ఫై మైళ్ళచొప్పున ప్రయాణం చేస్తూ హోపీ జాతీయుల వివాహాలూ, జ్ఞానస్నానాలు జరిపించాడు. ప్రతి రాత్రీ ఏదో ఒక యిసుక మేట దగ్గిర ఆగుతూ, దైవప్రార్థన ముగించుకుని నిద్రపోయి, తెల్లారేక, మరొక గ్రామం వెళ్తూ వుండేవాడు.

ఈసారి తనకు జబ్బుగావున్న కారణాన మే నెల అంతా మేరీమాత కని వినియోగించవచ్చు. ప్రతి రాత్రీ నిద్రాసమయాన లోకమాత తనని జోకొట్టి నిద్ర పుచ్చుతున్నట్లు వుండేది. ఉదయాన లేత కాంతులతో కళ్ళు తెరిచేసరికి, లోకమొక సౌందర్య వాటికవలె గోచరించేది. ఈ జబ్బు పడటంతో, తన మత జీవన ప్రారంభ దశలోని నిశ్చల భక్తి గుర్తుకొస్తోంది. అతి పవిత్రమైన భక్తి భావం మనసును ఆవరించేసింది. ఇక్కడి ప్రార్థన తొందరగా

ముగించుకు ప్రక్క ఊరు చేరుకోవాలనే హడావిడి లేదు. మనసుని మాతకి త్రికరణ శుద్ధిగా అర్పించవచ్చు.

ఒకసారి తన చిన్నతనంలో, ఈ నెలంతా మేరీమాత పూజతో గడుపుతాననే సరికి, ఒక వృద్ధ మతగురువు 'నీకింకా ఆ వయస్సు రాలేదు. పెద్దల మాట జవదాటకు' అని తనని భయపెట్టాడు. తనకు ఆ అదృష్టం ఎందుకు వుండక పోవాలని జపమాల చేత బట్టుకు గదిలోకి వెళ్లాడు ఆనాటి జోసఫు. 'నా కోరిక ప్రకారం కాదు. నీ సేవకై నేను ఉపయోగబడగల శక్తి నాకు కరుణించు, దయామయీ' అంటూ ఆ రోజంతా తన గదిలో ఏకాంతంగా కూచుని ప్రార్థన చేశాడు, ఏ వృద్ధ మతగురువైతే, వుదయం వేళ యితని దీక్షానిరతిని శంకించాడో, ఆయనే జోసఫుని పనిగట్టుకు పిలిపించి 'ఈ నెలంతా నీ యిష్టప్రకారం ప్రార్థన చేసుకో' అని అనుమతి ప్రసాదించాడు. తనకీయబడిన ఈ ప్రత్యేకానుమతి విషయమై వెంటనే సోదరి ఫిలోమినాకు వ్రాశాడు జోసఫు. ఆమె ఎంత సంతోషించిందో! తను సోదరుణ్ణి మే నెల ప్రార్థనలో పాల్గొననిస్తున్నారంటే ఎంత ఘనమైన విషయం!

మే నెల ఎందుకనో జోసఫు జీవితంలో ప్రత్యేక ఘటనలకి కారకమవుతోంది, చిన్నతనంలో తనకు మే నెల ప్రార్థనలకి అనుమతి యిచ్చారు. ఆ తరువాత ఒక మే నెలలోనే బంధుమిత్రుల్నీ స్వదేశాన్నీ వదిలిబెట్టి ఫాదరీగా తన జీవన బాధ్యత నిర్వహించేందుకు ఈ క్రొత్త ప్రపంచంలోకి

వచ్చాడు. అప్పుడు తనకి కుటుంబబాధ్యతల నుంచీ సాంఘిక బాధ్యతలనుంచీ పారిపోతున్నాననే సంశయం కొంతపీడిస్తూ వుండేది. ఇప్పుడు యిన్నాళ్లు గడిచాక, అది తల్చుకుంటే నవ్వుగా వుంటుంది. ఎంత బాధ, ఎంత ఆవేదనా ఆనాడు! తనని కాపాడింది లెటూరేగా అప్పుడు! జ్ఞాపకాల దొంతర విడిపోడంతో కనుకొలకుల్లో అశ్రు బిందువులు నిలిచాయి. జబ్బులోవున్న వాళ్ళకి కన్నీళ్ళు తొందరగా రావడం సహజం కద! కళ్ళజోడు తీసుకు, కళ్ళద్దాలూ కళ్ళూ తుడుచుకు, 'లెటూర్, యిందాకటి నుంచీ వంచిన నడుం ఎత్తకుండా పని చేస్తున్నావు. కొంచెం విశ్రాంతి తీసుకో' అన్నాడు.

బిషప్ లేచి వచ్చి అన్నాడు: 'నువ్వు తొందరగా కోలుకోవాలని నేను ప్రార్థన చేయదలచుకోలేదు, జోసఫు. ఎందుకంటే, నీకు నెమ్మదించిందా, మళ్ళీ ప్రయాణాల మీద వుంటావు. నిన్ను యిక్కడ కట్టిపడేసే మార్గమేమిటంటే, జ్వర దేవతని వెళ్ళిపోకమ్మా, అని బతిమాలడం. తెలిసిందా ?'

ఫాదర్ జోసఫు చిరునవ్వు నవ్వి, 'ఆ - నువ్వు మాత్రం శాంటాఫెలో ఎక్కువ రోజులుంటున్నావా ?' అన్నాడు.

'ఈ వేసవి అంతా నేనిక్కడే వుంటాను. నిన్ను కూడా యిక్కడే వుంచుతాను. ఈ వేసవిలో వికసించే తామర పువ్వులు చూద్దువుగాని! ఈ మధ్యాహ్నమే చెరువులోకి నీళ్ళు పెడతాడు తోటమాలి.'

చెరువనగా అదో పెద్ద చెరువు కాదు - చిన్న నీటి కుండు. ఏ మొక్కకి ఎంత నీరు పెట్టాలో చక్కగా తెలిసిన తోటమాలి, చలికాలంలో ఏ మొక్కా చావకండా మట్టి కుండీల్లో దాచి కాపాడుతాడు. 'క్రిందటి వేసవిలో నువ్విక్కడ లేవు. ఒక వంద తామర పువ్వులు పూశాయి. ఈ కొలనులో ఆ పువ్వులు తేల్తూవుంటే ఎంత బావుందనుకున్నావ్! రోమ్ నుంచి నేను తీసుకువచ్చిన - అయిదు మొగ్గలు ఎన్ని పువ్వులయ్యాయో!'

'అయితే అవి యెప్పుడు వికశిస్తాయి?'

'మొగ్గలు విచ్చడం జూన్‌లో. వాటి శోభ చూడాలంటే జూలై.'

'అలా అయిన పక్షంలో, జూన్‌లోనే నేను వాటి అందం చూసి, జూలైనాటికి వెళ్ళిపోతాను,' అన్నాడు జోసఫ్.

'అంత తొందరగానా?'

కప్పుకున్న బట్టల్లో నుంచి ఫాదర్ జోసఫ్ కొంచెం యిటూ అటూ కదిలాడు. 'ఎందుకా? తప్పిపోయిన కాత లిక్కుని వెతికేందుకు. మతమనేది మరచిపోయి, మూఢంగా బ్రతుకుతున్న మనుషులకి మత సౌరభం తెలిపేందుకు! టెక్సాస్ వైపుగా వెళ్ళాలి. అక్కడ ఎన్ని బీద కుటుంబాలున్నాయో! వాళ్ళు మతగురువనే మాట ఎరుగరు. ప్రతి గ్రామం, ప్రతి యిల్లూ దర్శించి వారిలో మత విశ్వాసం

కలిగించాలి. వారికి దేవునిపట్ల గొప్ప నమ్మకం ఉంది. కాని, మూఢాచారాలే దైవభక్తి అనుకుంటున్నారు. దైవ ప్రార్థన ఎలా చేయాలో కూడా మరిచి పోయారు. వ్రాత కోతలు తెలియని అమాయకులు వాళ్ళు. ఒక్కసారి వాళ్లని మన వైపు తిప్పుకుంటే చాలు, వాళ్ళింక మనని వదిలి పెట్టరు. మెక్సికనుల మధ్య తిరిగిన కొద్దీ, వారి స్వభావం పట్ల నాకు సదభిప్రాయం యేర్పడుతోంది. భౌతిక వాంఛా పరితృప్తులు కాదు వాళ్ళు. స్వలాభాలూ ధన కనక వస్తు వాహనాలతో గాక వాటికి అతీతమైన పదార్థం వైపు మొగ్గుతాయి వారి మనస్సులు. నిజమైన క్రయిస్తవులకి ఆస్తి వ్యామోహమూ సుఖాన్వేషణా వుండవు. మెక్సికనులలో కూడా మనకలాంటి సద్గుణాలు అవుపడుతాయి. ఒక కొత్త గ్రామంలో నాలుగైదు గంటలసేపు వుండి, వారికి మత ప్రసాదం పంచిపెట్టి, నూతనోత్తేజులుగా జేస్తే, వారితో పాటు నాకూ ఎంత ఆనందం కల్గుతుంది ? మన తోటలోని మొక్కలు మన అలక్ష్యంవల్ల వాడి వాడిపోతే ఎంత బాధనిపిస్తుంది! ఒకసారి టస్కాన్‌లో ఒకతను నన్ను వాళ్ల రహస్య స్థలానికి తీసుకు వెళ్ళాడు. ఎవారికి అడ్డం పడి పోయాము యిద్దరమూ. ఆ స్థానికుని నమ్మి అంత లోపలికి చొచ్చుకు పోవడానికి కొంచెం గుండె ధైర్యం కావాలి. నల్ల రాళ్ళ మధ్యనున్న సొరంగంలోకి వెళ్ళాము. అక్కడ మత గురువులు ఉపయోగించే ప్రార్థన సామగ్రీ, గానూ వున్నాయి. తమ పూర్వీకులు, అపాచీ తెగతో కలియబడ్డ

ప్పుడు ఈ పవిత్ర వస్తువుల్ని మాత్రం రహస్యంగా దాచారట. ఆ రహస్యం కుటుంబ పరంగా వుంటుందట. నాకు ఆ పూజా సామగ్రి చూపించేసరికి ఆశ్చర్యమయింది. భగవంతుని మార్గాలు మానవ మాత్రులు తెలుసుకోలేరు కదా - అని పించింది. మూఢమతులుగా భావింపబడే వారున్నా ఈ సామగ్రిని ఎంత భద్రంగా దాచి పెట్టారో!...'

బిషప్ వెంటనే సమాధానం చెప్పలేదు. ఒక క్షణం ఆగి 'నువ్వు చెప్పేదంతా బాగానే వుంది. కాని నీ అవసరం నాకుంది. నేనొక్కణ్ణే చూసుకోలేక పోతున్నా నీ వ్యవహారాలు' అన్నాడు.

'నా అవసరం వాళ్ళకి వున్నంతగా, నీకుంటుందా అని. మాంట్ ఫెర్రాండ్ నుంచి వచ్చే యే యువకుడైనా సరే నీకీ కార్యభారంలో సాయపడగలడు. అతను కొంచెం తెలివి గలవాడైతే చాలు. కాని అక్కడ నేను చేయ వలసిన పని బుర్రతో కాదు, మనసుతో! మేధస్సు కాదు, - హృదయం కావాలి. ఆ ప్రజల పట్ల దయా సాను భూతీ చూపాలి. వాళ్ళ స్వభావాన్ని ఈ కొత్త ఫాదరీలు నావలె తెలుసుకోగలరా? నేను యిన్నాళ్ళ బట్టీ యిక్క డుండడం చేత ఒక విధంగా మెక్సికన్‌ని అయి పోయాను. వారి మొండితనం నాకు కోపం తెప్పించదు. వారి వింత పద్ధతులన్నీ నాకర్ధ మవుతాయి. ఒక విధంగా నేను వాళ్ళ మనిషిని' అన్నాడు జోసఫ్.

'అవునవును, నిస్సందేహంగా! సరి, ఈ విషయమై యింక వద్దు' అన్నాడు బిషప్.

జోసఫుకి కొంచెం చికాకు కలిగింది. తలగడా మీద తల నిస్పృహతో వాల్చి, టామరిస్క్ చెట్ల వెనక్కి వెళుతున్న బిషప్ వైపు కళ్ళార్పకుండా చూశాడు. బిషప్ నెమ్మదిగా నడుస్తున్నాడు. అతని అడుగులో తొందరపాటు లేదు. అంత మాత్రాన తూచి వేస్తున్న అడుగు లనుకోడానికి వీల్లేదు. రుజువర్తనుని సహజ శైలితో, దేనికీ చలించక, పరిస్థితులకు ప్రభువువలె అడుగు వేస్తూ, చెట్ల వెనుకకు వెళ్లాడు. ఆ ముఖం చూస్తే అతనిలో ఏదో ఆవేదన వుందని యెవరూ అనుకోలేరు. తను వెళ్ళిపోతానని జోసఫు అనడం, వెళ్ళ నిమ్మని అనుమతి అడగటం, లెటూర్‌కి ఒక విధంగా నిరుత్సాహం కలిగించాయి. తన కోరికను జోసఫు తోసిపుచ్చడం కొంచెం బాధనిపించింది. లైలాక్ పువ్వులు తుంపుతూ, ఆ చెట్ల దగ్గిర కాసేపు పచారుచేసి, తను కోరికలు తుంపేసుకున్నట్టుగా, తేలిక మనసుతో జోసఫు పడుకున్న మంచం దగ్గిరికి వచ్చి, చిరునవ్వుతో పల్కరిస్తూ అన్నాడు. 'ఈ విషయంలో నీ మనసెలా చెబితే అలా నడుచుకో. నేను అడ్డంకులు కల్పించను. నీ ఆరోగ్యవిషయమై, కొంచెం శ్రద్ధ వహించాలనిపించి, ఈ వేసవి అంతా యిక్కడుండమని చెప్పాను గాని యేది విధ్యుక్తమని తోస్తుందో ఆ ప్రకారం చెయ్యి.'

కొంచెం సేపు వాళ్ళిద్దరూ మౌనం వహించారు. మీద బడుతున్న సూర్యరశ్మిని తప్పించుకునేందుకా అన్నట్లు కళ్ళు మూసుకున్నాడు జోసఫు. లెటూర్ తన ఆత్మగతంలో పడిపోయి, కదిలే వేళ్ళతో టామరిస్క్ పువ్వులు నలుపుతున్నాడు. ఏ అలజడీ, ఏ అంతర్ యుద్ధమూ పైకి పొక్కనీయకుండా దాచేయగలవు అతని ముఖ కాంతీ, స్వభావ సౌందర్యమూను! కాని, ఈ చేతి వేళ్ళ దగ్గరికొచ్చేసరికి అతను ఓడి పోతాడు. చేతి వేళ్ళలో అతని మనోగతి యావత్తూ తెలిసి పోతుంది. ఆశీర్వదించడాని కలవాటు పడ్డ మత గురువుల హస్తాలు సాధారణంగా యిటువంటి మనోదౌర్బల్యానికి గురికావు. కాని, అతని చేతి వేళ్ళు మాత్రం వేటినో అన్వేషిస్తు న్నట్టూ ఏవో నిర్ణయాలు తాము స్వతంత్రించి చేస్తు న్నట్టూ సూచీ పత్రాలవలె కనపడతాయి. ఒక పావు రాయి గుంపు తోట మీదుగా రెక్కలార్చుకుంటూ వెళ్ళ డంతో స్నేహితు లిద్దరూ తమ ఆలోచనా సాంద్రం నుంచి తేరుకున్నారు. మాగ్డలీనా ప్రతి దినమూ ఈ పావురా లకి గింజలు వేస్తుంది. అందుకోసమని ఆ సమయానికి అవి అలా వస్తాయి. ఈ యెగిరే గుంపు, ముందు వేరు వేరుగా కనిపించినా, కొంతసేపటికి ఒక తెల్ల కెరటంలా అయి, వుప్పురాయి నీటిలో కలిసిపోయినట్లు, పై ఆకాశం లోని తెల్ల కాంతిలో కలిసి పోయాయి. మరి కొద్దిసేప యాక ఆ వెండి పిట్టలు సూర్యకాంతిలో తళుక్కుమని,

మాగ్డలీనా దగ్గరికి వచ్చి, ఆమె చేతులమీదా, భుజాల మీదా, తలమీదా యెక్కడ పడితే అక్కడ వాలాయి. తన చేతులో ఉన్న పప్పుగింజలు వాటికి పెడుతోంది మాగ్డలీనా. పక్షులు ఆమె అరచేతిలో నుంచి గింజలు నోట గరుచుకు తినడం అమితాశ్చర్యకరమైన దృశ్యం.

మాగ్డలీనా యిప్పుడు బాగా పెరిగి చక్కని రూపు దాల్చింది. ఆమె బంగారు చెక్కిళ్ళమీద నుంచి గులాబీ కాంతులు జారుతున్నాయి. 'నరక కూపం నుంచిరక్షింపబడ్డ మనిషిలాలేదామె. క్రీస్తు మత వ్యాప్తి జరిగిన మొదటి రోజులలోని అద్భుతాలవంటిది, యిప్పుడు మన కళ్ళెదుట జరిగింది' అన్నాడు ఫాదర్ జోసపు సన్నగా.

మాగ్డలీనాకి యిరవై ఏడు యిరవై ఎనిమిదేళ్ళ కంటె యెక్కువ వుండదు. ఎంత ప్రశాంతంగా గడిచి పోతోందా జీవితం! కాని, ఆమె కళ్ళలో యేవో నీల మేఘాలు వున్నాయి. 'నీకు జ్ఞాపకముందా, ఆ మొట్ట మొదట రోజు. గుమ్మంలో నుంచుని వెనక్కి తిరిగిచూసిన ఆ బెదురు చూపు?' అన్నాడు బిషప్ ఆలోచనా ముద్రతో.

''అది మరిచి పోగలమా? మనకు ప్రాణదానం చేసిన చూపు! కాని, ఆ మనిషేమిటి, ఈ మనిషేమిటి! శల్యాకృతిలోని పిచ్చి మనిషికీ సుఖ శాంతులకి నిలయమైన ఈ మూర్తికీ పోలికెక్కడ? మాగ్డలీనా, మాగ్డలీనా,

యిలా వచ్చి కాసేపు మాతో పిచ్చాపాటీ చెప్పు. ఇద్దరం ఒకరి ముఖాలు ఒకళ్ళు చూసుకుంటూ కూచుంటే మాకు మతి పోతోంది. ఇలా వచ్చి కాసిని కబుర్లు చెప్పు' అన్నాడు ఫాదర్ జోసఫ్.

## 2

వేసవి మధ్య భాగంలో జోసఫ్ అక్కడ నుంచి బయలుదేరాడు. డిశంబరు నెల వచ్చింది కాని యింకా అతను తిరిగి రాలేదు. లెటూర్ ఒక్కడే వుంటున్నాడు. అతని హృదయమందిరాన్ని యేదో ఏకాంతత ఆవహించింది. బాల్యం నుంచీ ఈ 'ఒంటరితనం' ఒకో్కసమయంలో అతన్ని తెగ వేధించేది. ఆత్మ యేదో సన్నగా దీనంగా తెలియని దేనికోసమో పరితపిస్తుంది అలాంటప్పుడు. దైనందిన కార్యభారం యథావిధిగా జరిగి పోతోంది. మిగతా ఫాదరీలతో దగ్గిర వూళ్ళకి వెళ్ళి వస్తున్నాడు. అధికార వ్యవహారాలూ ఎప్పటికి మల్లేనే జరుగుతున్నాయి. కాని మనస్సు మాత్రం ఈ పనులలో నిమగ్నం గాక, బయట నెక్కడో విహరిస్తోంది.

క్రిస్టమస్ యింకా మూడు వారాలుందనగా, ఒక రాత్రివేళ పక్కమీద పడుకుని, నిద్రపట్టక దొర్లుతున్నాడు లెటూర్. అతను చెప్పే ప్రార్థనలు ఓ శూన్యపద సముదాయంవలె, డొలకలా తోచసాగాయి. ప్రార్థనలో యేదో లోపిస్తోంది. ప్రార్థనానంతరం మునుపటికి మల్లే మనసు

తెరిపిగా వుండటం లేదు. ఆత్మ పీఠం మొత్తానికే శూన్య క్షేత్రం అయిపోయినట్లు వుంది. అటువంటప్పుడు తను తోటి ప్రజలకి ఏమి యివ్వగలడు? తను యిన్నాళ్ళూ నిర్మించినది యిసుక మేడేనా? మత భిక్షుకై తన వైపు చూసే ప్రజలకి తను చేయూత నివ్వలేకుండా వున్నాడు. చీకటిదారుల వెంబడి అయోమయంగా పోతున్న నేటివులని కాపాడట మెలా? ఇక మెక్సికనులకి మతమంటే విలాసాలకీ వినోదాలకీ ఒక ఆటస్థలం.

గంటలు గడిచిన కొద్దీ పక్కమీద పరున్న బిషప్‌కి అదొక ముళ్ళపాన్పువలె తోచింది. ఆ ముళ్లు అదే పనిగా గుచ్చుకుంటున్నాయి. పక్కమీద నుంచి లేచి, కిటికీ కమ్ముల్లోనుంచి బయటకి చూశాడు. మంచు ధారాపాతంగా కురుస్తోంది. అప్పటికప్పుడే నేలంతా మంచుతో కప్పడిపోయింది. పూర్ణ చంద్రుడు నీలిమేఘపు తెరల వెనక నుంచి ఆకాశాన్ని వెలిగిస్తున్నాడు. వెండి కిరీటం పెట్టుకున్నట్టు వుంది చర్చి గోపురం. చర్చిలోకి వెళ్ళి ప్రార్థన చేసుకుందా మనిపించింది లెటూర్‌కి – ఆ చలిలో బయటికి రావడం భయంగావున్నా! చర్చిలోని పూజాపీఠం అతన్ని బలీయంగా ఆకర్షిస్తోంది.

తన పొడుగుపాటి అంగీని భుజాలమీద కప్పుకుని బయటికి వచ్చాడు లెటూర్. ఆ అంగీ యెన్నో సంగతులు జ్ఞప్తికి తెచ్చింది. తనూ జోసఫు ఒకేమాదిరి బట్టకొన్నారు ఫ్రాన్స్‌లో అంగీలకి. ఓహియో వచ్చాక ఒక జర్మన్ కుట్టు

పని వాడు చర్మంతో లైనింగ్ కుట్టిపెట్టాడు. తను శాంటా ఫెకి బయలుదేరుతున్నప్పుడు, ఈ అంగీలో అతడే కొంలది మార్పులు చేసి, యిక్కడి వాతావరణానికి అనుగుణంగా మార్చాడు.

లెటూర్ చర్చివాకిలిలోకి వచ్చి మెట్లెక్కి తలుపు తెరవబోతూ, ఒక్కసారి వెనక్కి తిరిగి ఆ ప్రకృతిశోభ చూడాలనుకున్నాడు. మంచుతో కప్పడిపోయిన వెన్నెలలో నీడలు వింత ఆకారాలతో నర్తిస్తున్నాయి. పొగలా పైకి లేస్తోంది మంచు. గుమ్మం దగ్గిర ఒక స్త్రీ విగ్రహం కనపడింది. ఆమె ఎందుకనో వెక్కి వెక్కి యేడుస్తోంది. లెటూర్ ఆమెను లేవదీసి లోపలికి తీసుకువెళ్ళాడు. దీపం వెలిగించాక ఆమె యెవరైనదీ గుర్తుపట్టగలిగాడు.

ఒకానొక అమెరికన్ కుటుంబంలో బానిస. ఆమె పేరు శాడా. యజమానులు ప్రొటస్టెంట్లు అవడం నల్ల, బానిస కాతలిక్ మతభక్తిని వాళ్లు సహించేవారు కాదు. ఏవిధమైన విగ్రహారాధన చేసినా, ఆమెను దండించేవారు. వెయ్యికళ్ళతో ఈ బానిసస్త్రీని కనిపెడుతూ. ఒక్క చలికాలంలో తప్ప యింకెప్పుడూ బయటగదిలో కూడా పడుకోనిచ్చేవారు కాదు.

శాడా గురించిన కథ బిషప్ వెనుకనే విన్నాడు. జీవన భారంతోనూ, విషాదాశ్రువులతోనూ ఆ వృద్ధురాలి ముఖం మరీ పీక్కుపోయింది. కాని 'పవిత్ర సౌజన్యం' అని

చెప్పబడేది, ఆమె ముఖంలో కనపడింది లెటూర్‌కి. ఇంతటి సౌజన్యవంతురాలి దర్శనంవల్ల తను ధన్యుణ్ణయాననుకున్నాడు. ఆమె కాళ్ళకి పాతజోళ్లు యేవో ఉన్నాయి కాని మేజోళ్ళసలు లేవు. కప్పుకున్న నల్లశాలువా పల్చటిది. ఆ డిశంబరు చలినుంచి ఆమెను కాపాడగలిగేపాటిది కాదు. గడవడ వణుకుతూనే నిలబడింది శాడా. బిషప్ ఆమెకి ఆసరాయిస్తూ పట్టుకుని, దగ్గిరున్నకోటు పైన కప్పేడు. 'వొద్దు, వొద్దు' అన్నది ఆవిడ భయపడుతూ.

'ఫాదరీ చెప్పినట్టు నువ్వు వినాలి. పద చర్చిలోకి. వెళ్ళి ప్రార్థన చేదాం' అన్నాడు లెటూర్.

చర్చిలోపలి భాగమంతా చీకటిగా ఉంది. పూజా పీఠం దగ్గర ఒక్క-చోట మాత్రం దీపం వెలుగుతోంది. ఆమెను ఒకచేత్తో నడిపిస్తూ, మరొకచేత్తో దీపంపుచ్చుకు, ఆ దీపపు వెలుగులో. దేవతావిగ్రహం చూపించాడామెకు. మాత విగ్రహం కనపడగానే ఆమె ప్రణమిల్లి మూర్ధాభివందనం చేసింది. వందనం చేస్తున్నప్పుడూ ప్రార్థన చెబుతున్నప్పుడూ ఆమె కంఠంనుంచి శోకనాదమే వెలువడింది. అవి శోకాశ్రువులైనప్పటికీ అనిర్వచనీయానుభూతికి చిహ్నాలని గ్రహించగలిగాడు లెటూర్.

'పంథొమ్మిది సంవత్సరాలు, ఫాదర్, యిప్పటికి పంథొమ్మిది సంవత్సరాలయింది నేను చర్చిలోకి వచ్చి నిలబడి! పంథొమ్మిది సంవత్సరాల అనంతరం నాకు దైవ దర్శనం కల్గించిన మీకు నేను సర్వదా కృతజ్ఞురాలిని.'

'ఆ పంధొమ్మిదీ, గడిచిపోయిన సంవత్సరాలు కదా! దేవుడెప్పుడూ మన హృదయంలో వుంటాడు. ఆ కనిపించే విగ్రహాలు బాహ్య చిహ్నాలు మాత్రమే. ఈ రోజు మనిద్దరం కలసి ప్రార్థన చేద్దాం.' అన్నాడు లెటూర్.

ఈ శాడా గురించి లెటూర్‌కి చాలసార్లు చెప్పాడు జోసఫు. ఈమెది దీన పరిస్థితి. యజమానులపేరు స్మిత్స్. ఎల్పాసో నుంచి యిక్కడికి వచ్చారు వీళ్ళు. వాళ్ళదసలు జార్జియా రాష్ట్రం. అక్కడేవో కష్టాలు సంభవించడం వల్ల తమకిగల బానిసలనందరినీ అమ్మేసి, ఆ జార్జియా రాష్ట్రం వదిలేసి యిటు వచ్చారు. ఈ మెక్సికన్ స్త్రీని కూడా అమ్మేసి వుందురుకాని, ఈమె తమ ఆస్తి అని నిరూపించగల పత్రాలు దగ్గర లేకపోయాయి. అందుచేత యెవరూ కొనుక్కోలేదు. మళ్ళీ ఈ మెక్సికన్ దేశం రావడంతో, శాడా తమ కనుగప్పి పారిపోతుందేమోనని, వీధి గుమ్మం దాటి బయటికి రానిచ్చేవారు కాదు. ఆఖరికి మిసెస్‌స్మిత్ బజారుకి కూరలకి వెళ్తూ, ఆ కూరలు మోసుకొచ్చేందుకు కూడా శాడాని తీసుకెళ్ళేదికాదు.

అంతకీ యిద్దరు స్త్రీలు ఈ శాడాతో పరిచయం చేసుకుందామని స్మిత్స్ యింట్లోకి వచ్చారు. శాడా ఆ సమయాన బట్టలు వుతుకుతోంది. ఈ కొత్తగా వచ్చిన స్త్రీలు శాడాతో మాట్లాడటం యజమానురాలు చూసి, సగం సగం జుట్టు ముడివేసుకుంటున్నది అలాగే పరుగెత్తుకు

వచ్చి, వాళ్ళని వీధుల్లోకి తరిమి కొట్టింది. 'నేను వీధి దారి వెంట తరిమాను గనుక, మీరు దొడ్డి దారిని వస్తారేమో జాగ్రత్త! నా దగ్గర ఈ ఆటలు సాగవు!' అని వారిని పాడల కొట్టింది.

'అమ్మా, మేమే దురుద్దేశంతో రాలేదు. చర్చి ప్రార్థనలకి వెళుతూ ఈమెను తీసుకు వెళ్దామని వచ్చాం' అనేసరికి, 'ప్రార్థనా? ఈ మతగురువులని నేను చచ్చినా నమ్మను. వాళ్ళ మాయోపాయంలో పడకుండా ఈ పిచ్చి మనిషిని వెనుకోసారి కాపాడేను. మళ్ళీ దానిని గోతిలో దింపుదామనుకుంటున్నారా?' అంటూ వాళ్ళని కసిరి కొట్టింది.

ఈ ప్రథమ ప్రయత్నమయాక మరొక సాహస వంతురాలు ప్రక్క-దొడ్లో ఉంటే, గోడలోకి కంతలోనుంచి శాడాతో మాట్లాడబోయేసరికి, శాడా 'వద్దు, వద్దు' అని సైగలతో తెలియబరచింది. లోపలున్న మనిషి యింత భయపడుతూవుంటే, తాము చేయగలదేముందని, వాళ్ళ ప్రయత్నం అక్కడితో విరమించుకున్నారు. ఆ సాహస వంతురాలే జోసఫు దగ్గరకు వెళ్ళి యింత దురన్యాయం మీ కళ్ళముందు జరుగుతోందని నివేదించేసరికి. ఆయన గారు బిషప్‌కి చెప్పాడు. దేనికైనా ఆ సమయం రావాలి, మనం తొందరపడితే కార్యభంగ మవుతుందని బిషప్, జోసఫుని వూరుకోబెట్టాడు. ఎందుచేతనంటే, ఈ స్మిత్స్ కాతలిక్ విద్వేషులు. ప్రాటస్టెంటు మతం మారేటున్నా

కాథలిక్ మతాన్ని ద్వేషించడమే వారిపని. ముఖ్యంగా చర్చి ఉత్సవాలప్పుడు, ఈ కుటుంబంలోని యువకులు చర్చి ముందర నిలచి, అనరాని మాటలంటూ మతగురువులను నీచంగా దూషించేవారు. 'అది తప్పు, అబ్బాయిలూ, అలా దుడుసుమాటలు అనకూడదు' అని చెప్పేపాటి జ్ఞానం పెద్దవాళ్ళకు లేదాయె! బిషప్ తోటలోపడి కాయలు అపహరించే కుర్రకారు, ఈ స్మిత్ కుటుంబంలోని యువకుల నాయకత్వాన్నే ఆ ఆగడాలు చేసేది. తోటమాలి వాళ్ళని ఎన్నిసార్లో తరిమాడు.

మోకాళ్ళమీద కూర్చున్న యిద్దరు భక్తులూ లేచి నిలబడ్డారు. 'పంథొమ్మిది సంవత్సరాలైనా ప్రార్థనలో ఒక్క వాక్యం కూడా నువ్వు మరచిపోలేదు' అని అభినందించాడు లెటూర్.

'ఎలా మరచిపోతాను, ఫాదర్? దైవ ప్రతిమ నా దగ్గిరున్నా లేకపోయినా, ప్రతిరాత్రీ ప్రార్థన చెప్పుకోని దే నిద్రపోను' అంది ఆ వృద్ధవనిత.

'నీ దగ్గర జపమాల వుందా?' అని అడిగేసరికి ఆమె ఖంగారుపడింది. యజమానులకి కనపడకుండా జపమాల నడుముకి చుట్టుకుంటదట, మెళ్లోవుంటే వాళ్ళు తీసెయ్యమంటారుగా! అంచేతన నడుముకి చుట్టుకుందట.

'శాడా, పై సంవత్సరం నొవెనా ప్రార్థనలలో నీ గురించి తప్పక ప్రార్థవ చేస్తాను. నీవంటివారికి విముక్తి

తొందరగా లభిస్తుంది. ప్రభువు నిన్ను కరుణిస్తాడు. శాంతించు. నీవు నా తోడ పుట్టినవారితో సమానం. వారిని నా ప్రార్థనలలో ఉదహరించినట్లే నిన్నూ చేరుస్తాను' అన్నాడు లెటూర్. ఆ చలిరాత్రివేళ అతను పొందిన ఆ అపూర్వానుభవం చిద్విలాసుడైన భగవంతుని అపార కరుణా కటాక్షంమీద పరిపూర్ణ విశ్వాసం కలిగింపజేసింది. ఎదురుగా కనిపించే ఆ శిలువ, దారిద్ర్యంలోనూ బాధలోనూ నీచత్వం లేదనీ, నిరంతర వేదనలోనే మానవ హృదయ సౌందర్య దీప్తులు వ్యక్తమవుతాయనీ ప్రత్యక్ష నిదర్శనంగా చెబుతోంది. ఆ భగవత్ చిహ్నానికి యెదురుగా, బానిస స్త్రీ ప్రక్కన ప్రార్థన చేస్తున్నప్పుడు, లెటూర్ హృదయం వసంతోత్సవ నృత్యం సలిపింది. ఇంత కల్మషపూరితమైన మానవలోకంలో, యిటువంటి సౌజన్య మూర్తులు వుండగా స్వర్గంలో దేవతలు యెందుకు వుండరనిపించింది! బాగా దెబ్బలు తిని, వృద్ధాప్యపు పొలిమేర చేరుకున్న వారికే, జీవన భారంలోని నిజానిజాలు తెలుస్తాయి. తాను పురుషుడు గనుక ఆమె మనసు సంపూర్ణంగా తెలుసుకోలేడు. స్త్రీల బాధలు స్త్రీలకే తెలుస్తాయి. ఆమెని కాపాడగలది జగన్మాత ఒక్కతే!

ఇరువురు హంతకుల మధ్య తనని శిలువ వేస్తున్నప్పుడు, 'లోకమింతే' అను చిరునవ్వుతో, తనని దండించే వారిని క్షమించిన ఆ పవిత్రమూర్తి, లెటూర్ మనసులో

మెదిలాడు. శాడా తన మనసులో గల బాధలన్నీ బిషప్‌కి చెప్పి, కన్ఫెషన్ పూర్తి చేసింది. రెండు చేతులూ ఆమె శిరసుమీద వుంచి దీవించాడు లెటూర్. చర్చి గుమ్మం దాటి బయటికి వస్తున్నప్పుడు, శాడా తను కప్పుకున్న కోటు యిచ్చేయబోయింది.

'వద్దు, వద్దు, నీ దగ్గర వుంచుకో' అన్నాడు లెటూర్.

ఆ కోటు తన దగ్గర వుంచుకోవడమంటే ఆమె పంచప్రాణాలూ ఎగిరిపోయాయి. ఇంకేమన్నా వుందా, తన యజమానులు బతకనిస్తారా! 'ఈ భారం నాకొద్దు!' అంటూ చంటిపిల్ల ఒంటిమీద చెయ్యివేసి ముద్దాడినట్టుగా ఆ కోటు నిమిరి అక్కడ వుంచేసింది శాడా.

లెటూర్ తన జేబులో నుంచి 'మాత' విగ్రహ మొకటి తీసి, ఆమె చేతులో పెట్టాడు. అది ఒక విధంగా ఆమెకు జీవితాలంబనం. తన యజమానుల కంటబడకుండా దానినెంతో భద్రంగా కాపాడు కుంటుంది. వారు నిద్ర పోయినప్పుడు, నిశ్చింతగా ప్రార్థన చేసుకుంటుంది, వ్రాయడం, చదవడం చేతకాని వాళ్ళకి ప్రేమ చిహ్నంగా. ఈ పూజా విగ్రహం తప్ప యివ్వగలదేముంది?

చర్చికి తాళంవేసి, ఆ తాళంచెవి జేబులో పెట్టుకు, బయటకి వచ్చాడు లెటూర్. వెళ్లేప్పుడు యెంత ఆరాటమో వచ్చేటప్పుడు అంత శాంతి! ఏదో కొత్త కాంతి

లభించినట్లయింది. ముందు వాకిట్లో మంచుపడడం తగ్గింది. పొగమేఘాలు ఒకపక్కని ఒత్తుగా పేరుకుంటు న్నాయి. వెనకటి నీలిమ తగ్గింది. పూర్తిగా పోలేదుగాని తెలుపుకీ నీలానికీ చెలిమి కుదిరినట్లుంది. తారకల సాయం లేకుండా ఒంటరిగా ప్రయాణం సాగిస్తున్నాడు చంద్రుడు. చర్చి సుమ్మంలో నిలబడ్డ లెటూర్, మంచులో కనపడు తున్న శాడా కాలిజాడలని అదేపనిగా చూస్తూ ఎంతసేపు నిలబడ్డాడో!

# 3

ఆ చలికాలమంతా జోసఫ్ అరిజోనాలో గడిపాడు. గాలిలో వసంతమాధురి కనబడగానే లెటూరూ, జాకింటో న్యూ మెక్సికోకి అడ్డంపడి, ఎడారి దారివెంట హోపీగ్రామా లకి ప్రయాణ మయూరు. అక్కడనుండి దక్షిణానికి వెళ్ళేం దుకు చాలారోజులు పట్టింది. నవాజోలలో లెటూర్‌కి ఒక ముఖ్య స్నేహితుడు వున్నాడు. అతను పుత్రశోకంవల్ల బాధ పడుతున్న సంగతి శాంటాఫెలో వుండగానే బిషప్‌కి తెలిసింది.

ఫాదర్ లెటూర్‌కి యుజేబియో చాలాకాలంగా తెలుసు. హోపీ తెగకీ నవాజోలకి పేచీలు వచ్చినప్పుడు, రాక సంప్రదింపుల నిమిత్తం ఈ యుజేబియో, శాంటాఫె లోని మిలటరీ అధికారులకి సాయంగా కొన్నాళ్ళ పాటు అక్కడ వున్నాడు. ఆ సందర్భంలోనే యుజేబియో లెటూ

ర్లకి పరిచయం అయింది. తన కొడుక్కి జ్ఞానస్నానం యిప్పించేందుకు అంతదూరం నుంచి శాంటాఫె తీసుకు వచ్చాడు యుజేబియో. ఆ కుర్రవాడే గడిచిన చలికాలంలో మరణించాడట.

వయసులో యుజేబియో లెటూర్ కన్న పదేళ్ళు చిన్న. నవాజో ప్రజలలో అతని పలుకుబడి అపారం. ఇతనికున్నన్ని గొర్రెలూ, గుర్రాలూ మరెవరికీ లేవట ఆ ప్రాంతాల. శాంటాఫెలోనూ, ఆల్బకుర్క్యూలోనూ యితని కార్యదక్షతని గౌరవించేవారు. రోమను సైనికోద్యోగివలె వుండేవాడు యుజేబియో. ఎప్పుడూ వెల్వెట్ బట్టలు ధరిస్తూ నగిషీలుగల టోపీ పెట్టుకునేవాడు. వొంటిమీద అతను కప్పుకునే శాలువా యెంతో విలువైనది. అతిశ్రేష్ట మైన వూలుతో నేసిన, ఆ అల్లిక కుట్లశాలువామీద డిజైనులు, కళ్ళని చెదరగొట్టేవి. వేసుకునే షర్టు ఒంటికి పట్టుకునేటట్టు కాక వొదులుగా దర్జాగా ఉండేది.

యుజేబియో తన బంధుమిత్రాదులతోనూ పరిచారకవర్గంతోనూ 'కొలరాడో'లో నివశిస్తాడు. పడమట, దక్షిణాన, వుత్తరానకూడా నవాజో వంశస్తులు అతనికిగల పశుసంపదనీ, అశ్వసంపదనీ కాపాడుతూండేవారు. నవాజోలలో ఒక తెగకి నాయకుడు యుజేబియో.

ఇసుక తుపాను ముమ్మరంగా వుంది. లెటూర్ జాకింటోలు కొలరాడో ప్రాంతాలు జేరుకునేసరికి హిమ

పాతం పర్వతాలని ముంచినట్లే, ఈ యిసుక రేణువులు గాలిలో తేలుతూ నేలని కప్పేస్తున్నాయి. కళ్ళ కేమీ కన పడటం లేదు. యుజేబియో ఎదురువచ్చి, అతిథు లిద్దరికీ స్వాగతం చెప్పాడు. లెటూర్ తన మిత్రుని శోకవదనం లోకి సానుభూతితో చూశాడు.

'నా మిత్రుడు వచ్చాడు - యింకేం కావాలి?' అన్నాడు యుజేబియో సన్నగా. ఘన స్వాగత పత్రాలకి మించిన ప్రేమపూర్ణ స్వాగతవచనం ఆ వొక్క వాక్య మూను. ఆ వాక్యం వెనకఉన్న హృదయసౌకుమార్యం లెటూర్‌కి తెలుసు. గుర్రాలు బాగా అలసిపోయివున్నా యనీ, కొంచెం సేపు విశ్రాంతి తీసుకు తుపాను తగ్గాక బయలుదేరమనీ యుజేబియో కోరాడు. 'మీరు అలసి పోయివున్నారు. ఇంత అలసటతో శాంటాఫె ప్రయాణం తలపెట్టడం మంచిపని కాదు' అన్నాడు యుజేబియో.

తనక్కడ మూడు రోజులు వుంటాననీ, బహుకార్య భారంనుంచి విశ్రాంతి పొందేందుకు యిలా వచ్చాననీ అన్నాడు లెటూర్.

అక్కడి నదీప్రవాహం యిసుకతిన్నెలగుండా మెలి కలు తిరుగుతూ వడవడిగా పరువులెత్తుతుంది. ఈ గ్రామా నికి కొంచెం దూరంలో ఉన్న మహా వృక్షాలు ముందుకు వంగి, యిసుకని తూర్పుదిక్కుగా తరుముతున్నాయా అన్నట్లు వుంటాయి. నదిలో సంవత్సరానికి చాలాభాగం

నీరు వుండనే వుండదు. నీటిప్రవాహాన్నిబట్టి, తమ తలలు తిప్పుకున్న ఆ చెట్లని చూస్తే, యేవో వింత ఆలోచనలు వస్తాయి. ఈ చెట్లలో చాలాభాగం సజీవములే. కాని కొన్ని మృత్యుముఖంలోకి తొంగిచూస్తున్నాయి. బతికుండీ మరణించీ కూడా మానవునికి అనేక విధాల ఉపయోగబడే ఈ వంశా వృక్షాలు ఎన్ని తెగల ప్రజలని వీక్షించాయో!

నవాజోల ఆతిథ్యం లెటూర్‌కి ఎంతో బావుంది. మూడురోజులపాటు అక్కడ వున్నాడు. కాని ఆ మూడు రోజులూ యిసుక తుపాను కొడుతూనే వుంది. ఇంట్లో కూచుని ఆ తుపాను రోదన వినడమో లేక గాలి వుధృతానికి వూగిసలాడే చెట్లమధ్యనుండి నడవటమో! ఆ నడిచేటప్పుడు కళ్ళూ నోరూ ముక్కూ కప్పే దుప్పటీ చుట్టుకుని, తల వంచుకు నడవాలి. ఆ నడవటంకూడా శిరసుని భూమిలో వంచుకు నడవాలి. తలపైకి ఎత్తాడా, కప్పుకున్న దుప్పటి ఎగిరిపోయి నోట్లోనూ ముక్కులోనూ యిసుక దూరిపోయి, ఆ యిసుక తుపాను నిండు మనిషిని బలి గొంటుంది. ఆ మూడు రోజులూ లెటూర్ గడిచిపోయిన స్మృతులమధ్య జీవించాడు.

జోసఫ్ వెళ్ళిపోయిన ఈ ఆరునెలలనుంచీ బిషప్‌కి బాధ్యతలు యెక్కువయాయి. కొత్తగా వచ్చిన మతగురువులు మంచివాళ్ళేగాని, యేదీ తమకి తాముగా నిర్ణయించుకోలేక ప్రతి చిన్న విషయానికీ బిషప్ సలహా అడుగుతూంటారు. జోసఫ్‌కి యిక్కడివారితో మెసలడం బాగా

తెలుసు. దగ్గరున్నప్పుడు అతన్ని కేకలేసి గదమాయించే వాడు కాని, దగ్గరలేకపోతే చెయ్యి విరిగినట్టు వుండేది.

లెటూార్ జోసఫ్‌లు ఒకే ప్రాంతం నుంచి వచ్చిన వారైనప్పటికీ అంతకి క్రితం వొకరికొకరు తెలియదు. విద్యాధికులు గల ఉన్నత కుటుంబంలోనివాడు లెటూార్. లెటూార్‌ది అన్నివిధాలా కలిగిన కుటుంబం. జోసఫ్ సామాన్యవర్గంలో జన్మించాడు. అతని తాతముత్తాతలు ధనస్వాములూ కాదు, మహా పండితులూ కాదు. జోసఫు చిన్ననాటినుండీ రోగిష్టివాడవటంచేత, ఆరోగ్యం కోసమని తాతగారు వుండే పోల్వీక్ ప్రాంతాలకి తరుచు పంపేవారు. అక్కడి పొడిగాలి జోసఫుని ఒకవిధంగా కాపాడింది. జోసఫు, లెటూార్‌లు మాంట్ ఫెర్రాండు మత విద్యా పాఠశాలలోనే ఒకరికొకరు పరిచయమయారు.

'సెమినరీ'లో లెటూార్ రెండవ సంవత్సరంలో ఉన్నాడు. ఆ ఏడే జేరిన నూతన విద్యార్థులని ఆట స్థలంలో నిల్చుని చూస్తున్నాడు. అందులో పంధొమ్మిదేళ్ళ కుర్రవాడొకడు బక్కచిక్కిన దేహంతో, కళాకాంతులు లేని ముఖంతో కనపడ్డాడు. ఆ కుర్రవాడు యితనిచూపులు పసికట్టినట్టున్నాడు. లెటూార్ వద్దకి వచ్చి భయమూ భీతీ లేకుండా, యివి కొత్త పరిసరాలు, ఏమి అడగవచ్చో, ఏమి అడగకూడదో, అనే సంశయం లేకుండా, లెటూార్‌ని 'నీ పేరేమిటి? వూరేమిటి? మీ నాన్న ఏం చేస్తున్నాడు?'

యిలాటివన్నీ దడదడా అడిగి, 'మా నాన్నకి రీయామ్‌లో రొట్టెలషాపు వుంది. పట్నం మొత్తంమీద మా కొట్లో చేసే రొట్టెలే బాగుంటాయి. సుప్రసిద్ధరొట్టెల వ్యాపారిగా మానాన్న పేరు తెచ్చుకున్నాడు' అన్నాడా యువకుడు.

కులీన కుటుంబంలో పుట్టి వాక్చాతుర్యం స్వత సిద్ధంగా తెలుసుకున్న లెటూర్, ఆ యువకుని మాటలకి లోన నవ్వుకుంటూ, అతని ఆత్మవిశ్వాసానికి మాత్రం ఆశ్చర్యపడ్డాడు. ఈ యువకుడు తన తండ్రి గురించే కాక అన్నను గురించీ, అత్తయ్యను గురించీ అల్లరిసోదరి ఫెలోమినాను గురించీ కుటుంబచరిత్ర యావత్తూ గడగడ చెప్పేసి 'నువ్విక్కడ యెన్నాళ్ళబట్టీ వుంటున్నావు?' అని అడిగాడు లెటూర్‌ని.

లెటూర్ జవాబు చెప్పక పూర్వమే, 'నువ్వింకెప్పుడూ మతసేవకే జీవితం వినియోగిద్దామనుకున్నావా? మత దీక్షలో వుండిపోతావా? నేనింక మతాన్ని వొదిలిపెట్టి వెళ్ళను. మొదట్లో తెలియక సేనలో ప్రవేశిద్దామనుకున్నాను. ఇప్పుడింక అదేమీ లేదు.'

గడిచిన సంవత్సరమే, క్లెర్‌మాంట్‌లో సైనిక విన్యాసం జరిగింది. ఆల్‌జీర్స్‌ని వోడించిన ఫ్రెంచి పటాలాలు తమ దుస్తులతో మహాదర్జాగా క్లెర్‌మాంట్ వీధుల వెంట బారులుతీర్చి వెళ్ళేసరికి, యువకుడైన జోసఫ్‌కి మనిషి పుట్టాక చేయగల మంచిపని పటాలంలో చేరడమే అనిపించింది ఆ లేతవయసులో! ఇంట్లో వాళ్ళకి చెబితే

వద్దంటారని, వెంటనే రెక్రూటింగు ఆఫీసుకువెళ్ళి తన పేరు నమోదు చేయించుకు వచ్చాడు. ఈ సంగతి వాళ్ళ నాన్నకి తెలిసి లబోదిబోమ నేసరికి, మనవాడికి పెద్దలని హింసపెట్టడం న్యాయంకాదనిపించిందట. జోసఫ్ కి పదమూడో యేట వాళ్ళమ్మ చనిపోయింది. ఆమె యెప్పుడూ తన కొడుకు మతగురువవాలని అనేదట. 'చనిపోయిన నీ తల్లి కోర్కె నెరవేర్చవా? ఆమె ఆత్మకి అపచారం చేస్తావా?' అని వాళ్ళ నాన్న అడిగేటప్పటికి, ఎందుకు పేరు యిచ్చి వచ్చానా అని పెద్దపెట్టున యేడుపు వచ్చిందట. క్లైన్ మాంటులో సైనికోద్యోగుల దుస్తులను చూస్తూ, జగన్మాత అని దేశ మాత కోసం ఎలా మరచిపోగలిగానా అని వాపోయాట్ట!

ఏదో యిష్టగోష్ఠిలో ఉన్నవాడల్లా, యింటికి వుత్తరం వ్రాయవలసిన వేళైందంటూ, ఛంగున పరిగెత్తే సరికి, లెటూర్ కి మరింత ఆశ్చర్యమై ఈ అర్భకుణ్ణి కాపాడవలసిన భారం తనదైనట్టుగా భావించాడు. ఇతడు సాహసవంతుడు, హృదయ ధర్మాన్ని బట్టి నడుచుకునే మనిషి. చూపులకి అందంగా లేకపోయినా మనసు మంచిది. ఈ రొట్టెల వర్తకుని కొడుకుని తను కాపాడాలి – అనుకున్నాడు ఆ క్షణాన. ఆనాటి స్నేహమే యింతదయింది.

విద్యాసంస్థలో వున్న సంవత్సరాలలో చదువు విషయంలోనూ, గ్రాహ్యశక్తి విషయంలోనూ లెటూర్ దే ఎప్పుడూ పై చెయ్యి. కాని ఈ రొట్టెల వర్తకుని కుమారు

నికి గల 'తీవ్ర విశ్వాసం' తనలో ఎందుకు లేదా, అని లెటూర్ అనుకునేవాడు. ఇద్దరూ ఫాదరీ ఉద్యోగంలో చేరాక, జోసఫ్ ముందు ఇంగ్లీషు భాష, తర్వాత స్పానిష్ నేర్చుకున్నాడు. కాని ఈ రెండూ కూడా నిత్యకృత్యానికి పనికొచ్చేటంతవరకే నేర్చుకున్నాడు. ఆ భాషల్లోని సొగసులు గ్రహించేవాడు కాదు. జోసఫు ఎవరిభాష వాళ్ళతో మాట్లాడేవాడు. నౌకర్లతో నౌకర్ల భాష, నేటివులతో నేటివుల భాష – లెటూర్ అట్లాకాదు.

ఇప్పటికి యిరవై అయిదు సంవత్సరాలబట్టీ జోసఫు లోని స్వభావ వైరుధ్యాలు లెటూర్‌కి అర్థమయేవికావు. ఆ వైరుధ్యాలు అంతే, అని సరిపెట్టుకునేవాడు. జోసఫు దూర ప్రయాణాలకి వెళ్ళినప్పుడు, మిత్రుని గురించి తలంపులు వచ్చి, బహుశా నేనతన్ని ప్రేమిస్తున్నాను, కాబోలను కునేవాడు. జోసఫుకి జిహ్వాచాపల్యం వున్నప్పటికీ. భగవంతునిమీద గల విశ్వాసం అపారమైనది. కమ్మటి పదార్థాలు కడుపునిండా తింటూ, తియ్యటి పానీయాలు యెంత నిర్విచారంగా సేవించేవాడో, అదేవిధంగా వుపవాస దినాలలో నీటిబొట్టు కూడా ముట్టేవాడుకాదు. ఎంత భోజన ప్రియుడో, అంత నియమవంతుడు కూడా. ఈ ప్రయాణాలలో అతను పడే కష్టం మాటలతో చెప్పలేనిది. ద్రాక్షరసంమీద జోసపుకిగల మక్కువ, మరొకరి విషయంలో అయితే వ్యసనమని చెప్పవచ్చు కాని ఈ రోగిష్టి మనిషి తన శరీర శక్తి కాపాడుకునేందుకు, యిది అవసరమయేది.

కమ్మని భోజనమూ తియ్యని పానీయమూ అతని కళ్ళల్లో వెలుగు తెప్పించడం లెటూార్ అనేకసార్లు స్వయంగా చూశాడు. కడుపునిండా భోజనంచేసిన మీాదట, సాధారణంగా ఎవరైనా విశ్రాంతి కోరుతారు కాని యితను భోజనానంతరం ఏడెనిమిది గంటలు నిర్విరామంగా తన పని చూసుకునేవాడు.

లెటూార్‌కి ఒక విషయం మాత్రం చీకాకు కలిగించేది. ఎవరేనా కనపడ్డం తరువాయి, 'మా చర్చికి విరాళమివ్వండి; అక్కడేదో ప్రజలు అవస్తల్లో ఉన్నారు, ధర్మం చెయ్యండి' అని పుండు సలిపినట్టు పట్టుకునేవాడు. విరాళమడగటంలో తప్పులేదుగాని సబబూ సందర్భం వుండాలనేవాడు లెటూార్. దీనంగా ఆశ్రయించడమనేది లెటూార్‌కి నచ్చదు. నిజానికి జోసఫుకి యీా ప్రపంచంలో 'నాది' అన్న వస్తువేమీాలేదు – 'కంటెంటో' గుర్రం తప్ప. ఫిలోమినా ఎంతమంచి బట్టలు పంపినా, ఈ ధర్మప్రభువుకి మిగిలేది పాతచింపులే! ఎవరేనా అడిగితే యిస్తారు, యితను అడక్కుండానే యిస్తాడు. లెటూార్ యిల్లు ఆనాటి నాగరికుల గృహాల్లా ఉండేది. ఇంట్లో పెద్ద గ్రంథాలయం వుంది. ఇక కంబళ్ళూ, తివాసీలూ, కావలసినన్ని. మెక్సికన్ స్త్రీలు స్వహస్తాలతో అల్లి బహూకరించిన లేసులు చెప్పలేనన్ని! జీవనయాత్ర సుఖతరంగా చేసుకోవడం లెటూార్‌కి తెలుసు. యాంటోనియోవంటి ధనశాలి వెండిపళ్ళాలూ అవీ యిస్తే, మెక్సికన్ వనితలు ఒకళ్ళతో ఒకళ్ళు పోటీబడి అత్యుత్తమ

నైన అల్లిక రుమాళ్ళు సమర్పించేవారు బిషప్‌గారికి. ఆ మాట కొస్తే లెటూరుకి కావలసినంత సంపద వుంది. జోసఫుకి యేముంది ఆ గుర్రం తప్ప? జోసఫు ఒక విధంగా బికారి. తనవీ అంటూ ఏమీ లేవతనికి. అనేక విషయాల్లో వెనకటి సెయింట్సుని జ్ఞాపకం చేస్తాడు జోసఫు.

ఒకప్పుడు జోసఫు తపోజీవనం గడపాలనుకున్నాడు గాని ఏదో ఒకటి మాట్లాడకుండా యెక్కువ సేపు వుండ లేకపోయే స్వభావం అవడంవల్ల, ఆ ప్రయత్నం విరమించాడు. మాట్లాడిన ప్రతి ఒక్కడూ అతనికి సన్నిహితుడే! ప్రతి కొత్త పరిచయం సంతోషాన్నిచ్చేది జోసఫుకి. వోహియోలో లెటూర్ జోసఫులిద్దరూ కలసి స్టేజికోచీల్లో వెళ్తూ వుండగా బండినిండా మనుషులు క్రిక్కిరిసివున్నా, మరొక కొత్తప్రయాణీకుడు వస్తున్నాడనేసరికి జోసఫు సంతోషంతో అతనిని లోపలికి ఆహ్వానించేవాడు - స్థలం లేకపోయినా. లెటూర్‌కి ఈ మర్యాద మొదట్లో చీకాకనిపించేది. కాని, ఆసంగతి ఆలోచించినకొద్దీ ఒక నూతన సత్యం పొడగట్టింది లెటూర్‌కి. జోసఫుకి ప్రజలంటే తెగ ఆపేక్ష. వోహియో రాష్ట్రంలోని దుర్భర పరిస్థితులూ, అక్కడి అనారోగ్య ప్రజల సోమరితనం, వీధులలోని మురికీ - యివేవీ బాధించేవి కాదు జోసఫుని. లెటూర్‌కి మాత్రం ఆ నికృష్ట పరిస్థితులు బాధాకరమనిపించేవి. లోకం ఎంత అశుభ్రంగా వుంటే, తను చేయవలసినపని అంత వుందని భావించేవాడు జోసఫు. ఒక్క సంగీతం వినడం తప్ప వేరు లలితకళాసక్తి ఏమీ

లేదు అతనిలో. పొగలంతా యెటువంటి మురికి ప్రదేశా లలో తిరిగినా సాయంత్రంవేళ మాత్రం జర్మన్ విద్యాం సుల పాట కాసేపు వింటే, మనసు శాంతిగా వుండేదట.

'జోసపు యిటువంటివాడు, ఇతనిలో ఈ సుగుణా లున్నాయి' – అని పట్టీవేసి చెప్పేందుకు లేదు. పై మెరు గులులేని అతని ఆంతర్యం గొప్పది. మనుషుల కూటమిలో అతనొక ఆణిముత్యంలా మెలిగేవాడు. ఇక్కడివారి పూరి గుడెసెల్లోనూ, అక్కడ రోములోని మతాధిపతుల విలాస మందిరాల్లోనూ ఒకేప్రకారం సంచరించేవాడు.

లోగడ ఒకసారి జోసపు, రోము వెళ్ళినప్పుడు, తన కొకసారి పోపు దర్శనం చేసుకోవాలని ఉన్నదని, పదహా రవ పోప్ గ్రెగరీ కార్యదర్శితో అన్నాడు. ఓహియో నుంచి వచ్చిన మత గురువుని చూడటానికి అంగీకరించాట్ట పోప్!

అప్పుడు జోసపు రోమునగరంలో మూడు నెలలు పాటు రోజుకి నలభై సెంట్లు మాత్రమే ఖర్చు పెడుతూ వున్నాడు. నలభై సెంట్లలో సుఖంగా జీవించవచ్చునట. ఆ పురాతన నగరంలోని సమస్త వైభవాలూ ఒక్కటి కూడా వొదిలిపెట్టకుండా చూశాడు. అంతేగాక సామాన్య ఫాదరీలు కాంక్షించడానికి వీలుకాని పోపు దర్శనభాగ్యం కూడా కలిగింది.

పోపుని దర్శించడానికి వచ్చినప్పుడు ఒక సంచీ నిండా వస్తువులతో వస్తారు – ఆయన దీవనకోసం. కాని

సంప్రదాయానికి విరుద్ధంగా యితను రెండు సంచీలు పట్టుకు వచ్చాడు. పరిచయమవడం తరువాయిగా, తన వంటి ఫాదరీలు నూతన ఖండంలో యెటువంటి అవస్థలు పడుతున్నదీ గడగడా చెప్పేయసాగాడు పోపుతో. ఆ వర్ణనలో కవితా వైఖరులు లేవు. స్వానుభవంతో చెప్పే మాటలు కావడంచేత పోపు మనో ఫలకం మీద చిత్తరువుల వలె హత్తుకుపోయాయి. నూతన ప్రపంచంలో ఈ మత సాధకులు సుస్థాపితం చేస్తున్న క్రీస్తుమత విశ్వాసానికీ, వారు పంచి పెడుతున్న జ్ఞాన భిక్షకీ మనసులో ఆనందించాడు పోపు. రెండు సంచీలలోని సరుకులూ ఆయన ముందు వుంచాడు జోసపు. ఏమున్నాయి వాటిలో? జప మాలలూ, శిలువలూ, ప్రార్థన పుస్తకాలూ, విగ్రహాలూ, మెళ్లో కట్టుకునే బిళ్ళలూ - యిటువంటి సామాగ్రంతా. అనుకొన్న వ్యవధి అప్పుడే మూడు రెట్లయిందని సెక్రటరీ జ్ఞాపకం చేశాడు. జోసపుమాటలు ఆఖరికి పోపుకూడా మర్చిపోయి వింటున్నాడు. చివరికి పోప్ ఆ వస్తువులకి తన ఆశీర్వాదం కాక వినయపూర్వక వందనం అర్పించి, 'నీవు ధన్యుడవు' అన్నాడు జోసపుతో. తానేదో ఉన్నత స్థానాన వున్నట్లూ, ఈ సామాన్య మత సాధకులు దిగువ వున్నట్లూ గాక, 'యిద్దరమూ క్రీస్తు ప్రభువు సేవకులం' అన్న సమతా భావంతో, మహనీయుల సహజ కరుణార్ద్రహృదయంతో, జోసపుని సాగనంపాడు.

నవాజోల ఆతిథ్యంలో, మూడురోజుల, విశ్రాంతి

తీసుకుంటున్న బిషప్ లెటూర్‌కి, యెన్నెన్నో పాత విష యాలు జ్ఞప్తికి వచ్చాయి. సోదరులకీ. మిత్రులకీ బాకీపడ్డ ఉత్తరాలన్నీ తీరిగ్గా రాశాడు. ఆ యిల్లు ఓడకాబిన్‌వలె వుంది. ఇంటిమీదుగా యెల్ల వేళలా యిసుక తుపాను కొడు తోంది. ఇక్కడి యిళ్ళకు కిటికీలుండవు. ఒకేఒక్క తలుపు. ఇసుక తుపాను మరీ వుధృతంగా ఉన్నప్పుడు తప్ప ఆ తలుపు తెరచివుంచాలి. లేకపోతే గాలి ఆడదు. యింటి గోడలలోని పగుళ్ళనుంచి పగలంతా యిసుక రేణువులు లోపలికి వస్తున్నాయి. ఒక్కోసారి ఈ యిల్లు ఓడలో కాబిన్‌వలె అల్లల్లాడేది. ఈ యిల్లు తనని కాపాడగలదా అనిపించేది అప్పుడప్పుడు. గాలినిండా యెంత దుమ్ము, లోకం నిండా యెంతయిసుక! – అనుకున్నాడు. అతనికేదో కూడా యిసుకగోడ మీద కూచున్నట్లుంది.

## 4

ఈ కొత్తచోటుకి వచ్చిన మూడోరోజున లెటూర్, వెనక్కి రావలసిందిగా జోసఫుకి వుత్తరం వ్రాశాడు. ఉత్తరం వ్రాయడమయాక, షికారుకని బయలుదేరాడు. చాలా సేపు తిరిగాడు. సాయం సమయానికి నదికి ఒక మైలు దూరంలో వున్నాడు. ఏదో శబ్దం గాలిలోనుంచి పరుగు లెత్తుకుంటూ వచ్చేసరికి, అది బహుశా తన మిత్రుని యింటి వద్దనుంచి అయివుంటుందని అనుకున్నాడు.

ఊళ్లోకి వస్తూ, యుజేబియో యింటిముందు ఆగాడు. పెద్దడప్పు ఒకటి వాయిస్తూ నవాజోభాషలో, యేదోపాడు తున్నాడు యుజేబియో. ఆ గానానికి సరిపడేట్టు నృత్యం చేస్తున్నారు నాలుగేళ్ళపిల్లవాడొకడూ అయిదేళ్ళపిల్లవాడొకడూను. లోపలనుంచి యిద్దరు స్త్రీలు, వీళ్ళ నృత్యం పరిశీలిస్తున్నారు.

చిన్నపిల్లలు లెటూార్ రావడం గమనించలేదు. తమ నృత్యంలో వారున్నారు, ఆ నల్లపిల్లలు ఇద్దరూ అర్ధనిమీలిత నేత్రాలతో చేతులూ కాళ్ళూ తిప్పుతూ, ఆ డప్పు చప్పుడుకి అనుగుణంగా గంతులు వేస్తున్నారు. యుజేబియో ముఖం ఆలోచనాపూరితమైవుంది. డప్పులు తన ముంగాళ్ళ మధ్య పెట్టుకు ముందుకి వొరిగాడు, వొరిగినకారణంగా అతని పెద్దజుట్టు నుదుటిమీద పడింది. చేతికిగల వెండికడియాలు ఆ సంధ్యాకాంతిలో తళుక్కుమంటూ డప్పుమీద కొట్టినప్పుడల్లా అవి మిలమిల్లాడుతున్నాయి, కొంచెం సేపయాక వాళ్ళనిపొమ్మని, ఆ డప్పు భార్యకి యిచ్చి, అతిధి కెదురుగా వెళ్ళాడు. 'టక్సాన్‌లో వున్న జోసపుకి ఈ ఉత్తరం పంపాలి. జాకింటొకిచ్చి పంపుతాను ఈ ఉత్తరం. మీ మనుషుల్లో యెవర్నైనా నా వెంట శాంటాఫెదాకా పంపగలరా?' అని అడిగాడు లెటూార్.

'ఎవర్నో పంపడమెందుకు? నేనే వస్తాను' అని సమాధానమిచ్చాడు యుజేబియో.

మర్నాడు వుదయం జాకింటో, జోసపుకి అందించ వలసిన వుత్తరం పుచ్చుకు బయల్దేరాడు. లెటూరూ యుజేబియో తూర్పుకి బయల్దేరారు.

శాంటాఫె అక్కడికి నాలుగు వందల మైళ్ళు. ఈ తిరుగు ప్రయాణంలో యిసుక తుపానులతోనూ, నిప్పులు చెరిగే యెండతోనూ యిటా అటా అన్నట్లు వుండేది. నేల యిసుకతో ఎంత నిర్జీవంగా వుండేదో, ఆకాశంలోని కదలిక అంత తీవ్రంగా వుండేది. అనంతాకాశం అంటే ఏమిటో కళ్ళముందు కనిపించింది లెటూర్‌కి. అది నిజంగా అంతు కనపడని ఆకాశం. పరిగెత్తే మేఘాలూ, సూదుల్లా పొడిచే యిసుక రేణువులూ తప్ప యింకేమీ కనపడటం లేదు. ఈ అనంతాకాశం క్రింద పర్వతాలు చీమ గుట్లల్లా వున్నాయి. కళ్ళముందు కనపడే ఈ నిర్జీవ దృశ్యం యెప్పటికేనా మారుతుందా, యెంతకీ యింతేనా, యిక మార్పు కనపడదా, అని అనిపించింది లెటూర్‌కి. సముద్రంలోని నావికునికి చుట్టూ సముద్రం, యెడారిలోని బాటసారికి చుట్టూ ఆకాశం. యుజేబియో పక్క నుండి తనతో ప్రయాణం చేస్తూ వుండటంచేత తనింకా బతికే వున్నాననీ, యిదింకా భూలోకమేనని అనిపిస్తోంది లెటూర్‌కి. గాలిపాటు ఏ క్షణాన ఎలా మారుతుందో! ఇప్పుడు వీచిన తుపాను యింకో క్షణానికి మాయం కావచ్చు; లేదా, అలా ఎంతసేపైనా వుండవచ్చు. తక్కువ మాట్లాడుతూ, తక్కువ తింటూ, ఎప్పుడు నిద్ర వస్తే అప్పుడు నిద్రపోతూ

గమ్యంవేపు ప్రయాణం చేస్తున్నాడు లెటూర్. జాకింటోకి మల్లే ఈ యుజేబియో కూడా సాధు జీవనుడు. పువ్వు లెక్కడేనా కనపడితే చాలు, అవి కోసుకొచ్చేవాడు. ప్రతి ఉదయం ప్రయాణానికి ముందు యేవో కొత్త పువ్వులు తీసుకువచ్చి, బిషప్‌కి బహూకరిస్తూ ఉండేవాడు. వీటిని యింద్ర ధనస్సులంటారంటూ ఒక ఉదయం సప్తవర్ణ పుష్పాలని లెటూర్‌కి యిచ్చాడు యుజేబియో. ఈ నవాజోకి పువ్వులమీద ఎంత ఆపేక్ష - అని ఆశ్చర్యపోయేవాడు లెటూర్.

రాత్రి ఏ చెట్టు నీడనో, ఏరాతి గుట్టనో, ఏ పర్వతం మాటునో విశ్రమించే వారు ఈ బాటసారులు. మర్నాడుదయం ప్రయాణం సాగిస్తున్నప్పుడు, తామక్కడ విశ్రమించిన గుర్తులు అణుమాత్రమైనా కనపడకుండా తగు జాగ్రత్త తీసుకునేవాడు యుజేబియో. సగం కాలిన కట్టెలూ, మిగిలిపోయిన భోజన పదార్థాలూ, వంట చేసుకునేందుకు పొయ్యిగా పెట్టిన రాళ్ళూ - యివన్నీ యెక్కడి వక్కడ మళ్ళీ కనపడకుండా మాయం చేసేవాడు. ఒక్కో సారి యిసుకలో పెద్ద గొయ్యి త్రవ్వి, అందులో పూడ్చేసేవాడు. తమ తాలూకు చిహ్నం కూడా మిగిల్చేవాడు కాదు.

ఇక్కడివారి పద్ధతే అంత! చుట్టూ ప్రకృతిలో కలసిపోతారుగాని ప్రకృతికి యెదురీదరు. హోపీ తెగవారి జీవన విధానానికీ, ఈ నవాజోలకీ అనేక విషయాలలో పోలికలూ

తేడాలూ కూడా వున్నాయి. సూర్యరస్మి ప్రతిబింబించే ట్లు యిళ్ళు కట్టుకోవడం ప్రమాదకరమని నవాజోల నమ్మకం. కొత్త పద్ధతులు వీళ్ళు ఆమోదించరు. తాత ముత్తాతలు నడచిన త్రోవనే నడుద్దామంటారు. కొత్తవాళ్ళొచ్చి నూతులు తవ్వినా, అందులో నీళ్ళు పరిశుభ్రంగా వున్నా, తమ పూర్వీకులు యే జలాశయాల్లో నుంచి నీరు తెచ్చుకున్నారో, అవే మంచివని వీళ్ళ అభిప్రాయం. అధునాతన నగరాల్లో నివసింపవలసిన ఆటవికులలో కూడా ఈ అభిప్రాయం కనపడేది.

వెండి పనిముట్లు, దంతపు పనిముట్లు చేయడంలో వీరు అద్భుత నేర్పరులు. తమకిగల శక్తిసామర్థ్యాలని ఈ నగిషీపనులు చేయటంలోనూ, తద్వారా సౌందర్యాన్ని సంపాందించడంలోనూ వీరు వినియోగిస్తారు. అంతేగాని పాశ్చాత్యులకు వలె ప్రకృతిని వశంచేసుకు, పునః సృష్టి చేదామని తలపోయరు. వీరు తమ కళా సౌష్టవాన్ని తమ పరిసరాలూ తమ జీవితమూ సౌందర్య భూయిష్టం చేసుకునేందుకే ఉపయోగిస్తారు, పాశ్చాత్యుల దృష్టిలో వీళ్ళు సోమరిపోతులవలె కనపడవచ్చు కాని అది సోమరితనం కాదు, తరతరాలుగా తీసుకుంటున్న జాగరూకతా, పెద్దల యెడ విధేయతాను! ఈ ప్రాంతం చూస్తే, ఇక్కడేదో 'పెద్దదేశం' నిద్రపోతోందనీ, అది నిద్రనుంచి మేల్కొనడంతో ప్రజలని కూడా లేపుతుందనీ అనిపిస్తుంది. ఈ భూమీ ఈ నేలా ఈ గాలీ వారికి జయించవలసిన శత్రు

వులు కాదు; వాటితో మైత్రిచేసుకొని జీవనరథం ముందుకి నడిపిస్తారు. ఈ స్థానిక ప్రజలు ఎవరైనా వేటకి వెళితే, విలాసానికి వెళ్ళరు. ఆహారంకోసం వెళతారు. క్రూరంగా మృగాలని చంపడం వాళ్ళలో లేదు. నదీ జలాలకి ఆన కట్టలు కట్టి, కలపకోసం అరణ్యాలు నేలమట్టంచేసి, వారు తమ నాగరికత నిర్మించుకోలేదు. జలదేవత ప్రసాదించిన నీటితో వారు తమ పొలాలు పండించుకున్నారు. భూమిని వారు పూజించేరేగాని, యింకా పండాలని దానికి లంచాలు పెట్టలేదు. పంచభూతాలపట్లా వారిది ప్రణవభావం.

ఆల్బకర్క్యూ చేరుకుంటూ వుండగా ఫాదర్ లెటూమూ యుజేబియో మాటల్లో పడ్డారు. నగరం చేరుకుంటున్న కొద్దీ స్థానికుల గుంపులు కనపడసాగాయి. ఈ తెల్లమని షిని, ఒక నవాజో వెంటపెట్టుకు తీసుకురావడం, వారు ఆశ్చర్యంతో చూడసాగారు. లగూనాకి ఉత్తరదిశగా ఉన్నప్పుడు యిద్దరు అశ్వారోహకులు యుజేబియోకి వం దనం సమర్పిస్తూ, తూర్పుదిశగా వెళ్ళేరు. ఆ వందనసమ ర్పణే యుజేబియోకి గల పలుకుబడికి నిదర్శనం. ఆ యిద్దరు ఆశ్వికులూ దుప్పులు పరిగెట్టినట్టుగా, ఆ యిసుక కొండల లోకి వెళ్ళారు. వారి గుర్రాల నీడలు గాలిలో ఎగిరే గ్రద్దల రెక్కల్లా ఉన్నాయి.

# 8

## పచ్చకొండ

జోసఫు శాంటాఫె వచ్చి మూడు వారాలయింది. లెటూార్ తనని టక్సాన్ నించి అంత తొందరగా ఎందుకు పిలిపించినదీ యింతదాకా చెప్పలేదు. పూల తోటలో చెట్ల యోగక్షేమం విచారిస్తున్న జోసఫు దగ్గరకు వంట మనిషి వచ్చి, ఈరోజు భోజనాలు తొందరగా అయిపోతాయనీ, అయ్యగారు భోజనానంతరం ఎక్కడికో వెళ్తున్నారనీ చెప్పింది.

లెటూార్‌కి ఒక్కడూ కూచుని భోజనం చెయ్యటం అలవాటు లేదు. ఎవరో ఒకరు ప్రక్కని వుండాలి దూర ప్రాంతాల నుంచి వచ్చిన మతగురువో, సైనికోద్యోగో, అమెరికన్ వ్యాపారస్తుడో ఎవరో ఒకరు ప్రతి పూటా ఉంటారు. లెటూార్ భోజనాల గదికి కిటికీలు తూర్పున ఉన్నాయి. కిటికీల వెలుపల నుండి ఆకుపచ్చని మొక్కలు కనపడుతూ వుంటాయి. ఇక భోజన సమ

యాన ఆ గదిలోకి వచ్చే వెలుగు ఎంతో మార్దవంగా వుంటుంది. భర్త మరణానంతరం, ఇజబెల్లా శాంటాఫెలో తనకిగల ఆస్తిపాస్తులన్నీ అమ్మేసి, న్యూఆర్లియన్సు వెళ్ళి పోయింది. ఆమె తన సరుకులు వేలం వేస్తున్నప్పుడు, ఒక పెద్ద భోజనాల బల్ల, ఒక సొరుగుల చిన్న అలమారా కొన్నాడు లెటూర్. తన జ్ఞాపకార్థంగా వెండి కాఫీసెట్టూ వెండి కొవ్వొత్తుల సెమ్మా బహూకరించింది ఇజబెల్లా.

జోసఫు, భోజనాల గదిలోకి వచ్చేసరికి, లెటూర్ అప్పటికప్పుడే తన కుర్చీలో కూచుని వున్నాడు. 'ఇవ్వాళ మనం తొందరగా భోజనం చేస్తున్నామని వంటమనిషి చెప్పిందిగా! భోజనాలయాక, మనిద్దరం షికారు వెళు తున్నాము. నీకో విషయం చెప్పాలి యివ్వాళ!' అన్నాడు లెటూర్.

'అలాగే, రెండు మూడు వారాలబట్టీ నేను ఎలా వున్నానో నువ్వు గుర్తించే వుంటావు. అశ్వశాలలోని 'కంటెంటో'ని చూసినప్పుడల్లా నాకు దిగులేస్తోంది. దానిని అలా కొన్నాళ్ళు కట్టిపడేస్తే బాగా బలిసి, ఎందుకూ పనికి రాకుండా పోతుంది.'

'ఆ భయమేమీ అక్కర్లేదు. ఆరువందల మైళ్ళు ప్రయాణంచేసి వచ్చాక ఆ మాత్రం విశ్రాంతి యివ్వడం హానికరమా? ఇవ్వాళ మధ్యాహ్నం కంటెంటోకీ, మోంజెలి కాకీ రెండిటికీ పనివుంది.'

భోజనానంతరం యిద్దరు మతగురువులూ పడమట దిశగా ప్రయాణమయారు. ఏ వూరు వెళుతున్నదీ, ఎందు నిమిత్తం వెళుతున్నదీ బిషప్ చెప్పలేదు; జోసఫు అడగ లేదు. కొంతదూరంవెళ్ళాక రహదారి వదిలిపెట్టి, దక్షిణాభి ముఖంగా శాండియా పర్వతశ్రేణులవైపు మళ్ళారు.

సుమారు నాలుగు గంటలవేళ 'రయోగ్రాండ్ లోయ'లోని ఒక కొండవరస చేరుకు, లోయదిగుతూ ఆల్బకుర్క్యూ దారిబట్టారు. అక్కడికి ఆల్బకుర్క్యూ అరవైమైళ్ళు. అక్కడ గోపురాకారం గల రాళ్ళగుట్టలు అమితంగా కన పడ్డాయి. ఇది నల్లరాయీకాదు; గోధుమవన్నెదీ కాదు. సముద్రనీలానికీ, చెట్ల ఆకుపచ్చకీ మధ్యగల ఒక తమాషా రంగు, ఈ రాతినేల ఆకుపచ్చరంగుగా ఉండుట వింతగా కనపడింది. జోసఫు వెనుకకు తిరిగి చూసేసరికి బంగారు వన్నె దాల్చిన ఒక కొండగుట్ట కనపడింది, అస్తమయ కాంతిలో అది ఒక బంగారు పర్వతంలా ఉంది. ఆ కొండని అక్కడక్కడ తవ్వినట్టున్నారు కూడా.

'ఇన్ని ఆకుపచ్చు గుట్టలమధ్య ఈ బంగారు కొండ వింతగా లేదూ! ఇదుగో యిన్నాళ్ళకి కనపడింది మన కెతె డ్రల్ కి కావలసినరాయి,' అన్నాడు లెటూర్.

జోసఫ్ కొండ దగ్గిరికి వచ్చి, రాయి ముట్టుకు చూసి, 'గట్టిదే' అన్నాడు. స్వదేశంలోని సెయింట్ పీటర్స్ చర్చి జ్ఞాపకం వచ్చింది ఫాదరీలకి.

'ఈ సువర్ణ కాంతులు దివ్య ప్రభుపు హర్మ్య మంది రాన్ని జ్ఞప్తికి తెస్తున్నాయి' అన్నాడు జోసప్ పట్టలేని సంతోషంతో.

'ఇటువంటి రాయే కావాలని కోరుకున్నాను. ఇస్లెటా నుంచి వస్తూ మార్గమధ్యాన, యిక్కడ ఆగి, వెను దిరిగి చూసేసరికి ఈ శిఖరం కనపడింది. ఇస్లెటా ఫాదరీ అంత్యక్రియలకి అక్కడికి వెళ్ళి, వర్షంవల్ల మామూలు బాటంతా తుడుచుకుపోయిందని వినడంవల్ల, ఈ దారి వెంట వచ్చాను. పడమట నుంచి సాయం సమయాన వస్తూ వుండగా, యీ పర్వత శిఖరం నన్ను ఆనంద పారవశ్యంలో ముంచింది. చూసీ చూడగానే అనుకున్నాను - మన కెతెడ్రల్ కోసమే యిదని'

'ఇవేవో హటాత్ సంఘటనలని మనమనుకుంటాం. కాని నేనలా భావించను. కెతెడ్రల్ నిర్మించేందుకు చాలా కాలం పట్టవచ్చు-అది వేరే సంగతి. కాని భగవంతుడు నిన్ను పనిగట్టుకు, ఈ దారి వెంట పంపివుంటాడు'

'ఎందుకు చాలా కాలం పడుతుంది? భగవదాశీ ర్వాదం వుంటే, నా జీవిత కాలంలోనే పూర్తికావచ్చు. పీళ్ళమీదా వాళ్ళమీదా ఆధారపడకుండా స్వయం శక్తితో నిర్మించాలి యిటువంటివి. పటుదర్పాలు ప్రదర్శిం చేందుకుకాక, ప్రార్థనలకి అనువుగా వుండే ఒక సువిశాల మందిరం కట్టించాలి మనం. ఇంగ్లీషువారి 'ఎర్ర యిటుకల

యిల్లు' కాకూడదు. ఇక్కడ పనివాళ్ళమీద నాకు నమ్మకం లేదు. ఏపనీ నియమబద్ధంగా చెయ్యలేరు వాళ్ళు.'

జోసఫు కళ్ళద్దాలు తీసి తుడుచుకుని 'యిక్కడి పని వాళ్ళు పనికి రాకపోతే, యెక్కడనుంచి పట్టుకువస్తావేమిటి?' అని అడిగాడు.

'టోలోనులో నా కొక మిత్రుడున్నాడు. క్రితంసారి దేశం వెళ్ళినప్పుడు నేనీ సంగతి అతనితో ప్రస్తావించాను. అతను గొప్ప శిల్పి, సముద్ర ప్రయాణం చేసి అతనింత దూరం రాకపోవచ్చు. ఈ గుర్రపు స్వారీలు అతనికి అల వాటులేవు. తను రాలేకపోయినా, తన కొడుకుని తప్పక పంపుతాడు. అతని కడసారి కొడుక్కికూడా, ఈ నూతన ప్రపంచంలో సంప్రదాయ సిద్ధమైన చర్చి నిర్మించాలనే కోరిక ఉంది. నేను వెళ్ళేటప్పటికి అతనింకా చదువుకుం టున్నాడు. ఈ పాటికి చదువు అయిపోయివుంటుంది. యూరప్ ఖండం లోని చర్చి నిర్మాణ కౌశలం యావత్తూ అతను తన అధ్యాపకులు వద్దనుంచి నేర్చుకుని వుంటాడు. మనం మిగతా ఏర్పాట్లన్నీ చేసుకున్నమీదట, అతన్ని పిలి పించవచ్చు. అతను తనతోపాటు యిద్దరు పనివారినితీసుకు వస్తాడు. సెయింట్ లూయిలోని పనివారికంటె వారి కెక్కువేమీ అవదు. మన కెతెడ్రల్ కి యెటువంటిరాయి కావాలో నిర్ణయం అయింది గనుక, యికపని ప్రారంభించ వచ్చు. శాంటాఫెకి యిది యేమంతదూరం కాదు - పది హేనుమైళ్లు ఒక దూరమా? ఈ కొండ యెక్కడం దిగడం

కూడా అంత కష్టం కాదు. ఇక్కడనుంచి రాయి, శాంటా ఫెకి తేలిగ్గా చేరవేయవచ్చు.'

'నువ్వు బిషప్‌వి గనక నీకు ముందుచూపు ఎక్కువ. నే నెప్పుడూ కళ్ళముందు కనబడే విషయాలగురించే ఆలోచిస్తాను. మనమింత బీదవాళ్ళమే, డబ్బు లేనివాళ్ళమే, యింతటి భవనం ఎలా నిర్మించగలం? నాలాటి సామాన్యునికి అర్థం కాదది' అన్నాడు జోసపు.

'ఈ కెతెడ్రల్ మన కోసమా, మనకోసం కాదుగా! ముందు తరాలవారికోసమని యిది నిర్మిస్తున్నాము. శిల్ప సంపదల పుట్టిల్లు అయిన ఫ్రాన్సునుంచి వచ్చిన మనం, మరొక శిల్పకళాఖండం నిర్మించగల అవకాశం ఉంటేనే, నూతన భవనం తలపెట్టాలి. లేకపోతే ఎందుకు? అమెరికా నిండా యిప్పటికే బోలెడన్ని వంకరటింకర సావిళ్లున్నాయి' అన్నాడు లెటూర్.

'అవును, నువ్వు చెప్పింది నిజమే. భవనమంటే నేనెంతకీ, ఓహాయో రాష్ట్రంలోని చర్చివంటిదే మరొకటి యిక్కడ నిర్మించడమనుకున్నాను. స్వదేశంలోని సుందర భవనాలవంటివి తలపెడతావనుకోలేదు. మీ పూర్వీకులు పదమూడో శతాబ్దంలోని క్లెర్మాంట్ కెతెడ్రల్ నిర్మించారని విన్నాను. నీ కృషికి వెనక ఆరువందల సంవత్సరాల వారసత్వం ఉంది. భవనం, భవనం అంటే ఏదో సామాన్యమైనదనుకున్నాను! సామాన్యమైనవి లెటూర్ ఎందుకు తలపెడతాడు?'

'మనప్రజలు తమకిగల సమస్తం ఆ పూజామందిరం కోసం ధారపోయగలిగినప్పుడే ప్రయత్నం ఫలవంతమవుతుంది.'

అవునవునని తల వూపాడు ఫాదర్ జోసఫ్.

కొండ దిగి వస్తూండే సమయానికి దిగువ భాగాన చీకట్లు ఆవరించాయి. పై భాగంమట్టుకే కొంచెం మేర బంగారు వన్నెతో మెరుస్తోంది.

'మన మందిరానికి ఈ రాయి చాలు. ఈ కొండ దగ్గరకి వచ్చినప్పుడల్లా భగవంతుని మందిరానికి యిటువంటి రాయే వుపయోగించాలన్న కోరిక బలవత్తరమవుతోంది. బహుశా అది నాలోని 'అహంకారప్రవృత్తి' గావచ్చు. అయితేనేం, బంగారు యిటుకలతో భగవంతుని మందిరం కట్టించాలనే నా కల నిజమయింది. దానధర్మాలు చేయమని నాకు లక్షలు గుమ్మరించినా, యింత సంతోషించి వుండను,' అని ఆత్మతృప్తితో పలికాడు లెటూర్.

ఇద్దరూ గృహోన్ముఖులయారు. అప్పటికప్పుడే చంద్రకాంతి లోకమంతా ఆవరించుకుంది. అరిజోనా ప్రజల ఆత్మలు కాపాడే కార్యభారంనుంచి తనని శాంటాఫె పిలిపించడమేమిటి, ధనధాన్యసంపదలులేని ఈ బీద బిషప్, మహోన్నత భవనం నిర్మించాలని కలలు గనడమేమిటి? — అని విస్మయపడుతున్నాడు జోసఫ్. చర్చి మందిరం కట్టిం

చాలని తనకీ వున్నది. కాని మందిరం ఎలాటిదైతేనేమి? అని అతని వుద్దేశ్యం. కాని, లెటూర్‌కి మందిర స్వరూపం కూడా ముఖ్యమే!

## 2

ఆ మర్నాడు ప్రతివారం వచ్చే టపా వచ్చింది. పొద్దుటంతా ఉత్తరాలు చదువుకుంటూ కూచున్నాడు లెటూర్. భోజనాల వేళప్పుడు జోసఫ్‌తో అన్నాడు: లీవెన్‌వర్త్ బిషప్ వద్ద నుంచి ఒక ముఖ్యమైన వుత్తరం వచ్చిందనీ, ఆ విషయమై సాయంకాలం మాట్లాడుదామనీను!

అది చాలా పేజీల ఉత్తరం. అందులో కొల రాడోలో సంగతులు అనేకం వున్నాయి. కొలరాడో రాకీ పర్వతాల ప్రాంతం. శాంటాఫెకి వందలమైళ్ళ దూరంలోనే ఉన్నప్పటికీ, అక్కడికీ యిక్కడికే రాకపోకలు లేవు. శాంటాఫె నుంచి యూరప్‌కి వ్రాసిన ఉత్తరం కొలరాడోకి వ్రాసినదాని కంటే తొందరగా వెళుతుంది. కొలరాడోలోని రాకీ పర్వతాల దగ్గిర బంగారు గనులున్న సంగతి, ఆ చుట్టుపట్లవారి కంటె ఐరోపావాసులకి ముందు తెలిసింది. జోసఫు టక్సాన్‌లో వుండగా అతని సోదరుడు మేరియస్ దగ్గర నుంచి ఉత్తరమంతా కొలరాడో గోల్డురష్ (బంగారు వేట) గురించే. కాని యిటలీలో జరుగుతున్న యుద్ధం గురించి నామమాత్రంగా కూడా లేదు. యూరప్‌లోని

యుద్ధం కంటె అమెరికాలోని బంగారానికి విలువ యెక్కువయిపోయింది అప్పటికే!

రాకీ పర్వతాలలోని 'పైక్స్‌పీకు' చేరుకోడం చాలా కష్టం. చర్మాలకోసం జంతువుల్ని వేటాడే వేటగాళ్ళు కూడా ఆ నల్లరాయి ప్రాంతాలకి వెళ్ళేవారుకాదు. వెనకొకనారి కొలరాడాలోని రాకీపర్వతాల్లోకి 'ఫ్రీమాంట్' అనే పరిశోధకుడు చొచ్చుకు వెళ్ళాడు. కాని అతని పార్టీ మనుష్యుల్లో సగం మంది చచ్చి, సగంమంది శల్యావశిష్టులై, తీసుకు వెళ్ళిన గుర్రాలని చంపి, వాటి మాంసం తిన్నారట. ఈ ఉపద్రవం జరిగిన కొద్దికాలానికే పరిస్థితులు తారుమారయాయి. చెర్రీక్రీక్‌లో బంగారపు గనులున్నాయనే వార్త ప్రజలని గుంపులు గంపులుగా పట్టుకు వచ్చింది అక్కడికి. మిస్సోరీ నదిదాటి, ప్రాణభయం ఆకలిదప్పులూ మర్చిపోయి, యెక్కడెక్కడి నుంచో ప్రజలు బంగారు వేటకోసం పరుగులెత్తుకుంటూ వచ్చారు.

లీవెన్‌వర్తు బిషప్, ఫాదర్ లెటూర్‌కి తనప్పుడే కొలరాడోనుంచి తిరిగి వచ్చాననీ, డేరాల్లోనూ చెట్ల అడుగునా ఎక్కడ ఆశ్రయం లభిస్తే అక్కడ మనుష్యులు నివశిస్తున్నారనీ ఆ ప్రాంతానగల డెన్వర్ అమాంతంగా ఒక మహానగరమై పోయి, వూరినిండా హోటళ్ళూ, జూదపు శాలలూ పెరిగిపోయాయనీ బంగారంకోసం జరుగుతున్న ఈ అన్వేషణలోని వేటగాళ్ళలో సజ్జనులూ ఉత్తములూ చాలామంది వున్నారనీ కాని వాళ్ళందరూ పరిస్థి

తుల ప్రాబల్యం వల్ల తాగుబోతులూ తుంటరులూ అయే ప్రమాదం కనపడుతోందనీ, యింతటి ప్రజాబాహుళ్యంలో ఒక్క ఫాదరీ కూడా లేడనీ, నీతినియమాలు మర్చిపోయిన ఈ ప్రత్యేక సంఘంలో, ఆధ్యాత్మిక మార్గం చూపగల ఫాదరీ ఒక్కడు కూడా లేకపోవటం వల్ల ప్రజలు నిరాశా పరులై జీవిస్తున్నారనీ, ఆ పర్వతప్రాంతాల నిమోనియా వ్యాధితో చాలమంది మరణిస్తున్నారనీ, వారికి ఆత్మ శాంతి కలిగించే అంత్యక్రియల అవకాశం కూడా వుండడం లేదనీ ఒక పెద్దగ్రంథం వ్రాశాడు.

ఆ ప్రదేశమంతా ఫాదర్ లెటూర్‌కి చెందినదనీ, ఆ ప్రజల విషయమై తగు ఏర్పాట్లు చెయ్యమనీ వ్రాశాడు. ఇప్పటికే తన 'డయోసీస్' కొన్ని వేల చదరపుమైళ్ళు పడమర దక్షిణాలుగా పెరిగిందనీ, అకస్మాత్తుగా ప్రాముఖ్యత లోకి వచ్చిన ఈ కొలరాడో, రాకీప్రాంతాలు తనకి తూర్పున వున్నాయనీ, ఏ ఫాదరీని అక్కడికి పంపడమో తనకు తెలియకుండా వుందనీ, సమర్థుడైన మతగురువు ఎవ రేనా వుంటే, వెంటనే పంపవలసిందనీ వ్రాశాడు లెటూర్‌కి ఆ బిషప్. ఈ వెళ్ళే ఫాదరీ, తన వెంట తనకి కావలసిన పదార్థాలూ ఇతర సామగ్రి మాత్రమే కాకుండా, చలిని మెదుగ్గొగల బట్టాపాతా తీసుకువెళ్ళాలట. డెన్వర్‌లో పోగాకూ విస్కీ తప్పయింకేమీ దొరకవు. గనుల్లో పని చేసేవారు వుడికీ వుడకని పదార్థాలతోనూ, నిలువ రొట్టెల తోనూ, సారాతోనూ జీవిస్తున్నారట. ఆఖరికి ఆ కొండ

వాగుల్లోని నదీ జలాలని కూడా వాళ్ళు పరిశుభ్రంగా వుంచలేకపోవడం చేతనే, చాలామంది జ్వరం తగిలి మరణించడం మొదలుపెట్టారు. అక్కడి జీవన పరిస్థితులు అతిదారుణం. సాయంసమయాన, ఫాదర్ లెటూర్ తన స్టడీలో కూచుని, జోసపుకి ఈవుత్తరం చదివి వినిపించాడు. వాక్యం తరువాత వాక్యం శ్రద్ధగా విన్నాడు జోసఫు.

'ఈ రెండు మూడు వారాలబట్టీ ఏమీ పొద్దు పోవడంలేదనికదా నీ క్షోభ. ఇదిగో, కాళ్ళముందుకి వచ్చింది అవకాశం,' అన్నాడు లెటూర్.

ఉత్తరం చదువుతున్నంతసేపూ ఆరాటంతో విన్న జోసఫు చదవడం పూర్తవగానే, 'అయితే యిప్పుడు నే నింక యింగ్లీషు నేర్చుకోవాలి. రేపు పొద్దుట బయలు దేరనా?' అని అడిగాడు.

'అంత తొందర పనికిరాదు. అక్కడ నిన్ను ఆహ్వానించి ఆతిథ్య మిచ్చేందుకు మెక్సికను లెవరూ లేరు. నీకు కావలసిన సామాన్లు నువ్వు వెంట తీసుకువెళ్ళాలి. నీ కోసమని పెట్టెబండీ కట్టిస్తాను. నీకు కావలసినవన్నీ అమర్చుకో! మన తోటమాలి సోదరుడు సాబినో నీకు బండివానిగా వస్తాడు. ఇన్నాళ్ళూ నువ్వు నెరవేర్చిన కార్యక్రమం ఒక యెత్తూ; యిది ఒక్కటీ ఒక యెత్తూను.'

నిశిరాత్రి దాకా ఫాదరీ లిద్దరూ అనేక విషయాలు మాట్లాడుకుంటూ కూర్చున్నారు. అరిజోనాలో జోసఫ్

స్థానే మరొకమనిషి కావాలి. అరిజోనా ప్రజలంటే జోసఫ్‌కి ప్రాణసమానులు, వారిని ఒదిలిపెట్టి ఈ కొత్తచోటుకి వెళ్ళడం కొంచెం బాధగానే వుంటుంది కాని భగవంతుని పిలుపు కాదనడానికి తనెవరు? భవబంధాలు తెంచుకోవడమనే శిక్షణని అతను మొదటినుంచీ నేర్చుకున్నాడు.

రాత్రి నిద్రపోయే ముందు జోసపు తన పాతజోళ్ళు బాగుచేసుకుంటున్నాడు. ఒకవేళ తను ట్రూచాస్ పర్వతాలగుండా ప్రయాణం చేస్తే, షిమాయోదగ్గిర ఆగుతాడు. అక్కడి ప్రజలెంతో ప్రేమాస్పదులు, వొట్టి అమాయకులు. రాత్రివేళ వెళ్ళమనేవారు తమకి కనపడకుండా.

షిమాయో అనగానే ఫాదర్ జోసఫ్‌కి యెన్నో జ్ఞాపకానికి వచ్చాయి. ఒకసారి అతను షిమాయో నుంచి వచ్చిన హంతకుని 'కన్ ఫెషన్' వినడానికి అధికారరీత్యా వెళ్ళమన్నారు. 'రమోన్' అనే ఆ హంతకుడు యిరవైయేళ్ళ కుర్రవాడు. అతిని ముఖమూ, అతని మాటలూలో ధూర్తలక్షణాలు లేవు. ఆ యువకుడికి ఒకే వ్యసనం – కోడిపందాలంటే సరదా. ఒకసారి అతను తన కోడిపుంజుని పట్టుకు, శాంటాఫె వచ్చాడు పందెం కాసేందుకు. అతని వెంట షిమాయో యువకులు కూడా కొందరు వచ్చారు. ఈ కోడిపుంజు అప్పటికే అయిదుచోట్ల పందాలు నెగ్గింది. రమోన్‌పుంజు అవతలి కోడిమీద పడి, దాని మెడనరం మీద పొడుస్తుంది. అది దాని ప్రత్యేకనైపుణి. ఆనాడు కోళ్ళమీద పందాలు బాగా కాశారు. చూడటానికివచ్చిన

ప్రజల దగ్గిర్నుంచి కూడా రుసుము వసూలుచేశారు. అనుకున్నట్టే రమోన్ పుంజు, అవతల కోడిని ఓడించింది. ప్రతి కక్షి కోపం పట్టలేక రమోన్ పుంజుని పొడిచేశాడు. అతను దాన్ని పొడవడమూ రమోన్ కత్తి అతని గుండెల్లోకి దూసుకుపోవటమూ ఒకే క్షణాన జరిగాయంటారు చూసినవాళ్ళు. కనుమూసుకు తెరిచేటంతలో జరిగింది దంతా. కొందరు సాక్షులు రమోన్ కసికొద్దీ చంపలేదు, తాత్కాలికోద్రేకం – అన్నారు. ఏమయితేనేం, పుంజూ మనిషీ ఒకేసారి మరణించారు. కోడిపందాలంటే గిట్టని జడ్జీగారు రమోన్‌కి మరణదండన విధించాడు.

అతను కొద్ది రోజులలో వురి తీయబడతాడనగా, జోసఫు వెళ్ళి అతన్ని జయిలు కొట్లో చూసి వచ్చాడు. జైల్లోవున్న యువకుడు, కులప్రభువు అయిన శాంటియాగో విగ్రహానికి జోళ్ళు తయారుచేస్తున్నాడు. పిమాయో వాసులు నాలుగేసి నెలల కొకసారి కొత్తజోళ్ళు తొడుగుతారు ఆ విగ్రహానికి. ఉరితీసేనాడు అతని తలిదండ్రులు శాంటాఫె వస్తారు. వారికి యిచ్చి పంపుతాడట ఆ జోళ్ళు.

కొవ్వొత్తి కాంతిలో జోళ్ళకు రంగువేసుకుంటున్న ోసఫుకి ఆ కొలరాడోలో కనిపించే నేరస్థులు యిటువంటి ాయకజీవులై ఉండరనిపించింది.

# 3

ఫాదర్ జోసపు చక్రాల బండి తయారు చేసేందుకు ఒక నెల్లాళ్ళు పట్టింది. సన్నగా పొడుగ్గా వుందది. పర్వతాల వెంట, సన్నని దారులవెంబడి, ప్రయాణం చేసేందుకు అనుకూలంగా కట్టారు. రాళ్ళగుట్టలమీదుగానూ, యిసుక దారులలో నుంచీ కొండ కొనలలోనూ ప్రయాణం చేయగల బండీ అది. వర్షం పడకుండా పైన దట్టమైన బట్టవేసి కట్టారు. బండిలోపల పతాకాలూ, చిన్న చిన్న లోహపు శిలువలూ, తావళాలూ. రంగుబొమ్మలూ, మత సంబంధమైన కరపత్రాలు జాగ్రత్త చేసుకున్నాడు జోసపు. తనకు చదువుకునేందుకు పుస్తకాలంటూ యేవీ అక్కర లేదు, ప్రార్థన గ్రంథం తప్ప.

ఆ బండిలో పెట్టుకోవలసిన సరుకు జోసపు ఎన్ని సార్లు సర్దేడో చెప్పలేము. సర్దుడంతా అయాక, పెట్టెల మూతలు బిగించి, ఒక కొసగా చేర్చేది మాగ్డలీనా. నడవనిండా ఈ పెట్టెలు పరచివుండటం చూసి బిషప్ ఒక్కోసారి కనుబొమ్మలు చిట్లించేవాడు. సాబినో తీసుకు వచ్చిన పాతకాలపు సంచులలో జోసపు కట్టుబట్టలూ పడక బట్టలూ జాగ్రత్త చేశారు.

అప్పట్లో బిషప్ లెటూర్ కూడా చాలా తొందర పనులలో వున్నాడు. క్లెర్‌మాంట్ నించి వచ్చిన కొ… మత గురువుకి అతని ఉద్యోగ ధర్మమేదో చెప్పే…

చుట్టూ గ్రామాలకి తీసుకువెళ్ళి చూపించి వస్తున్నాడు. తను బిషప్ గనుక అధికారరీత్యా ఫాదర్ జోసఫులో గల వుత్సాహాన్ని ఆమోదించగలడే గాని మిత్రత్వ ధోరణిలో చూస్తే అతనికెంతో విచారమేసింది. తన 'కామ్రేడ్' తనని వదిలిపెట్టి యెక్కడో దూర ప్రదేశానికి వెళ్ళి పోతున్నాడు. తమ జీవితాలు రెండుగా చీలిపోతున్నాయి. ఇక నుంచీ ఇద్దరిదీ చెరో మార్గమవుతుంది. అందుచేత ఈ ప్రయాణ సరంజాం, యింట్లో జరిగే ఈ ప్రయత్నాలూ అతనిని కొత్తగా వ్యాకుల పరుస్తున్నాయి. అందుచేత కూడా యేదో ఒక పని కల్పించుకు వెళ్తూ వుండేవాడు.

ఆరోజు ఆల్బకర్క్యూనుంచి తిరిగి వచ్చాడు. భోజనాల బల్ల దగ్గర ఫాదర్ జోసఫు చాలా హుషారుగా వున్నాడు. కొత్త బండీమీద ప్రయాణంచేసి వచ్చాననీ, బండి భేషుగ్గా వుందనీ, శాబినో ప్రయాణానికి సిద్ధంగా వున్నాడనీ, తాము మర్నాడు బయలుదేరవచ్చునా అనీ అడిగాడు. ఏమార్గాన వెళ్లేదీ పటమువేసి చూపిస్తూ, తను తీసుకెళ్తున్న వస్తువు లన్నీ యేకరువు పెట్టాడు. దిగులంతా బిషప్‌కిగాని జోసఫ్ కేమీ లేదు. కొత్తచోటుకి వెళ్ళడమంటే మహా సంతోషంగా వుందతనికి.

కాఫీ వచ్చాక కాఫీ పుచ్చుకుంటూ సంతోషవదనంతో అన్నాడు జోసఫు. 'లెటూర్, నువ్వు ఒక విధంగా నీకు తెలీకుండానే భగవంతుని కార్యం కోసం టక్సాన్ నుంచి నన్ను పిలిపించి వుంటావు. నే నక్కడేదో గొప్ప

పనిలో వున్నాను. ఏకారణమూ లేకుండా నన్ను పిలిపించావు. నువ్వెందుకు పిలిపించావో, నీకూ తెలీదు, నాకూ తెలీదు. మనిద్దరమూ అంధకారంలో తడుముకొంటూ అడుగులు వేస్తున్నాము. చదరంగబలం వంటివారం మనందరమూ. ఈ పావుల్ని నడిపేది భగవంతుడు. అంతా మన స్వశక్తి అని అప్పుడప్పుడు భ్రమలో పడతాము. లేకపోతే నువ్వు నన్ను పిలిపించటమేమిటి, నే నిక్కడ ఆ క్షణానికుండడమేమిటి? ఇదంతా ఆశ్చర్యం కాదూ?'

లెటూర్ తన చేతులోని వేడి కాఫీకప్పు టేబుల్ మీదవుంచి 'జోసఫు, ఇందులో ఏమంత మహాత్మ్యము కనపడటం లేదు నాకు. ఏకాంతం భరించలేక, మిత్రసందర్శనాపేక్షతో నిన్ను పిలిపించాను. బిషప్‌ని కనక అధికారం ఉంది. స్వార్థంతో నిన్ను పిలిపించాను. ఏ పని లేకుండా నా సంతోషం కోసం నిన్ను పిలిపించటం స్వార్థం కాదంటావా? స్వార్థమే. ఆ స్వల్పం కూడా సెలో లేదు. నే నింకా పరిణతిపొందాలి. మనిద్దరం ఒక దేశస్థులం. ఎన్నో జ్ఞాపకాలవల్ల కట్టివేయబడ్డ మిత్రులం. ఇంత సన్నిహితంగా వచ్చిన మిత్రత్వం కొన్నాళ్ళయేసరికి, దానిదారి నది విడిపోవడం జీవనధర్మమేమో! ఈ సామాన్యవిషయం వివరించి చెప్పేందుకు మహాత్మ్యాల ప్రస్తావన కావాలా?' అన్నాడు లెటూర్.

జోసఫుకి ఈ మాటలు వినపడడం లేదు. అతని దృష్టి ఎంతకీ ఆ బంగారపు గనుల దగ్గర పనిచేసే

దీనులవైపు వుంది. తన ఉద్యోగం వేరూ, తను వేరుగా అతను జీవితాన్ని పరికించలేదు. బిషప్ అందుకు భిన్నం. బిషప్, జోసపుని ఒక మిత్రునివలె ప్రేమించాడు.

లెటూర్ తన గదిలోకి వెళ్ళి, తమ యిరువురి స్వభావాల గురించీ ఆలోచించసాగాడు. జోసపు యెక్కడికి వెళ్ళినా, ఆ దేశ ప్రజలతో మైత్రి చేసుకుని వారిలో ఒకడై పోగలడు. లెటూర్ అట్లా కాదు. సమాజంలో అతను నాగరీకునిగా రాణిస్తాడు. తొందరగా కొత్త స్నేహాలు చేసుకోలేడు. చిన్నప్పటి నుంచీ కూడా త్వర త్వరగా స్నేహితులని చేసుకునే గుణం అతనికి లేదు. అందరితోనూ చక్కగా మాట్లాడుతాడు. కాని కొద్ది మందికి మాత్రమే సన్నిహితుడు. ఫాదర్ లెటూర్ వంటి సుగుణరాసీ, సున్నిత స్వభావుడూ ఏ పండిత మండలిలోనైనా సరే రాణించగలడు. ఈ న్యూమెక్సికోలో దైవసేవ నిమిత్తం, యింతటి ఉన్నతాభిరుచులూ గుణసంపదా గల మనిషి అవసరమా అనిపిస్తుంది. ఇతని తర్వాత వచ్చే బిషప్‌లు యింతటి సౌజన్యవంతులవుతారనేందుకు అవకాశం లేదు. లెటూర్ వంటివాణ్ని యిక్కడికి పంపడంలో భగవంతునికి ఏవో కారణాలుంటాయి, అని హాయిగా నమ్మియగలడు జోసపు. బహుశా యిక్కడి కొత్త 'డయోసిస్' నూతన శకారంభానికి, ఆ దేవుడే యిటువంటి పుణ్యపురుషుణ్ని యెన్నుకొని వుంటాడని జోసపు అభిప్రాయం.

మర్నాడు మధ్యాహ్నం, సామానులతో బండి యింటిముందు నిలబడింది. జోసఫు, బిషపు వ్రాతబల్లదగ్గర కూచుని ఉత్తరాలు గబగబా వ్రాస్తున్నాడు. ఒకటి తన సోదరునికి; రెండోది ఫిలోమినాకి. బంగారం కోసం మతులు పోగొట్టుకు, కొండలవెంబడి పడ్డ మనుషుల దగ్గిరకి తను వెళ్తున్నాననీ, తనప్రయత్నం సఫలీకృత మయేందుకు ప్రార్థనలు సలుపమనీ ఫిలోమినాని కోరాడు. ఆ ఉత్తరాలు తొందరగా వ్రాస్తున్నప్పుడు వేళ్ళతో పాటు పెదిమలు కూడా కదులుతున్నాయి. బిషప్ లోపలికివచ్చి 'కొలరాడోకి నీతోపాటు 'కంటెంటో'ని కూడా తీసుకువెళ్తున్నావా?' అని అడిగాడు.

'అవును. తీసుకువెళ్తున్నాను. సాబినో బగ్గీ నడుపుతూ వుంటే. నేను గుర్రంమీద వెళతాను. ఇక్కడ వదిలెయ్యమన్నావా? నీకు అవసరముంటే వదిలేస్తాను,' అన్నాడు జోసఫు.

'అబ్బే. అదేం కాదు. నాకవసరం లేదు... నువ్వు కంటెంటోని తీసుకువెళ్తూవుంటే, దానివెంట 'యాంజెలికా'ని కూడా తీసుకువెళ్ళు. ఒకదానిని వదిలిపెట్టి ఒకటి వుండలేవని. మళ్ళీ నువ్వెంతకాలానికి వస్తావో! అంచేత రెండిటినీ ఒకేచోట వుండనియ్!'

జోసఫు సమాధానం చెప్పలేకపోయాడు. తను వ్రాసిన వుత్తరంలోని వాక్యాలవైపు చూస్తున్నాడు. అశ్రుబిందు వొకటి కాగితంమీద పడి, సిరాని కొద్దిగా

చిమ్మింది. లెటూర్ మిత్రుని ముఖంలోకి చూడలేక, వెంటనే వెళ్ళిపోయాడు.

ప్రాతఃకాలానే జోసపు బయలుదేరాడు. శాబినో బగ్గీ తోలుతున్నాడు, శాబినో పెద్దకొడుకు యేంజలికా పైనఎక్కి ఉన్నాడు. జోసపు కంటెంటో పైనయెక్కాడు, ఈశాన్యదిక్కుగా వున్న బాటవెంబడి యెర్రని యిసుక గుట్టలూ అక్కడక్కడ కనిపించే జునిపర్ మొక్కలూ దాటుకుంటూ ముందుకు ప్రయాణం చేస్తున్నారు. గోపురాకారపు కొండల మలుపు తిరిగేదాకా, లెటూర్ వెంట వచ్చి, మిత్రునికి వీడ్కోలు యిచ్చాడు. ఆ మలుపుతిరిగిన మీదట యింక శాంటాఫె కనపడదు. కంటెంటో మీద కూచున్న జోసఫుకి ఆ బాలభానుని అరుణకాంతిలో రెండు పర్వతాలూ శాంటాఫేని కౌగలించుకున్నట్టుగా ఉంది.

బిషప్ ఒక్కడూ యింటికి వచ్చాడు. వొంటరితనం అతని హృదయాన్ని దొలిచేస్తోంది, తనకు అప్పుడే నలభై యేడేళ్ళు వచ్చాయి. ఈ కొత్తఖండానికి వచ్చి రెండు పదులు, ఇరవైయేళ్ళు గడిచాయి. న్యూమెక్సికో వచ్చి అప్పుడే పదేళ్ళు అయింది. తను స్వదేశంలోనే ఫాదరీగా వుండిపోతే, యిటువంటి వొంటరితనం పీడించి వుండేది కాదు. అన్నదమ్ముల పిల్లలూ, అక్కచెల్లెళ్ళ పిల్లలూ తనని చూడడానికి వస్తూండేవారు. పాఠాలు చెప్పమనీ, పాకెట్ మనీకోసం తనచుట్టూ చేరివుందురు పిల్లలు. బంధు

మిత్రాదులతో తన యిల్లునిండుగా వుండేది. ఇంటిపనీ వంటపనీ ఏ మేనగోడలో ఏ అన్నగారికూతురో వచ్చి, చూసుకుంటూ వుండేది. ఇంటిభారమూ ఈ శూన్యతా తనని ఆవరించేవి కావు. ఏభైదగ్గర పడుతున్న ఏకాంత జీవనుల మనఃక్లేశం బిషప్‌ని బాధపెట్టింది.

తాను చదువునే గదిలోకి ప్రవేశించగానే అదే తన నిజప్రపంచమనిపించింది. జగన్మాత విగ్రహం తనకు ధైర్యమిస్తోంది. చుట్టూ ఎన్ని గ్రంథాలు! అక్కడ ప్రవేశించడంతో హృదయంలో గల శూన్యత మాయమయింది ఈ వొంటరితనం శూన్యతతో పోల్చదగ్గదికాదు. నిరంతరం పుష్పించే సుమవాటిక. జగన్మాత చల్లని చూపులు అర్థం చేసుకోగలవారికి నిర్జీవతా, యేకాంతవాసమూ ఎక్కడుంటాయి? ఆమె చూపులు అమృతకిరణాలే!

శాంటాఫె చర్చిలో 'వర్జిన్ మేరీ' కర్ర విగ్రహముంది. 'టొవర్గాస్' అనే ఆయన రెండువందల యేళ్ళక్రితం ఈ పట్నం పట్టుకున్నాడు స్పెయిను తరఫున. అప్పట్నుంచీ ఈ విగ్రహానికి వూరేగింపు ప్రారంభమైంది. ఆ దేవతకిగల ధనకనక వస్తువాహనాలు అపారం. శిల్పులు తమ నేర్పరితనమూ, స్త్రీలు తమ హస్తనైపుణీ ఈ దేవతా విగ్రహపూజకని వినియోగించేవారు. ఈ దేవతకిగలన్ని దుస్తులు, ఇంగ్లండురాణికి గానీ ఫ్రెంచిచక్రవర్తిణికి గానీ లేవట.

తమ ప్రేమని దేవతా విగ్రహాలపై కురిపించటం ఒక మొక్కుకనుకో కాదు, - చిరకాలంగా మానవులు చేస్తున్న

పని. రాఫేల్, షియాను అంతటివాళ్ళు తమ కాలంలో ఆమెకి చిత్రప్రతిష్ఠచేసి, ఆమెని శతవిధాల అలంకరించి, ఆమెను వినుతిస్తూ కథలూ కావ్యాలూ అల్లి, ఆమెకోసం మహామందిరాలు నిర్మించారు.

బిషప్ లెటూర్ అనుకున్నది నిజమైంది. న్యూమెక్సికోలో పనిచేసేందుకు జోసప్ మళ్ళీ తిరిగిరాలేదు; తన పాత స్నేహితులని పలకరించేందుకొచ్చేవాడేగాని మత నిర్వహణకి కాదు. కొలరాడోలోని రాకీపర్వతాలకీ దక్షిణాన గల నీలపు పర్వతాలకీ అతని జీవితశేషం అంకితమై పోయింది. జబ్బులు చేస్తేనూ దెబ్బలు తగిలితేనూ విశ్రాంతి తీసుకునేందుకు శాంటాఫె వస్తూండేవాడు. ఒకసారి చర్చి అధికారులతో, బిషప్ లెటూర్ ఆర్చిబిషప్ అయినప్పుడు వచ్చాడు; తన మిత్రునికి జరిగే గౌరవం కనులార వీక్షించేందుకు వచ్చాడు.

క్రీడ్, దురాంగో, సిల్వర్ సిటీ, సెంట్రల్ సిటీ మొదలైన ప్రదేశాలలో మత ప్రచారం చేస్తూండేవాడు. శాంటాఫెలో నిర్మితమైన ఆ బగ్గీలో, రాత్రివేళ అందులోనే పడుకుంటూ, అదే యిల్లుగా, అదే వాహనంగా మత కార్యక్రమం సాగించేవాడు జోసపు. బండికి వెనుక భాగాన, సామాను వేసుకునే పెట్టె వుండేది. ఆ పెట్టెకి పైన బట్టలు పరిచి, సమూహ ప్రార్థనాసమయాన, ఈ బండిని ఒక చెట్టు నీడకి పట్టుకు వచ్చి, ఆ పెట్టెమీదనే పూజా విగ్రహాలు వుంచి, ప్రార్థన జరిపిస్తూండేవాడు.

ప్రయాణం చేసేందుకు సరియైన బాట ఉండని కారణాన, ఈ బండి తోలేందుకు మనిషి దొరకడం కష్టంగా వుండేది.

చక్రాల్లో ఆకులు విరిగిపోయినా, కమాను కట్టలు సీరసించినా, బండి ఒకవైపుకి ఒరిగిపోయినా జోసపు లక్ష్య పెట్టేవాడు కాదు. రెండుసార్లీ పెట్టెబండీ, లోపలగల ఫాదరీగారితో సహా, బోల్తా కొట్టింది. మొదటిసారి కొండ మీద నుంచి దడదడ దొర్లిపోయినా, అప్పుడు కొద్ది గాయంతో తేలిపోయింది. అది నెమ్మళించాక శాంటాఫెలో వున్న లెటూర్‌కి వ్రాశాడు జోసపు, తన దగ్గరగల పవిత్ర విగ్రహం మహిమవల్ల బండీ దొర్లినా, తను రక్షింపబడ్డా నని. సెంట్రల్ సిటీదగ్గర రెండో సారి బోల్తాకొట్టినప్పుడు, ఈ విగ్రహమహిమేమీ పనిచేసినట్టులేదు. జోసపు తొడ యెముక విరిగి, శేష జీవితమంతా కుంటివాడయాడు. ఆ కుంటితనంవల్ల యిక గుర్రం ఎక్కడం కూడా సాధ్యం కాలేదు.

ఈ ప్రమాదం జరగటానికి ముందు జోసపు. శాంటాఫె, ఆల్బకుర్క్యూ నగరాలకి వెళ్ళి అక్కడి మెక్సికనుల దగ్గర డెన్వర్‌లోని చర్చికోసం భిక్ష వేడటం మొదలు పెట్టాడు. డెన్వర్ చర్చికి గోడలూ పైకప్పూ వున్నాయి గాని తలుపులూ కిటికీలూ లేవు. అక్కడివాళ్ళకి డబ్బు లేదా అంటే కావలసినంత వుంది. రంపపు మిల్లులూ వ్యాపారాలూ గనులూ బోలెడన్ని వున్నాయి. ఎక్కడి

డబ్బూ తమ వ్యాపారాలు అభివృద్ధి చేసుకునేందుకే సరి పడ్డం లేదట. అంచేత చర్చికి విరాళాలు యివ్వలేం పొమ్మన్నారట! 'మీరివ్వకపోతే పని అడ్డుతుందా? నాకు తెలిసిన మెక్సికను లిస్తారు' అంటూ యిలా వచ్చాడట జోసపు.

దీనికి భిక్షాయాత్ర అని పేరుపెట్టాడు జోసపు. బండిలో పట్టినన్ని వేసుకు తీసుకువద్దామనుకున్నాడు. ఇతని పెట్టెబండీ, టావోస్ చేరుకునేసరికి బండీవాడు యజమాని మీద తిరుగుబాటు ప్రకటించాడు. ఇటువంటి త్రోవలలో ఛస్తే ముందుకి వెళ్ళేది లేదన్నాడు. 'ఇటువంటి ప్రయాణం చేస్తే నీవూ, నేనూ కూడా ఈ చక్రాలక్రింద పడిపోతాము. నలిగిన బాట ఉన్నచోట నేను బండీ నడపగలనుగాని అది లేనిచోట కాద'ని చెప్పేసరికి జోసపుకి కోపం వచ్చింది. బాట ఉన్నచోట బండీవాడుకూడా ఎందుకని జోసపు అభి ప్రాయం. ఆ బండీవాడు జోసపుతో పోట్లాడి వెళ్ళి పోయాడు. కొన్నాళ్ళపాటు బండివానికోసం అక్కడ ఆగి, 'వాగన్ ట్రయిన్సు'లో పనిచేసిన ఒకమనిషి సాయంతో, ఈ పెట్టెబండి చచ్చిచెడి శాంటాఫె చేరుకుంది. బిషప్ గారి బళ్ళదొడ్లోకి గడ్డపలుగుల సాయంతో దానిని అతి కష్టంమీద నెట్టారు.

జోసపుకి మెక్సికనులనగా, స్వజాతీయులనే అభి ప్రాయం. తనకు తెలిసిన ప్రజలదగ్గర యాచన ప్రారంభిం చాడు డెన్వర్ చర్చికోసం. కిటికీలూ దర్వాజాల కోసం

ప్రారంభించిన భిక్ష అక్కడితో ఆగలేదు. శాంటాఫే లోనూ ఆల్బకర్క్యూలోనూ గల వనితలు ఎన్నో అపూర్వ మైన వస్తువులు డెన్వర్ చర్చికోసం సమర్పించారు. డెన్వర్‌లో యితను గడ్డిపరుపుమీద పడుకునేవాడు. ఒక సారి ఒక అమెరికన్ మత గురువు అతన్ని చూడడానికి వచ్చి వేళాకోళంకూడా చేశాడు. పాతచెక్కల కూర్పుతో చేశారతని భోజనాల బల్ల. భోజనాల బల్లమీద టేబుల్ క్లాతుగాని యితర వస్తువులుగాని ఏమీలేవు. జోసఫ్ ఒక్కోసారి తుడుచుకునే తువ్వాళ్ళబదులు చినిగిన చొక్కాలు వాడుతూండేవాడట, అదీ బట్టే, యిదీబట్టే - ఈ చొక్కా వృథాచేయడమెందుకని! తమ ఫాదరీ పాత చొక్కాతో ముఖం తుడుచుకున్నాడని విని, మెక్సికన్ వనితలు వలవల కన్నీరు కార్చారు. కొలరాడోలో ఎవరూ పూలతోటలూ పళ్ళతోటలూ వేసుకోరట. భూమిని ఎవ రైనా తవ్వారా బంగారంకోసమేనట! మరొక దృష్టి లేద క్కడి వాళ్ళకని చెప్పేసరికి మెక్సికను స్త్రీలు ఆశ్చర్య పోయారు. అక్కడ వెన్న, పాలు, కోడిగుడ్లు, పళ్ళూ యిలాటివేమీ వుండవట. రొట్టెలొక్కటి మాత్రమే దొరుకు తాయట.

ఈ భిక్షాయాత్రలో జోసఫ్ చాలా వస్తువులు పోగు చేశాడు. ఆరు మెత్తటి పరుపులూ, కొన్ని డజన్ల దుప్పట్లూ, దిండు గలీబులూ, టేబిల్ క్లాతులూ, తుండు గుడ్డలూను! ఇక బటాణీలూ, ఎండు పళ్ళూ సంగతి చెప్పనే అక్క

ర్లేదు. షిమాయోవారు అతి శ్రేష్టమైన దుప్పట్లు పంపారు జోసపుకి.

ఈ వొచ్చే బహుమతులు బిషప్ కంటపడకుండా యెప్పటి కప్పుడు పెట్టెలో దాచేస్తూండేవాడు జోసప్. బిషప్‌కి బహుమతుల సేకరణ గిట్టదుగా! ఒకసారి ఈ బహుమతుల గుట్టచూసి అన్నాడు లెటూర్: 'జోసప్, యివి తీసుకెళ్ళేందుకు నీకు ఆ బండి చాలదు. మరొక ఎద్దు బండీ కూడా కావాలి.'

'భగవంతుని కోరిక అలావుంటే, ఎద్దుబండీ కూడా వస్తుంది.'

జోసఫ్ అన్నట్లే ఎద్దుబండీ సమకూడటమే గాకుండా తోలేవాడుకూడా వచ్చాడు.

బయలుదేరే రోజు ఉదయం పెట్టె బండీ వెనుక టార్పలినుతో కప్పబడ్డ ఎద్దుబండీ, సూర్యోదయమయాక బయలుదేరాలని జోసప్ ప్లాను. బిషప్ స్టడీలోకి వెళ్ళి, యింకా బాగా వెలుతురు రాలేదని, అక్కడ కూచుని యేవో విషయాలు మాట్లాడుతున్నాడు జోసప్.

'మనం పెద్దవాళ్ళమవుతున్నాం' అన్నాడు జోసప్ లెటూర్‌తో.

బిషప్ నవ్వుతూ సమాధానం చెప్పాడు: 'అవును, యింకా చిన్నవాళ్ళమా! ఇటువంటి వీడ్కోలే, ఎప్పుడో ఒకసారి చివరి వీడ్కోలవుతుంది!'

అవునన్నట్లుగా తల పంకించాడు జోసఫు. 'భగవంతుడు యెప్పుడు పిలిస్తే అప్పుడు వెళ్ళిపోవడానికి సిద్ధంగా వున్నాను నేను. ఏమైనా మన జీవితాలు శుష్క-ప్రయాసలో నిరుపయోగంగా గడవలేదు, చదువుకునే రోజులలో ఊహించిన కలలూ సంకల్పించిన తలంపులూ చాలామేర నిజమయ్యాయి. జీవిత స్వప్నాల సఫలతకంటె పరమార్థమేముంది ఈ యాత్రలో? మనం కాంక్షించినవి నిజమయాయి. యింకేం కావాలి?'

బిషప్ తన కుర్చీలోనుంచి లేచి, 'నాకంటె నువ్వు ధన్యుడివి. ఎందరి ఆత్మలనో పునీతం చేశావు. నీకుగలంతటి విశాలహృదయం కాదు నాది. నే నెప్పుడూ లోపలకి ఒదిగి దాక్కుంటాను. నీవు ధరించబోయే కిరీటాన్ని మణిమయ కాంతులతో తారకలు అలంకరిస్తాయి. నీ హృదయ మొక కరుణాసాగరం. నాలో ఆ ఔన్నత్యం లేదు, నాకు తెలుసు. నన్ను దీవించు. సోదరా!' అంటూ జోసఫు ముందు, ముంగాళ్ళమీద నిలబడ్డాడు బిషపు లెటూర్. జోసఫు అతన్ని దీవించి, తనూ ఆ ప్రకారమే అతని దీవనకై ముంగాళ్ళమీద నిలబడ్డాడు. ఇద్దరూ ఒకరినొకరు దీవించుకున్నారు. ఆ తర్వాత మిత్రులిద్దరూ ఒకరినొకరు కౌగలించుకున్నారు. ఆ కౌగిలిలో భూతభవిష్యద్వర్తమానాలు కరిగిపోయి, రెండు విశుద్ధాత్మలు జ్యోతిర్స్వరూపం ప్రకాశించింది.

# 9

## అంతిమ అధ్యాయం

రియామ్ పట్నంలోని మదర్ సుపీరియర్ ఫిలోమినా మరణించిన కొద్దిరోజులకి, ఆమె కాగితాలు తిరగేస్తూ వుండగా ఆర్చిబిషపు లెటూర్ 1888 డిసెంబరులో ఆమెకు వ్రాసిన లేఖ ఒకటి దొరికింది. 'మీ సోదరునికి పిలుపు వచ్చింది. మునుపటికంటె యిప్పుడతను నాకు మరీ సన్నిహితుడయాడు. ఉద్యోగ ధర్మం మమ్మల్ని చాలారోజుల పాటు ఎడంగా ఉంచింది. కాని మృత్యువు మమ్మల్ని దగ్గిర చేసింది. కొద్దికాలంలో, నే నతన్ని కలుసుకుంటాను. వెనకటి స్మృతులు నెమరువేసుకోవలసిన ఈ జీవిత చరమ దశని ప్రశాంతంగా గడుపుతున్నాను. ఇదింక జ్ఞాపకాల బరువుతో పరిసమాప్తికై ఎదురుచూడవలసిన తుదిఅంకం' అని వ్రాశాడు లెటూర్.

శాంటాఫెకి నాలుగుమైళ్ళదూరంలో వున్న ఒక తోట బంగళాలో గడుపుతున్నాడు. కొద్ది రోజులలో

ఉద్యోగం నుంచి విరమించుకొంటూ ననగా అక్కడి స్థలం కొన్నాడు. ఎర్రకొండలదగ్గర నివాశమేమిటని, మిత్రులు వారించినప్పటికీ తనకు ఆచోటే బాగుంటుందన్నాడు.

వెనకోసారి 'టస్కన్యీ' వెళ్తునప్పుడు శాంటాఫేకి నాలుగు మైళ్ళ దూరాన చెట్లతో కప్పబడ్డ ఈ తోట చూశాడు. అందులో ఒక యాప్రికాట్ వృక్షం ఉంది. యాప్రికాట్స్ అంటే లెటూర్‌కి ఇష్టం. సూర్యరశ్మి కారణంగా యిక్కడి యాప్రికాట్స్‌కి మధురిమ వచ్చిందనుకునే వాడు. ముఖ్యంగా ఆ ఫలాలు స్వదేశంలోని ఫల జాతులని జ్ఞప్తికి తెచ్చేవి.

ఆ స్థలంలో ఉంటున్న మెక్సికన్ ఆ యాప్రికాట్ చెట్టు వయసు రెండు వందల సంవత్సరాలు అయివుండవచ్చని అన్నాడు. వాళ్ళ తాతగారి కాలం నుంచీ ఆ చెట్టు అలానే వుందట. ఈ తోటా ఇల్లూ కొనగల ధర్మాత్ముడెవడేనా ఉంటే, తను వెంటనే అమ్మేసి, శాంటాఫెలో నివాసం ఏర్పాటు చేసుకుంటానని అన్నాడు. వృద్ధుని నోటివెంట ఆ మాట వచ్చిన కొద్ది రోజులకి లెటూర్ ఆ గృహాన్ని కొని, తను ఉండటానికి హంగులన్నీ ఏర్పాటు చేసుకున్నాడు. గ్రంథాలయం మాత్రం శాంటాఫెలో ఉంచి, తను ఇక్కడ ఈ తోట బంగళాలో ఉందామనుకున్నాడు.

ఉద్యోగం నుంచి విరమించాక లెటూర్ పనేమిటంటే, ఫ్రాన్సు నుంచి వచ్చిన కొత్త పాదరీలకి శిక్షణ యివ్వటం. ఇతని తరువాత వచ్చిన ఆర్చి బిషప్,

లెటూర్ చదువుకున్న కాలేజీలో చదువుకున్నవాడే, న్యూమెక్సికోలోని క్రైస్తవ ఫాదరీలు చాలామట్టుకు ఫ్రెంచివారే! కొత్త ఫాదరీలు కొన్ని నెలలపాటు స్పానిష్ భాష నేర్చుకునేందుకూ, ఆ ప్రాంతపు ఆచార వ్యవహారాలు తెలుసుకునేందుకూ లెటూర్ వద్ద శిక్షణ పొందుతూండే వారు.

ఈ వయసులో లెటూర్‌కి గల కాలక్షేపం యేమిటంటే తోటపని. కాలిఫోర్నియా పళ్ళ తోటల్లో కూడా లభ్యం కాని రకరకాల ఫలజాతులు తన తోటలో పండించేవాడు. యూరప్ నుంచి యెన్నో రకాలు తెప్పించేవాడు. వెళ్ళిన కొత్తచోటల్లా మొక్కలు నాటమని వుద్బోధించేవాడు ఫాదరీలకి. మెక్సికనుల ఆహారంలో పిండి పదార్థమే తప్ప ఫలజాతులు లేవనీ, ఈ ఫలవృక్షాలు ముందు ముందు వారికి ఎంతో మేలు చెయ్యగలవనీ ప్రతి ఫాదరీకి చెప్పేవాడు లెటూర్. ఫ్రెంచి ఫాదరీ ఉన్న ప్రతిచోటా పళ్ళతోట, పూలతోట వుంటేనే అందం - అని ప్రబోధించేవాడు.

పళ్లు ఒక్కటేకాదు. ఎక్కడెక్కడి పువ్వులూ తెచ్చి తన పూలతోటలో నాటి వాటి సుమ పరిమళంతో, కాంతి వెల్లువతో తన యింటికి అందం చేకూర్చేవాడు. శతాబ్దాలుగా ఫ్రాన్సులోనూ యిటలీలోనూ పూసిన పువ్వులు, లెటూర్ కృషి ఫలితంగా ఈ మెక్సికోలో తల

ఎత్తాయి. అక్కడి లేత రంగులు యిక్కడ చిక్కనమేవి. ఇక, ఆ పూలకన్నెల సోకులు చెప్పతరంకాదు.

1885లో బెర్నార్డు అను ఒక కొత్త ఫాదరీ న్యూమెక్సికోకి వచ్చాడు. అతనొకవిధంగా ఫాదర్ లెటూర్‌కి దత్తపుత్రుడు అనుకోవచ్చు. మాంట్ ఫెర్రాండులో చదువుకునే రోజుల్లోనే ఆ యువకుడు, లెటూర్ జీవితకథనం ఎంతగానో విన్నాడు. అటువంటి గురువుకి సేవచేయగల సుదినంకోసం కాచుకునున్న బెర్నార్డ్‌కి, న్యూమెక్సికో రాగల అవకాశం, ఒక అపూర్వవరమనిపించింది. బుద్ధిబలంతో పాటు ఆత్మశక్తీ దేహసౌందర్యమూ గల యువకుడీ బెర్నార్డ్. పూజనీయుడైన లెటూర్‌కి సేవచేయడంకంటె కోరదగదేముంది? – అనుకునేవాడు అతను.

'భగవంతుడే నాకోసం యితన్ని యిక్కడికి పంపాడు' అనేవాడు లెటూర్ మిగతా ఫాదరీలతో.

## 2

1888 ఆసురాలు కాలమంతా లెటూర్ ఆరోగ్యంగానే వున్నాడు. అతనిదగ్గర అయిదుగురు ఫాదరీలు శిక్షణ పొందుతున్నారు. ఆ పాదరీలతోపాటు తనుకూడా అప్పుడప్పుడు పక్క గ్రామాలకి గుర్రంమీద వెళ్ళివస్తూండేవాడు. క్రిస్‌మస్ రాత్రి శాంటాఫె చర్చి మందిరంలో సమూహ ప్రార్థన లెటూరే జరిపాడు. జనవరిలో బెర్నార్డ్‌తో శాంటాక్రజ్ మతగురువుకి అనారోగ్యంగా వుందని తెలిసి, అక్కడికి వెళ్ళాడు. తిరిగి వస్తున్నప్పుడు

అనుకోకుండా వర్షం కొట్టింది. దగ్గిరలో తలదాచుకునే స్థలం లేదు. బలమైన తుపానేమో, బండీకి కప్పు లేని కారణంగా బెర్నార్డ్ లెటూర్ లిద్దరూ, పూర్తిగా తడిసి ముద్దయారు. ఇల్లుచేరుకునేసరికి లెటూర్ కి ఒంట్లో బాగూ లేదు. ఆరాత్రి సరిగా నిద్రపో లేదు. ఒళ్లంతా నొప్పులూ జ్వరమూనూ. తనకు నిద్రపట్టకపోయినా యెవరినీ లేపక, పొద్దుటే మామూలు సమయానికి లేచి ప్రార్థన చేసుకునేందుకుగాను భగవన్మంది రానికి వెళ్ళాడు. ప్రార్థన చేస్తూండగా వెన్నులోంచి చలి వచ్చింది. అతి కష్టంమీద వంటగదిదాకా అడుగులు వేయ గలిగాడు. ముసలి వంటమనిషి యితన్ని చూసి ఖంగారు పడి, వెంటనే పక్క దగ్గిర చేర్చి, ఒక గ్లాసు బ్రాందీ పట్టింది. బ్రాందీతో చలి తగ్గిందిగాని జ్వరమూ దగ్గూ తగ్గలేదు. ముందు జ్వరంగా ప్రారంభమై, ఆపైన దగ్గులోకి దింపింది.

ఈ వ్యాధి తనని కొన్నాళ్ళు మంచంమీద పడేసే సరికి లెటూర్ బెర్నార్డుని పిలిచి 'అబ్బాయ్, నువ్వునన్ను శాంటాఫె తీసుకు వెళ్దువు గాని! అక్కడ నా గదిలో నే నుంటానంటే, ఆర్చిబిషప్ అభ్యంతరం చెబుతాడనుకోను. ఏమయినా ముందుగా ఆ సంగతి కనుక్కు, ఆయన అను మతి పుచ్చుకో.'

'ఇప్పుడే వెళ్ళి ఆర్చిబిషప్ అనుమతి తీసుకుంటాను. మీరంత ఖంగారుపడటం నేను వొప్పను. దగ్గూ పడిశం ప్రమాదకరం కాదు.'

లెటూర్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. 'ప్రమాదమూ ప్రాణహానీ ఏముంది? ఈ జలుబువల్ల నేను మరణించను, నాయనా. ఈ జీవితంలో నేను చేయవలసిన పని అంతా అయిపోయింది గనుక కన్ను మూస్తాను.'

ఆనాటినించీ లెటూర్ అందరితోనూ ఫ్రెంచిలోనే సంభాషించసాగాడు. నియమవంతుడైన లెటూర్, స్పానిష్ లోనూ యింగ్లీషులోనూ మాట్లాడాలనే నిబంధన యెందుకు సడలించాడో, చుట్టూగల వ్యక్తులకి ఆశ్చర్యంగా తోచింది.

ఎవరేనా ఫాదరీకి, స్వదేశంనుంచి ఏదైనా చెడ్డ కబురువస్తే, లెటూర్ ఆ ఫాదరీతో ఫ్రెంచిలో సంభాషించేవాడు. స్వభాషలో మాట్లాడడం వల్ల మనస్తాపం కొంతలో కొంత తగ్గుతుందని అతననుకునేవాడు.

ఆ మధ్యాహ్నమే బెర్నార్డ్ ఆర్చిబిషప్ దగ్గర నుంచి వార్త తెచ్చాడు: లెటూర్ తమవద్ద వుండడం ఎంతో సంతోషదాయకమనీ, తక్షణం రావలసిందనీ, మాగ్డలీనా అతనిగది అప్పుడే తుడిచి శుభ్రం చేస్తోందనీ, లెటూర్ సేవ చేసేందుకుగాను ఆమె కనిపెట్టుకునుందనీ, తన పెట్టె బండీ యెప్పుడు పడితే అప్పుడు పంపుతాననీ, ఎంతో ఆదరాభిమానాలతో ఆహ్వానం పంపాడు కొత్త ఆర్చిబిషపు.

'వొద్దు. యివాళ వెళ్ళొద్దు. మరొకరోజున, నాకు దేహంలో మరి కొంచెం శక్తి చేకూరాక, వాతావరణం యింతకన్న శ్రేష్టంగావున్న రోజున, మధ్యాహ్న సమయం

దాటి సాయం సూర్యుని కిరణాలు యేటవాలుగా పడుతు న్నప్పుడు, మన స్వంతబండీలోనే వెళదాం' అన్నాడు లెటూర్.

బెర్నార్డుకి అర్ధం అయింద. ఆల్బకర్క్యూనుంచి శాంటా ఫెకి, ఈ లెటూర్ అటువంటివేళనే కొన్ని దశాబ్దాల వెనుక వచ్చాడు. తాము శాంటాఫె వూళ్లోకి వెళ్ళబోతు న్నప్పుడల్లా, ఆ కొండగుట్టమీద ఆగి, శాంటాఫె వంక వినీల దృక్కులతో చూసేవాడు అనేకసార్లు. లెటూర్ శాంటాఫెని మొట్టమొదట చూసింది ఆ కొండమీద నుంచే. జోసఫు ఆ కొండమీదనుంచే చివరిసారి వెనుదిరిగి చూశాడు. జోసఫు కొలరాడో వెళ్ళిపోయి తన జీవితాన్ని మరొక విధంగా పావనం చేసుకున్నాడు. చనిపోయేనాటికి జోసఫు కూడా, వికార్‌నుంచి బిషపుగా, ఉన్నతపదవి పొందాడు.

ఆ కొండమీద నిలబడి, శాంటాఫె దృశ్యాన్ని చూస్తున్నప్పుడల్లా, నిస్పృహతో అనేవాడు బెర్నార్డుతో, వెనుకటిరోజుల్లో ఈ పట్నం ఎంతో అందంగా వుండేదని! అప్పట్లో దీనికొక వ్యక్తిత్వం వుండేది. పచ్చటి మొక్కలూ యేపుగా యెదిగిన చెట్లూ యెక్కడపడితే అక్కడ కన పడేవి. గృహనిర్మాణం కూడా ఒక పద్ధతిలో జరిగేది. అంతేగాని యిప్పటిమాదిరి స్థలం వున్నచోటల్లా యిల్లు కట్టేవారు కాదు. అమెరికనుల గృహనిర్మాణం చూస్తే లెటూర్‌కి తలనొప్పి. వాళ్ళ కసలు యిల్లు కట్టుకోవడం

చేతకాదనీ, ఎండవానల నుంచి కాపాడే కొంప ఏదైనా సరే వాళ్ళకి చాలుననీ అనేవాడు. ఓహియోలో అతనికి తెలిసినయిళ్ళన్నీ అలానే వుండేవి. తను నిర్మించిన కెతెడ్రల్ వీటన్నిటికీ భిన్నంగా ఉంది. జోసఫు కొలరాడో వెళ్ళిపోయాక శాంటాఫె చర్చి నిర్మాణమే లెటూర్ కి జీవితాలంబనం అయింది.

ఫిబ్రవరి నెలలో ఒకరోజున మధ్యాహ్నంవేళ బయలుదేరి సూర్యాస్తమయ సమయం వరకూ కొండమీద నిలిచి, అరుణకాంతుల్లో శాంటాఫె నగర ప్రవేశం చేశాడు లెటూర్.

దళసరి దుప్పటి కప్పుకు గుర్రపు బగ్గీలో నుంచి, బంగారువన్నె చర్చి మందిరాన్ని ఆత్మతృప్తితో వీక్షించాడు. ఫ్రెంచి శిల్పి మోల్నీ ఎంత కష్టపడి కట్టాడు దీన్ని! ఇందులో ఆడంబరపూర్వకంగా కనపడేదేమీ లేదు, యూరప్‌లోని చర్చిలవలె ఇది ఒక శిల్పకళా మందిరం.

శిల్పి మోల్నీ, బిషప్ లెటూరూ ఈ గుట్టమీద నిలబడి ఎన్నోనాళ్లు ఆ నిర్మాణ సౌందర్యాన్ని కనులపండువగా చూశారు. ఇక్కడ నిలబడి దాన్ని మెచ్చుకోవడంతో ఎన్ని సాయంత్రాలు గడిచాయో! వెనుక గోధుమవన్నె పర్వతాలు, ముందు పసుపుపచ్చ యిటుకలతో కట్టబడ్డ కెతెడ్రల్. ఇక సరుగుడు చెట్లూ యితర చెట్లూ నీలాకాశంలోకి తొంగిచూస్తూ, చర్చికీ, కొండలకీ సేవ చేసే పరిచారికలవలె వున్నాయి.

మోల్నీ బిషపుతో అనేవాడు. 'చెట్లమీద నుంచీ పర్వతాలమీద నుంచీ పుట్టుకువచ్చినట్టుగా చర్చి మంది రాలు కనపడటం ఒక్క యూరప్‌లోనే ఉంది. ఆ తరువాత ప్రకృతిమాత దీవెనలతో అంతటి సుందర భవనమే శాంటాఫెలో నిర్మితమయింది.'

'చుట్టూ పరిసరాలు యిలా అతికినట్టు సరిపడడం భగవదేచ్ఛ కావచ్చు. ఫ్రేములో పటంలా పరిసరాలలో అతికిన భవనమే 'సుందరమందిర' మనిపించుకుంటుంది. పరిసరానికీ భవనపు ఔన్నత్యానికీ ఆ పొత్తుకుదిరేదీ కుదర నిదీ తెలుసుకోగలవాడే శిల్పి. స్థలమున్న చోటల్లా యిటు కల గోడలతో యిళ్ళు మొలిపిస్తే అవి భవనాలవుతాయా' అని మోల్నీ అన్న మాటలు ఆ సాయంత్రంవేళ లెటూర్ చెవులలో గింగురుమంటున్నాయి.

'ఆ పర్వతాల నిండా ఎవరో కుంకుమ జల్లారు చూడండి, ఫాదర్' అన్నాడు బెర్నార్డ్.

సూర్యబింబపు ఎర్రదనాన్ని మించి వున్నాయి కుంకుమరేఖలు ఆ పర్వతాలమీద. ఆ కుంకుమ కొద్ది సేపటికి ఎర్ర గులాబీగా మారుతుంది. అది ఎర్ర గులాబీ మాత్రమే - రక్తవర్ణంకాదు. కాని యిటువంటి భవన నిర్మాణాల్లో ఎందరు అనామక సాధువుల రక్తం కాలువలై ప్రవహించి, ఈ ఎరుపునిచ్చిందో, ఎందరు ఉత్కృష్ట జీవ నుల తపఃఫలమో ఆ ఎర్రదనం, అనుకున్నాడు లెటూర్ -

కళ్ళు చెదరగొట్టే ఎర్ర గులాబీ కాంతులు చూస్తూ. అదే చివరిసారి అతనా మహాసౌందర్యాన్ని చూడడం!

# 3

మర్నాడు ఉదయం కెతెడ్రల్‌లో మేల్కొనే సరికి లెటూర్ అనుకున్నాడు - తన కడపటి స్థలము చేరుకున్నానని. మహాసముద్రాల్లో ప్రయాణంచేసిన ఓడలు చివరికి తమ రేవు చేరుకున్నట్టు, ఇది తనకు చిరపరిచితమైన రేవు. ఇవి తనకు తెలిసిన గోడలు. ఈ చెట్ల నీడలు తనకు సన్నిహితమైనవి. లెటూర్ కోసమని విశాలమైన మంచమూ మెత్తటి పరుపులూ పంపారు, సన్యాసినులు. ఈ చర్చి మందిర ప్రాంగణం తనకు చిరకాలంగా తెలిసినది. ఈ తెలిసినచోట వుండటం మనసుకేదో నూతన విశ్రాంతినిస్తోంది. ఇక్కడికి తను ఒకప్పుడు యువకుడుగా వచ్చాడు. ఇదే గదిలో చెప్పుకోదగ్గంత మార్పు ఏమీ రాలేదు. వెనుకటి కంబళ్ళూ, తివాసీలే యిప్పుడూను. బల్లమీద అవే కొవ్వొత్తుల సెమ్మాలు, అవే తెల్ల గోడలు. ఈ తెల్లదనమూ, యిక్కడ పవిత్ర ప్రశాంత వాతావరణమూ, సాధారణ జీవితపు తుపానుల నుంచి తనని ఒకవిధంగా కాపాడాయి. తన ఆత్మకేదో విశ్రాంతిగా వుంది. నిశీధి తన దళసరి చీకట్ల నుంచి లోకాన్ని పల్చని వెలుగులోకి మార్చే సమయాన చర్చి గంటలు అతి శ్రావ్యంగా పలకటం పక్కమీద పడుకున్న బిషప్‌కి వినిపించింది.

మునుపటి కంటె యిప్పుడు మరొక కొత్త శబ్దం వచ్చింది. రైలింజను కూత. తనిక్కడికి రావడం ఎద్దుబండ్ల కాలంలో వచ్చాడు. ఇప్పుడు శాంటాఫెకి రైళ్ళు పడ్డాయి. ఒక విధంగా తను చారిత్రక విధిని నిర్వహించాడు.

స్వదేశంలోగల మిత్రులూ, బంధువులూ, న్యూమెక్సికోలోగల హితులూ ఆర్చిబిషప్ లెటూర్ తన కడపటి సంవత్సరాలు ఫ్రాన్సులో గడుపుతాడనుకున్నారు. అక్కడి విద్యాసంస్థలో యితను అధ్యాపక పదవిని స్వీకరించవచ్చునని కూడా అనుకున్నారు. ఉద్యోగం నుండి విరమించుకునేందుకు ముందు లెటూర్ ఒకసారి యూరప్ వెళ్ళాడు. పెద్దతనం రావడంవల్లనో ఏమో, తను చిన్నప్పుడు తిరిగిన ప్రదేశాలు చూడాలనిపించింది. కాని అక్కడికి వెళ్ళివచ్చాక వృద్ధాప్యమనేది ఐరోపావాసులకిగాని న్యూమెక్సికోలో నివసించే వారికి రాదని అనిపించింది.

తన స్వదేశంలోని పర్వత శిఖరాలూ, పట్నాలలోని పరిశుభ్రత, పల్లె ప్రాంతాలగల జీవనశోభ, తను విద్య నేర్చుకున్న ప్రదేశాలలోని క్రమశిక్షణ, - ఇవన్నీ అతనికి ఒకవిధంగా తృప్తినిచ్చాయి. క్లెర్‌మాంట్ చాలా అందమైన ప్రదేశమే కాని అంతటి ప్రకృతి సౌందర్యంలోనూ గొంతుకలో యేదో అడ్డం పడ్డట్టుగా వుందతనికి. ఈ ప్రాంతంలో భూతకాలపుబరువు ఎక్కువ అనిపించింది. వేసవి పవనం పుష్పగుచ్ఛాలమీదుగా పరువులెడుతూ, లోకాన్ని ఆనందపారవశ్యంలో ముంచెత్తుతున్నప్పుడు, కళ్లూమనసూ

మూతలుపడి, నవాజో అడవులలో సరుగుడు చెట్లమీదుగా రివ్వునకొట్టే వాయుమాధుర్యం కోసం అతనిగుండె ఆరాట పడేది. ఈ మలయపవనం కంటె. ఆ వాయువేగం వైపు అతని మనస్సు ఎందుకనో పరుగిడేది.

పగటివేళ కార్యభారంలో పదిమందితోనూ కలసి తిరుగుతున్నప్పుడు ఈ తలపులు వచ్చేవికావు. భోజనమై పక్కమీద పరుండగానే యెన్నో ఆలోచనలు. కాని యిక్కడి భోజనమూ, యిక్కడి ద్రాక్షరసమూ, విద్యా వంతులూ, సంస్కృతీపరుల స్నేహమూ, నిరంతరమూ ముందుకి వురుకులెత్తే చైతన్యమూ - యివి అతనికి తృప్తి నిచ్చేవి కావు. ఉదయం లేచాక గుండె బరువుగా ఉండేది. లేచి అలా షికారుకి వెళ్ళినప్పుడు గోధుమకాంతితో, సూర్యదర్శన మయ్యేదికాదు. లోకమంతా నిద్రలోనే వుండేది. తోటలూ పొలాలూ దట్టమైన పొగమంచుతో కప్పబడి, పర్వతశిఖరాలు కన్ను పొడుచుకున్నా కనపడేవి కాదు. సూర్యదేవుడు యీ మంచుమేఘాలని తరిమి తన వెచ్చదనంతో గ్రామాలకి జీవం పోసేసరికి చాలా పొద్దెక్కేది.

న్యూమెక్సికోలో తను వుదయం లేచేసరికి యెంతో హాయిగా వుండేది. ఉదయకాంతి ఎప్పుడూ కొత్తదనంతో తన కళ్ళముందు తాండవించేది. తను పెద్దవాణ్ణి అవు తున్నాననీ, వయసొస్తోందనీ యేనాడూ అనిపించలేదు న్యూమెక్సికోలో. సూర్యుని మొదటి కిరణాలు తన గదిని

వెలిగించేవి. ఆ ప్రత్యూష పవనాల లాలిత్యమూ, పిల్ల వాయువుల మాధుర్యం దేహమంతా అలుముకుపోయి, పసి పాప ప్రతి వుదయం ఎటువంటి చిరునవ్వుతో లోకం వైపు కళ్ళు తెరుస్తుందో, అదే ప్రకారముండేది తనకి. ఆ యావన భావం యిక్కడ కలగటంలేదు బ్రతుకు బరువుగా బుజాల మీదకెక్కి తనని బెదిరిస్తోంది.

క్లైర్‌మాంట్‌లోని సుందర ప్రదేశాలూ విజ్ఞానధనుల చెలిమీ ఉత్తమ కులాంగనల పరిచయ భాగ్యమూ, లలిత కళలలోగల అందచందాలూ యితర త్రాగల జీవన మాధు రులూ యివేవీకూడా అతనికి నూతనాసక్తిని కలిగించలేక పోయాయి. తిండీ తిప్పలూ లేకుండా రాత్రులకి రాత్రులూ యెడారులలో ప్రయాణంచేసికూడా ప్రతి వుదయం యెంతో హాయిగా లేచేవాడు. ఆ స్థల మహాత్మ్యము ఈ ఫ్రెంచి పట్టణాలలో లేదు. బహుశా ప్రకృతి, మానవుడు తన మీద చేసే అత్యాచారాలని వొప్పక ఈవిధంగా ఎదురు తిరిగి శిక్షిస్తుందేమో. కొత్త దేశాలలోనూ కొత్త ప్రదే శాలలోనూ గాలికిగల పరిమళం, ఈ పాతబడ్డ దేశాల్లో కనపడదు. అసలా గాలిలోనే ఒక దివ్యత్వం వుంది. మాన వుడు నేల కనపడ్డం తరవాయిగా పంటలు పండించి, తనకు కావలసినది భూసారంనుంచి పిండుకోడం మొదలెట్టినదగ్గర నుంచీ, గాలికూడా తన సహజ నైర్మల్యాన్ని పోగొట్టుకుం టోంది. టక్సాస్‌లోనూ, కాన్సాస్‌లోనూ అనేక ప్రాంతాలు వ్యవసాయ క్షేత్రాలుగా మారిన తదుపరిని,

అక్కడి గాలి వెనకటి సౌరభాన్ని కోల్పోయి మలిన పడింది. ఈ నేలా గాలీ వరప్రసాదములు - వాటిని పొదుపు గానూ, భక్తితోనూ వాడుకుంటేనే, అవి తమ సహజ త్వాన్ని కోల్పోకుండా వుంటాయి. ఈ నేలనుంచి యెంత యెక్కువ పండించగలమా అనే లక్ష్యంతో మనుషులు శ్రమిస్తే, తాత్కాలిత ఫలితం కనపడవచ్చునేగాని, గాలి చెడిపోయి లోకపు సౌందర్యం మాసిపోతుంది. అన్నీ పంట పొలాలే అవాలని దురాశకి పోతే. బ్రహ్మాండమైన పసరిక బయళ్ళమీద వచ్చే గాలికి కరువై మనుష్యులు అల్లాడు తారు. అన్ని బీళ్ళూ దున్ని, పంటలు పండించాలనుకోవడం కూడా మానవుని అవివేకాల్లో ఒకటి.

కొన్నాళ్ళయేసరికి 'ఈ స్వచ్ఛమైన గాలి' భూమి మీదనుంచి మాయమవుతుందేమో! అది యివాళ రేప టిలో జరక్కపోవచ్చు. కాని ఆ ప్రమాదదినం వైపుగా మానవులు ప్రయాణం చేస్తున్నట్టున్నారు. పుట్టి పెరిగిన ప్రాన్సు ఎందుకు నచ్చలేదో చెప్పమంటే, స్పష్టంగా 'యిందుకు' అని చెప్పలేకపోవచ్చు. కాని విదేశంలోనే తన కడపటిదినాలు గడపాలని నిశ్చయించుకున్నాడు లెటూర్. ఆ న్యూమెక్సికోలో ఈ నాగరిక దేశంలోలేని స్వాతంత్ర్య మేదో వుంది. తన హృదయాన్ని తేలికపరచి, తనని నిత్య జీవవ శోభతో సంతోషపెట్టగల ఉత్తమ మార్గమేదో అక్కడ గోచరిస్తోంది. అందుకనే 'న్యూ మెక్సికో' అను కున్నాడు లెటూర్.

# 4

తన చివరిరోజులు యెంతో ప్రశాంతంగా గడవాలని తన జీవన సరళినికూడా ఆ ప్రకారం మార్చుకున్నాడు. క్రమజీవన విధానం ఆరోగ్యంగా వున్నప్పుడు యెంత అవసరమో, అనారోగ్యంగా వున్నప్పుడు మరింత అవసరం. ప్రతి ఉదయం శిష్యుడు బెర్నార్డ్ గురువుకి స్నానం చేయించేందుకు వేన్నీళ్ళు కాగుతో వచ్చేవాడు. లెటూర్, స్నానం అయాక చలవచేసిన బట్టలు కట్టుకునేవాడు. ఇప్పటికి ముప్ఫయ్యేళ్ళబట్టీ యాంటోనియో యిచ్చిన ఆ వెండి నామాసే ఉపయోగిస్తున్నాడు. ప్రాతఃకాల ప్రార్థనఅయాక మాగ్డలీనా ఫలాహారం తీసుకువచ్చేది. ఆమె పక్కబట్టలు సర్ది, మిగతావస్తువులు వాటివాటిస్థానంలోవుంచుతూండగా లెటూర్ వాలు కుర్చీలో కూచుని, ఫలాహారము ముగించేవాడు, ఇక చూడవచ్చినవారిని ఆహ్వానించే సమయము. ఆర్చిబిషపు వూళ్లో వున్నప్పుడు, అతనొచ్చి కాసేపుకూచుని వెళ్ళేవాడు. ఆ తరువాత మదర్ సుపీరియర్, అమెరికన్ డాక్టరూ వచ్చేవారు. వారు వెళ్లాక, బెర్నార్డ్, సెయింట్ అగస్టిన్ రచనలో, పాస్కెల్ గ్రంధాలో, మెడమ్ డీ సెవినీ లేఖలో చదివి వినిపించేవారు. అక్కడితో వుదయపు కార్యక్రమం పూర్తయేది.

ఒకోక్కసారి ఉదయపువేళ, తన క్రొత్త శిష్యులకు తాము వెనుకటి రోజులలో యెదుర్కొన్న సమస్యలూ, వాటిని తాము ఎలా జయించుకు వచ్చినదీ చెబుతూ వుండే

వాడు. వాళ్ళు అతను చెప్పిన విషయాలు వ్రాసుకునేవారు. ఇటువంటి విషయాలు వ్రాతమూలకంగా వుండకపోతే అవి కాలగర్భంలో కలసిపోతాయి. స్థానిక ప్రజలను గురించీ, వారి ఆచార వ్యవహారాల విషయం, మూఢ నమ్మకాల విషయం అనేక కథలు ప్రచారంలో వుండేవి. వాటిలో కొన్ని నిజం, కొన్ని కల్లబొల్లి కథలూ. ఇందు విషయమై ప్రచారమైన అసత్యాలను ఖండించాలనే దృక్పథంతో ఫ్రెంచి భాషలో తన అనుభవాలు శిష్యులకు చెప్పి వ్రాయిస్తూ వుండేవాడు.

లెటూర్ చాలా సంవత్సరాలబట్టీ కొత్త ఫాదరీలకి ఒకేఒక్క విషయం చెబుతున్నాడు. మొట్టమొదట న్యూ మెక్సికో చేరుకొన్న స్పానిష్ ఫాదరీలని గురుతుల్యులుగా భావించమనీ వారికిగల కార్యదీక్ష, మతభక్తి ఆదర్శాలుగా భావించమనీ నూరిపోస్తున్నాడు. ఆ స్పానిష్ ఫాదరీలు ఎదుర్కొన్న కష్టాలతో పోల్చిచూస్తే తను న్యూమెక్సికో వచ్చేవేళకి పరిస్థితులు చాలా మెరుగు. వారాలకొద్దీ తను కొద్దిపాటి ఆహారంతో గుర్రాలమీద ప్రయాణం చేసి వుండవచ్చు. ఆరుబయట నిద్రించి వుండవచ్చు. రోజులకి రోజులు స్నానం చేసేందుకు నీళ్ళు దొరికివుండకపోవచ్చు. కాని తను వచ్చినది స్నేహపాత్రమైన లోకంలోకి, ఏ గృహమైనా సరే తనకి ఆప్యాయతతో ఆహ్వానమిచ్చేది.

కాని, జూనీ జేరుకున్న స్పానిష్ ఫాదరీల సంగతో? ఉత్తరంగా వారు నవాజోలవైపూ పడమటగా హోపీల

వైపూ వెళ్ళారు. తూర్పున అల్బకర్క్యూనుంచి టావోజ్ దాకాగల దేశమంతా వారికి శత్రుమయమే కొద్దిపాటి తిండిపదార్థాలూ, ప్రార్థన పుస్తకం, శిలువా ఈ మూడే వారి సొత్తు. కంచరగాడిదలమీద ప్రయాణం చేసేవారు. ఏ కొంచెం ఏమరుపాటుగావున్నా నేటివ్లు ఆ కంచర గాడిదలని అపహరించేవారు. అప్పుడు ఆ వాహనయోగం కూడా లేక ప్రభు సందేశ ప్రచారకులై, మరో జత బట్టలూ, తినేందుకు తిండీ, త్రాగేందుకు నీరూ లేకుండా కాలినడకని ప్రయాణం చేసేవారు. యూరప్ఖండవాసులు ఆ కష్టాలని వూహామాత్రంగానైనా ఊహించలేరు. ఐరోపాదేశాలు మానవునికి కొంత వ్యక్తిత్వపు విలువని యిస్తూవుండేవి. కాని ఈ కొత్త దేశానికి వచ్చిన ఫాదరీలు ఈ సువిశాల భూభాగమే తమ దేశంగా, ఆకలిదప్పులు తీర్చుకునేందుకు కనిపించిన ఫలాలు తింటూ, జలజల పారే నీటివాగులదగ్గర తియ్యగా వుండే నీళ్ళు త్రాగుతూ, చెట్టు నీడలే తమ రక్షణ స్తలాలుగా ముందుకు సాగారు. ఆకలి భరించలేక పోయిన ఆ ఫాదరీలలో విషఫలాలవల్ల ఎందరు మరణించారో, ఎవరికి లెక్క తెలుసు? బల్లేలూ, భయపెట్టే జునిపర్ మొక్కలూ, బ్రహ్మచెముడూ, పాములూ, మండ్రగబ్బలూ - వీటిని లక్ష్యపెట్టకుండా ఈ మిషనరీలు తమ గమ్యంవైపుగా పయనించేవారు. అసలే అది భీభత్స ప్రకృతి. అందుకుతోడు అక్కడి మానవులుకూడా క్రూరులు. ఎంతటి ధైర్యవంతులూకూడా ఆ సాహసం

చూపెట్టివుండరేమో! ఎడారి యిసుకలో నీటిబిందువు కరువై, గండశిలల వేడికి దిక్కుదోచక భగభగ మాడి, నోరు తెరచుకున్న లోయల్లోకి కాలుజారి, క్షుద్బాధ భరించలేక తినకూడనివి తిని, ఎందరు ప్రాణాలు పోగొట్టుకున్నారో! ఆకలి, చలి, వేడిమి – వీటిని ఆ స్పానిష్ ఫాదరీలు యెటువంటి కార్యదీక్షతో ఎదుర్కొన్నారో కథలల్లి కావ్యాలు వినిపించే కవిపుంగవులు లేరిక్కడ! ఆఖరికి సెయింట్ పాలూ అతని శిష్యులూ కూడా యిటువంటి దారుణ హింసాకాండకి గురిఅయివుండరు. మొదటి రోజులలో క్రిస్టియనులు బాధలుపడ్డమాట నిజమే. కాని మధ్యధరా ప్రపంచంలో తమకి తెలిసిన మనుషులమధ్య, తమకు పరిచితమైన దేశాలలో వారు త్యాగధనులయారు. చనిపోతున్నప్పుడు వాళ్ళని చూసి 'అయ్యో' అనుకున్నవాళ్ళున్నారు. వారి స్మృతులు భద్రపరచబడ్డాయి. హోలీమెన్ గా వారి పవిత్ర నామాలు పేర్కొనబడ్డాయి. కాని యిక్కడ ఈ స్పానిష్ ఫాదరీలో? తమకి తెలియని ప్రపంచంలో తమ పేరుకీ తను మరణానికీ వీసమంత విలువ కూడా లేనిచోట ప్రభునామ సంకీర్తనచేస్తూ అనామకంగా నిస్వార్థంగా యెటువంటి ఫలాపేక్షా లేకుండా నిండు ప్రాణాలు బలిపెట్టారు. ఎవరు త్యాగమూర్తులు? లెటూర్, ఓల్డు మెక్సికో వచ్చేసరికి బాగా పుష్టిగావుండేవాడు. అతని మొదటి ప్రయాణం దురాంగో బిషప్‌ని చూసేందుకు. ప్రయాణమార్గాన అనేక కథలు విన్నాడు. ఫ్రెంచి ఫాదరీ

లని ఎదుర్కొన్న దారుణ హింసలు ఆలకించాడు. ఒక్కొక్క సారి కొందరు సత్పురుషులు తనకెంతో సాయంచేసి, పేరడిగితేకూడా చెప్పకుండా తమదారిన వెళ్ళిపోయేవారు. దాహాన్నీ ఆకలినీ తీర్చే వింత ఫలాలు ప్రసాదించి, తమ దారిని తాము వెళ్ళిపోతూ వుండేవారు మరికొందరు. ఫాదర్ జునిపరో గురించి తనూ అనేక కథలు విన్నాడు. ఈ జునిపరో యిక్కడి మెక్సికనులకి ఎన్నో విధాల సాయం చేశేవాడట. అతని గురించిన కథలు ఒకటీ రెండూకాదు — కొల్లలు.

ఒకసారి జునీపరో తన మనిషితో ప్రయాణం చేస్తున్నాడట. ఒక్కరోజుకి సరిపడే రొట్టె, నీరుమాత్రమే వాళ్ళదగ్గర వున్నాయి. మర్నాడు తెల్లవారినప్పటినుంచీ సూర్యాస్తమయమయేదాకా బ్రహ్మాచెముడు డొంకల గుండా వారు ప్రయాణంచేశారు. చీకటిపడేసరికి, యెడారి కొసకి చేరుకోలేకపోతామా, అని వాళ్ళ ఆశ. అదృష్ట వశాత్తూ అస్తమయసమయానికి ఒకకుటీరం చేరుకున్నారు. చర్మపు దుస్తులు ధరించిన మెక్సికన్ ఆరాత్రికి వీళ్ళ నక్కడ వుండిపొమ్మన్నాడు. ఆ పూరికొంపలో వుండిపోయారు. లోపల ఆ మెక్సికన్ భార్య పసిపాపకి పాలిస్తోంది, ఆ వనిత వొళ్ళో పసివాడు, పక్కని మేకపిల్లాను. ఆ మేక పిల్ల ఎంత మనోహరంగావుందో చెప్పడం కష్టమట.

ఈ దంపతులు చాలా మంచివాళ్ళు. తాము గొల్లల

మని చెప్పేరు వాళ్ళు. జునిపరో, అతనితో వచ్చినతనూ, మెక్సికనూ సాయంకాలపు ప్రార్థనలు పూర్తిచేసుకు, భోజనాలకు కూర్చున్నారు. గొల్లవాణ్ణి అక్కడి జీవిత విశేషాలు అడుగుదామన్నాట్ట ఫాదర్ జునిపరో. కాని బడలిక వల్ల నిద్ర ముంచుకురావడంతో, యేమీ అడక్క నిద్ర పోయాట్ట. మర్నాడు పొద్దుట లేచి చూసేసరికి, మెక్సికన్ దంపతులూ లేరు, మేకపిల్లా లేదు, పసివాడూ లేడు. అతిథుల కని పొద్దుటి భోజనం మాత్రం అక్కడ ఉన్నది. వాళ్ళు బహుశా తమ గొర్రెలూ మేకలూ చూసుకునేందుకు వెళ్ళిపోయారేమో, అని జునిపరో సరిపెట్టుకున్నాడు.

స్వస్థలం చేరుకున్నాక, మిగతా ఫాదరీలతో ఈ సంగతి చెప్పేసరికి వారు ఆశ్చర్యపోయి 'ఆ స్థలమెక్కడ?' అని అడిగారు. మూడు చెట్లు త్రికోణాకారంగా ఉన్న చోట, అని గుర్తులు చెప్పేసరికి, కొందరు ఆ మూడు పత్తిచెట్లు వెతికేందుకు వెళ్లేరు. పత్తిచెట్లుమూడూ కనపడ్డాయి. ఏ చెట్టుకయితే మెక్సికనులు తమ గాడిదని కట్టేశారో అది కూడా ఈ మూడు చెట్లకీ కొంచెం దూరంలో వుంది. అక్కడొక పాకగాని మనుషులు నివసించిన గుర్తులుగాని ఏమీ లేవు. ఆ చుట్టుపట్ల గొర్రెలు మేసేందుకు మేతకూడా కనపడలేదు. పరిశీలించడానికి వచ్చిన యిద్దరు ఫాదరీలూ ఆ స్థలానికి దగ్గర ముంగాళ్ళమీద వంగి, నేలని ఆఘ్రాణిస్తూ. ఆ దివ్యమూర్తుల కుటుంబానికి అభివందనం చేశారు.

కళ్ళముందు ఈ 'మాయ' జరిగాక జునీపరో యింకా వివరించి చెప్పడం మొదలెట్టేడు. ఆ కుటీరంలో ప్రవేశించి నప్పటినుంచీ, అతనిదృష్టి పసిపాపమీదే వున్నదట. ఆ పసిపాపని చేతుల్లోకి తీసుకుముద్దాడాలని, ఎంతగానో అని పించిందట. కాని తను లోపలకొచ్చేసరికి ఆ పాప, తల్లి ఒళ్లో వున్నాడు. తమ భోజనాలయేసరికి పాప నిద్ర పోతు న్నాడు. కాని ఆ మాతృమూర్తికి చెరో పక్కనా మేక పిల్లా మానవబాలుడూ వుండడం ఆ బాలుని వీళ్లు భగవంతుడే అనడం, జునిపరోని విస్మయానందంలో ముంచెత్తింది,

అది భగవద్దర్శనమేగాని కట్టుకథ కాదనీ, భగవం తుడే మత గురువుల్ని కాపాడేందుకు . గొర్రెలకాపరి వేషంలో అక్కడ ప్రత్యక్షమయ్యాడనీ కథ వ్యాప్తి మయింది. సౌందర్యారాధన నుంచీ సౌఖ్యాన్వేషణ నుంచీ మళ్ళీ నిరాడంబరంగా వుండే గ్రామీణ సహజ గాంభీ ర్యంతో, సత్యస్వరూపం గోచరిస్తుంది. రాజకుమార్తె పల్లె వనితలతో కలసి ముందు వాకిలి వూడుస్తూంటే చూసినవాళ్ళకీ విన్నవాళ్ళకీ గొప్పగా వుంటుంది. కీర్తి ప్రతిష్ఠలకంటె, చరిత్ర యిచ్చే బిరుదులకంటె, ఈ విశుద్ధ జీవనులలో యేవో అపూర్వ శాంతి కాంతులు లభ్యమవు తాయి గనుకనే దేవతలెప్పుడూ యిటువంటి రూపాలు ధరిస్తారు. బీదలలో అతి బీదవై 'ప్రభువు' దర్శనమిస్తాడు అని అనుకున్నారు ఫాదరీలు.

# 5

ఆ వుదయంవేళ లెటూర్ నిద్రపోదామనుకున్నాడు. నిద్ర పట్టేటట్టులేదు. కాని కళ్ళమీదకి నిద్ర తెప్పించుకుందామనుకున్నాడు కాని, నిద్రకి బదులు గడిచిన కాలంలోని జ్ఞాపకాలు కనురెప్పలపై తాండవించ సాగాయి. భోజనసమయందాకా తనని లేపవద్దని చెప్పాడు యింట్లో వాళ్ళకి. గదికి ఒక చివరగా, వెలుతురు తీక్షణంగా పడని చోట వుందతని మంచం. అతను పడున్నచోట మృదువుగా గోధుమ వన్నెలో వెలుగుపడుతోంది. తెల్లని గోడలలో అమర్చబడ్డ నిప్పుగూళ్ళు వెచ్చదనం కలిగిస్తున్నాయి గదికి. దుప్పటి కప్పుకు పడుకున్న బిషప్, కాళ్లూ చేతులూ కదపకుండా, గుండెలమీద చేతులు వేసుకుని నిద్రపోతున్నాడు. అది నిద్రకాదు. కళ్ళు మూసుకోవడం మట్టుకే. జోసఫు బహూకరించిన వుంగరం, గుండెలని తాకుతోంది. విగతజీవుడైనప్పటికీ జోసఫ్ ఒకవిధంగా ఈ గదిలో తనతో జీవించే వున్నాడు. ఓహియోలోని సరస్సులూ, పారిస్‌లోని తమ పరిచయమూ, మాంట్ ఫెర్రాండ్‌లో తాము పొందిన శిక్షణా - యివన్నీ స్మృతిపథంలో - మెదులుతున్నాయి. వాటిని జ్ఞాపకం తెచ్చుకుని ఆ జ్ఞాపకాలమధ్య పునర్జీవించడం లెటూర్‌కి ఎంతో ఆనందం చేకూరుస్తోంది ఆ వుదయంవేళ. ఒక్కొక్కటే జ్ఞాపకం చేసుకుంటున్నాడు.

ఇద్దరూ యిరవై యిరవై రెండేళ్ళవాళ్ళు. చదువు

పూర్తవుతోంది. తాము క్లెర్ మాంట్‌లో వుండగా ఓహియో నుంచి ఎవరో బిషప్ వచ్చాడు. ఈ నూతన ప్రపంచంలో సేవాతత్పరులై పనిచేసేందుకుగాను. ఎవ రేనా ఫాదరీలు దొరుకుతారా? - అని అడిగాడు. విద్యార్థు లకి అతనిచ్చిన గంభీరోపన్యాసం లెటూర్ జోసఫ్‌లు ఎంతో శ్రద్ధగా విన్నారు. ఉపన్యాసానంతరం అతనితో విడిగా మాట్లాడారు. ఆ తర్వాత ఆ బిషప్ ఉత్తరఫ్రాన్సుకి వెళ్ళాడు. అతన్ని పారిస్‌లో ఫలాన తేదీన కలుసుకుంటా మనీ 'ఫారన్ మిషన్సు కాలేజీ'లో కొద్దివారాల శిక్షణ అయాక షెర్‌బర్గ్‌లో ఓడ యెక్కి అమెరికా చేరుకుంటా మనీ అన్నారు.

తమ పెద్దవాళ్ళకి తెలిస్తే ఈ ఆలోచన పడగొడ్తా రని ఆ యువకు లిద్దరికీ భయం. అంచేత సాధ్యమైనంత వరకూ ఈ సంగతి పైకి పొక్కనీయకుండా గోప్యంగా వుంచారు. తలిదండ్రులకి అభివందనం చేయకుండా, ఓడ యెక్కడం అపచారమేమోనని, వాళ్ళలో వాళ్ళు తర్కించుకున్నారు. సెయింట్ ఫ్రాన్సెస్ ఎగ్జేవర్ వెనక యిదే ప్రకారంగా వెళ్ళవలసివచ్చినప్పుడు, తల్లిదండ్రుల యింటిముందునుంచి వెళుతూ, వారికి వందనం అర్పించ కుండా వెళ్ళాడని తమ క్లాసు పుస్తకంలో చదువుకున్నారు వారు. ఆనాడు సెయింట్ ఎగ్జేవర్ చేయగా లేంది, యిప్పుడు తాము చేస్తే తప్పవుతుందా అని, ఆ యువకు లిద్దరూ ఒకరికొకరు ధైర్యం చెప్పుకోసాగారు,

లెటూర్‌కంటె జోసఫ్ స్థితి మరీ విపరీతము. అతనికి తల్లి లేదు. తండ్రి ఒక్కడే. తండ్రికి పిల్లలంటే తెగప్రేమ. అందులో జోసఫ్ పెద్దవాడు. తన తండ్రిని మోసగించి ఎలా వెళ్ళడమా అని జోసఫ్‌కి బాధగావుంది. ప్రయాణపు తేదీ దగ్గరపడుతున్న కొద్దీ యితని బాధ తీవ్రతరమై మనిషి సన్నబడడం పాలిపోవడం మొదలెట్టాడు.

ఇద్దరు స్నేహితులూ ఫలానారోజున రియామ్‌లో కలుసుకుందామని ఏర్పాటుచేసుకు, అక్కడనించి పారిస్ వెళదామనుకున్నారు. నిశ్చయం చేసుకునేదాకానే గాని, ఆ పైన తిరుగులేదు లెటూర్‌కి. ఆ రోజు వుదయం యింకో గంటా గంటన్నరకి తెల్లవారుతుందనగా, నిర్ణీతస్థలానికి వచ్చాడు లెటూర్. అక్కడ జోసఫు చలికి గడగడ లాడుతూ అతి దీనంగా కనపడ్డాడు. రాత్రంతా జోసఫు అక్కడే తిరుగుతున్నాడట. ముందుకో వెనక్కో తెలీకుండా వుందట. బాగా ఏడ్చివుండటం చేత కళ్ళువాచాయి. చలిలో తిరుగుడువల్ల జలుబు పట్టుకుంది. పసివానివలె యేడుస్తూ 'ఏం చేయమన్నావు, లెటూర్? నన్నేం చేయమన్నావు? మా నాన్నహృదయం వ్రక్కలు చేయలేకుండా వున్నాను. ఇటు నాన్నని శోకంలో ముంచటమా, లేక అటు నామాట తప్పడమా? అన్నమాట తప్పితే నరకప్రాప్తి. ఏం చేసేందుకు ధైర్యం చాలకుండా వుంది – మరణించడమే తరుణోపాయమనిపిస్తోంది. ఇప్పుడీ క్షణాన

మరణించగలిగితే ఎంత హాయి! బాధలనుంచి విముక్తి లభిస్తుంది,' అన్నాడు జోసఫ్.

పక్కమీద పరున్న లెటూర్‌కి ఆ దృశ్యం, కళ్ళకి కట్టినట్లు కనపడుతోంది. నేరస్తులవలె తామిద్దరూ దొంగ చాటుగా యిళ్ళలో నుంచి పారిపోయి వచ్చారు! నమ్మిన మిత్రుణ్ణి ఎలా ఓదార్చటమో తెలీకుండా ఉంది. రెండు తీవ్ర వేదనలమధ్య నలిగిపోతున్నాడు జోసఫ్. ముఖము రెండు చేతుల్లోనూ దాచుకు, మధ్యమధ్య వెక్కి వెక్కి యేడుస్తున్నాడు. 'నువ్వేమీ భయపడకు. నా వెంట పారిస్ రా. మీ నాన్నగాని నిన్ను క్షమించలేకపోతే అక్కడి అధికారులతో మాట్లాడి ఏదో విధంగా నువ్వు వెనక్కి వచ్చేదువుగాని. ఇదేమంత ప్రాణాలుతీసే సమస్య కాదు' అని వూరుకోబెట్టి వీధిలోకి వచ్చి, అటువైపుగా వెళ్తున్న బండీ యెక్కారు. బండీ యెక్కడం తడవుగా సొమ్మసిలి నిద్రపోయాడు జోసఫ్. ఆ క్షణాన లెటూర్ అభయహస్తమే అతనికి లభ్యం కాకపోతే, జీవితమంతా ఏదో అనామక ఫాదరీగా గడిపి వుండును జోసఫ్.

వసంతకాలంలో వుదయంవేళ రియూయ్ నుంచి బయలుదేరిన ఆ యువకులిద్దరిలో ఫాదరీ వృత్తికి లెటూర్ అన్నివిధాలా తగిన మనిషిలా ఉన్నాడు. అతని ఆరోగ్యం మంచిది; బుర్ర గట్టిది. 'ఫారెన్ మిషన్సు' కాలేజీలో గడి పిన కొద్ది వారాలూ, లెటూర్ ఆ శిక్షణని చక్కగా స్వీక

రించాడు. జోసఫు ఈ మతసాధక వృత్తిలోగల అవాంత రాలు దృఢ చిత్తంతో ఎదుర్కొగలడా అనిపించే దప్పట్లో. కాని కాలగమనంతో ఈ అనారోగ్యపు దేహం ప్రభు సేవని వేయివిధాల చేయగలిగింది.

ఫాదర్ లెటూర్ తన 'డయోసీస్'లో ఎక్కువ మార్పులు చేసేవాడు కాదు. మెక్సికనులది ఒకతీరు, నేటివ్ లది మరొకతీరు. ఏ జాతిమనుషుల్ని వారి భాషలో అర్థం చేసుకోవాలి. శాంటాఫె, దేశపు లోపలి భాగంలో గల నగరం. అక్కడెక్కువగా సంపద లేదు. వ్యాపార రీత్యా గొప్ప పట్నం కాదు. కాని ఫాదర్ జోసఫు, విశృంఖల జీవనుల ప్రదేశంలోకి గిరవాటు వేయబడ్డాడు. అక్కడి మనుష్యులకి క్రోధము, కక్ష, దురాశ, దుశ్చింత ఎక్కువ. ఆ యేటికాయేడు ఆరోగ్యం పల్చబడుతున్నా, దేహదా ర్ఢ్యం సన్నగిల్లుతున్నా, ఒకవైపు కుంటితనం క్రుంగ తీస్తున్నా, ఆ పర్వతపట్నాల్లో తన పాతబగ్గీలో ప్రయాణం చేసేవాడు జోసఫు. నాలుగేళ్ళపాటు ధనరాసులతో తుల తూగిన గ్రామాలు, అక్కడ ఖనిజసంపద లేని కారణంగా, పాడుపెట్టిన వూళ్ళయేవి. ఈ భోగభాగ్యాలూ, వుయ్యాల వూపులూ, కలిమిలేములు స్వయంగా కళ్ళతో చూసే వాడు జోసఫు.

మతధర్మం నలుగురికీ చెప్పడంతో తన భారం తీరి పోయిందనుకునే తత్వం కాదతనిది. ఆ మత విశ్వాసం ఎదుటి వారిలో కలిగించి, కొలరాడో చర్చికి నూతన

భాగ్యోదయం కలిగేదాకా విశ్రమించేవాడు కాదు. ఆ చర్చికోసం ధనస్వాములవద్ద నుంచి బోలెడంత నేల సంపాదించాడు. వాళ్లు భూమిని దానంచేసేవారే కాని డబ్బిచ్చేవారు కాదు. అంచేత బ్యాంకులవద్ద నుంచి డబ్బు అప్పు చేశేవాడు. స్కూలు భవనాలకి, కాన్వెంటులకి డబ్బు అప్పుచేసి, అది తీర్చడమెలాగో తెలియక, భిక్షాపాత్ర పుచ్చుకుని ఓహియో, పెన్సిల్ వేనియో, కెనడా రాష్ట్రాలు పర్యటించివచ్చేవాడు. ఈ పర్యటనంతా యెందుకయ్యా అంటే, ఆ అప్పులమీద వడ్డీ చెల్లించేందుకు. ఋణవిముక్తడయేందుకు ఒకసారి ఫ్రాన్సువెళ్ళి, అక్కడ ఒక భూమి తనఖా సంఘమును లేవదీసి, అప్పు పుట్టించేందుకు ప్రయత్నాలు చేశాడు, కాని బ్రోకరితన్ని బోల్తా కొట్టించి, మసిపూసి మారేడుకాయ చేయడంతో, ఆ ప్రయత్నాలు విఫలమయాయి.

తత్ కారణంగా ఫాదర్ జోసఫుని, అతని డెబ్బయవయేట, ఈ ధనవ్యయానికీ అప్పులకీ సంజాయిషీ చెప్పుకోమని రోమ్ నగరంలోని పాపల్ కోర్టువారు పిలిపించారు. అక్కడికివెళ్ళి అతి కష్టంమీద వారికి తన ఋజువర్తన నిరూపించుకున్నాడు. ఒకకాలు పొట్టీ, ఒకకాలు పొడుగూ అయిన ఈ 70 యేళ్ళ ఫాదరీని చూసి అతని లోగడ రికార్డు పరిశీలించి మతాధిపతులు 'జోసఫ్ నిర్దోషి' అని తీర్పు చెప్పారు.

జోసపు మరణవార్త శాంటాఫెకి తెలియడంతోనే,

ఫాదర్ లెటూర్ 'డెన్వర్' వెళ్ళే రైలెక్కాడు. అతను చనిపోయాడనే టెలిగ్రాముని లెటూర్ ఒక పట్టాన నమ్మలేక పోయాడు. ఎడారులూ, దుర్గమారణ్యాలూ కొండ కోనలూ సురక్షితంగా దాటిన తన మిత్రుడు, యిలా చెప్పకుండా చేయకుండా మరణించడమేమిటని ఆశ్చర్యం లెటూర్‌కి.

# 6

బిషప్ తన చివరి రోజుల్లో మృత్యువు గురించి యెక్కువ తలపోసేవాడుకాదు. తను వొదిలేసి వెళుతున్న పాతకాలం గురించి పదేపదే మననంచేసుకునేవాడు. భవిష్యత్ మనచేతులలో లేనిది. దానిమార్గం అది చూసుకొంటుంది. ఇక మరణానుభవాన్నికూడా మేధా దృష్టితో చూడగలిగాడు లెటూర్. చివరిదశలో మనుషుని విశ్వాసాల్లోనూ విలువల్లోనూ మార్పు వస్తుంది. ఇది 'తను' పొందే అనుభవమేగాని 'తనది' కాదనిపించేది. ఆ మనోభావం మత జీవనానికి దూరమైనది, – ఒకవిధమైన మనః పరిణతి. ఇతరుల ప్రవర్తననీ తన ప్రవర్తననీ వేరు వేరు త్రాసులలో వుంచి ఏప్రకారం తన జీవితకాలమంతా నిర్ణయాలు చేసుకున్నదీ తనకర్థమవుతోంది యిప్పుడు. తన జీవితంలోని తప్పులేవీ అంత పెద్దవికావు. ఎటువంటి నావ అయినాసరే, రేవు చేరుకునేలోపున తుపాను గాలులనీ జల మృగాలనీ యెదుర్కోవడం జీవన ధర్మం.

తన జ్ఞాపకాలలో కొన్ని మాత్రమే నిలిచి, మరి కొన్ని యెందుకు చెరిగిపోయాయో అతనికి అర్థం కావటం లేదు. ఈ జ్ఞాపకాలలో తనుకూడా ఒక పాత్రధారే అయి నప్పటికి బయట నిలబడి వాటిని చూడగలుగుతున్నాడు, తను కుర్రవాడుగా వున్నప్పుడు మధ్యధరా ప్రాంతంలో మేనత్తలతో గడపటం, రోమ్ నగరంలోని తన విద్యార్థి దశ, మోల్నీ యిక్కడికివచ్చి ఈ కెతెడ్రల్ నిర్మించడం- యివన్నీ ఒకదానితో ఒకటి కలిసిపోయి కనపడుతున్నాయి. ఈ స్మృతి వాటికలకి కాలప్రమేయం లేదు. ముందువి వెనకా, వెనకవి ముందూ కనబడతాయి. తను ఈ చైతన్యానికి మధ్య పీఠం వేసుకు కూర్చుని చేతితో తడిమి వాటిని పైకితీసి, అరిచేతులో వుంచుకు పరిశీలిస్తున్నట్టుగా వుంది.

మాగ్డలీనాగాని, బెర్నార్డ్‌గాని లోపలకి వచ్చి ఏదైనా ఒక మాట అడిగితే, తను ఆ భూతకాలం నుంచి వర్తమానంలోకి వచ్చి సమాధానం చెప్పేందుకు, కొద్ది సెకనులు పడుతోంది. వాళ్ళు తన మనసు పనిచేయడం లేదని, తన స్మృతి తప్పుతోందని చెవులు కొరుక్కుంటు న్నారు. కాని తన మనసు ఎంతటి ఉత్సాహంతో రత్న రాసులు లెక్కిస్తోందో వాళ్ళకేం తెలుసు?

వర్తమానంలోకి రావాలని అనిపించినప్పుడు వచ్చే వాడు. కాని ఈ వర్తమాన జగతిలో తనదన్నది యేము న్నది? ఫాదర్ జోసఫు వెళ్ళిపోయాడు. యాంటోనియో దంపతులు మరణించారు. కిట్ కార్సన్ గతించాడు.

ప్రధాన వేషధారులందరూ తెర వెనక్కి వెళ్ళిపోయారు. ఇక మిగిలినవి చిన్న పాత్రలు.

ఆర్చిబిషప్ లెటూర్ శాంటాఫె వచ్చిన కొద్ది రోజులకు యుజేబియో అతన్ని దర్శించటానికి వచ్చాడు. తన జీవనపుటలలో మిగిలిన వ్యక్తి యితనొక్కడే! కొలరాడో వెళ్ళినప్పుడు ఆర్చిబిషప్ లెటూర్‌కి సుస్తీగా వుందని విన్నాడట. అంచేత గబగబా ప్రయాణం కట్టుకు శాంటాఫె చేరుకున్నాడు. యుజేబియో కూడా యిప్పుడు వృద్ధుడు. ఇద్దరూ కరస్పర్శ చేసుకున్నారు. కరస్పర్శానంతరం తన కనుకొలకుల్లో నిల్చిన బాష్ప బిందువును తుడుచుకొన్నాడు లెటూర్.

'ఇలా మళ్ళీ మనం కలుసుకుంటామని నేననుకున్నాను. మిమ్మల్ని రమ్మని కబురంపిద్దామనుకున్నాను కాని దగ్గరా, దాపా? అంచేత కబురు పెట్టలేదు' అన్నాడు లెటూర్.

యుజేబియో చిరునవ్వు నవ్వుతూ 'యిప్పుడు మునపటంత దూరమా? మోటార్లు వేశారుగా! గేలప్‌లో ప్రొద్దుట బయలుదేరితే సాయంత్రానికి యిక్కడికి రావచ్చు - అదేరోజు సాయంత్రానికి వచ్చేస్తాము. మనిద్దరమూ ఒకసారి గేలప్‌నుంచి శాంటాఫె వచ్చాం జ్ఞాపకముందా? అప్పుడు యించుమించు రెండు వారాలు పట్టింది మన ప్రయాణానికి. ఇప్పుడు మనుషులు వేగంగా ప్రయా

ణాలు చేస్తున్నారు, కాని మంచిపనులంత వేగంగా జరుగు తున్నాయా అని?'

'భవిష్యత్ తెలుసుకోడంకోసం మనం ప్రయత్నించ కూడదు, నేస్తం! తెలుసుకోకపోవడమే మంచిది. మాన్యు లిటో యెలా వున్నాడు?'

'బాగానే వున్నాడు. తన ప్రజలని జాగర్తగా చూసుకుంటున్నాడు.'

యుజేబియో యెక్కువసేపు వుండలేదు. మర్నాడు వచ్చి మళ్ళీ దర్శనం చేసుకుంటానని వెళ్ళిపోయాడు. శాంటాఫెలో తనకేదో పనివుందనీ కొద్దిరోజులు అక్కడ వుండవలసివస్తుందనీ చెప్పేడు లెటూర్‌కి. నిజానికి యుజేబియోకి అక్కడ పనేమీలేదు. ఫాదర్ లెటూర్‌ని చూసి యుజేబియో తనలోతను అనుకున్నాడు. 'యింకెన్నాళ్లో లేదు' అని.

అతను వెళ్ళిపోయాక బెర్నార్డ్ వైపు తిరిగి లెటూర్ అన్నాడు. 'నేను రెండు మహోన్నత విషయాలు చూశాను. బానిసత్వ నిర్మూలనమూ, నవాజోల స్వాతం త్ర్యమూ నా కళ్ళారా చూశాను.'

నవాజోలకీ, అపాచీలకి గల కలహాలు అంతరిస్తాయా అనీ, ఈ నేటివుల యుద్ధాలకి సమాప్తి వుంటుందా అని ఫాదర్ లెటూక్ యెన్నాళ్లో వాపోయాడు. సరుకులు తయారుచేసే ఉత్పత్తిదారులూ, వాటిని అమ్ముకునే వర్త

కులు ఈ యుద్ధాలు చల్లారకుండా చూస్తారు. యుద్ధంగాని, యుద్ధభయంగాని వుంటేనే వారి అధికారదర్పమూ వారి పలుకుబడీను. లెటూర్ తన మధ్యవయసునంతటినీ నవాజోల స్వాతంత్ర్యం పునఃస్థాపితం చేయడానికి వెచ్చించాడు. యుజేబియో స్నేహంతో నవాజోల కష్టనిష్ఠూరాలు అర్థమయాయి లెటూర్‌కి. ఈ నేటివులు తెల్లవారి మతాన్నీ వారి మతప్రచారకులనీ సహించినప్పటికీ, తమ ఆచార వ్యవహారాలు తొందరగా మార్చుకోరు. ఒకసారి ఈ నవాజోలని చలికాలంలో పెకోస్ నదికి అవతలవైపుగా తరిమి కొట్టారు. వీరికి యిటు మెక్సికనులూ విరోధులు; అటు అమెరికనులూ విరోధులే. ఆ శ్వేతజాతీయుల వేటలో వేల సంఖ్యలో స్త్రీ పురుషులూ శిశువులూ మరణించారు; అశ్వ సంపదా పశుసంపదా హరించిపోయాయి. 'ఈ ప్రదేశమంతా మాది. మీ రిక్కడనుంచి వెళ్ళిపోవాలి' అని యుద్ధం ప్రకటించారు నవాజోలమీద తెల్లవారు.

ఇటువంటి యుద్ధ శంఖారావం కోసం కాచుకు కూచున్న కిట్ కార్సన్ వారిని వేటాడడంలో నాయకత్వం వహించాడు. నవాజోలు గొర్రెల కాపర్లు, వాళ్ళదగ్గర మారణాయుధాలు లేవు. కొండలమాటున అతి ప్రాచీన జీవితం గడుపుతున్న ఈ గొర్రెల కాపర్లమీద దండెత్తారు తెల్లప్రభువులు.

తెల్లవారికి నవాజోల జీవన విధానంగాని, వారి సమస్యలుగాని తెలుసుకోవాలని యెంతమాత్రం లేదు.

బంగారం కోసం, భూమికోసం, అధికార దాహం కోసం ఆ నోరులేని ప్రజలని తరిమికొట్టడమే! తుపాకులతో మీద పడే శ్వేత జాతీయుల్ని, తుపాకీ అంటే ఎలా వుంటుందో యెరగని నవాజోలు యెలా ఎదుర్కోగలరు?

కార్సన్‌ని దోషి అనడానికి వీలులేదు. అతను యుద్ధవీరుడు. పై అధికారులు చెప్పినట్లుగా నడుచుకు తీరాలి. నవాజోలనిలోబడమంటే వాళ్ళు నిరాకరించారు. ఈ తిరుగుబాటు చేసిన తెగకి నాయకుడైన 'మాన్యులిటో'ని ప్రాణాలతోగాని, చంపిగాని పట్టుకొచ్చేవారికి బహుమతి యిస్తామని ప్రకటించింది ప్రభుత్వం. అప్పుడు యుజేబియో శాంటాఫెవచ్చి 'మీరు పూనుకుంటేగాని ఈ దురన్యాయాలకి అంతం ఉండదు' అని బిషప్ లెటూర్‌ని కోరాడు. మాన్యులిటో జూనీ వస్తాడు. అక్కడ కలుసుకోవలసిందిగా కోరాడు బిషప్‌ని యుజేబియో! తను ఫాదరీ అవడంవల్ల ఇలాటి వాటిల్లో జోక్యం కలుగుజేసుకోకూడదని లెటూర్ అన్నాడు.

ఇప్పుడీపక్కమీద అశ్వస్థుడై పడున్న ఆర్చిబిషప్‌కి నవాజోల ఆనంద విషాదాలూ, యుజేబియోతో తను గడిపిన రోజులూ, నవాజోజాతికిగల ఆతిధ్య మర్యాద – యివన్నీ తలపుకి వచ్చాయి.

'బెర్నార్డ్, భగవంతుడు దయామయుడు గనకనే అన్యాయాలు సరిదిద్ది, పాతకాలపు తప్పులు మన్నించి సుఖజీవన ప్రతిష్టాపన జరగడం నన్ను చూడనిచ్చాడు.

నేటివులని ఈ తెల్లవారు ఏనాటికీ జయించలేరు. భగవంతుడు వారిని కాపాడతాడు' అన్నాడు లెటూర్.

# 7

అమెరికన్ డాక్టర్, కొత్త ఆర్చిబిషప్‌తోనూ మదర్ సుపీరియర్‌తోనూ మాట్లాడుతున్నాడు 'నేను మొదటినుంచీ అంటూనే వున్నానుగా, అది గుండెకు సంబంధించిన జబ్బని. చిన్న మోతాదులు మొదట్లో పనిచేసేవి, ఇక పనిచేయడం మానేశాయి. మోతాదు పెంచితే మొదటికే మోసం రావచ్చు. ఇప్పుడింక మోతాదు పెంచినా ప్రమాదమే, పెంచకపోయినా ప్రమాదమే. అందుకే ఆయన ముఖంలో ఆ మార్పు.'

ఆర్చిబిషప్ లెటూర్ ఆహారం తీసుకోడం లేదు.. అలానే నిద్రపోతున్నాడు. అది నిద్రో మగతో తెలియదు. అతని జీవనయాత్రలో చివరిదినం శాంటాఫె నగరవాసులందరికీ ప్రార్థనదినం. కెతెడ్రల్‌లోకి పరివ్రాజికలూ వృద్ధస్త్రీలూ, యువతీ యువకులూ, పిన్న పెద్దలూ, అందరూ వస్తూపోతూ వున్నారు. వచ్చినవారు ప్రార్థనలు జరిపి వెళ్ళిపోతున్నారు. ఆ ఉదయమే ఆర్చిబిషప్‌కి రోమ్‌లోని ఉన్నత మతాధికారులు తుదిప్రార్థనా పత్రం పంపారు. ఆ చివరి దినానజరిగిన ప్రాతఃకాల ప్రార్థన, పవిత్రాత్ములకు మానవ లోకం అర్పించిన జోహారువలె ఉంది. శాంటాఫెలోని వారూ చుట్టుపక్కల గ్రామాలలో వారూ అందరూ కెతెడ్రల్ ఆవ

రణలోకి వచ్చి ఒకరొకరు 'ఎలావుంది, ఎలావుందీ?' అని అడుగుతున్నారు. వారిలో యుజేబియో కూడా వున్నాడు. వంటమనిషీ, తోటవాడూ, మదర్ సుపీరియర్, మాగ్డలీనా, బెర్నార్డ్ - వీరు లెటూర్ పక్క దగ్గర వున్నారు. ఆర్చిబిషప్ లెటూర్‌కి యిహలోకవాసులు చేయగల పరిచర్యలేమీ లేవు - భగవన్నామ జపం తప్ప. అతి ప్రశాంతంగా పడున్నాడు. ముఖంలో యెటువంటి బాధా లేదు. ఒక్కోసారి అతని ముఖంమీద కళ్ళు చైతన్యకాంతితో నృత్యం చేసేవి. మళ్ళా మగత నిద్రలోపడేవాడు. యింకొద్దిసేపట్లో దీపాలు వెలిగిస్తారనగా ఆర్చి బిషప్ లెటూర్ కొంచెం ఏమీ తోచనట్టు చికాకుగా ఇటూ అటూ మెదలసాగాడు. ఫ్రెంచిలో యేదో గొణుగుతున్నాడు. ఆమాటలు బెర్నార్డ్‌కి అర్థంగాక 'ఏమంటున్నారు ఫాదర్? నేనిక్కడే వున్నాను' అని దీనంగా అడిగాడు.

అలా కాసేపు గొణిగి చేతులు యిటూ అటూ కదిల్చాడు. పిలిచి యేదో చెప్పబోతున్నాడనీ యేదో మాట్లాడబోతున్నాడనీ మాగ్డలీనా భావించింది. నిజానికి బిషప్ అక్కడ లేడు. తన స్వదేశంలో పచ్చని కొండలమీద, ప్రొగమంచువేళ, యిటూ అటూ తెలియక మథనపడుతున్న యువకునికి ఆత్మస్థయిర్యమిస్తున్నాడు, అతనిలో ఒక నూతన ధైర్యాన్ని కలిగిస్తున్నాడు, ఉయ్యాలూగే సమయంకాదు, నమ్మిన దారివెంట ముందుకి నడవాలని, అతనికి ధైర్యం చెబుతూ బండీ యెక్కిస్తున్నాడు. ఆ బండీ

కొండలదారి వెంట పర్వతాలమీదుగా గబగబా వెళ్ళిపోతోంది.

చీకటిపడ్డాక చర్చి గంట గణగణ మ్రోగేసరికి శాంటా ఫెలోని మెక్సికన్ వాసులూ అమెరికన్ కాతలిక్కులూ ముంగాళ్ళమీద నిలబడి జోహారు లర్పించారు ఆ పూజ్యపాదునికి. ముంగాళ్ళమీద నిలబడి ప్రార్థన చేయని మరికొందరు హృదయమందిరంలో ప్రార్థనలు తెలిపారు. యుజేబియో అతనివెంట వచ్చిన కుర్రవాడూ ఈ వార్త తమ ప్రజలకి చెప్పేందుకు వెళ్ళిపోయారు. మర్నాడు వుదయం ఆర్చిబిషప్ లెటూర్ శవపేటిక, అతను నిర్మించిన సువిశాల మందిరంలోని పూజాపీఠందగ్గిర, ప్రజల కడపటి ప్రార్థనల నిమిత్తం వుంచబడింది.

[సమాప్తం]





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B172 |
| పుస్తకం పేరు | ప్రేమగాథ |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 321 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 20 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | good |